ఆంధ్రగ్రంథమా॥ ప్రథమపుష్పము

# శతకమంజరి

## భక్తిసంపుటము

ప్రకాశకులు

కా. నాగేశ్వరరావు

చెన్నపురి

1926

వెల రూ. ౧-౮-౦

# విషయానుక్రమణిక

# సంపాదకీయము

ఆంధ్రవాఙ్మయాంగములందు శతకవాఙ్మయాంగము విశేషవ్యాప కమును గలిగి పండితపామరహృదయ రంజకముగ నున్నది. పురాణములు, శాస్త్రములు, కావ్యములు, ప్రబంధములు, నాటకములు, నవలలు, కథలు, వాఙ్మయాంగములందు ప్రధానాంగములైనను శతకాంగ మువలె పండితపామరహృదయముల నాకర్షింపజాలవు. ఆంధ్రభాషయం దుమహాకవులును, సామాన్యకవులును రసభరితములైన శతకములను రచియించి వాఙ్మయవికాసమునకు దోడ్పడినవిధమును శతకములు విశ దముచేయుచున్నవి. లాక్షణికులు సామాన్యముగను శతకములను కావ్య గ్రంథములుగను పరిగణింపకపోయినను శతకవాఙ్మయము వ్యాపక మునుగలిగి ప్రజాదరణమును బడసినది. దేశ మాంగ్లవిద్యార్ణవమునందు మునుగక పూర్వము విద్యాభ్యాసారంభమునం దొకటిరెండు శతకము లైనను నోటరాని అక్షరాస్యు లాంధ్రదేశమునం దుండెడివారు కారు. భక్తినీతి వైరాగ్యపరములైన దాశరథి కాళహస్తీశ్వర భాస్కర వేమన సుమతి నారాయణాదిశతకములను బడులందు వల్లించుట యాచారముగ నుండెడిది. వర్తమానవిద్యావిధానము కాకి, కుక్క కథలతో నారంభమై ఆంగ్ల కావ్యములతో నంతమునొందుచు విద్యాప్రయోజనములకు నిరు పయోగమైనది. విద్యాభిమాను లీదుర్దశనుండి మాతృభాష నుద్ధరించు టకు బాటుపడి యాత్మోపలబ్ధిని బడయుదురుగాత!

శతకవాఙ్మయము:—శతపదజన్యమైన శతకపదము సంఖ్యా బాహుళ్యమును దెలుపుచున్నది. సంస్కృత ప్రాకృతవాఙ్మయములందు

గల శతపదబ్రాహ్మణము, అవదానశతకము మున్నగునామము లధిక సంఖ్యార్థమును విశదము చేయుచున్నవి. జపమంత్రవిధానములందు సహస్రము, అష్టోత్తరశతము నియతసంఖ్యలుగ నేర్పడినవి. దైవప్రార్థనా పూజాదికములం దష్టోత్తరశతసంఖ్య బహుసంఖ్యార్థమును దెలుపుచున్నది. దేవీదేవతలయర్చనలందు సహస్రనామములను, అష్టోత్తరశత నామములను చెప్పుట సదాచారము. అక్షమాల లష్టోత్తరశతసంఖ్యగల పూసలను గలిగియున్నవి. శతకములందు సామాన్యముగను నీసాంప్రదాయ సిద్ధముగను ౧౦౮ పద్యము లుండును. శివతత్త్వసారము వేమన శతకము మొదలగు శతకములు వందలకొలదిపద్యములను గలిగియున్నవి. మఱికొన్ని శతకములందు ౧౦౦ పద్యములును గలవు. కాలాంతరమున నితరకవులు వారిస్వంతపద్యములను మంచిశతకములందు చేర్చుటయును శతకపద్యములందు సంఖ్యాభేదమునకు గారణంబై యుండును.

ఆంధ్రవాఙ్మయమునందు ౧౦౦౦ శతకములైనను నుండియుండును. శ్రీయుత వంగూరి సుబ్బారావుగారు ౬౦౦ శతకములనుజూచి నటులు శతకవాఙ్మయచరిత్రమునందు వ్రాసియున్నారు. ఎన్నియో శతకములు నష్టమైనవియును నజ్ఞాతములైనవియును గలవు. కవిత్వధోరణి గల కవులు ప్రబంధాదికృతినిర్మాణములకు పూర్వమునను శతకములను రచియించుట సామాన్యము. తిక్కనపోతనాది మహాకవులును శతకములను రచియించినటులు ప్రతీతిగలదు.

శతకములందు శృంగారనీతిపరము లైన శతకములు కొన్నియున్నను భక్తిశతకము లధికముగ నున్నవి. కవులు తమయిష్టదేవతాస్తవ పరములైన శతకములను రచియించి కవితాకన్యక నీశ్వరార్పణము చేయుట సాంప్రదాయసిద్ధముగ నున్నది. శ్రీరామశతకములు, కృష్ణశతకములు, శివపరములైనశతకములు, దేవీపరములైనశతకములు శతకవాఙ్మయమునందు విశేషముగగలవు. వేమనశతకము, సుమతిశత

కము, కుమారీశతము మొదలగు నీతిశతకములుగలవు. వేణుగోపాలశత కము మల్లికార్జునశతకము మొదలగుశృంగార భక్తిశతకములు గలవు వీరశృంగారభక్తిరససమ్మిళితములైన శతకములు గలవు. ఆంధ్రవాఙ్మయమునందు వేలకొలదిశతకములుపుట్టినను శతకము లనేకములు నష్టమైనవి.

ఆంధ్ర శతక వాఙ్మయము :—ఆంధ్ర శతకవాఙ్మయమునకు ప్రాకృత సంస్కృతశతక వాఙ్మయములు మూలాధారమైనను నీవాఙ్మయాంగ వికాసము ప్రత్యేకము వ్యక్తిత్వమును గలిగియున్నది. ఆంధ్రశతకములకు మకుటము ప్రధానముగ నున్నది. సామాన్యముగను మకుటమే శతక నామమును దాల్చుచున్నది. దాశరథి, కాళహస్తీశ్వర, రంగశాయి, రామతారక, సుమతి, వేమనాది శతకముల మకుటము లాంధ్రశతకముల స్వరూపమును విశదము చేయుచున్నవి. భక్తిశతకములందు మకుటము లిష్టదేవతా పరములై యొప్పుచున్నవి. ధూర్జటి కాళహస్తీశ్వరుని, సోమనాథుడు వృషాధిపతిని, అన్నమయ్య సర్వేశ్వరుని, గోపన్న శ్రీభద్రాద్రిరాముని, పోతరాజు శ్రీమన్నారాయణుని దమశతకములందు సంబోధించి మకుటరూపమైన శతకనామకరణమును జేసిరి. వేమన, సుమతి, కుమారి మొదలగు నీతిశతకముల మకుటములు భావార్థపరములుగ నున్నవి. నారాయణాది శతకములందు గల ఆదిదశకాది శతకవిభాగములును నాంధ్రశతకముల వ్యక్తిత్వమును దెలుపుచున్నవి. ఆంధ్రవాఙ్మయమునందు శతకాంగము ప్రముఖాంగముగ నున్నను కావ్యాంగములందు సందిగ్ధాంగముగ నున్నది.

కావ్యాంగములు :—లాక్షణికులు కావ్యాంగములందు పురాణేతిహాస ప్రబంధనాటకాదుల కొసంగిన ప్రాముఖ్యమును శతకముల కొసంగియుండలేదు. అప్పకవి శతకములనుండి కావ్యలక్షణముల కుదా

హారణములను సంగ్రహించెను. అప్పకవి, విన్నకోట పెద్దన్నగారులు శతకములను క్షుద్రకావ్యములందు జేర్చిరి. అనంతామాత్యుడు శతకములను చాటుప్రబంధములందు జేర్చెను. కవిచరిత్రకారుల గురజాడ శ్రీరామమూర్తిగారు, వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రములందు శతకముల ప్రశంసను జేసియుండలేదు. శతకములు లక్షణగ్రంథములందు ప్రవేశమును గాంచకపోయినను ప్రజాహృదయమునందు స్థిరప్రవేశమును గాంచిన విధమును శతకములసంఖ్య, శతకకర్తలనామములు శతకముల ప్రచారము విశదము చేయుచున్నవి. కావ్యాంగములను నిర్ణయించుటయందు శతకాంగమును నాంగ్లకావ్యసాంప్రదాయానుసారముగను నిర్ణయించుట యాంగ్లవిద్యాశిక్షితుల కాచారమైనది. శతకకవుల చరిత్రను రచియించిన కీ. శే. వంగూరి సుబ్బారావుగారును నీమార్గము నవలంబించి శతకములు భావగీతములను (Lyrics) కావ్యాంగమునకు జేరునటులు నిర్ణయించిరి. ఈ నిర్ణయ మాంధ్రకావ్య సాంప్రదాయములకు సమన్వయముగాకను సందిగ్ధముగ నున్నది. శతకవాఙ్మయమును నాంధ్రవాఙ్మయమునకు పరిచితమైన హ్రస్వకావ్య విభాగమునందు జేర్చుటయే భావ్యముగ నుండును. నీతిశతకములందు విషయ సమన్వయము లేకపోయినను భక్తిశృంగార శతకములందు విషయసమన్వయమును భావసమన్వయమునుగలవు. శతకవాఙ్మయము లాక్షణికుల యాదరణమును బడయకపోయినను, ప్రజాదరణమును బడసినవిధమును వాఙ్మయవ్యాపనము విశదముచేయుచున్నది. భక్తిశతకములు, నీతిశతకములు, శృంగార శతకములు ప్రజాజీవనమును రసవంతము చేయగలవిధమును శతకముల యాదరణము చాటుచున్నది. ఆరంభవిద్యా ప్రవృత్తియందు బాలికాబాలకులకు జ్ఞానోదయమునకును, భాషాపరిచయమునకును శతకములు ప్రయోజనకరములుగ నున్నవి. వేమన, సుమతి, కుమారీ, భాస్క-

రాది నీతిశతకములకును, దాశరథి, నారాయణ, రామతారకాది భక్తి శతకములకును పూర్వము విద్యాప్రవృత్తియందుగల వ్యాపకము వాని ప్రయోజనమును విశదము చేయుచున్నది. బాల్యమునందు నీతి, భక్తి, ధర్మబోధకములును మనోహరములును, శ్రావ్యములును నైన శతకములను జదువుట విద్యాప్రవృత్తికి ప్రయోజనకరముగ నుండగలదు. ఆంధ్రప్రజాహృదయమున కపరిచితులైన ఆంగ్లేయపండితులును దేశీయ పండితులును విద్యాప్రవృత్తియందు నిర్ణయించుచున్న పాఠావలి ఆంధ్రభాషకు సంప్రాప్తమైన దుర్దశను తెలుపుచున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులు విద్యాప్రవృత్తియం దీదుర్దశను తొలగించి విద్యాప్రవృత్తిని సారవంతము చేయుదురుగాత! శతకవాఙ్మయమునందు భక్తిశతకము లాంధ్రహృదయస్వరూపమును విశదము చేయుచున్నవి.

భక్తిశతకములు:—మానవులకు సకలార్థములందును భక్తి తరణమునకు సాధనముగ నున్నది. పితృభక్తి, మాతృభక్తి, పతిభక్తి, గురుభక్తి, దేశభక్తి, దైవభక్తి మహత్తరమైన భక్తికి భిన్నరూపములు. భక్తులు తాము తరించి లోకమును తరింపజేయుచున్నారు. శ్రీరామచంద్రుని పితృభక్తి, సావిత్రి పతిభక్తి, ప్రహ్లాదుని దైవభక్తి భక్తి ప్రభావమునకు నిదర్శనములు. అనన్యమైన భక్తి ఇహపరలోక సౌఖ్యములకు పరమసాధనము. దైవానుగ్రహమునుబడయుటకు భక్తియోగము పరమసాధనముగ నున్నవిధమును భక్తుల చరిత్రలు తెలుపుచున్నవి. పండితులకు సాధ్యముగాని పరమపదము భక్తులకు సులభసాధ్యముగ నున్నది. వ్యాసులు జ్ఞానసాగరమైన భారతరచనానంతరము మోక్షప్రాప్తికి భక్తిసాగరమైన భాగవతరచనను చేసిన యితిహాసవృత్తము భక్తిప్రభావమును దెలుపుచున్నది. విశ్వరూపసందర్శనమున కనన్యమైన భక్తియె సాధనమని శ్రీకృష్ణభగవానులు ప్రియభక్తుడైన యర్జునున కుపదేశించెను.

శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!

శ్లో. మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ!

భాగవతభక్తిభరితమైన ఆంధ్రహృదయబృందావనమునకు శతకములు సహజఫలములుగ నున్నవి. భక్తిరసభరితములైన శతకముల నాంధ్రకవులు హృద్యముగను బాడి ప్రజాహృదయములందు భక్త్యుత్సాహములను ప్రజ్వలింపజేయగలిగిరి. రామదాసుగారి దాశరథి శతకము, ధూర్జటి కాళహస్తీశ్వరశతకము, పోతనామాత్యుని నారాయణశతకము, సుబ్బారాయుడుగారి భక్తచింతామణిశతకము మొదలగు భక్తి భరితమైన వందలకొలఁది శతకము లాంధ్రభక్తహృదయమును విశదము చేయుచున్నవి. శతకములు పండిత పామరహృదయములందును బాల వృద్ధహృదయములందును గలుగజేయఁగల భక్తిరసావేశ మనుభవజ్ఞులకు విదితము. బ్రాహ్మీముహూర్తమునను లేచి భక్తిరసపూరితమైన హృదయముతో దైవసంకీర్తనమును జేయుటకు శతకములు పరమప్రయోజనకరములుగ నున్నవి. కొంతకాలమునకు బూర్వము శ్రావ్యమైన శతకసంకీర్తన మాంధ్రగృహములందు జరుగుచు సాంధ్రహృదయవికాసమునకు దోడ్పడుచుండెడిది. ఇపు డాస్థితియంతయును మారినది. విద్యాలయము లందును గృహములందును శతకపఠన మపరూపమైనది. ఆరంభవిద్యాభ్యాసమునందు కాకి పిల్లికథలు ప్రబలినవి. ఆంధ్రహృదయమునందు భక్తిరసప్రవాహము శుష్కించుచున్నది. ఆంధ్రాభిమానులు విద్యాలయములయందును గృహములందును భక్తిజ్ఞాన నీతిబోధకములైన శతకముల పఠనము నుద్ధరించి భాషాభ్యుదయమునకును హృదయవికాసమునకును దోడ్పడుదురు గాత! ఈభక్తిశతకముల సంపుటము యీకార్యసిద్ధి కించుకేనియును తోడ్పడిన ప్రకాశకులు కృతార్థులు.

ఆంధ్రగ్రంథమాలయందు శతకసంపుటము ప్రథమపుష్పము. ఈ శతకసంపుటమునందు గల ప్రతిశతకమునకును విపులమైన పీఠిక గలదు. ఆపీఠికయందు కవికాలము, కవిత్వము, భావార్థము, శతకవిభాగములు పాఠభేదములు మున్నగు విషయములు విపులముగను విమర్శింపబడినవి. ఆంధ్రమహాజను లీప్రచురణమునందలి గుణములను గ్రహించి శతకావళికి స్వాగతంబు నొసంగుటకు వేడుచున్నాము. కీ. శే. శ్రీ వంగూరి సుబ్బారావుగారు శతకకవులచరిత్రను వ్రాసి చేసిన యుపకృతిని ప్రజలు సార్థకము చేయుదురుగాత!

అక్షయ సంవత్సర అధికచైత్ర బహుళ ౨ బుధవారము.

కాశీనాథుని. నాగేశ్వర రావు.
సంపాదకుడు.

# పీఠిక

శ్రీవృషాధిపశతకమును రచియించిన పాలకురికి సోమనాథారాధ్యులు కాకతీయరాజ్యమునందలి పాలకురికియందు జననమొందెను. పాలకురికియందు బుట్టి ద్రవిడాంధ్ర కర్ణాటకదేశములందు సంచారమునుచేసి కలికె యను గ్రామమునను శివసాయుజ్యమును బొందినటులు తెలియుచున్నది. శ్రియాదేవియును విష్ణురామదేవుడును తలిదండ్రులనియును కట్టకూరి పోతిదేవుడు విద్యాగురువనియును కరస్థలము విశ్వేశుడు కవితాగురువనియును బసవపురాణమునందును, బసవేశుడు తండ్రియనియును లింగార్యుడు గురువనియును పండితారాధ్యచరిత్రమునందును సోమనాథుడు తనను గుఱించి వ్రాసికొనెను. పండితారాధ్యచరిత్రకు కృతిపతియైన నూరనామాత్యుడు "ఆపస్తంబసూత్రుడు, హరితసగోత్రుడు, ముద్దుమఱది, నెచ్చెలికాడు" అని వ్రాసెను. సోమనాథుడు లింగధారి బ్రాహ్మణుడని వీరేశలింగముపంతులుగారు కవులచరిత్రమునందు వ్రాసియుండిరి. బండారు తమ్మయ్యగారు దుందుభి సంవత్సరాదిసంచికయందు సోమనాథుడు జంగము డని నిర్ధారణచేయు నొకవ్యాసమును వ్రాసిరి. అనుభవసారమునందు సోమనాథు డిటులు తన కులగోత్రాదులను వర్ణించుకొనెను:—

కం. భృంగిరిటిగోత్రుడను గురు, లింగతనూజుండ శివకు ♦ లీనుడ, దుర్వ్యా
సంగ వివర్జిత చరితుడ, జంగమలింగప్రసాద ♦ సత్ప్రాణుండన్.

"వీరశైవమతస్థు లగు జంగములకును లింగాయతులకును గోత్రాధికారులు- బ్రాహ్మణులకు నారాధ్యబ్రాహ్మణులకువలె - గౌతమ భారద్వాజాది మునీశ్వరులు కాక శివునిముఖమునుండి యుద్భవించిన - వృషనందీశ్వరభృంగి (భృంగిరిటి) వీరస్కందులు అయియున్నారు." అని వ్యాఖ్యానముచేయుచు సోమనాథుడు జంగము డని తమ్మయ్యగారు సమర్థించిరి. ఆరాధ్యబ్రాహ్మణులును ఆరాధనసమయమునందు "ఓం ఓం శ్రీనందిభృంగిరిటి వీరక వీరభద్ర చండేశ్వర ప్రమథముఖ్యమహాగణేభ్యః...... నమోమహద్భ్యః" అని చెప్పుటవలనను భృంగిరిటిగోత్రము జంగమకులనిర్ణయమును జేయజాలదు. అనుభవసారమునందు "వేదోక్తనిరూఢిని బురాణరహస్యనియుక్తిని" రచియింతుననియును పండితారాధ్యచరిత్రమునందు "చతుర్వేదపారగుడను" అనియును వ్రాసెను. సోమనాథభాష్యమునందు "గాయత్రీ మంత్ర ప్రకరణము"ను జేర్చెను. చతుర్వేదసారసూక్తులను వ్రాసెను. సోమనాథునిగ్రంథములందు గల వేదార్థపరిచయమును సోమనాథుని సంబంధ బాంధవ్యములును బ్రాహ్మణకులసంభవమును దెలుపుచున్నవి. పాలకురికి సోమపతితుడు అను ధూర్తవిప్రుని నిందయే బ్రాహ్మణకులజననమును దెలుపుచున్నది. సోమనాథు డారాధ్య బ్రాహ్మణకులజుడుగ బుట్టినను కాలక్రమమునను అనుభవసారమును

వ్రాసినకాలమునకు బ్రాహ్మణకులగోత్ర మోహమును వదిలి శివభక్తుడై బసవకులమును బసవ
గోత్రమును స్వీకరించి ప్రమథగణపరమైన భృంగిరిటగోత్రమును స్వీకరించినటు లూహిం
పదగియున్నది. వేమనారాధ్యుడు బ్రాహ్మణు డనుటకును ప్రబలనిదర్శనములు గలవు.
శైలిదేవ వేమనారాధ్యుడు భూసురు డని పండితారాధ్యచరిత్రమునందు వర్ణింపబడినది.
పండితులు చరిత్రాంశముల నిర్ణయమునందు కులాభిమానమును విడిచి సత్యాభిమానమును
బూని సోమనారాధ్యుని కులగోత్రములను నిర్ణయించుట సమంజసము.

కాలము:—సోమనాథుడు కాకతీయరాజ్యమును 1140-1196 వరకును
ఏలిన మొదటి ప్రతాపరుద్రుని కాలమునం దున్నటులు వీరేశలింగము పంతులుగారు
నిర్ణయించిరి. బసవేశ్వరుడు 1140-68 వీరశైవమత వ్యాపనమును జేసెను. బసవేశ్వరుడును
పండితారాధ్యుడును సమకాలికులు. పండితారాధ్యుడు 1120-90 వరకును నుండినటులు
కొ. లక్ష్మణరావుగారు శివతత్త్వసారము పీఠికయందు నిర్ణయించిరి. సోమనాథుడు తాను
వేమనారాధ్యుని మనుమని శిష్యుడ నని వ్రాసికొనెను. వేమనారాధ్యుడు పండితారాధ్య
లకు సమకాలికు డని పండితారాధ్యచరిత్రము తెలుపుచున్నది. బసవేశ్వరుడు 1168 లో
లింగైక్యము నొందెను. పండితారాధ్యుడు బసవేశ్వరుని మరణానంతరము జీవించియుండెను.
1220 లో ఉద్భటకావ్య మను నామాంతరము గల శృంగారసారమును రచియించిన కన్నడ
కవి సోమరాజు సోమనాథుని బ్రస్తుతించెను (కర్ణాటకకవి చరిత ౧ వ భాగ. 270 పుట)
పండితారాధ్యుడు 1190 వరకు జీవించియుండి సోమనాథుడు 1196 వ సంవత్సరప్రాంత
మునం దుండినటులు నిర్ణయించిన కొంత యసందిగ్ధస్థితి గలుగుచున్నది. పండితారాధ్యుని
కాలము పదేండ్లు వెనుకకును సోమనారాధ్యునికాలము కొంచెము ముందునకును నడుపుట
యుచితముగ నున్నది. కాని ఈ నిర్ణయము 1140-1196 వరకు పాలించిన మొదటి
ప్రతాపరుద్రునికాలమునకు సోమనాథుని కాలమును దూరస్థము చేయును. పండితారా
ధ్యుని కాలానంతరము పదియైదేండ్లలోపలనె సోమనాథుడు నివసించి తన గ్రంథములను
రచియించినటు లూహింపదగియున్నది. పండితారాధ్యచరిత్రమును బసవపురాణమును రచి
యించిన సోమనాథుడు 1170-1200 వరకును నివసించి యుండును. కర్ణాటక వాఙ్మయ
పరిశోధనలవలనను నితరమైన యాధారములవలనను యథార్థమైన కాలనిర్ణయమును
జేయుట కవకాశము లింకను గలవు.

వ్యక్తిత్వము, గ్రంథములు:—సోమనాథు డొక మహావ్యక్తి యని వారి
గ్రంథములును నితర గ్రంథకర్తల ప్రశంసలును వీరశైవులవర్ణనలును తెలుపుచున్నవి. చతు
ర్వేదపారంగుడు. సంస్కృతాంధ్ర కర్ణాటాదిభాషలందు మహాపండితుడు. గానకళాప్రవీ
ణుడు. కవిపుంగవుడు. మహాభక్తుడు. వీరశైవశిఖామణి. సోమనాథుని ప్రతిభను వారిగ్రం
థములు విశదముచేయుచున్నవి. బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, అనుభవసారము,

చతుర్వేదసారసూక్తులు, చెన్నమల్లు సీసములు, వృషాధిపశతకము తెనుఁగు గ్రంథములు; సోమనాథభాష్యము, బసవన పంచగద్య, శ్రీరుద్రభాష్యము, నమస్కారగద్యము, అక్షరాంక గద్యము, పంచప్రకారగద్యము, అష్టకము, పంచకము, ఉదాహరణ యుగ్మము, సంస్కృతములు; బసవరగడ, గంగోత్పత్తిరగడ, శ్రీబసవాఢ్యరగడ, సద్గురురగడ, కర్ణాటకములు. సోమనాథున కాంధ్ర కర్ణాటక సంస్కృతభాషలందును, వేదవేదాంతశాస్త్రములందును, మతసంప్రదాయాచారములందును, కళలయందును, శాస్త్రములందును గల యసామాన్యపాండిత్యమును ద్విపద కావ్యము లైన బసవపురాణమును పండితారాధ్యచరిత్రమును భాష్యములును తెలుపుచున్నవి. అనుభవసారము సోమనాథుని శివానందానుభవమును తేటమాటలను దెలుపుచున్నది. ద్విపదకావ్యములపట్ల గల యనాదరణమును వీరశైవమతము పట్ల గల విముఖతయును సోమనాథుని గ్రంథముల ప్రచారమునకు ప్రతిబంధకములుగ నేర్పడినవి. నన్నయకును తిక్కనకును నడుమకాలమునందు వర్ధిల్లి తాను తెనుఁగున ద్విపద కావ్యములను ప్రజాసామాన్యమున కుపయోగకరముగ రచియించి దేశభాషా సాంప్రదాయాచారములను పెన్నిధిగను గ్రంథములందు సేకరించిన సోమనాథుని గ్రంథముల కధికతరమైన ప్రచారమును గలుగజేయుట కాంధ్రభాషాభిమానులు ప్రయత్నించుదురు గాత!

వృషాధిపశతకము:—ఆంధ్రవాఙ్మయమునందు శతకవాఙ్మయము మిగుల రసవంతముగ నున్నది భక్తి జ్ఞాన వైరాగ్య నీతి శృంగార హాస్యభావములు శతకములందు పల్లవించుచు శతకములు రసోదయమును గలుగజేయుచుండును. శతకములు ఒకేవిషయమును గాని పలువిషయములను గాని హృదయరంజకముగను వర్ణించుచు ఖండకావ్య స్వరూపము దాల్చియున్నవి. ఆంధ్రవాఙ్మయమునం దిపుడు 600 పైన శతకములు నిలిచియున్నవి. శతకములందు భక్తిపరమైన శతకము లధికముగ నున్నవి. శతకగుచ్ఛముగ నున్న శివతత్త్వసారము వృషాధిప శతకమునకు పూర్వకాలపు గ్రంథమైనను ప్రచారమునందున్న శతకములందు వృషాధిపశతకము ప్రాచీనశతకముగ నున్నది. ఈ శతకమునకు బసవశతకము బసవేశశతక మని నామాంతరములు గలవు. ఈ శతకము నిదివరకు శ్రీ శైవముద్రాక్షరశాల వారు బందరు, వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సు వారు మద్రాసు, ముద్రించిరి. ప్రాచ్యలిఖిత భాండాగారమునందు వ్రాతప్రతులు గలవు. ఆ ప్రతులను పరిశోధించి పాఠభేదములను జేర్చి ఈ ప్రతిని ముద్రించితిమి. సోమనాథుడు వృషాధిపశతకమును బసవపురాణానంతరము రచియించి తనకు బసవేశ్వరునిపట్ల గల పరమభక్తిని దెలియజేసెను.

శైలి:—సోమనాథుని ద్విపదకావ్యముల శైలి మహాప్రవాహమువలె బ్రవహించుచు నాంధ్రపద భూయిష్ఠమై భావగర్భితమై పండితపామరులకు సులభగ్రాహ్యమై మనోహరముగ నున్నది. వృషాధిపశతకపు శైలి సరళమైనను సంస్కృతపదభూయిష్ఠమై

కఠినముగ నున్నది. అంత్యప్రాసములకును ముక్తపదప్రాసములకును శబ్దాలంకారములకును నీ శతకము తరువాతికవులకు మార్గదర్శకముగ నున్నవిధము నీపద్యములు తెలుపుచున్నవి.

"ఉద్ధత భక్తవృద్ధ వినుతోత్తమ సిద్ధ పరీత జంగమ
శ్రద్ధ సదాత్మశుద్ధ గణరాజిసమృద్ధ విముక్తిపాళి స
న్నద్ధ మహాప్రసిద్ధ యగుణత్రయబద్ధ శరణ్యమయ్య భా
స్వద్ధత చిత్ప్రబుద్ధ బసవా........................"

చ. "సురవరపూజ్య పూజ్యగుణ శోభిత శోభితరూప రూప వి
స్ఫురతరశీల శీలగుణపుంగవ పుంగవసత్త్వ సత్త్వసం
వర పరవాద వాద భయవర్జిత పాప విచారచార యీ
శ్వరసమ నీవెదిక్కు......బసవా................"

సోమనాథుడు తన యష్టభాషాపాండిత్యమును దెలుపుటకీశతకమునందు సంస్కృతమునందును తెనుగునందును ద్రవిడ కర్ణాటక మహారాష్ట్ర భాషలందును మిశ్రమభాషలందు మణిప్రవాళమునందును బసవస్తుతిని జేసెను. "విరచిత శుద్ధ సాళువ,.....కేళివిలోల సంగమేశ్వర" యను నొక సమాసముననె పద్యమంతయు జేర్చెను. శైలియందు శబ్దాలంకారములును నంత్యప్రాసములును ముక్తపదప్రాసములు నున్నను నర్థరసస్ఫురణము సహజముగ గలుగుచు పద్యములు సరళగతి గలిగి భావములు సులభముగ గ్రాహ్యము లగుచున్నవి. యతిప్రాసములు విశ్రమమైత్రిని గలిగి శ్రావ్యములై సుస్వరోపేతములై యున్నవి. శతకమంతయును మకుటమునందు సంబోధనజేసిన బసవేశ్వరుని ప్రభావమును వ్యక్తపరచుచు బసవేశ్వరగానమును జేయుచు శబ్దార్థములను బసవమయము చేయుచున్నది.

## కావ్యార్థము

ఈశతకమునకు మకుటము:—బసవా! బసవా! బసవా! వృషాధిపా!

హృదయాంతరాళమునుండి త్రిరావృత్తమై వెడలిన బసవసంబోధనము సోమనాథుని భక్తిరసోన్మాదమును చాటుచున్నది. సోమనాథుని హృదయేశ్వరుడైన బసవేశ్వరుని గానస్తవములు పండ్రెండవశతాబ్దియందలి యాంధ్రహృదయ వేదనమును సువ్యక్తము చేయుచున్నవి. శ్రీ శంకరాచార్యులు తన ప్రజ్ఞాబలముచే జైన బౌద్ధమతముల నణగద్రొక్కి వైదికమతమును దాని ప్రాబల్యమును స్థాపించినను నపూర్వమైన ప్రజాశక్తి తిరిగి తలయెత్తి విజృంభించినది. శంకరుడు ప్రతిపాదించిన "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" "శివోహం" అను పరమార్థతత్త్వములను నిత్యజీవనమునందు సమన్వయము జేయుట కాంధ్రహృదయము ప్రయత్నించినది. సిద్ధాంతమునందు బ్రాహ్మ

ణుడును చండాలుడును శివస్వరూపు లని యాచార్యస్వాములు సిద్ధాంతము చేసినను నాచరణమునందు సంఘజీవనమునందు శివారాధనమునందు భక్తబృందావనమునందు కులగోత్రస్వరూపము లైన భేదావరణములు భేదములను బెంచి వర్తమానకాలము నందువలెనే నిందాసూయలకు దుర్బలమునకు గారణములుగ బరిణమించినవి. ఆచార్య స్వాములవారు ప్రతిపాదించిన "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను సిద్ధాంతమున కర్థాపత్తిని గలుగజేయుటకు బసవేశ్వరుడు దలపెట్టెను. బసవేశ్వరుడు మహాభక్తుడు. బ్రాహ్మణకులజుడు. బాల్యమునందే బ్రాహ్మణకర్మలను నిరసించి భక్తి జ్ఞాన సమ్మిళితమైన లింగధారిమత వ్యాపనమునకు బూనుకొనెను. జీవేశ్వరులకు ప్రవృత్తియందుగల యవ్యవహిత సంబంధము నిత్యానుభవ మయినపుడు పరమార్థసందర్శనము సాధ్యమగును. జంగమజీవనమునందు పరమార్థసందర్శనము గలుగునపు డద్వైతసిద్ధి భక్తులకు గలుగుచున్నది. బసవేశ్వర సిద్ధాంతములను పండితపామర హృదయములందు వ్యాపింపజేయుటకు సోమనాథుడు తన యప్రతిమాన మైన ప్రజ్ఞాపాండిత్యములను వినియోగించి కీర్తికాము డయ్యెను. గురులింగజంగమముల కైక్యమును సోమనాథుడు బోధించి కులగోత్రములను వదలి బసవకులగోత్రములను స్వీకరించెను. లింగధారణము శివభక్తబృందావనమునందు గురులింగజంగమ భేదావరణముల గూలద్రోసి సకలజనులకును శివస్వరూపమును గలుగజేయుచున్నది. వృషాధిపశతకమునం దీ పరమార్థమును తత్త్వభావమునను నర్థరూపమునను సోమనాథుడు మనోహరముగ నుపదేశించెను. సోమనాథుడు శివసాయుజ్యమునకు శ్రీ గురుమూర్తి యైన బసవేశ్వరునకువలె జంగమస్వరూపులైన భక్తులకును భృత్యభావమును బూనిన విధమును శతకము దెలుపుచున్నది. లింగాంగులైన కిన్నరయ్య, మాచయ్య, బాచిరాజు, బంకిదేవయ్య, చౌడయ్య, బొప్పయ్య, బ్రహ్మయ్య మొదలగు భక్తులకు జంగమభక్త బృంద వనమునందు కులగోత్రస్థితి భేదములుపోయి శివభక్తగణ స్థానము లభించినది. జీవేశ్వరులకు విశిష్టాద్వైతమతస్థులు గల్పించిన శాంత దాస్య సఖ్య వాత్సల్య మధురావస్థలను సోమనాథు డీ శతకమునందు పెక్కు స్థలములందు వ్యక్తము చేయుచు సకల జంగమప్రపంచమును నీ సూత్రబద్ధము చేసి శివమయము చేసి పరమార్థమును గనుగొనినవిధము నీ క్రిందిపద్యము తెలుపుచున్నది.

ఉ॥ నాయొడయండ నావిభుడ నాహృదయేశ్వర నామనోరమా  
నాయిలువేల్ప నావరద నాగురులింగమ నాదుజంగమా  
నాయధినాథ నావరుడ నన్నుఁ గృపామతిఁ బ్రోవుమయ్య దే  
వా యమిబృందవంద్య బసవా! బసవా! బసవా! వృషాధిపా!

గ్రంథపుస్తగర్భితచే నీ విషయము నింతటితో నాపి విషయార్థస్ఫురణమున కనుభవసారమునందలి పద్యముల నుదాహరించుచున్నాను.

క. ఇంద్రియపరవశు డధముం, డింద్రియనిగ్రహుడు భక్తియెడ మధ్యముడై
యింద్రియజయుఁ డుత్తముఁడు శి, వేంద్రియసంధాయకుఁడు మహేశుఁడుగాడే.

క. యీశుల మాశుల మనక ని, రాశులమతి వారికోరత లరయక భక్తా
నీకము శివుడని కొలచిన, చేకొనడే వాంఛితార్థసిద్ధి మహాత్మా.

క. అర్థార్థము వ్యవసాయము, అర్థము జంగమహితార్థ మడియును సద్భ
క్త్యర్థము సద్భక్తియు ము, క్త్యర్థం బటుగానవలయు వ్యవసాయ మిఁక్.

వృషాధిపశతకము భాషయందును భావములందును భక్తి రసోదయమునందును సెక్క గ్రంథములకు మార్గదర్శకమై సోమనాథారాధ్యుని ప్రతిభను వెల్లడి చేయుచున్న విధము నీ క్రింది పద్యము విశదముచేయు చున్నది.

ఉ. లింగమయాంతరంగ గురులింగపదాంబుజభృంగ సత్ప్రసా
దాంగ కృపాపరిస్ఫురదపాంగ విముక్తభుజంగ జంగమో
త్తుంగ జితాభిమంగ గతదుష్కృతభంగ మదీయలింగ నీ
వంగడ మేఁ జు మయ్య బసవా! బసవా! బసవా! వృషాధిపా!

పాఠములను సరిచూచిన వ్రాతపుస్తకములు:— ఈ గ్రంథమును అచ్చుకూర్చుటకు ముందు పాఠభేదములను గుర్తించుటకై చెన్నపురిలోని దొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము వారి గ్రంథాలయమునందలి గ్రంథముల నుపయోగించుకొన్నారము. ఇందు ప్రదర్శించిన నంబరులు పై భాండాగారమువారి గ్రంథముల నంబరు లని కృతజ్ఞతతో చదువరులకు తెల్పుచున్నారము.

12-9-14 ఇది తాళపత్ర గ్రంథము. సంపూర్ణముగ నున్నది 104 పద్యము లిందు గలవు. వ్రాత తిన్ననిది. కంపేరు చేయుటలో దీనికి 'అ' అని చిహ్నముంచినాము.

13-3-15 ఇది కాగితపుప్రతి దీనియందు 108 పద్యములుగలవు. ఇందలి వ్రాతకూడ తిన్ననిదే. దీనికి 'ఇ' అను గుర్తుంచినాము.

13-9-18 ఇదియును తాళపత్రముల ప్రతియే. ఇందుగూడ 109 పద్యము లున్నవి దీనికి 'ఉ' యను గుర్తుంచినారము.

14-14-22 ఇదియును తాళపత్రగ్రంథమే. ఇది చాల ప్రాచీనము. దీనికి ఇందు 'ఊ' యను గుర్తు నుంచితిమి. ఈ పుస్తకము చివరను ప్రతి విలేఖకులు ఈ విధముగా ప్రతిని లిఖించిన కాలమును పేర్కొన్నారు. క్రోధినామ సం॥ర ఆషాఢ శు ౧౧ జయవారము నాడు వృషాధిపశతకం సంపూర్ణముగా అడ్డిగెలమల్లు వ్రాసిన ప్రతిని కాంజవీరమల్లు వ్రాసికొనెను.

## పెక్కుభాషల పద్యములకు తాత్పర్యము

(౧౦) ఇది సంస్కృతమున రచించిన స్తుతి. ప్రసిద్ధమైన కీర్తిచేత నిండింపబడిన ముల్లోకములు గలవాడా! మహాపాపముల నణంచు విభవము గల పాదపద్మములు గల వాడా! ప్రకాశించుచున్న వృషభస్వరూపుడా నమస్కారము. అని భావము.

(౧౧) ఆప్తులగు శివగణములం బ్రవేశించిన ఆర్తుల నన్నింటిని హరింపజేయు వాడా! సుఖము నిచ్చు చిరునవ్వుతో కూడిన కటాక్షములు గలవాడా! ప్రకాశవంతము లగు గుణములు గలవాడా! దీనభావముతో నీకు నమస్కారమని ప్రణుతింతునని భావము. ఇదియును సంస్కృతభాషా మయమే.

(౧౨) కల్పింపబడిన లింగజంగమ సుఖములచేత వెలుగొందువాడా! (అనగా లింగ జంగములకు సుఖమును గల్పించి తత్కృపను విలసిల్లువాడా యని భావము) నిర్వికల్ప వికల్ప మార్గములందు ఖ్యాతినొందినవాడా! గుణములకు కల్పవృక్షములాంటివాడా! అని నీకొఱకు గౌరవలీలతో నమస్కరింతునని భావము. ఇదియును సంస్కృతమయమే.

(౧౩) పాపములను బెదరించినవాడా! సంసారతాపమును పోగొట్టినవాడా! భక్తిచే ఊర్జితమైన మనస్సుగలవాడా! సుగుణములనెడి ఉత్తమరత్నములకు పెట్టెలాంటి వాడా అని నిన్ను వర్ణించెదనని భావము! ఈ పద్యముగూడ సంస్కృతభాషామయము.

(౧౪) మన్మథుని చూర్ణముచేసినవాడా! భస్మవిలేపనముచే వెలుగొందువాడా! మనోరథముల నీడేర్చినవాడా! పూర్వజన్మాశ్రితపవర్తనమును వీడినవాడా ! వర్ణభేదమును నిరసించువాడా! శివాసహితుడా! నీకొఱకు నమస్కారమును చేయుచున్నానని భావము ఈ పద్యము సైతము సంస్కృతభాషామయమే.

(౧౫) భవారణ్యపర్యటనముచే నలసియున్న జనులయొక్క శ్రమలను పోగొట్ట జాలి, సమస్తజగములచేతను ప్రణుతింపబడిన మీ పాదద్వంద్వమును నా హృదయకమలము నందు—"ఓ నా యీశ్వరా దయానిధీ! నిరంతరము సంస్మరించుచున్నా" నని నిన్ను సంస్కృతభాషతో నుతించెదనని భావము

(౧౬) ఇది తమిళపద్యము. నా దైవమా, నాగ(భూషణ)ధరా ! దిక్కులేనివారికి దిక్కగువాడా! పెద్దయ్యా! పవిత్రముచేయువాడా! ప్రఖ్యాతుడా! దేవా! లింగడీ! అని అర్థము గలుగునట్లు ద్రవిడభాషతో నుతింతును. అని భావము.

(౧౭) ఇది కర్ణాటకపద్యము. పసివాడైన నన్ను రక్షింపవలసినది. నా అవనీతుల నెందును మన్నింపవలసినది. నీ పదాబ్జముల నమస్కరింపగల నీయనుగ్రహమే యిది నీయాత్మయే దిక్కు—అని నిన్ను కర్ణాటకభాషతో నుతింతునని భావము.

(౫౮) ఇయ్యది మహారాష్ట్రభాషా ప్రస్తుతి గల పద్యము. దేవోత్తముఁడవు నీవు. గురుదేవుడవని వృషభేశ్వరుఁడవని నిన్ను చెప్పెదను. నీయొక్క అనుగ్రహము. నన్ను దయ జూచువాఁడవు నీవేగదా యని నుతింతునని భావము.

(౫౯) ఇది సంస్కృతాంధ్ర మిశ్రితమైన భాషలతో చేసిన ప్రస్తుతి పద్యము. ప్రవాళ మనగా బవడము. పవడమునం దెట్టులు ఎఱుపు తెలుపు మున్నగు రంగులు ఒకదానితో నొకటి కలసి మెలసి ప్రత్యేకవర్ణమువలె సముజ్జ్వలములై యుండునో అట్లే వివిధభాషలలో గల పదములు ఒక్కఛందమునందు ఎనసి పెనసి యుండుటచేత నిట్టి పద్యములకు మణిప్రవాళములు అని ప్రాచీనులు పేరునుంచిరి. "భక్తులయొక్క హృదయకమలములందు విహరించువాఁడా! నిరంతరముసు చేతులనెత్తి దేవరవారి పాద ద్వంద్వమును నమస్కరించుచున్నానని యును, హృదయమునందు ధ్యానము సేయుచున్నా ననియును, నిన్ను పూజించుచున్నాననియును మణిప్రవాళముతో నిన్ను నుతించెదననియు భావము. ఇది సంస్కృతాంధ్రభాషలు మిశ్రమము చేసిన పద్యము.

(౬౦) ఈ పద్యమునందు ద్రావిడాంధ్ర సంస్కృతములు మిశ్రము చేయఁబడి యున్నవి—అరుణగిరీశ్వరుని (తిరువణ్ణామలేశ్వరుని) యనుగ్రహమును పొందినవాఁడా! తమ దివ్యవర్ణనలు వినెడి భాగ్యము నాకు లభించినది. కనుక నిన్నొక్కనినే దేవోత్తముఁడ వని నుతింతును అని తాత్పర్యము.

(౬౧) ఇందు ఆంధ్ర కన్నడ సంస్కృతముల మిశ్రస్తుతి గలదు. దేవా! మీ దర్శన మున ఈ పాపము చేటికవలె నన్నువదలి పరుగెత్తిపోదా? పరముఁడా నమస్కరించెదను. ఓ న్యాయవిధేయా! నీవేదిక్కు. నీకంటె నొరులను కృతార్థులగువారి నెఱుంగను.

(౬౨) వ్యాఘ్రచర్మమును నాగభూషణములును సూర్యచంద్రనేత్రములును గరళ కంఠమును గంగాధరత్వమును కపాలధారణమును గల దేవునికి నీవు సేవకుఁడవని నిన్ను నుతింతునని భావము. ఇది అచ్చతెలుగున నుతించిన పద్యము.

(౬౩) ఇందు సంస్కృత ద్రవిడ కర్ణాటాంధ్ర మహారాష్ట్రాదిభాషలు అనేకములు గలవు—ఓ హృదయేశ్వరా! (దేవరవారి) శ్రీ పాదుకను నా మనస్సునకు తెమ్ము. నీవు పరతర్వుడవు. పురాణుడవు. ఏమిచేయవలయును? (అనగా ఏమిచేయవలయునో ఆజ్ఞనిమ్మని యర్థము) నన్ను రక్షించు మహావిభూ! నీవు నా తండ్రివి. నా సహాయుడవు. అని నిన్ను ప్రస్తుతిచేయుదును.

(౬౪) కన్నడ సంస్కృతభాషామిశ్రిత మగున దీ పద్యము. నేను మహారసవంత మైన (నీ) పాదద్వంద్వమును అత్యాసక్తితో పాడెదను. మిమ్ముల నర్చించెదను. సమగ్ర మగు (మీ) స్తుతిని మోక్షసాధకము లగు సత్కార్యములను విడువను.

శ్రీరస్తు

పాలకురికి సోమనాథకవి విరచిత

# వృషాధిపశతకము

శ్రీ గురులింగమూర్తి ౧ సవిశేషమహోజ్జ్వలకీర్తి సత్క్రియో
ద్యోగకళాప్రపూర్తి యవధూతపునర్భవ ౨ జూర్తి పాలితా
భాగ్యత ౩ సంశ్రితార్తకవిపండిత గాయకచక్రవర్తి దే
వా! గతి నీవె మాకు బసవా! బసవా! బసవా! వృషాధిపా. ౧

చ. ప్రమథవిలోల భక్త ౪ పరిపాల ధురంధరశీల సంతతా
స్తమితసమస్తదేహగుణజాల! సుఖప్రదలీల లింగజం
గమమహిమానుపాల గతకాల సమంచితనాదమూల దే
వ మము భరింపుమయ్య బసవా... ౨

ఉ. అప్రతిమప్రతాప సముదంచితనాదకళాకలాప దీ
ప్తప్రమథస్వరూప శివభక్తగణాత్మగతప్రదీప ధూ
తప్రబలేక్షుచాప విగతప్రకటాఖిల ౫ పాప లింగత
త్త్వప్రద నీవె దిక్కు బసవా... 3

## జంగమభక్తి

ఉ. భక్తిరసాభిషిక్త భవపాశవితానవిముక్త జంగమా
సక్త దయాభిషిక్త తనుసంగతసౌఖ్యవిరక్త ౬ సంతతో
ద్యుక్త గుణానురక్త పరితోషితభక్త శివైక్యయుక్త ప్ర
వ్యక్తము నీవె దిక్కు బసవా... ౪

(1) ౧. అ. ఉ. ఊ. సువిశేషమహోజ్జ్వల. ౨. ఇ. జార్తి. 3. సంశ్రితార్థికవి ఇ. అ ఉ సంశ్రితార్తి. (2) ౪. అ. ఊ. వరపాల. (3) ౫. వావిళ్లప్రతిలో పాద అనియున్నది. ఆప్రతిలో మూడవపద్యము నాల్గవదిగనున్నది. (4) ౬. అ. ఇ. ఊలలో సంగతోద్యుక్త అని యున్నది.

ఉ. శత్రులతాలవిత్ర గుణజైత్ర భవాబ్ధివహిత్ర జంగమ
క్షేత్ర విచిత్రసూత్ర బుధగీతచరిత్ర శిలాదపుత్త్ర స
త్పాత్ర విశుద్ధగాత్ర శివభక్తికళత్ర శరణ్య మయ్య భా
స్వత్త్రి జగత్పవిత్ర బసవా... ౬

ఉ. త్ర్యక్షసదృక్ష సంచితదయాక్ష శివాత్మకదీక్ష సత్ప్రసా
దాక్ష ప్రతాపశిక్షితమహాప్రతిపక్ష మహోక్ష భూరిక
ర్మక్షయదక్ష జంగమసమక్షమ భక్తపరోక్ష లింగత
త్త్వక్షమ నీవె దిక్కు బసవా... ౭

ఉ. అక్షయభక్తిపక్ష బసవాక్షర ౧ పాలకకల్పవృక్ష రు
ద్రాక్షవిభూతివక్ష ఫలితార్థముముక్ష శివప్రయుక్తఫా
లాక్ష కృపాసమంచితకటాక్ష శుభాశుభపాశమోక్ష త
త్త్వక్షమ నీవె దిక్కు బసవా... ౮

ఉ. ఆర్యవితానశర్య భువనాధికశౌర్య యుదాత్తసత్పథా
చార్య యవార్యవీర్య బుధసన్నుతచర్య విశేషభక్తితా
త్పర్య వివేకధుర్య ౨ పరిపాలితతుర్య శరణ్య మయ్య దు
ర్వార్య యనూనధైర్య బసవా... ౯

ఉ. తజ్జ్ఞ జితప్రతిజ్ఞ యుచితప్రమథానుగతజ్ఞ నమ్రదై
వజ్ఞ కళావిధిజ్ఞ 3 బలవచ్ఛివభక్తిమనోజ్ఞ ధూతశా
స్త్రజ్ఞ సునాదపూరితరసజ్ఞ తృణీకృతపంచయజ్ఞ స
ర్వజ్ఞ శరణ్య మయ్య బసవా... ౧౦

ఉ. క్షీణజనప్రమాణ యసి ౪ కృంత్తకయంత్రకఘోణ జంగమ
ప్రాణ వినిర్జితప్రసవబాణ సమంచితభక్తియోగసం
త్రాణ కళాప్రవీణ శివధర్మరహస్యధురీణ దత్తని
ర్వాణ శరణ్య మయ్య బసవా... ౧౦

---

(7) ౧. సాధక. (8) ౨. ఇ. ఉ. పరిపాదిత. (9) 3. ఇ. రతజ్ఞ. ఊ జలవత్తర. (10) ౪. కృత్త.

ఉ. గానరసప్రవీణ గతకాలవితాన సమస్తభక్తస
న్మాన మహాకులీన యసమానచరాచర ౧ రూపభేదసం
ధాన జితాభిమాన తనుధర్మవిహీన మహాప్రధాన దే
వా నను( గావుమయ్య బసవా... ౧౧

ఉ. లింగమయాంతరంగ గురులింగపదాంబుజభృంగ సత్ప్రసా
దాంగ కృపాపరిస్ఫురదపాంగ విముక్తభుజంగ జంగమో
త్తుంగ జితాభిమంగ గతదుష్కృతభంగ మదీయలింగ నీ
వాఁగడ మేఁజు మయ్య బసవా... ౧౨

ఉ. ఉత్తమభక్తివిత్త ౨ భజనోత్సుకచిత్త యుదాత్తచిత్సుఖా
యత్త క్రియాప్రమత్త నిఖిలాగమవేత్త గుణోపయుక్త స
ద్వృత్త ప్రసాదభోగ సముదీర్ణవిశేషసుఖ ప్రమత్త భా
స్వత్తమ నీవె దిక్కు బసవా... ౧౩

ఉ. దేహజనైరివాహ శివదీపితదేహ సుఖప్రవాహ ని
ర్మోహ విసప్రమసంయమిసమూహ లసద్గుణగేహ సంతతో
త్సాహ నిరీహ జంగమవితానదయావిహితావగాహ ని
ర్వాహమ నీవె దిక్కు బసవా... ౧౪

ఉ. న్యాసఫలానివాస దరహాసముఖప్రతిభాస దత్తకై
లాస విశేషజంగమవిలాస శివైక్యసమాస నిర్జితా
యాస సమస్తభక్త హృదయాంబుజ నిత్యనివాస ధిక్కృత
వ్యాస శరణ్యమయ్య బసవా... ౧౫

ఉ. రాగపరోపభోగ గతరాగ విధూతభవాదిరోగ ౩ స
త్త్యాగ మహానురాగ బహిరంతరనిష్ఠితయోగ సత్క్రియో
ద్యోగ యకర్మయోగ శివయోగసమగ్రసుఖాతిభోగ దే
వా గతి నీవె మాకు బసవా... ౧౬

---

(11) ౧. ఇ. ఉ. ఊ. లింగరూప. (13) ౨. భక్తివృత్త అని కూడ పాఠమున్నది.
(16) ౩. నిర్భాగ అని కూడ కలదు.

ఉ. శీలలతాలవాల [౧] యవశిష్టభవప్రతికూల లాలితో
[౨]త్తాల గణానుకూల శివధర్మమతప్రతిపాల నిత్యస
ల్లీల యశోవిశాల చరలింగసుఖోదయకాల జియ్య దే
వా [3] లలిఁ బ్రోవుమయ్య బసవా... ౧౭

ఉ. కామితభక్తిభామ గతకామ మహాగణసార్వభౌమ ని
స్సీమయశోభిరామ సవిశేషవిముక్తిలలామ సద్గుణ
స్తోమ శివైక్యధామ సుఖదుఃఖవిరామ ప్రమోదసీమ దే
వా నమ్ముఁ గావుమయ్య బసవా... ౧౮

ఉ. సాధితజన్మబాధ గతసర్వనిషేధ [౪] హతాపరాధ దు
ర్భేధకళావిరోధ పరిపోషితశాంభవబోధ వర్జిత
క్రోధ నిరాకృతాఖిలవిరోధ శివైక్యసుబోధ యీభవ
వ్యాధికి నీవె మందు బసవా... ౧౯

ఉ. శ్రీవిలసత్ప్రభావ [౫] ప్రవిశిష్టపరా [౬] జితకాన్యదైవ స
ద్భావయుతస్వభావ శివతత్త్వవిశిష్టమహానుభావ యం
హోవనదావ పాలితమహోద్ధతశైవవిభుండ వీవ దే
వా వరదానశీల బసవా... ౨౦

ఉ. ఆద్య [౭] సమర్పితాఖిల పురాతనభక్తగణానువేద్య సం
పాద్యగుణా [౮] నవద్య యనుభావశివాంకితగద్యపద్య ని
ర్భేద్య గణైకవేద్య యురరీకృతివాద్య భవాదిరోగస
ద్వైద్య శరణ్యమయ్య బసవా... ౨౧

ఉ. నాదకళావినోద యభినందితవేద హృతాపవాద సం
పాదితభక్తివాద [౯] బుధవందితపాద చిరప్రమోద యా
స్వాదితసుప్రసాద యవిషాద శిలాదసుతావిభేద దే
వా దయఁ జూడుమయ్య బసవా... ౨౨

---

(17) ౧. అ. ఇ. అవిశిష్ట. ౨. ఆ. ఇ. ఈ. లోల. 3. అ. మది. (19) ౪. జితాన్యగాధ. (20) ౫. ఇ. నతేష్ట, (ప్రతి) ౬. జితాన్యభావ. జితాన్యగాధ అని వావిళ్ల పాఠము. (21) ౭. ఉ. సమర్చితా. సమంచితా అనియు కలదు. ౮. ఉ. సుభావ్య. (22) ౯. బాధభావితపాద అనియును గలదు.

ఉ. కాయగుణావిధేయ జితకాయ వినమ్రజగన్నికాయ యా
మ్నాయవచఃప్రమేయ యసమానసమంచితగేయ భక్తిధౌ
రేయ సదానపాయ సుచరిత్రసహాయ జితాంతరాయ దే
వా యొడయండ వీవ బసవా... ౨3

ఉ. స్వీకృతభక్తలోక యవశీకృతకర్కశవావదూక యూ
రీకృతసద్వివేక యురరీకృతజంగమభక్తిభూక దూ
రీకృతదుష్టపాక యధరీకృతవేదవిరుద్ధబౌద్ధచా
ర్వాక శరణ్యా మయ్య బసవా... ౨౪

ఉ. నిత్య యుదాత్తసత్య యతినిశ్చలజంగమభృత్య సజ్జన
స్తుత్య కృపాకటాక్షపరిశోభిత ౧ చైత్య వరిష్ఠభక్తిసం
గత్యభిరామసత్య గురుకార్యపరాయణకృత్య వర్జిత
వ్రాత్య శరణ్యా మయ్య బసవా... ౨౫

ఉ. ధన్య మహావదాన్య గతదైన్య విధూతజఘన్య భక్తిచై
తన్య గణైకమాన్య హతదర్పకసైన్య నిరస్తమాతృకా
స్తన్య జితారిఘోరభవజన్య ౨ సుఖప్రదచిత్సుకాత్మభా
వన్య 3 శరణ్యా మయ్య బసవా... ౨౬

ఉ. చర్వితశృంగిగర్వ గుణసంపదఖర్వ యపూర్వగీతగాం
ధర్వ దిగంత ౪ పూర్ణసముదాత్తయశఃకృతకర్ణపర్వ యం
తర్వినివిష్టశర్వ విదితస్ఫురణాంచిత ౫ దర్వ కావుమో
స్వర్విభునమ్రపాద బసవా... ౨౭

ఉ. ఖ్యాతదయాభిజాత విపదంబుధిపోత యజాతతత్త్వవి
జ్ఞాత వినీత భక్తిపరిణేత మనోరథదాత జంగమ
స్తోత ముముక్షుగీత పరిశోభితనీతిసమేత సద్గుణ
వ్రాత శరణ్యమయ్య బసవా... ౨౮

---

(25) ౧. శైత్య యనియు నున్నది. (26) ౨. శరణ్యము. 3. ఉ. ఊ. వాన్య జితానుభావ. (27) ౪. ఉ. పూర్వ. ౫. అ కోటమాపర్వ, ఊ కాప్రమోపర్వ (దర్ప కోటమాపాద పర్వఘనప్రసాద, పర్వఘనప్రమ అనియును పాఠము లున్నవి.)

ఉ. మారమదాపహార సుకుమారశరీర గణప్రసాదవి
స్తార వృషావతార సముదారవిహార ౧ నమద్దయాపరి
ష్కార శుభప్రకార యవికార మహాజగదేకవీర దు
ర్వార శరణ్యమయ్య బసవా... ౨౯

ఉ. దేశికజన్మదేశ యవిదేశ యనావృతపాశ సంహృత
క్లేశ మహాప్రకాశ కృతకిల్బిషనాశ దయానివేశ నం
దీశనికాశ జంగమసమీహితకారిగుణావకాశ దే
వా శరణంబునయ్య బసవా... ౩౦

ఉ. ఉద్ధతభక్తివృద్ధ వినుతోత్తమసిద్ధ పరీతజంగమ
శ్రద్ధ సదాత్మశుద్ధ గుణరాజిసమృద్ధ విముక్తపాశస
న్నద్ధ మహాప్రసిద్ధ యగుణత్రయబద్ధ శరణ్యమయ్య భా
స్వద్ధతచిత్ప్రబుద్ధ బసవా... ౩౧

ఉ. నందితభక్తబృంద యవినాశసుధాంశుముఖారవింద ౨ యా
నంద వినీతకంద కరుణామకరందరసోపలాలిత
స్కంద యుదాత్తభక్తితరుకంద యశోజితకుంద నాకరా
డ్వందిత నీవె దిక్కు బసవా... ౩౨

ఉ. లౌల్య పరాయణాత్మ ౩ గుణలౌల్య ౪ యమూల్య సదోషయుక్తని
ర్మాల్య వినీతికల్య యసమానదయారసకుల్య నిత్యనై
ర్మల్య యమూల్య దుష్టజనమానసశల్య పదాబ్జలబ్ధకై
వల్య శరణ్యమయ్య బసవా... ౩౩

చ. గురుపదపద్మసద్మ యవికుంఠితజంగమశీలఖేల సు
స్థిరమృదుపాదమోద సముదీర్ణవిశేషమహత్వతత్వ ని
ర్భరభుజశౌర్యధుర్య పరిరంభితభక్తికళత్రగోత్ర మ
ద్వరద శరణ్యమయ్య బసవా... ౩౪

---

(29) ౧. సముద్దయా. (32) ౨. సానంద విలీయమానకరుణా. (33) ౩. ఉ. అ. గణలౌల్య. ౪. ఉ. ఊ. యమల్య.

చ. భువనహితార్థతీర్థ భవభూరుహశాతకుఠారధార గౌ
రవసముదాత్తవృత్త యనురాగరసామృతసారపూర శాం
భవమయవేదబోధ శివభక్తహృదబ్జ[1] వికాసభాస దే
వ వరద కావుమయ్య బసవా... 3౫

లింగభక్తి

చ. వినుతనవీనగానగుణ విశ్రుతభక్తవిధేయకాయ య
త్యనుపమగణ్యపుణ్య నయనాంచల[2] దూరభవోపతాప స
ద్వినయవికాసభాస సముదీర్ణశివైక్యసుఖైకపాక దే
వ నను భరింపుమయ్య బసవా... 3౬

ఉ. అంచితభక్తియుక్త యసహాయవిశృంఖలవీరపూర ని
శ్చంచలశైవభావ శ్రితజంగమపాదకిరీటకూట హృ
త్సంచితతత్త్వసత్త్వ[3] దురితవ్రజశైలకదంబశంబ ని
ర్వంచక నీవె దిక్కు బసవా... 3౭

ఉ. నిర్గతధర్మకర్మ యవినీతపునర్భవయంత్రతంత్ర దు
ర్మార్గవిహీనయాన గుణమాన్య మహావృష[4] సామ్య సౌమ్య ష
డ్వర్గవిరక్తసక్త మదడంబరవర్జితవేషభూష నీ
వర్గము నేఁజుమయ్య బసవా... 3౮

చ. సరసవచస్క నిర్మలయశస్క శివైక్యమనస్క భక్తహృ
త్సరసిజగేహ క్షప్తభవదాహ దయాపరివాహ చిత్సుఖో
త్తరనిజశిల్పభక్తపరతల్ప మహావృషకల్ప మన్మనో
వరద శరణ్యమయ్య బసవా... 3౯

చ. హరసమసౌఖ్య యాదివృషభాఖ్య పురాతనముఖ్య తత్త్వవి
త్పరిషదుపాస్య వీతగుణదాస్య త్రిలోకనమస్య తార్కికో
త్కరజయశౌండదీర్ఘభుజదండ మహాగుణమండ మన్మనో
వరద శరణ్యమయ్య బసవా... ౪౦

---

(3౫) ౧. వినాస అనియున్నది. (3౬) ౨. భూతస్మరోపతాప...భావసముదీర్ణ విశాలశివైక్యభావ. (37) 3. ఊ. తత్వసత్వ. (38) ౪. సైన్యధన్య.

చ. వరగుణదీప్ర భక్తజనవప్ర తృణీకృతవిప్ర తాత్త్వికాం
కురపదపద్మభక్తిరసగుంభ నిరాకృతదంభ సద్గుణ
స్ఫురితవిశిష్ట శాంతిగుణపుష్ట నిరస్తనికృష్ట మన్మనో
వరద శరణ్య మయ్య బసవా... ౪౧

ఉ. లింగనిరూఢ సంచితవిలీఢ పరాక్రమగాఢ మానసా
౧సంగివృషాంక నిర్గళితశంక ౨ నిరస్తకళంక సంతతా
భంగురపుణ్య శీలమణిపణ్య త్రిలోకవరేణ్య దేవ నీ
వంగడ మేఁ జుమయ్య బసవా... ౪౨

చ. ఉరుతరభాగ్య మన్మహితయోగ్య జగత్త్రియమృగ్యపాపసం
హారణసమర్థ నమ్రచరితార్థ లసద్గుణసార్థ భావభా
స్వరనయసాంద్ర కీర్తిజితచంద్ర వివర్జితతంద్ర మన్మనో
వరద శరణ్య మయ్య బసవా... ౪౩

చ. విరచితశుద్ధ ౩ సాళవనవీన మృదుస్వరమంద్ర మధ్యతా
రరుచిర దేశిమార్గ మధురస్వరగీత సుధాతరంగిణీ
తరలతరంగజాల సముదంచితకేళి విలోల సంగమే
శ్వర శరణయ్య నాకు బసవా... ౪౪

చ. అసమవదాన్యమాన్య ప్రణుతార్య యవార్య రసజ్ఞతజ్ఞ దు
ర్వ్యసనవిదూర శూర గణవంద్య యనింద్య ౪ యమాఢ్య యూఢ్యభ
క్తిసుఖసమృద్ధ వృద్ధ చిరదీప్తిపవిత్ర చరిత్ర ౫ పాత్ర నా
వసి గని బ్రోవుమయ్య బసవా... ౪౫

చ. అసమశిలీముఖస్ఫురదహంకృతికర్తనకర్మకర్మఠా
భ్యసనధురీణవిభ్రమ గణాధిపపాదసరోజసంతత
ప్రసృమరసౌరభోరుమకరందక సిక్తవనశ్రియాకళా
వ్యసన శరణ్య మయ్య బసవా... ౪౬

---

(42) ౧. ఉ. సంగ. ౨. ఉ. నిర్దళితశంక (44) 3. సాళువ అను రాగము.
(45) ౪. ఇ. యమాఢ్య. ౫. అ. గాత్ర.

చ. అసదృశవిస్ఫుర ద్గుణదృగంచల కల్పితసృష్టిపాలన
గ్రసనకళాకలాప ఘనకౌశలఖేలన లింగమూర్తిమా
నసకలనావశీకరణనైపుణ తత్పరశీల జంగమ
శ్వసన శరణ్యమయ్య బసవా... ౪౭

చ. ప్రమథగణాధినాథ సముపాసన భాసురపార్వతీమనో
రమరమణీయ హృత్కమలరాజితనవ్యపతంగ సౌరభ
భ్రమరవిలోలతామధుకరాయితదివ్యశరీర సత్ప్రభా
వమహిత నీవెదిక్కు బసవా... ౪౮

ఉ. కందళితాత్మయంత్రితవికర్తనశీతమరీచి మస్మనో
మందవిహారవిస్ఫురితమధ్యమయాన చిదంబకేందుని
ష్యందసుధారసానుభవ సంతతదివ్యశరీర యోగిరా
డ్వందిత నీవె దిక్కు బసవా... ౪౯

## పెక్కుభాషలఁ బ్రస్తుతి

ఉ. * ఖ్యాతయశఃప్రపూరితజగత్త్రితయాయనమో నమోమహా
పాతకసూతకఘ్నపదపద్మయుగాయ నమో నమో సము
ద్ద్యోతవృషాయ తే యనుచు నుత్సుకతన్ బ్రణుతింతు సంయమి
వ్రాతశరణ్య నిన్ను బసవా... ౫౦

ఉ. ఆప్తగణప్రవిష్టసకలార్తిహరాయ నమో నమో సుఖా
వాప్తికరస్మితాంచితకటాక్షదయాయ నమో నమో సము
ద్దీప్తగుణాయ తే యనుచు దీనగతిన్ బ్రణుతింతు నిన్ను ని
ర్వ్యాప్తజగత్ప్రపంచ బసవా... ౫౧

ఉ. కల్పితలింగజంగమసుఖస్ఫురణాయ నమో నమో యసం
కల్పవికల్పమార్గకథితప్రథితాయ నమోనమో గుణా
కల్పవరాయ తే యనుచు గౌరవలీల నుతింతు నిన్ను న
స్వల్పతరప్రభావ బసవా... ౫౨

---

* ఈ పద్యము మొదలు వ్రాస్నలినే అను కలుసు సంస్కృత భాషలో ప్రస్తుతించెను. చదువరుల సౌకర్యార్థమై వివిధభాషలస్తుతులు గల ఈ పద్యముల యర్థములను సంగ్రహముగా పీఠికయందు చేర్చినాము.

ఉ. తర్జితదుష్కృతాయ భవతాపనికృంతనకల్మషాయ భ
క్త్యూర్జితమానసాయ సుగుణోత్తమరత్నకరండకాయ తే
యార్జితసత్క్రియాయ సదయాయ నమో యని సన్నుతింతు త
త్త్వార్జితభక్తలోక బసవా... ౫౩

ఉ. చూర్ణితమన్మథాయ పరిశోభితభస్మవిలేపనాయ సం
పూర్ణమనోరథాయ గతపూర్వభవాశ్రితవర్తనాయ ని
ర్వర్ణనిరాసకాయ సశివాయ నమో యని సంతతంబు ని
న్వర్ణన సేయువాఁడ బసవా... ౫౪

ఉ. హృన్నలినే స్మరామి భవదీయపదద్వితయం భవాటన
స్విన్నతనుశ్రమాపహ మశేషజగత్ప్రిణుశం మదీశ ని
ష్పన్నదయానిధే! యనుచు సంస్కృతభాష నుతింతు నిన్ను వి
ద్వన్నుతనామధేయ బసవా... ౫౫

చ. పరమనె ౧ యెన్నె యాండవనె పన్నగతానె యనాథనాథనే
౨ పెరియవనే పుణిందవనె పేరుడయానె ౩ పిరానె యప్పనే
తెరిమురియయ్యనే యనుచు ద్రావిడభాష నుతింతు మన్మనో
సర కరుణావిధేయ బసవా... ౫౬

చ. హసుళెయ యెన్న రక్షిసువ దారయ దె న్నవనీతవెందు మ
న్నిసువుదు ౪ నిమ్మడింగెరగు నిమ్మప్రసాదియె ౫ నిమ్మతొత్తనే
౬ కసిగతి యంచు భక్తి నినుఁ గన్నడభాష నుతింతు ౭ షడ్గుణ
శ్వసన శరణ్యమయ్య బసవా... ౫౭

ఉ. ౮ దేవవరా తుమ్హాచ గురుదేవ ౯ మ్హణూనుతకీ తుమ్హాచ గో
సావతురా తుమ్హాచ తుమసాచప్రసాద అమీకృపాకరా
యీావ గదా యటంచు నుతియించెద నిన్నును ౧౦ నార్యభాష దే
వా వినుతార్యలీల బసవా... ౫౮

(56) ౧. ఊ. ఎన్నె, యాండవనె నన్నదయానె. ౨. ఇ.ఊ. పెరియనె, దెని పుండవనె. 3. పెరాయ. (57) ౪. అ. నిమ్మడిగ్గరిక. ౫. నిమ్మతొత్తు.. ౬ కశిగతె. ౭. తిద్గణ. (58) ౮. అ. పురీతుహీంచి. ౯. అ. మణూను కరీతుహీంచి. ౧౦. అ. నారియ బాసనిన్ను.

చ. అనయముఁ జేతులందు భవదంఘ్రిసరోజయుగం నమామి నె
మ్మనమున సంస్మరామి యనుమాటల-నిన్ వరివస్కరోమ్యహ
మ్మనుచు మణిప్రవాళమున నంకన సేయుదు భక్తలోక హృ
ద్వనజవిహారలోల బసవా... ౫౯

చ. ౧ అరుళగిరిప్రసాదముడయానె భవద్గుణ ౨ వర్ణనల్వినామెనా
౩ కొరువనినే స్మరామి సురసత్తనుయోగణవర్యయంచు ని
ల్లరుదు మణిప్రవాళమున నంకనసేయుదు నిన్ను మన్మనో
వర కరుణావిధేయ బసవా... ౬౦

ఉ. పాయదె ఒందు ౪ చేటిగతిపాప ౫ అమా పరమన్నమామి భో
న్యాయ విధేయ ౬ మీవతెరి యన్యు నజాణు కృతార్థయంచు వా
గ్ధ్యేయమణిప్రవాళమునఁ దెల్లము నిన్ను నలంకరింతు దే
వా యమిబృందవంద్య బసవా... ౬౧

చ. ౭ బలు పొడతోలుచీరయును ౮ పాపపెనల్ గిలుపారుకన్ను వె
న్నెలఁతల చేదుకుత్తుకయు నిండినవేలుపుటేఱు పల్లుపూ
సలుగలజేనిలెంక వని జానుఁ దెనుంగున విన్నవించెదన్
వలపు మదిన్ దలిర్ప బసవా... ౬౨

చ. తిరుఘుడి నామనంబునను దేన్నృదయేశ్వర, ౯ కింవిధీయతాం
పరతర త్వం బురాణ నను పాహివిభో అమవాపితాఅమా
వరదనెఘుళ్లెయంచు నినుఁ బ్రస్తుతిసేయుదుఁ బెక్కుభాషలన్
వరద వివేక శీల బసవా... ౬౩

ఉ. పాడువెనామహారసన నంఘ్రియుగంభమగొండుసద్గుణా
మాడువెయర్చనం ౧౦ బెడె సమ్యగనుతి త్వాయిసత్క్రియన్ దగన్
౧౧ గూడ మణిప్రవాళమునఁ గోరి నుతింతును సంచితార్థముల్
పాడిగ నివ్వటిల్ల బసవా... ౬౪

(60) ౧. అరళుగిరి. ౨. ఊ. వర్ణనల్వినాయె. 3. వొరువని. (61) ౪. ఇ. యావ. ౫. అన్నిప్రతులలోను, అమాపరదంబ అంబభో. ౬. అ. పాయుపటుంతు మెఘ, విగతపాప, అమాపరహన్, నమామి, భొన్యాయి, నమీణుకరా. (62) ౭. ఊ. పొడవోలు ఇ. ఉ. పలువడతొనచీర. ౮. పాపను గల్గిరువారు కంనువె. (63) ౯. ఊ. కింపరయ్యతా. (64) ౧౦. ఉ. బెడె. ౧౧. గూఢ మణిప్రవాళమున ననియు నున్నది.

## భక్తరక్షణము

ఉ. రుద్ర గణాదిరుద్ర వినిరూపితలింగ సుఖాదిసద్రయ
చ్ఛిద్ర దయాసముద్ర సవిశేషపరాక్రమవీరభద్ర య
త్క్షుద్ర జనావలీభవనిషూదనరౌద్ర సమస్తభక్తదే
వద్రుమ నీవె దిక్కు బసవా... ౬౫

చ. ఇహపరసిద్ధ సిద్ధవృషభేశ్వర ఈశ్వరభక్త భక్తహృ
ద్గహనవిలోకలోకహితకారణ కారణజన్మ జన్మదో
షహరణదక్ష దక్షరిపుసన్నిభ సన్నిభరూప రూపని
ర్వహణ శరణ్య మయ్య బసవా... ౬౬

ఉ. సన్నుతిజంగమాగమము స్వాతిజలంబులు భక్తినిమ్నగం
బెన్నగ నీదుచూడ్కు లనుచిప్పల సన్నలు ముత్తియంబులై
యున్న నొకయ్యభ్రముగ్గు నియమోన్నతి నిల్పినధన్య నిన్ను నే
శ్వన్నుతులన్ భజింతు బసవా... ౬౭

ఉ. బల్లహునొద్ద నున్ననినుఁ బట్టణవీథులఁ జల్లలమ్ముచో
గొల్లత జారువాఱి కడుఁగూర్మి మెయిన్ బసవా యనన్ భువిన్
బ్రెల్లఁగనీక పట్టిన యతిస్థిరసర్వగతైక భావ మ
ద్వల్లభ నీవె దిక్కు బసవా... ౬౮

ఉ. వేఁడినమిండజంగమము వెక్కసమందఁగఁ దత్సభాస్థలిన్
వోడక నాతివల్వలొగి నొల్చియు మానము దూలకుండఁగాఁ
బోఁడిమిఁ గట్టుపుట్టములు ప్రోవులుపెట్టినపుణ్యమూర్తి నీ
వాఁడఁ జుమయ్య జియ్య బసవా... ౬౯

చ. అరయఁగ సిద్ధరాము రజతాద్రిపయిన్ బసవాఖ్యునిన్నుఁ దా
రిమురి జంగమాజ్ఞ మెయి నారయ నప్పుడు భక్తి పెంపుసొం
పరుదుగఁ బార్వతీసుహృదయాంబుజకర్ణిక నత్తమిల్లు భా
స్వరుఁడవు నీవె దిక్కు బసవా... ౭౦

ఉ. వర్ణవిహీనుఁ డంచు ద్విజవర్గము దా గళమెత్తిపల్కుచున్
వర్ణములెల్లఁ జూడ శివనాగయగారికరంబులందు స
ద్వర్ణుఁ డితండునా నమృతధారలుచూపినభక్తిరాఢ నీ
వర్ణము నేఁజుమయ్య బసవా... ౭౧

ఉ. బిజ్జలు నర్థమంతయును బ్రీతిగ జంగమకోటి కిచ్చె నా
నజ్జగతీశ్వరుం డడుగ నక్షయబండరు వాక్షణంబునన్
ఇజ్జగమెల్లఁ జోద్యపడ నిచ్చినలింగ ౧ సదర్థనవ్రమ వి
ద్వజ్జన నీవె దిక్కు బసవా... ౭౨

చ. ఉరుశివయోగనిద్రమెయి నున్నతఱిన్ ఫణిహారియేఁగుడున్
మరచిచనంగ జంగమసమన్వితమై మును బ్రాణమేగి యు
ద్ధురగతి వారు వచ్చుటయుఁదోడనె వచ్చిన జంగమాత్మ నీ
వరవుడ నేఁజుమయ్య బసవా... ౭౩

ఉ. సంగయదేవుఁ డర్థి నొకజంగమమై చనుదెంచి వేఁడ ను
త్తుంగి లలాటలోచనము భోరున నద్దమువట్టి చూపుడున్
జెంగి యదృశ్యుఁ డైన శివుఁ జేకొని యార్చిన యప్రతర్క్య నీ
వంగడ మేఁజుమయ్య బసవా... ౭౪

ఉ. కర్ణవతంస మీక పెనఁగన్ సతిచెక్కిలి వ్రేయుచున్ మహా
తూర్ణతఁ జెంది జంగమముదోస్థ్సలమెత్తిపసిండియాకు సం
పూర్ణప్రకృష్టభక్తిమెయిఁ బొల్పుగ నిచ్చిన నిష్ప్రపంచ నీ
వర్ణము నేఁజుమయ్య బసవా... ౭౫

ఉ. శృంగిపురోగమాఖిలవిశేషవిషంబులు గూర్చి మందుచున్
బొంగి భుగుల్లుభుగ్గు రను భూరివిషాగ్ని నిషాదు లార్తులై
చెంగి చనన్ శివార్పితముచేసి భుజించినసుప్రసాది నీ
వంగడ మేఁజుమయ్య బసవా... ౭౬

ఉ. చిత్తజవైరివిక్రమముఁ జెప్పకు చెప్పకు త్రావనోడి తాఁ
గుత్తుక నిల్పె నంచుఁ గడుఁ గ్రూరతరం బగు కాలకూటమున్
గుత్తుకబంటి గ్రోలినయకుంఠితవిక్రమచక్రవర్తి భా
స్వత్తమ నీవె దిక్కు బసవా... ౭౭

(72) ౧. సమర్థరూప యనియుఁ గలదు.

ఉ. తంగెటిజున్ను ముంగిటనిధానము పందిటికల్పవల్లి ముం
గొంగునము త్తియం బనఁగఁ గూర్మి మనంబునఁ దొంగలింపఁగా
జంగమకోటి కర్చనలు సల్పుచు నున్నయగణ్యపుణ్య నీ
వంగడ మేఁజుమయ్య బసవా... ౭౯

ఉ. భీమగజంబు ఢీకొనిన బిట్టనఁజంపుము బిజ్జలేంద్రుఁ డు
ద్దామతఁ దక్కిన్రొక్కుటయుఁ దత్కరి నెత్తినవిక్రమోద్ధతుం
డామడియాలుమాచనకు నగ్గల మైనమహానుభావ నా
స్వామివి నీవె దిక్కు బసవా... ౮౯

ఉ. శంక దలిర్ప నెంతయు వెసన్ బరదైవపతంగకోట్లకున్
బింకముతోడ ఫాలతటభీమవిలోచనవహ్ని నేర్చునా
శంకరదాసదేవునకు సద్భటుఁ డంచు నుతించు నిన్ను నీ
వంకకుఁ ద్రిప్పుమయ్య బసవా... ౯౦

ఉ. ఏఁడులు నూఱటంచు శ్రుతు లెన్నఁగ శ్రీగిరిమీఁద నాలుగూ
ఱేఁడులు సంచరించు సకలేశ్వరదేవర మాదిరాజు నా
నేఁడలనూరుమన్న భువి నిష్ఠురకాలమహోగ్రదృష్టి క్రొ
వ్వాఁడు లణాపు మయ్య బసవా... ౯౧

ఉ. సూత్రము దప్పి గొత్త్రగుడిఁ జొచ్చిన మిండనిఁ జంపి సాక్షిగా
నో త్రిపురాంతకా యనుచునోయని పిల్చిన యల్ల ౧ సద్యశః
పాత్రుఁడు కిన్నరయ్యకును బ్రాణసఖుం డగునిన్నుఁ గొల్తు దే
వా త్రిజగత్పవిత్ర బసవా... ౯౨

ఉ. ఒక్కఁడె రుద్రుఁ డన్న శ్రుతులొల్లక వ్రేలు పురాణభట్టులన్
వ్రక్కలు సేసి తత్తనువువావిఁ బ్రువ్వులుగాఁగఁ జూచునా
కక్కయగారిబిడ్డఁ డనఁగా నుతికెక్కిననిన్నుఁ బూన్తు మ
ద్వాక్కలికాసమూహి బసవా... ౯3

ఉ. డంభమయాన్యదర్శనవిడంబనుఁ డష్టమదాపహారి యా
శుంభదుదాత్తకీర్తి యగుసోఫలదేవరబాచిరాజు వి
స్రంభసఖుండ వీ వని ప్రశంస యొనర్తు చరిత్రపూత వి
శ్వంభర శంభుమూర్తి బసవా... ౯౪

(82) నాదయా.

ఉ. దీప్రము నీమహామహిమ దివ్యము నీమహనీయవిక్రమం
బప్రతిమంబు నీచరిత మాద్యము నీ నిజరూప మంచు న
ల్లప్రభుఁడర్థితోఁడ నుపలాలన సేయఁగ నొప్పుచుండు దే
వా ప్రణుతింతు నిన్ను బసవా... ౮౫

ఉ. మేమరభక్తి నీశ్వరుఁడు మెచ్చఁగ జిహ్వయె పళ్లెరంబుగా
నాదటఁ బ్రాఁచియంబలి సమర్పణచేసి పొగడ్త కెక్కినా
మాదరచెన్నలింగయకుమారుఁడ నిన్ను భజింతు సంతతా
స్వాదిత సుప్రసాద బసవా... ౮౬

ఉ. బల్లిదుఁడై గణాధిపుల పాదజలంబులు కట్టెమోపుపైఁ
జల్లి కడానిగావుడును జంగమకోటికిఁ బంచియిచ్చుచున్
మొల్లపుభక్తిఁ బేర్కొనిన మోళిగమారయ కూర్మిబంట మ
ద్వల్లభ నీవెదిక్కు బసవా... ౮౭

ఉ. భీకరరుద్రనేత్రశిఖిఁ బెద్దఁగఁ జేయఁగ వీరభద్రు ను
ద్రేకగజంబు నా నితరదేవతలం బడఁదాఁకునుద్ధతుం
డాకలికేతబ్రహ్మయకు నర్మిలి భృత్యుఁడ నిన్నుఁ గొల్తు దే
వా కరుణింపుమయ్య బసవా... ౮౮

చ. పసిగమెయిన్ [౧] వృషాధిపునిప్రాణము జంగమకోటి ప్రాణముల్
మసలక యొత్తుచున్ భువనమాన్యచరిత్రతఁ దేజరిల్లు న
మ్మసిఁడిగ చౌడరాయునకు ముందటిభృత్యుఁడ నిన్భజింతు న
న్వసిగొని ప్రోవుమయ్య బసవా... ౮౯

ఉ. ఎన్నఁగ జంగమంబుఁ దనయింటికి నెప్పుడువచ్చు నప్పుడే
గన్నము వెట్టి తెచ్చి యధికం బగునర్థము వాని కిచ్చు నా
కన్నడబ్రహ్మ సంయమికి గాదిలిభృత్యుఁడ వైన నిన్ను శ
శ్వన్నుతులన్ భజింతు బసవా... ౯౦

ఉ. ఆసురవృత్తిఁ జూపరు భయంపడి మ్రొక్కఁ బ్రసాదవహ్నిచే
భూసురు లిండులన్నియును బొగ్గుల ప్రోఁకలు సేయు ధూత సం
త్రాసుల బిబ్బబాచయల దాసుఁడ నన్ విలసిల్లు సద్గుణా
వాస శరణ్యమయ్య బసవా... ౯౧

---

(89) ౧. గణాధిపుల.

ఉ. సుంకముఁ బైఁడి భక్తులకుఁ జూరలు వెట్టెఁ బసిండి తెమ్మనన్
శంకరుఁ బూటవెట్టి నరనాయకుచేతను మ్రొక్కఁగొన్నయా
సుంకరబంకిదేవునకు సూనుఁడ వైనప్రసాది నన్ను నీ
వంకకుఁ ద్రిప్పుమయ్య బసవా... ౯౨

ఉ. దివ్యవిమానపంక్తి దివిఁ దేజరిలన్ రజతాద్రికిన్ జగ
త్సేవ్యము గాఁగ మున్ను దనచే మృతిఁబొందుమృగాళిఁ జొచ్చుసం
భావ్యుఁడు తెన్గుబొమ్మయకుఁ బ్రాణసఖుం డగునిన్నుఁ గొల్తు దే
వా వ్యసనాదిదూర బసవా... ౯3

## బసవేశ్వరమహిమ

ఉ. చెన్నగుప్రాణలింగరతి చేఁగప్రసాదము పుట్టినిల్లు న
త్యున్నతభక్తిసీమ శివయోగ సమగ్రత కల్మియైన మా
యన్నకు నాదిచెన్నబసవన్నకు సద్గురుఁ డైననిన్ను శ
శ్వన్నుతులన్ భజింతు బసవా... ౯౪

చ. అడరఁగఁ గళ్లుచేసి రుచిరాన్నము లాదట నంది యిచ్చుచోఁ
గడిఁగడి సందుకొంచు నతికాంక్షమెయిన్ శివుఁ డారగింపఁ గా
నడిసనుభక్తుఁ డాసురియ చౌడయగారిప్రసాది దేవ నీ
వడుగఁ జుమయ్య జియ్య బసవా... ౯౫

ఉ. జంగమ మారగింపక విషంబును మీకు నసహ్యమంచుఁ దా
ముంగల నారగించిన సముద్ధత భక్తియుతుండు సత్ప్రసా
దాంగుఁడు సింగిబొప్పయకు నగ్గల మైనమహానుభావ నీ
వంగడ మేఁజుమయ్య బసవా... ౯౬

చ. కొఱటను లేఁతపత్తిరియు గొడ్డునఁ బాలును రేయి జగమం
బఱిముఱి వేఁడినం బడసి యాక్షణమాత్రన యిచ్చినట్టి యా
మొఱటదవంక దేవునకు ముద్దుతనూజుఁడ వైన నిన్ను నే
నఱలఁగఁ బ్రస్తుతింతు బసవా... ౯౭

---

(94) గ. అ. ప. (96) ౨. మారగింపఁగ.

చ. అనయము భక్తులీడ్యకు లటంచను వేదములాద్విజోత్తముల్
విన నుతియింపఁ గుక్కచే జదివించిన హాలినహల్లి కల్లిదే
వునకు ననుంగువాఁడ వని యుత్సుకతన్ నుతియింతుభక్తహృ
ద్వనజవిహారలోల బసవా... ౯౮

ఉ. భక్తుని మ్రింగఁ జంప మును భర్గునకున్ జిరుతొండనంబికిన్
యుక్తమె యంచు వారిపయినొక్కట నుద్ధతి ఘంటవ్రేసి యు
ద్రిక్తతనొప్పఁగా నలరు దిట్ట హలాయుధుకట్టనుంగ ప్ర
వ్యక్త శరణ్యమయ్య బసవా... ౯౯

చ. ధర నురులింగమూర్తిధ్వజదండముగా మొలకచ్చతోఁడ శ్రీ
కరముగ భక్తికిం బడగఁగా శివుగర్భముఁ జొచ్చి పొల్చుమా
యరియమరాజుగారి పరమాప్తుఁడవైన మహానుభావ నీ
నరవుఁడనేఁజుమయ్య బసవా... ౧౦౦

ఉ. దండితవాదివై శివుఁడె దైవము గాకని కన్నులిచ్చి తా
నిండుమనంబుతో నిలువు నిద్దపుఁగన్నులు దాల్చి పొల్చు మా
పండితమల్లికార్జునుఁడు ప్రస్తుతి సేయఁగ నేర్చునిన్ను నె
వ్వండునుతింప నేర్చు బసవా... ౧౦౧

చ. వసుమతిఁ బేరుకొన్న నరువత్తురుమువ్వురికూర్మిబంట జో
డసులసుతుండ తేరసుల దక్కినభృత్యుఁడ వీరలాదిగా
నెసఁగు మహానుభావులకు నెల్ల ననర్గళమైనభక్తిన
న్వసిగొని ప్రోవుమయ్య బసవా... ౧౦౨

బసవప్రార్థన

చ. బసవనిధానమా! బసవభవ్యనిధీ! బసవామృతాంబుధీ!
బసవమహానిధీ! బసవభర్మగిరీ! ౧ బసవామరద్రుమా!
బసవమహాబలీ బసవబండరువా బసవోల్లసన్మణీ
వసిగని ప్రోవుమయ్య బసవా... ౧౦౩

(108) ౧. బసవామరుద్ధతీ.

ఉ. నాయొడయుండ! నావిభుఁడ! నాహృదయేశ్వర నామనోరమా
నాయిలువేల్ప! నావరద! నాగురులింగమ! నాదుజంగమా
నాయధినాథ! నావరుడ! నన్నుఁ గృపామతిఁ బ్రోవుమయ్య దే
వా యమిబృందవంద్య బసవా... ౧౦౮

ఉ. నోరికివచ్చినట్టు నిను నూఱువిధంబులఁ బ్రస్తుతింతు నే
నేరుతు నేరఁ బొమ్మనక నీపయి నొచ్చెము లేనిమచ్చికన్
గారవ మొప్ప మత్ప్రణుతిఁ గైకొనఁగాఁ దగు గారవింపు నిం
పారగ కూర్మిపేర్మి బసవా... ౧౦౯

చ. బసవఁడు ప్రీతిఁ గైకొనియె భక్తిమెయిన్ రచియింపనాడు మున్
బసవపురాణ మంచు ననుఁ బ్రస్తుతిసేయుదు రట్లు గాన నీ
యసమదయాధురీణతకు నంకిలిపాటు ఘటిల్లకుండ నన్
వసిఁ గొని బ్రోవుమయ్య బసవా... ౧౧౦

చ. సురవరమల్ల! మల్లలిత సూత్రపదాంబుధిఖేల! ఖేలసం
గరకలకంఠ! కంఠమణి నాయకభీమ భుజంగ! జంగమ
స్థిరతరనాథ! నాథకనిధీకృత రూప! విరూపసమ్మతా!
వరకరుణాబ్ధి ప్రోవు బసవా... ౧౧౧

చ. సురవరపూజ్య! పూజ్యగుణశోభిత! శోభితరూప! రూప వి
స్ఫురతరశీల! శీలమణిపుంగవ పుంగవ! సత్త్వ! సత్త్వసం
సారపరవాద! వాదభయ వర్జిత పాపవిచార! చార! యీ
శ్వరసమ నీవె దిక్కు బసవా బసవా బసవా వృషాధిపా. ౧౧౨

చ. అకుటిలలింగజంగమ సమగ్రదయాకలితప్రసాది పా
లకురికి సోమనాథుఁ డతిలౌల్యమునన్ బసవన్నదండనా
యకునకు [1] నొప్ప నీశతక మర్పణ చేసె [2] ధరన్ బఠించువా
రికి వినువారికిన్ గలుగు శ్రీయును నాయువు భుక్తి ముక్తియున్.

వృషాధిపశతకము సంపూర్ణము.

---

(109) ౧. నీశ. ౨. ధరణి.

# పీ ఠి క.

శ్రీ సర్వేశ్వరశతకమును రచియించిన యథావాక్కుల అన్నమయ్య ఆరాధ్య బ్రాహ్మణుడు. ఆత్రేయగోత్రజుడు. యజుశ్శాఖాధ్యాయి. దూదికొండ నివాసి యగు సోమేశ్వరారాధ్యుని పుత్త్రుడు. అన్నమారాధ్యుడు గోదావరీ తీరమునందు గల పట్టిసమునందు గల వీరభద్రస్వామిని సేవించుచు నచట నివసించుచుండెను. తదనంతరము శ్రీశైలయాత్రకు బోయి తిరిగి వచ్చునపుడు పల్నాటి తాలూకాయందలి సత్రశాలయందు నివసించెను. ఆ స్థలమునందే సర్వేశ్వరశతకమును రచియించి సిద్ధిని బొందెను. అన్నమార్యుని మునిమనుమడు చిట్టెమరాజు పల్నాటి సీమను నివాసమును జైకొని యచటను చెర్లగుడిపాడు, మిరియాల, పల్లిగుంత, పశ్వేముల, వద్దిరేల, సీతానగరము నను నాలుగ్రామములకు కరణికమును సంపాదించెను. చిట్టెమరాజు మనుమడు సోమరాజు ప్రసిద్ధపురుషు డగుటంజేసి ఇంటిపేరు సోమరాజువారుగ మారినది. ఇప్పటికిని సోమరాజువారు పల్నాడు సీమయందు గలరు. సోమరాజు వేంకటశివుడుగారు తనవంశావళిని రచియించినట్లును శేషగిరిరావుగా రీవృత్తాంతమును తమకు దెలిపినటులును జయంతి రామయ్యపంతులుగారు సాహిత్యపరిషత్తువారు ప్రచురించిన సర్వేశ్వరశతకపు పీఠికయందు వ్రాసిరి.

కాలము:— అన్నమారాధ్యుడు సర్వేశ్వరశతకమునందు కృతిని రచించినకాలమును ౧౩౦ పద్యమునందును తన కులగోత్రములను ౧౩౩, ౧౪౦ పద్యములందును దెలిపెను.

శా. శాకాబ్దంబులు వార్ధిమత్కుపురజిత్సంఖ్యం బ్రవర్తింప సు
శ్లోకానందకరంబుగా మహిమతో శోభిల్ల సర్వేశ్వర
ప్రాకామ్యస్తవ మొప్పఁజెప్పె శుభకృత్సంవత్సరవర్షంబునన్
శ్రీకంఠార్పితమై వసుంధరపయిం జెన్నొంద సర్వేశ్వరా. ౧౩౦

అన్నమార్యుడు సర్వేశ్వరశతకమును ౧౧౬౪ శాలివాహనశకాబ్దం బైన శుభకృత్సంవత్సరమునందు (క్రీ. శ. ౧౨౪౨) రచియించెను. అన్నమయ్య శతకమును రచియించినకాలమునకు 30 ఏండ్లుండిన నీకవి ౧౧౯౨-౧౨౭౦ ప్రాంతమున నివసించియుండును. పాల్కురికి సోమనాథుడు ౧౧౯౦-౧౨౭౦ ప్రాంతమువరకుండినటులు తెలియుచున్నది. అన్నమయ్య సోమనాథుడు జీవించియున్నపుడే పుట్టియుండును. సర్వేశ్వర

శతకమునం దనుభవసారమునందు సోమనాథుడు తెలిపినభావములు గలవు. సర్వేశ్వరశతకపు ౬౮-వ పద్యమునకును అనుభవసారపు ౨౧౭, ౨౧౮ పద్యములకును భావములు సరిపోవుచున్నవి.

శా. లింగారాధన జంగమార్చనము లోలిన్ భక్తి కంగంబు ప్రా
ణాంగవ్యాప్తియు నై స్ఫురించు నిది తత్సారం బగుం గాన నా
యంగాభ్యర్చన జంగమాహితకరుం డై చేసినం డా శివ
శృంగారం బగు వానిభక్తి పదిఁ జర్చింపంగ సర్వేశ్వరా. ౬౮

ఉ. జంగమభక్తి లింగపరిచర్యల మీఱుట యుత్తమంబు త
జ్జంగమలింగపూజ లవి సామ్యముసల్పుట మధ్యమంబు మున్
జంగమలింగపూజయెడసల్పక లింగము గొల్చుచున్కి యె
న్నంగ కనిష్ఠమాట శరణప్రతిపత్తియె ముఖ్య మిమ్మయిన్. అ. సా. ౨౧౭

కం. జంగమపరాఙ్ముఖుండై, లింగార్చనసేయుసతని లీల దలిర్పన్
వెంగలి యై శవమునకును, శృంగారము సేసినట్లు శివభక్తనిధీ. అ. సా. ౨౧౮

అన్నమారాధ్యుడు సోమనారాధ్యునకు దరువాతను, ౧౨౩౮-౧౩౦౦ వఱకు నున్న తిక్కనసోమయాజికి ముందును, సమీపకాలమునందు వర్ధిల్లె ౧౨౪౨ క్రీ. శక సంవత్సర ప్రాంతమునందు సర్వేశ్వరశతకమును రచియించెను.

సర్వేశ్వరశతకము:— ఈశతకము శివభక్తిపరమైన ప్రాచీనశతకము. సోమరాజు వేంకటశివుడు గారివంశావలియం దీశతకరచనను సంబంధించిన ఈ క్రిందిగాథ గలదని తెలియుచున్నది. "అన్నమయ్య కృష్ణాతీరమునందలి సత్రశాలయందు శ్రీమల్లికేశ్వర స్వామిని సేవించుచు సర్వేశ్వరశతకమును రచించెను. పద్యముల నొక్కొకదానిని దాటి యాకుమీద వ్రాసి కృష్ణాప్రవాహమునందు వేయుచుండెను. ఎదురీదివచ్చిన యాకును దీసి దారమునకు గ్రుచ్చుటకును నాయూ కీదిరానపుడు గండకత్తెరవైచుకొనుటకును బ్రతిజ్ఞచేసెను.

మ. తరులం బువ్వులు పిందెలై యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగున్
హర! మీపాదపయోజపూజితములై యత్యద్భుతం బవ్విరుల్
కరులౌ నశ్వములౌ ననర్ఘమణులౌఁ గర్పూరమౌ హారమౌఁ
దరుణీరత్నములౌఁ బటీరతరులౌఁ దథ్యంబు సర్వేశ్వరా. ౭౭

పై పద్యము కొట్టుకొనిపోవుట చూచి గండకత్తెరను వైచికొనుట కుద్యమించెను. అపు డొకపసులకాపరి తాటిగుఱాకును దెచ్చియిచ్చెను. ఆయాకునందు ౭౭-వ పద్యమునకు

బదులుగ నీక్రింది ౨౨-వ పద్య మండుటనుజూచి దానిని దారమునకు గ్రుచ్చి నియమాను సారము శతకమును ముగించెను.

మ. ఒకపువ్వుంబు భవత్పదద్వయముపై నొప్పంగ సద్భక్తిరం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదన్నఁ బా
యక కాలత్రితయోపచారముల నిష్నర్చించుచున్ బెద్దనై
ష్ఠికుఁడై యుండెడువాఁడు నీ వగుట దాఁ జిత్రంబె సర్వేశ్వరా. ౨౨

ఈ గాథయందలి సత్యాసత్యము లెటులున్నను రెండు పద్యములకును భావార్థము నందు గల భేదము పరమభక్తిప్రభావమును రమ్యముగ దెలుపుచున్నది. మొదటిపద్యము నందు పుష్పార్చనమునకుఫలము మహాసంపదలుగను రెండవపద్యమునందు నైష్ఠికుని శివార్చ నమునకు ఫలము కైవల్యముగను నిర్దేశింపబడినది.

**శతకప్రతులు:**—సర్వేశ్వరశతకమును శ్రీ శైవసిద్ధాంతముద్రాక్షరశాలవారు, మద్రాసు, శ్రీరామలింగేశ్వరముద్రాక్షరశాలవారు, ఓరుగల్లు, సాహిత్యపరిషత్తువారు, మద్రాసు, వావిళ్ల రామస్వామిశాస్త్రి అండు సన్సు వారు, మద్రాసు, ముద్రించిరి. ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమునందును సాహిత్యపరిషత్తు కార్యాలయమునందును వ్రాత ప్రతులు గలవు. ఈ ప్రతులను సంప్రతించి పాఠభేదములను చేర్చి దీనిని ముద్రించితిమి. ఈకవి యితరగ్రంథములను జేసినటు లూహించుట కాధారములు లేవు.

**శైలి:**—సర్వేశ్వరశతకమును రచియించిన అన్నమారాధ్యుని శైలి సంస్కృత పదభూయిష్ఠమైనను నాతికఠినమై హృద్యమై సరళముగ నున్నది. కొన్ని పద్యములు భావయందును భావములందును భాగవతపద్యములను స్ఫురింపజేయుచున్నవి. పద్యము లర్థాలంకారములను గలిగి భక్తిరసముతో నుప్పొంగుచున్నవి. పద్యములనడక సరళగతిని గలిగి శ్రావ్యముగ నున్నది. కల్పనలు భావగర్భితములై సహజాలంకారయుక్తములై మనో హరముగ నున్నవి పంచేంద్రియోద్వృత్తమైన చిత్తమునకును నీఁగకును, భవపంకనిమగ్న మైన మానమునకును జీవికిని గల్పించిన పోలిక ప్రౌఢముగ నున్నది. సర్వేశ్వరశతకము నందు ౩౮, ౧౨౭ పద్యములందు బాలురు వినోదార్థ మిసుకదేవాలయములను సికతాధామ ములను నిర్మించి యానందించెడివిధమును కవి రమ్యముగవర్ణించెను. రవీంద్రనాథుడు గీతాం జలియందుఁ జేసిన ౬౦ వ గీత యందలి బాలక్రీడావర్ణనము లీవర్ణనముల కనురూపముగ నున్నవి. సర్వేశ్వరశతకమునందలి భావము లాధ్యాత్మికములు.

పాఠమే లేనిసంసార ♦ వార్ధితటిని, వేడ్క నుం ద్రాటపాటులఁ ♦ బిల్ల లెపుడు.
ఇసుకచే నిండ్లఁ గట్టుచు ♦ నెసఁగుచుంద్రు, వట్టిగుల్లలతో నాడి ♦ వఱలుచుంద్రు.

౬౦ గీతాంజలి. రవీంద్రుడు.

సంసారప్రవాహార్ణవ తరణవిషయమునను గురుమంత్రకార్ముకసంధానవిషయమునను ౯౯, ౭౦ పద్యములందు జేసిన కల్పనలు గంభీరముగ నున్నవి. విశ్వేశ్వరునకు విశ్వప్రవృత్తియందు గల వైరుధ్యస్థితి ఈ పద్యమునందు రమ్యముగ దెలుపబడినది.

మ. సకలాధీశ్వరపట్టభద్రుఁడవు భిక్షాగామి వత్యంతశాం
తకళాత్ముండవు రౌద్రమూర్తి వతిసౌందర్యాంబికాసంగమా
ధికలోలుఁడవు దివ్యయోగివి మదిం దెల్లంబుగా నెట్టివా
రికిఁ దా శక్యమె నీనిజం బరసి చర్చింపంగ సర్వేశ్వరా. ౧౦౬

ఇట్టి మంచికల్పనలు సర్వేశ్వరశతకమునందుఁ జాలఁ గలవు. అన్నమార్యుఁడు స్వచ్ఛముగ సర్వేశ్వరశతకమువిషయమై తెలిపిన భావములు యథార్థముగ నున్నవి.

శా. ధాత్రి న్భక్తజనానురంజనముగాఁ దత్త్వప్రకాశంబుగాఁ
జిత్రార్థాంచితశబ్దబంధురముగా సేవ్యంబుగా సజ్జన
శ్రోత్రానందముగా శుభాంచితముగా శోధించి సర్వేశ్వర
స్తోత్రం బన్నయ చెప్పె నిజ్జగములో శోభిల్ల సర్వేశ్వరా. ౫౩

## శ త కా ర్థ ము

ఈశతకమునకు మకుటము :—సర్వేశ్వరా!

సర్వేశ్వరశతకమునకు మకుటము సర్వాంతర్యామి యైన సర్వేశ్వరసంబోధనము. సర్వేశ్వరసంబోధనమును నానావిధములను జేసి తనకుఁ గలిగిన శివయోగానందమును అన్నమార్యుఁడు సర్వేశ్వరశతకమునందు సువ్యక్తము చేసెను. శతకము శివభక్తిభరితమై పండ్రెండు పదుమూఁడుశతాబ్దులందు దక్షిణదిగ్భాగమునందు వ్యాపించిన శైవసిద్ధాంతములను బోధించుచున్నది. బసవేశ్వరుఁడు పండితారాధ్యుఁడు సోమనాథారాధ్యుఁడు మున్నగు శైవభక్తులు ప్రతిపాదించిన గురులింగజంగమారాధనరూపమైన శివారాధనము నే అన్నమారాధ్యుఁడును సర్వేశ్వరశతకమునందు బోధించెను. సర్వేశ్వరశతకమునకు భక్తియే హృదయ మైనను ముక్తికి సాధనము లైన నిగమాగమవేదాంతయోగసాధనమార్గములను సయితే మన్నమార్యుఁడు సందర్భానుసారముగ శతకమునందు వివరించెను.

శతకకవులు సామాన్యముగ భావోద్రేకము గలుగునపుడు భావార్థమును వ్యక్తము చేయుటకు పద్యములను వ్రాయుచు శతకమాలికలను గూర్చుచుందురు. శతకమాలయందలి భావకుసుమములు రమ్యముగ నున్నను భావానుసంధానమునందు కళానైపుణ్యము గోచరము గాకుండును. విషయార్థవిస్ఫురణమునందు పూర్వాపరసందర్భములు కొన్నిసమయములందు తక్కువగ నుండును. ఏపద్యమున కాపద్యమే భావార్థమును దెలుపుచుండును.

ముఖ్యముగ నిది నీతిశతకమందు స్పష్టముగ గనిపించుచుండును. అన్నమయ్య సర్వే-
శ్వరశతకమునందు నీమార్గము నవలంబించిన విధమును పద్యములు దెలుపుచున్నవి. సద్భక్తి
చిత్తశుద్ధి తీర్థమహిమ శివయోగానందము పంచాక్షరీప్రభావము మున్నగు విషయార్థ
ములను దెలిపెడి పద్యము లొక క్రమనిర్ణయము లేకయే కలిసియున్నవి. భావార్థములను
శీర్షికలుగ విడదీయుట యసాధ్యముగ నున్న విధమును విమర్శనము దెలుపగలదు.

అన్నమార్యుఁడు ముక్తికి పరిశుద్ధమైన భక్తియోగము సాధన మనియును ముఖ్య
ముగ భూతసేవాపరమైన జంగమభక్తియోగము మూలసాధన మనియును సర్వేశ్వరశత
కమునందు నిరూపించెను.

మ. ధరణిం గర్మవిధానభక్తివిభవద్ధ్యానోత్తమజ్ఞానముల్
సరసం బేర్కొన నాల్గుయోగములు తత్త్వం బెందు నీభక్తి వి
స్తరబాహ్యక్రియ లెల్లఁ బొల్లు లగుటం దద్భక్తియోగంబు తాఁ
బరగం దక్కినమూఁడుయోగములకుం బ్రాణంబు సర్వేశ్వరా. ౬౯

మ. అనురంగా ధన మిచ్చి కాతురు మహీయఃప్రీతిఁ బ్రాణంబుఁ బ్రా
ణము నర్థంబును నిచ్చి కాతు రభిమానంబు న్విశేషించి మా
నముఁ బ్రాణంబును నర్థము న్నొసఁగి సన్మానంబుగా నుత్తమో
త్తమచారిత్రులు భక్తిఁ గాతురు ప్రమోదం బంది సర్వేశ్వరా. ౬౬

మ. తమలింగార్చనకంటె జంగమము సౌందర్యంబుగాఁ గొల్చుట
త్తమభక్తస్థితి లింగజంగమముల న్సామ్యంబుగాఁ జేత మ
ధ్యమభక్తస్థితి లింగపూజ నధికుండై జంగమోపాసనా
క్షముఁడై యుండుట భక్తియం దధికనిమ్నత్వంబు సర్వేశ్వరా. ౧౫౯

అన్నమార్యుఁడు చిత్తశుద్ధిలేని "బకవేషార్చనలను" "తీర్థారాధనములను" "వ్రతక్ర
ములను" నిరసించినవిధము బాహ్యవేషములు భక్తిస్థానము నాక్రమించినవిధమును విశదము
చేయుచున్నది. చిత్తశుద్ధిలేని శివపూజాదులను వేమనయోగి పరిహసించినటులె నా
పూజాదులు జెట్టివానివిద్య లని అన్నమయ్య సత్యార్థమును దెలిపెను.

మ. ఒనరం జిత్తము శుద్ధిలేనినరుఁ డుద్యోగంబునం గోరి చే
సినపూజావిభవంబు సువ్రతములుం శీలంబులు స్మంత్రసా
ధనముల్ తీర్థములుం దపంబులును మీఁదం జెట్టివాఁ డభ్యసిం
చినశస్త్రాస్త్రకళానిధంబు లగుఁ జర్చింపంగ సర్వేశ్వరా. ౧౨౦

మంత్రజపము చిత్తలయమును జేసి మోక్షమును గలుగఁజేసెడివిధ మీ క్రిందిపద్య
మునందు స్వానుభవపూర్వకముగను కవి వర్ణించెను.

మ. క్రమసంయుక్తి మనంబు బుద్ధియు నహంకారంబుఁ జిత్తంబు నా
యమలాంతఃకరణంబు నక్షరచతుష్కవ్యాప్తిఁగాఁ దీర్చి పం
చమవర్ణంబుగ నాత్మఁ గూర్చి కడువాంఛన్ యోగి పంచాక్షరీ
సుమహామంత్రముతోడ నైక్యపదవిన్ శోభిల్లు సర్వేశ్వరా. ౧౭౧

చిత్తశుద్ధిని గలిగి భక్తియోగాభ్యాసమును జేయుచు సద్భక్తులు నిగ్రహమును బూని కర్మక్షయమును జేసి కైవల్యపదమును జేరెడివిధమును అన్నమార్యుఁడు బాగుగ నీపద్యములందు వివరించెను.

మ. చెదరం బాఱు దశప్రభంజనములన్ శిక్షన్ సుషుమ్నంబునం
గుదియంబట్టి చలింపనుండ శశి నర్కుం గట్టి భాస్వన్మన
స్పదనస్థానమునందు నిన్నెలమి సంస్థాప్యంబు గాఁ జేసి తా
హృదయానందరసాబ్ధిఁ దేలు శివయోగీంద్రుండు సర్వేశ్వరా. ౮౭

మ. కలయం గాత్మయుగంబుఁ గూర్చి తరువంగాఁ బుట్టి తత్సాధనం
బుల రెంటిన్ దహియించువహ్నిగతిఁ దాఁ బొల్పొందఁ గాయంబు సం
ధిల సత్కర్మముతో మథింపఁగ భవచ్ఛిద్భక్తిసద్వహ్ని యు
జ్జ్వలమై కాయముఁ గర్మముం జెఱుచుఁ దత్త్వం బెన్న సర్వేశ్వరా. ౭౧

మ. వరుసం బైకొని వచ్చుకర్మముల నున్వారించి మాయామల
జ్వరము ల్దూల్చి యపారఘోరతరసంసారాబ్ధి లంఘించి భీ
కరసూక్ష్మాంగవిచిత్రకంచుకము వీఁకం బుచ్చిపోవైచి తాఁ
బరమవ్యోమము సొచ్చు నీయచలసద్భక్తుండు సర్వేశ్వరా. ౧౧౩

అన్నమారాధ్యుఁడు సర్వేశ్వరశతకమునందు శివార్చనమునకును కైవల్యప్రాప్తికిని విధ్యుక్తములైన నిగమాగమమార్గములను మంత్రతంత్రసాధనములను వ్యక్తము చేసినను సత్య దయాశౌచయుక్తమైన సద్భక్తియోగమె ముక్తిసాధన మని ప్రతిపాదించెను.

మ. భవదీయార్చన సేయుచోఁ బ్రథమపుష్పం బెన్న సత్యంబు రెం
డవపుష్పంబు దయాగుణం బతివిశిష్టం బేకనిష్ఠాసమో
త్సవసంపత్తి తృతీయపుష్ప మది భాస్వద్భక్తిసంయుక్తి యో
గవిధానం బవి లేనిపూజలు మహిం గైకోవు సర్వేశ్వరా. ౯౨

భక్తిశతకములు సామాన్యముగను ఇష్టదేవతాస్తవమయము లై యుండును. కృతికర్తలు తమ యిష్టదేవతలను రూపవిలాసవైభవములతోఁ జిత్రించి భక్తిరసానందము ననుభవించుచు భక్తహృదయములందు భక్తిరసోదయమును గలుగజేయుదురు. బసవశతకము, కృష్ణశతకము, రామతారకశతకము, నారాయణశతకము, కాళహస్తిశతకము మున్న

గుశతకములందు కృతికర్తలు వారి యిష్టదేవతలను రూపలీలావైభవములతో స్తోత్రము చేసి భక్తిరసావేశము ననుభవించి లోకమునకు భక్తిమార్గమును బోధించిరి. పరశివారాధనపరమైన సర్వేశ్వరశతకమునందు నావరూపలీలాతీతుడైన సర్వేశ్వరుని భావారాధనము విశేషముగ నున్నది. ఇష్టదేవతాస్తవపరములైన భక్తిశతకములకును సర్వేశ్వరస్తవపరములైన భక్తిశతకములకును భాగవతగుణాభివర్ణనమునందు గల విశేదమునకు సర్వేశ్వరశతకము లక్ష్యముగ నున్నది.

పరమేశ్వరుడు సర్వముకును నీశ్వరుడే కాక సర్వమును పరమేశ్వరుడే యని "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను మహావాక్యము ప్రతిపాదించెడి తత్త్వార్థమునే అన్నమయ్య ఈశతకమునందు ప్రతిపాదించి సర్వేశ్వరశతకనామమును సార్థకము చేసెను. సర్వేశ్వరుడు సకలభూతములందు లోపలను వెలుపలను సముడై వెలుగుచుండును. భక్తులు విశ్వమునం దంతటను తమ్ముగాని జగమునుగాని చూడక కేవలము పరమేశ్వరుని సందర్శించుచు బ్రహ్మానందము ననుభవించుచుందురు. ఈశ్వరవ్యతిరిక్తమైన దుర్వ్యవసాయములను గాంచునపుడు వినునపుడు వర్ణించునపుడును జీకును జెవిటియును మూగయునై శివభక్తుడు చరించును. శివభక్తుడు సర్వత్ర సర్వేశ్వరుని జూచుచు సర్వేశ్వరత్వమును బడయు విధము నీ పద్యములు తెలుపుచున్నవి.

మ. వెలి వీక్షించిన నీస్వరూపమె మహావిస్పష్టమై యాత్మలో
పల భావించిన నీస్వరూపమె మహావ్యక్తమై దృష్టిలం
దలఁపం జేకొని యున్న నీయచలితధ్యానంబునం జేసి తాఁ
గలనైన న్శివయోగి తన్నుఁ జగముం గానండు సర్వేశ్వరా. ౭౫

మ. భవికిన్ భక్తి మహత్త్వ మంకురితమై పాటిల్ల భక్తుండు బాం
ధవమాత్రుండగు భక్తి పుష్పితముగాఁ దద్భక్తుఁ డాత్మేశుఁడై
సవిశేషస్థితిఁ దోఁచు భక్తి సఫలోత్సాహంబునుం బొందఁ గా
నవికల్పక్రియ నంత భక్తుఁడును నీవై యుండు సర్వేశ్వరా. ౫౦

సర్వేశ్వరశతకము, హృద్యమైన శైలిని, ప్రౌఢమైన భావములను, భక్తిజ్ఞానవైరాగ్యబోధకములైన కల్పనలను, గలిగి అన్నమారాధ్యుని శివభక్తహృదయమును దెలుపుచు శతకవాఙ్మయమున కలంకారముగనున్న విధము నీక్రిందిపద్యము దెలుపుచున్నది. శతకవిసర్గన పన్నమారాధ్యుని పాండిత్యమును నిగమాగమపురాణానుభవజ్ఞానమును పరిశుద్ధస్వభావమును నిశ్చలశివభక్తిని జ్ఞానవైరాగ్యసంపత్తిని విశదము చేయుచున్నది. శతకము శివభక్తిపరమైనను కాలాంతరమునందు గనుపట్టెడి యన్యదేవతల దూషణములు గనిపింపవు.

మ. అమితామోదనవప్రసూనముల నిన్నర్చించుచో గద్యప
ద్యము లూహించి నుతించుచో వివిధగీతవ్రాతము ల్పాడుచో
నమృతాహారము లిచ్చుచో నిపుణుఁడై యాటాడుచో నందుఁ జి
త్తము సద్భక్తియె నీవు చేకొనుపదార్థం బెల్ల సర్వేశ్వరా. ౭౮

దుందుభి కార్తిక బహుళ
౧౧ బుధవారము. మద్రాసు.

కాశీనాథుని నాగేశ్వరరావు.

పాఠభేదములు:—ఈ శతకమును అచ్చువేయునపుడు ఆంధ్రసాహిత్యపరిషత్తువారి అచ్చుప్రతిలోని పాఠము చొప్పుననే మూలము కూర్పఁబడినది. కాని పాఠసౌష్ఠవము గలచోటుల ఇతరపుస్తకములలోని పాఠములే మూలములో చేర్పబడినవి. ప్రాచ్యలిఖితభాండాగారమువారి వ్రాతప్రతులతోను వావిళ్లవారి అచ్చుప్రతితోను సంప్రతించి పాఠభేదములు మూలముక్రింద నుదాహరింపబడినవి. వీనిలో పాఠభేదముల నుదాహరించునప్పుడు పరిషత్పాఠములకు (ప) అనియును, ప్రాచ్యలిఖితభాండాగారము పాఠములకు (ప్రా)అనియును వావిళ్లవారి పాఠములకు (వా) అనియును గుర్తులు వేయబడినవి. వీనిని చదువరులు గమనింపగోరెదము.

వ్రాతప్రతులు:—ప్రాచ్యలిఖితభాండాగారమునందు ఈ గ్రంథమునకు అయిదువ్రాతప్రతులు గలవు. అవి వరుసగా (1) 11-2-22, (2) 13-4-3, (3) 13-10-19, (4) 13-3-35, (5) 14-13-17. అను సంఖ్యల పుస్తకములు. ఇందులో 2, 4 పుస్తకములు అసమగ్రములు. కాగితపుప్రతులు. 3, 5 గ్రంథములు సమగ్రములు, చాలవఱకు పరిశుద్ధము లగు గ్రంథములు. ఇవి వ్రాతనుబట్టి మిగుల ప్రాచీనము లయినవని చెప్పఁదగినవికూడనై యున్నవి. సాహిత్యపరిషత్తు భాండాగారమునందు మూడుప్రతులు గలవు. ఆప్రతుల ననుసరించియే సాహిత్యపరిషత్తువారిప్రతి ముద్రితమై పాఠభేదములను గలిగియుండుటం జేసి ఆ వ్రాతప్రతుల నిచటను ప్రత్యేకముగ జేర్పఁగనలేదు. మొత్తముమీఁద ముద్రణకాలమునందు, పైని చెప్పఁబడిన ప్రతులన్నియును గూడ మాకు చాల తోడ్పడియున్నందున ఆయాగ్రంథముల రక్షకులయెడల చాల కృతజ్ఞతఁ జూపుచున్నాము.

శ్రీరస్తు

# సర్వేశ్వరశతకము

శ్రీకంఠుం బరమేశు నవ్యయు నిజశ్రీపాదదివ్యప్రభా
నీకోత్సారితదేవతానిటలదు[1]ర్నిత్యక్షరధ్వాంతుఁ జి
త్ప్రాకామ్యాంగు నపాంగమాత్రరచితబ్రహ్మాండసంఘాతు జం
ద్రాకల్పుం బ్రణుతింతు నిన్ను మది నాహ్లాదింతు[2] సర్వేశ్వరా!

మ. ఒకమాటీసకలంబు నీ[3]మయముగా [4]నూహించుచు న్వేండి యొ
క్కొకమాటింతయు నీవుగా ననుచు నే యుక్తిం [5]బ్రశంసింప నే
రక వేదంబులు చిక్కువడ్డ వనినం బ్రవ్యక్తమై [6]యుండు భా
వకుఁడై నీనిజరూప మిట్టి దన నెవ్వాఁడోపు సర్వేశ్వరా! ౨

శా. జ్ఞానాతీతుఁడవైన నీమహిమఁ బ్రజ్ఞం బూని తర్కించు ట
జ్ఞానాంగం బగు నైననుం దమ యథాశక్తిం బ్రశంసించి ది
వ్యానందస్థితిఁ బొందువారిఁ గని భక్త్యావృత్తి నిన్నెట్టివాఁ
డైనం బ్రస్తుతిసేయుచుండుఁ దనచేనైనంత సర్వేశ్వరా! 3

---

(1) ప. మొదటి పద్యమునకు మీఁద నీక్రిందిపద్యము గలదు.

ఉ. చిత్తము ప్రాణ మాయువును జేర్చి త్రికూటపుదారిఁ దూఱుచు
న్మత్తిలియున్న కుండలిని మట్టుగదల్చి పెకల్చినంత ట
త్యుత్తమమండలత్రయము లొందుచు నిత్యము వెల్గు మేల్ బళీ
హత్తి నిషిద్ధలింగగురుఁ డంచు భజించి నుతించి కొల్చెదన్.

౧. ప్రా. దుర్నితాక్షరధ్వాంతు, ౨. ప. ఆహ్లాదించి. (2) 3. ప. మహిమగా, ౪. ప. నూహించి వర్ణించి వే ఱొకమా టెంతయు. ప్రా. నూహించుచున్. ౫. ప. బ్రవర్తింప. ౬. ప్రా. య్యుండి, ప. యుందు. ౭. ప. నిజతత్త్వ మిట్టిదన. ఇట్టి దట్టిదన అని ప్రా. లలో నెందును లేదు.

మ. అమితాంభోజభవాండభాండనిలయం బై యుండు నీయంతరం
గమువ ట్టెంతయొ దాని కింక బహిరం గం బెట్టిదో సూక్ష్మత
త్త్వము దా నంతకు మీఁద నేమివిధమో తా నిట్టి నీపెంపుమా
ర్గము నీకైన ననచింత్య మె ట్లొరుఁ దెలుం గంజాలు సర్వేశ్వరా!

మ. ఇన విఘ్నేశ్వరమాతృకాద్రుహిణ బ్రాహ్మీస్కందదుర్గారమా
వనితాధీశ్వర భైరవుల్ బలసి భా స్వద్భక్తిసంయుక్తి నీ
కనిశంబుం బరివారభృత్యనికరం బై రన్న ని న్నింకఁ గొ
ల్వనివా రెవ్వ రజాండభాండములలో వర్ణింప సర్వేశ్వరా! ౫

శా. ఏపారంగ నజాండభాండనికరం బేరూపులోఁ బుట్టి యు
ద్దీపించు న్మఱి రూపు లెల్ల సమసు ప్తిం బొంది యేరూపులో
లోపించుం గలయంగ నంతటికిఁ దా లోనై విజృంభించి యే
రూపం బవ్యయ మై వెలుంగు నది నీ రూపంబు సర్వేశ్వరా! ౬

మ. జలజాతప్రభవాండబుద్బుదము లశ్రాంతంబునుం బుట్టుచుం
గలయం గ్రాఁగుచునుండు నీపృథులలిం గస్ఫారగర్భాబ్ధిలోఁ
బలఁ దద్బుద్బుదగర్భవాసులు హరి బ్రహ్మాదిదేవాలియుం
గలదే వారికి నీమహత్త్వ మెఱుఁగం గా శక్తి సర్వేశ్వరా! ౭

మ. భవదున్మేషవిజృంభణంబు ప్రకటిం పంగా సరోజాతిసం
భవుజన్మంబు భవన్నిమేష మమిత బ్రహ్మాండకల్పాంతభై
రవసంక్షోభిత మన్నఁ దక్కిన భవ త్ప్రారంభభూరిక్రియా
నివహం బెవ్వరు నేర్తు రిట్టి దని వ ర్ణింపంగ సర్వేశ్వరా! ౮

## ఆజ్ఞాశక్తి

మ. పవనుం డై హిమధాముఁ డై యనలుఁ డై పానీయ మై యాత్మ మై
రవి యై యంబర మై మహీవలయ మై రమ్యాష్టమూర్తిక్రియన్
భువనాండంబులు లక్షణాంగములుగాఁ బుట్టించు నత్యద్భుత
త్వవలీలావిభవంబుతోడ భవ దాజ్ఞాశక్తి సర్వేశ్వరా! ౯

(4) ౧. ప. తల్కింప నీపెంపు ౨. ప. నశక్య. (5) ౩. ప్రా. బ్రహ్మస్కంద. ౪. ప. యున్న, ప్రా. వారన్న అని కలదు. (6) ౫. లోపింపఁగలయంగ. ప్రా. వ్యాపించున్ గలయంగనంతటికి. (7) ౬. హరిబ్రహ్మదులం దేమియుం. (8) ౭. ప్రకటింపంగా. (9) ౮. ప్రా. రమ్యాష్టమూర్తిక్రియా. ౯. ప. తోఁప.

మ. జలజాతప్రభవాండభాండములు దుశ్చారిత్రులం బాత్రులం
జెలువై యుండ [౧]యథాప్రమాణములుగా శిక్షింప రక్షింప ని
శ్చలలీలం బ్రభవించు రాజు భవదాజ్ఞాశక్తిఁ గాకింతవ
ట్టెలమిం జేకొని నిర్వహింప మఱి రాజెవ్వాఁడు సర్వేశ్వరా! ౧౦

శా. జ్ఞానజ్యోతి విజృంభమాణముగ [౨]నోజన్ [౩]విష్ణువిధ్యాదిదే
వానీకాత్మదశావళిం దవిలి నీ [౪]వారంగ వారింగళా
జ్ఞానప్రౌఢులఁ జేయుటల్ వెలయఁగా సర్వజ్ఞశబ్దంబు దా
నీనామాంకముగా విధించు[౫] నిగమానీకంబు సర్వేశ్వరా! ౧౧

మ. సురలన్ మర్త్యసమంబుగా[౬] మనుజులన్ శోభిల్ల బృందారకో
త్కరముంగా ఘను నల్పు నల్పుని ఘనుంగాఁ బుణ్యపాపాలిచేఁ
దిరుగన్ ద్రిప్పుచు నీమహామహిమ ప్రీతిం బద్మజాండంబునం
దరయన్ జీవుల నింద్రజాలములుగా నాడింతు[౭] సర్వేశ్వరా! ౧౨

మ. ఘనుఁడై యేచి దశాననుండు బలిమిం గైలాసశైలేంద్ర మె
త్తిన [౮]నద్దానవనాథుఁ ద్రొక్క నతఁ డర్థిన్ మ్రొక్కినం గాచి [౯]ప్రా
క్తనశౌర్యాధికుఁ జేసె దుష్టు నణఁపంగా శిష్టు రక్షింప రం
జనతో నెప్పుడు [౧౦]వేచియుండు భవదాజ్ఞాశక్తి సర్వేశ్వరా!

మ. తమకం బెత్తిన నాత్మజుం గడు మదాంధవ్యాప్తి నేకాంతప
క్షమునం దెవ్వరుఁ గానకుండఁ గవయంగాఁ బోయి నీబాణఘా[౧౧]
తమునం బద్మభవుండు ద్రెళ్లె ననినం దాఁ దప్పి వర్తించి లో
కమునం దెవ్వరి కింక నిన్ను [౧౨]నెఱుఁగంగా వచ్చు సర్వేశ్వరా!

మ. పలుజన్మంబులఁ గూడఁబడ్డ భవసంభద్ఘోరదుష్కర్మరా
సులు పైఁ గూలి సమస్తజీవులు వెసన్ శోషించుచు న్బెద్ద దు
ర్బలులై చిక్కినఁ దద్భవాపహరణార్థం బొప్పఁ బద్మోద్భవ
ప్రళయం బొక్కొకమాటు సేయుదు [౧౩]తుదిన్ భావింప సర్వేశ్వరా!

---

(10) ౧. ప్రా. యథాప్రమాణములతో (11) ౨. ప్రా. విజృంభణాంగము 3. ప్రా. విష్ణుదేవాది దేవా. ౪. ప. నీవారంగ వారించుచున్. ౫. విధించె. (12) ౬. వా. ప్రా. సమూహిగా. ౭. ప. నాడించు. (13) ౮. తద్దానవనాథు వా. పాఠము. ౯. ష. ప్రార్థన....ప. దాస్యసృష్టిరక్షింప. ౧౦. నేర్చియుండు. (14) ౧౧. ప. ప్రా. పాతమునన్ ౧౨. ప. ప్రా. మొఱఁగంగా వచ్చు. (15) ౧౩. ప. మదిన్. ఈపాఠము ప్రా. ప్రతిలోనున్నది

మ. సుమహత్పద్మభవాండపంక్తుల లయక్షోభప్రతాపంబుతో
నిమిషార్థంబునఁ [౧]గాంచి పెంపెసఁగు నీనేత్రానలజ్యోతి య
య్యమమీనాంకజలంధరత్రిపురదైత్యాలి న్నిర్వ్యాజృంభించి భ
స్మముగాఁ జేయుట నిశ్చయింప నిది దా శౌర్యంబె సర్వేశ్వరా!

మ. అతిదక్షుం డగుదక్షుఁ డీజగముప్రో యాగంబు సల్లక్షణ
స్థితిగాఁ జేయుచునుండి మిమ్ము మదినుద్దేశింపమిం జేసి తా
హతుఁ డయ్యెం దుది [౩]నెట్టికార్యములుఁ బొందైయుండునే కర్తస
మ్మతితోఁ జేయని [౪]దుర్మదుండు మనునే భావింప సర్వేశ్వరా!

మ. జగతీచక్రము పాదఘట్టన నదృశ్యంబై ప్రవర్తింపఁగా
గగనం బంతయు బాహుమండలసమగ్రవ్యాప్తులం దద్భుతం
బుగ ఘూర్ణిల్ల నజాంత్యవేళల సముద్భూతాంగహారావళుల్
నెగడం బొంగి నటింతు తాండవమహానృత్యంబు సర్వేశ్వరా!

మ. [౫]అమరేంద్రాబ్జభవాళి కెన్నఁ దుది నీ వాదిం బ్రసాదించి న
ర్థము సిద్ధించుచు నుండుఁగాని సురమాత్రుం గోరిన స్వీరికా
ర్యము సిద్ధింప దనేకమార్గములఁ బ్రారంభించిరే నిశ్చయా
ర్థముగా నీవ సమస్తకర్త వగుటం దర్కింప సర్వేశ్వరా! ౯౫

మ. అమరంగా స్ఫుటభక్తినాటకము భాషాంగక్రియాంగాభిర
మ్యముగాఁ జూపిన మెచ్చి [౬]మీరలు పురేయన్నంతకున్ యోనిగే
హములన్ రూపులు పన్నుకొంచును నటుండై వచ్చి సంసారరం
గములోనం బహురూపమాడు వెలయంగా జీవి సర్వేశ్వరా!

శా. శ్రీవత్సాంకు రమావిశేషతయు వాక్ఛ్రీనాథుచాతుర్యమున్
దేవాధీశ్వరు [౭]వైభవోన్నతియు నాతిగ్మాంశు తేజంబు శ్రీ
దేవీనందనురూపవిభ్రమము చింతింపంగ నీభక్తిస
ద్భావాత్ము లగుపుణ్యమూర్తికిఁ దృణప్రాయంబు సర్వేశ్వరా!

---

(16) ౧. ప. గాల్చి, వా, గ్రాచి. ౨. ప. విగుర్వించి. (17) 3. ప నట్టి కార్య
ములు పొల్లైయుండవే కర్తసమ్మతిగా. ౪. ప్రా. దుష్టబుద్ధి అనియును గలదు. (19) ౫.
అమరేంద్రాబ్జభవాలికైన పది నీవారం బ్రసాదింప నర్థము సిద్ధించుచునుండు దానుచిత
మాత్మం గోరి నీ వీని కార్యము సిద్ధింపదు, అని కలదు. (20) ౬. ప. నీ పిలబలే. (21)
౭. ప. వైభవాతిశయమున్.

మ. ఇల సద్భక్తులపాదధూళిపటలం బేమర్త్యుఫాలంబునం
జిలుకు[౧] న్వాఁ డపవర్గనాథుఁ డనిర్వ సిద్ధంబుగా వారిని
ర్మలహస్తార్పితభూతిఁ బ్రీతి నొసలారం బూయు విశ్వాసికిన్
ఫల మూహించి [౨]విధింప నెవ్వరికిఁ[౩] జెప్ప న్వచ్చు సర్వేశ్వరా!

## భక్తతీర్థప్రభావము

మ. పలుతీర్థంబులఁ గ్రుంకుకంటె మహిలో భక్తాంఘ్రిపానీయముల్
తలమీఁదం [౪]జిలికించుకోఁ దగుచు దీర్ఘం బాశ భారంబు త
త్ఫల మత్యల్పము భక్తపాదయుగళాంభస్స్పర్శనిర్భర మై
యలరున్ శాశ్వతభుక్తిముక్తిఫలదం బై యుండు సర్వేశ్వరా!

మ. రమణన్ భక్తసమగ్రదర్శనము తీర్థశ్రేణి, తద్గోష్ఠి తీ
ర్థము, తద్దివ్యదయావలోకనము తీర్థం బెన్నఁగా నిట్టి జం
గమతీర్థాంబుధి నోలలాడక వివేకభ్రష్టు లై పోయి లో
కములోఁ దీర్థము లంచు నేఱులు సొరం గా నేల సర్వేశ్వరా!

మ. కమనీయం బగుసర్వతీర్థములు లింగం బున్నచో మూర్తిమం
తము లై యొప్పుచునుండు [౫]లింగమును దాత్పర్యంబుతో భక్తగా
త్రములం దెప్పుడు నుండుఁగాన మహిలో దత్త్వార్థ మూహింపఁ దీ
ర్థములం దెల్లను దివ్యతీర్థము భవద్భక్తుండు సర్వేశ్వరా! ౨౫

మ. ధరణిం దీర్థము లాడుకంటె ముద మొంద న్సర్వయజ్ఞంబులం
బరఁగం జేయుటకంటె సువ్రతము లొప్పన్ [౬]వేదశాస్త్రార్థత
త్పరుఁడై యాదటఁ జల్పుకంటె మది నుత్సాహించి నీభక్తిమ
త్పురుషశ్రేష్ఠులఁ బూజసేయుట మహాపుణ్యంబు సర్వేశ్వరా!

---

(22) ౧ ప. జిలుకన్. ౨. విధించి యె. ౩. ప్రా. జేయన్వచ్చు. (23) ౪. ప. జిలికించుకొన్న శుచి. (25) ౫. ప. లింగమునఁ దాత్పర్యంబు గా భక్తగాత్రమునం దేవుఁడు నుండు. (26) ౬. ప్రా. వేదవిఖ్యక్తతత్పరుఁ డై.

మ. భవదీయామలతత్త్వనిర్ణయకళాప్రఖ్యాతసద్భక్తపుం
గవగోష్ఠీసుఖవార్ధిలోఁ గడువేడ్కం దేలినం గాక యీ
భువి నేతీర్థజలంబులం గడిగినం బోనేర్చునే ఘోరదు
ర్భవసంఘాకలితాత్మతామసమహాపంకంబు సర్వేశ్వరా! ౨౭

మ. ధరణిం బ్రాక్తనభక్తనిర్మితమహాస్థానంబులై యొప్పు శ్రీ
గిరిముఖ్యం బగు దివ్యతీర్థములు భక్తిం జూచిరే వారిదు
స్తరదోషంబులు వాయు నన్న మఱి సాక్షాద్భక్తులం జూచినం
బరమార్థంబుగఁ బాయదే సరులపాపం బెల్ల సర్వేశ్వరా! ౨౮

## సద్భక్తుల మహిమ

మ. కని సద్భక్తుల కంత నంతఁ గడువేడ్కన్ హృత్ప్రణామంబు సే
సినమాత్రం జెడు సర్వదోషములు తచ్ఛ్రీపాదముల్ మట్టి మ్రొ
క్కిన సర్వాంగసమగ్రశుద్ధి యగు భక్తిన్ వారికిం బ్రీతి చే
సినఁ ద్వద్దివ్యదయావలోకనఘనశ్రీ లొందు సర్వేశ్వరా! ౨౯

మ. జలజాతప్రభవాచ్యుతాదులు [3]మదిం జర్చించి చర్చించి నీ
[౪]కలరూ పారయ లేక చిక్కులఁ బడంగా నిన్ను హస్తాప్తతా
మలకవ్యాప్తికిఁ దెచ్చి యేర్పఱిచి సంబంధించి చేకొన్న భ
క్తులశౌర్యం బుపమింప నెవ్వఁడు సమర్థుం డింక సర్వేశ్వరా! ౩౦

మ. అమరన్ భక్తగణాత్మమధ్యమము లింగావాస మా లింగమ
ధ్యమముం బద్మభవాండభాండనిలయంబై యుండుటన్ భక్తతృ
ప్తి మహాలింగము తృప్తియై మహిమ నుద్దీపించుఁ దల్లింగతృ
ప్తిమహత్త్వంబున నీసమస్తమును దృప్తిం బొందు సర్వేశ్వరా!

మ. అనురాగంబున నిన్నుఁ జూచుఁ దలపోయుం జొక్కుఁ గాంక్షించు వ
ర్ణన సేయుం దమకించు సిగ్గు విడియుం బ్రార్థించు శోషించు నం
త నిదిధ్యాసము దాల్చుఁ దన్ను మఱచుం దా నీదశావస్థలం
దనరంగా మది నిన్ను డక్కఁ గొను సద్భక్తుండు సర్వేశ్వరా!

---

(27) ౧. ప. సంఘాతదురాత్మతామస, ప్రా. సంఘాతదుఃసంత అనియు నొక దానిలోఁ గలదు. (28) ౨. ప్రా. జూచుచో. (౩0) 3. ప. మెఁగిన్. ౪. కొన్ని ప్రతులలో 'కలరూ పెన్నఁగ లేక' యనియుఁ గలదు.

మ. ఎలమిన్ భక్తుఁడు వక్రుఁడై నడిచెనే నేపారఁగా దానికిం
గలుషింపం గలహింపఁ గింకిరిపడం గా డెట్టిచో నైన ని
ర్మలగంగాపృథులప్రవాహ మరయం [౧]ప్రస్ఫూర్తిఁ దా నెన్నివం
కలుగాఁ బాఱిన దాని నెందు నలుకం గాఁ జన్నె సర్వేశ్వరా!

మ. సికతాధామము నీకుఁ జేసి మదిలోఁ జెన్నొంది క్రీడించు బా
లకు లింద్రాధికు లన్న నీగుడు లతి[౨]శ్లాఘ్యేష్టకాష్ఠాదులన్
సుకుమారంబుగ నెత్తి భూతలములో శోభిల్లువంశప్రదీ
పకు సౌభాగ్యముమాన మెవ్వరికిఁ జెప్ప న్వచ్చు సర్వేశ్వరా! ౩౪

మ. భవదభ్యర్చనవేళలన్ భవుల సంపద్భ్రాంతులన్ దీనమా
నవులన్ విద్విషులన్ భవాతురుల సన్మానించుటల్ [౩]సౌఖ్యము
ఖ్యవిహారేచ్ఛలు నీమహత్త్వములు నిత్యానంద మూహించుచో
భువి నీభక్తుల కాత్మలో [౪]విరసము ల్పుట్టించు సర్వేశ్వరా! ౩౫

మ. కరుణం జేకొని రేని [౫]నారకపదగ్రస్తాత్ము దేవేంద్రుఁగాఁ
బరఁగం జేయుదు రాత్మలో నలిగిరేఁ బర్జన్యు నారారవో
త్కరపంకప్రవిలీనకీటకముఁగాఁ గల్పింతు రన్నట్టిచో
హర! నీభక్తులశక్తి యెట్లు గుఱిసేయ న్వచ్చు సర్వేశ్వరా! ౩౬

మ. రమణీయక్షితిపాలుఁ [౬]డింద్రునిచతుర్మాసక్రమాయుష్యుఁ డా
యమరేంద్రుఁ డజునాడికాద్వయమువాఁ [౭]డా బ్రహ్మ యుష్మన్నిమే
షమువాఁ డంచును వీరి నెల్ల నగు నీ సాలోక్యసామీప్యస
త్తమరాజ్యస్థితిపట్టభద్రుఁ డగు సద్భక్తుండు సర్వేశ్వరా! ౩౭

---

(౩౩) ౧. ప్రస్ఫూర్తితో, ప్రా. ప్రస్ఫూర్తిగా. (౩౪) ౨. శ్లాఘ్యేష్టి...అని కొన్నిటిలోఁ గలదు. (౩౫) ౩. ప. సంఘుసౌఖ్యవిహారేచ్ఛలు నీ మహామహిమ. ౪. ప. నవరసంబు ల్పుట్టు. వా. ప్రా. లలో విరసముల్ అనియే కలదు. (౩౬) ౫. ప. నస్మదపద. ప్రా. లో ఒకదానిలో నారకపద, అనియుఁ గలదు. (౩౭) ౬. ప. రింద్రుని చతుర్మాసక్రమాయుష్యులా. ౭. ప. డా బ్రహ్మ విష్ణున్నిమేషమువాఁ డంచును అని కలదు. కాని ఇం దర్థము కానరాదు. విష్ణోర్నిమేషమువాఁ డని యేమో?

## పూజామాహాత్మ్యము

మ. ప్రకటింపంగ సమస్తపాతకములం బాపంగ నీపూజయం
దాకపుష్పాంశము చాలు నన్న మహిలో నూహింపఁగా నీపదా
ర్చకు లేమార్గమునందు శుద్ధులు మదిం జర్చింపఁ దద్దుర్గుణ
ప్రకరం బెన్నెడివాఁడు లోకములలోఁ బాపిష్ఠి సర్వేశ్వరా! ౩౮

మ. తమతేజంబుఁ దృణీకరించుచు సముద్యత్తేజులై మీఁదిలో
కములం దెల్లఁ జరించు నీయచలభక్తశ్రేణులం జూచి నె
య్యమునం దారును దద్విధంబునను నిన్నర్చింప నూహించి మ
ర్త్యమునం బుట్టఁగ వాంఛసేయుదు రమర్త్యశ్రేణి సర్వేశ్వరా!

మ. అమరన్ భక్తుల కెల్ల నీవ హృదయంబై యుండుట న్వారి సౌ
ఖ్యము నీసౌఖ్యము వారికూర్మియు[౧] సమగ్రం బైన నీకూర్మి త
త్త్వము భావింపఁగ వారికోపము భవత్ప్రఖ్యాతరౌద్రప్రభా
వము దా వారలవాక్యనిర్ణయము నీవాక్యంబు సర్వేశ్వరా! ౪౦

మ. అవనిం బెన్నిధి భాగ్యహీనునకుఁ బ్రత్యక్షంబు [౨]గా కప్పు డొం
డవ భాండాకృతిఁ దాల్చి మాటువడి మాయాన్వృత్తి [3]నున్నట్లు దా
భవదీయప్రతిబింబమూర్తి యగుసద్భక్తుండు సంసారదు
ర్వ్యవసాయాత్ముల కెల్లఁ గేవలనరుండై తోఁచు సర్వేశ్వరా!

మ. క్షితిపై శ్వేతమునీంద్రుఁ జంప నలుకం గీనాశుఁ డేతెంచి నీ
యతికోపోజ్జ్వలనాహుతి న్మడిసెఁ దత్కథ్యం బేకనిష్ఠాసమ
న్వితులం జేకొని భక్తవత్సలుఁడవై నీ వెప్పుడు న్గావఁగాఁ
బ్రతిపక్షావలి [౪]కెట్లు వారిదెసఁ జేర న్వచ్చు సర్వేశ్వరా! ౪౨

శా. కింకం దన్ను నదల్చి చక్రమునఁ దాఁ [౫]గృష్ణుండని న్వైచినం
బొంకం బొప్పఁగ దానిఁ [౬]దుత్తుమురుగాఁ బోఁదట్టి యుప్పొంగె ని
శ్శంకాత్ముండు దధీచి శాశ్వతులు నీసద్భక్తు లూహింపఁగా
సంకల్పప్రభవప్రతాపపవనభాస్వద్దావ సర్వేశ్వరా! ౪౩

---

(40) ౧. ప్రా. కూర్మియు. (41) ౨. ప. గాకుంట దొంతవ భాండాకృతిని. 3. ప్రా. నెల్లెట్లు శా. (42) ౪. కేల వారిదెస. (43) ౫. ప్రా. గృష్ణుండు దన్వైచినన్. ౬. ప. దుత్తుమురుగా. ప్రా. బొప్పఁగఁ గాని తుత్తుమురుగా. ౭. ప్రా. నవభాస్వద్ధామ అనియును గలదు.

మ. ఘటదుగ్ధంబులు పేరుఁ గాక వెలయంగాఁ గానెంత తోడంటిన
న్నటదుగ్ధాంబుధి పేరునే జగములో నల్పుండు దుస్సంగతిం
[౧]జటులాత్ముం డగుఁగాక యెవ్వెడల నీ సద్భక్తుఁ డే కార్యము
త్కటమై తాఁకిన నన్యచిత్తుఁ డగునే తర్కింప సర్వేశ్వరా! ౪౪

మ. సతి వేశ్యం దనప్రాణవల్లభునితో సంయోగ [౨]మర్థించఁగా
కతనిం బ్రార్థనసేసి [౩]సొమ్ము గొనిపో నర్తాడునే భక్తుఁ డీ
క్షితి నీభక్తియ వేఁడుఁ గాక మఱి నీ శ్రీపాదము ల్గొల్చి కు
త్సితకామ్యార్థము [౪]లెంత వేఁడుకొనునే చింతింప సర్వేశ్వరా!

మ. భ్రమరధ్యానము దాల్చి కీటకము సద్భావాదిసంయుక్తిఁ [౫]దా
భ్రమరంబై ఖగవీథి నాడు ననిన [౬]న్నాటించి నిన్నాత్మ నె
య్యముతో ధ్యానము సేయుమర్త్యుఁడును నీ యట్లే పరవ్యోమత
త్త్వమునం [౭]దవ్యయలీల నుండు టరుదే భావింప సర్వేశ్వరా!

మ. అమరశ్రేణులకు [౮]న్సుధామయకళౌఘాత్మీయసారంబు ర
మ్యముగాఁ [౯]గ్రోలఁగ నిచ్చి తా నొకకళామాత్రాంగుఁడై యున్న చం
ద్రమునిం జూచి [౧౦]జనమ్ము మ్రొక్కు[౧౧]గతి నారన్ భక్తపూజావిధి
క్రమభారాకృశుఁ జూచి మ్రొక్కుదురు లోకం బెల్ల సర్వేశ్వరా!

## శివయోగానందము

మ. చెదరంబాఱు దశప్రభంజనములన్ శిక్షన్ సుషుమ్నంబునం
గుదియంబట్టి చలింపకుండ శశి [౧౨]నర్కుం గట్టి భాస్వన్మన
స్సదనస్థానమునందు నిన్నెలమి సంస్థాప్యంబు గాఁ జేసి తా
హృదయానందరసాబ్ధిఁ దేలు శివయోగీంద్రుండు సర్వేశ్వరా!

---

(44) ౧. ప్రా. జటిలాత్ముం డగుఁగాక. (45) ౨. ప. మాసించుగాక. ౩. ప్రా. సొమ్ముగొనఁగా నర్తాడునే. ౪. ప. లొండ వేఁడుకొనునే. (46) ౫. ప్రా. సంయుక్తిగా. ౬. ప. న్భావించి. ఖగవీథి నాడుగతి సంభావించి యనియును గలదు. ౭. దవ్యయలీల నుండు టరుదే. (47) ౮. ప్రా. సుధామయకళా మాత్మీయసారంబు అని యున్నది. ౯. ప. జేపఱ నిచ్చి. ౧౦. ప. జగమ్ము. ౧౧. క్రియ నారన్. (48) ౧౨. ప్రా. నుర్కుంగంటి.

మ. వెలి వీక్షించిన నీస్వరూపమె మహా విస్పష్టమై యాత్మలో
పల భావించిన నీస్వరూపమె మహా ప్రవ్యక్తమై దృష్టులం
దలఁపం జేకొని యున్న నీయచలిత ధ్యానంబునం జేసి తాఁ
గలనైన న్మినయోగి [1]తన్ను జగముం గానండు సర్వేశ్వరా! ౪౯

మ. భవదాకారమె కాంచు నీ స్తనకదం బశ్లేష సద్వాక్యముల్
చెవులార న్వినను నిన్నె చెప్పు మది [2]దుశ్శీలేంద్రియాటోపదు
ర్వ్యవసాయాత్ములఁ గాంచుచో వినెడిచో వర్ణించుచోఁ జీకునుం
[3]జెవుడు న్మూగయు నై చరించు మహి నీశీలుండు సర్వేశ్వరా!

మ. అతిలాలిత్యముగా సహస్రశము నిన్నర్చింపఁగానచ్చు సు
వ్రతుఁడై యుండఁగవచ్చు నెల్లకళలం బ్రాజ్ఞుండు గావచ్చు వా
క్పతి గా నైనను వచ్చుఁగాని [1]మతి నీ భక్తుండు గారాదు సు
స్థితిగా నీదయ లేనిమానవునకుం జింతింప సర్వేశ్వరా! ౫౧

మ. భవదీయ [1]భక్తిమహత్త్వ మంకురితమై పాటిల్ల భక్తుండు బాం
ధవమాత్రుం డగు భక్తి పుష్పితముగాఁ దద్భక్తుఁ డాత్మేశుఁ డై
[2]సవిశేషస్థితిఁ దోఁచు భక్తి సఫలోత్సాహంబునం బొందఁగా
[3]నవికల్పస్థితి నంత భక్తుఁడును నీ వై యుండు సర్వేశ్వరా! ౫౨

మ. సుముఖుం డై శివయోగి మోదమున మదిం బొల్లఁ జేకొన్న భి
క్షము విప్రోత్తమకోటిభోజనసదృక్షం బన్న సౌభాగ్యయో
గమునం దారయ సమ్మహామహుఁడు వేడ్కం గోరి యారోగిణం
బమరం జేసినపుణ్య మెట్లు గణియింపం వచ్చు సర్వేశ్వరా! ౫౩

శా. ఎచ్చో నీపదభక్తుఁ డుండు మది నిం పెక్కం బ్రయత్నంబుతో
నచ్చో నీ వనిశంబు నుండుదు త్వదీయధ్యానచిన్మూర్తు లై
యచ్చో సన్మును లెల్ల నుండుదురు మంత్రాంగాకురాయుక్తు లై
యచ్చోఁ దీర్థము లెల్ల నుండు నిది వేదార్థంబు సర్వేశ్వరా! ౫౪

(49) ౧. ప. తానె జగముంగా నుండు. (50) ౨. ప్రా. దుశ్చిత్తేంద్రియాటోప- 3. వా. జెవిటి న్మూగయునై. భవదాకారమె యంచు నీ నతి కదంబశ్రేణి – అనియును పాఠము గలదు. (51) ౪. ప్రా. లో, మతి సద్భక్తుండు గారాదు. ప. మది నీ భక్తుండు. (52) ౫. భక్తమహత్త్వము అని ప్రా. పాఠము. ౬. నవిశేషస్థితిఁదోఁచు ౭. ప. సవికల్ప- క్తియు అనియు నున్నది. (54) ౮. ప్రా. సన్మూర్తులై.

## సద్భక్తిప్రభావము

శా. సత్యం బెప్పుడుఁ [౧]దప్పఁడే మహా దురాచారుండు గాఁడేని యా
చిత్యం బేమఱఁడేని దుర్జనులగోష్ఠిం బొందఁడే భక్తసాం
గత్యం బాడటఁ బాయఁడేని మదనగ్రస్తుండు గాఁడేని నీ
భృత్యుం డాతఁడు మూఁడులోకములలో [౨]బెంపొందు సర్వేశ్వరా!

శా. పెంపం దల్లి యగున్ రుజాపటలదు[౩]ష్ఠీవ్యాధిక్షోభ వా
రింపన్ వైద్యుఁ డగుం గుమార్గవిధులం గ్రీడింపఁ బోకుండ శి
క్షింపన్ బల్లిదుఁ డైనతండ్రి యగుచున్ శ్రీమంతుఁగా నెంతయున్
సంపద్వృద్ధి [౪]యొనర్ప దాత యగు నీసద్భక్తి సర్వేశ్వరా! ౬౬

మ. ఉరుసంసారగజేంద్రదర్పదళన వ్యాఘ్రప్రతాపోగ్రకే
సరి దుష్ప్రాపశరీర[౫]బంధవిపులత్వాగ్మజవ్రజచ్ఛేదవి
స్ఫురితక్రూరకుఠారధార దురితవ్యాపోద్భూతజీమూతదు
స్తరసంఘాతవిఘాతమారుతము నీసద్భక్తి సర్వేశ్వరా! ౬౭

మ. అరివీరప్రకరంబు భీకరతరంబై [౬]తాఁకుచో సింహసిం
ధురశార్దూలమృగోరగాదిభయముల్ దోతెంచుచో ఘోర(రోగ)దు
స్తరసంసారవికారవేదనలు మీఁదం బర్వుచో వజ్రపం
జరమై చేకొని [౭]తన్ను నెత్తుకొను నీసద్భక్తి సర్వేశ్వరా! ౬౮

మ. కమలాప్తుం డుదయింపఁగా ననలనక్షత్రతమఃపాధీశ తే
జము లెల్లం బెడఁబాసి పోవుగతి నీసద్భక్తిభావంబు చి
త్తములోనం బ్రభవింపఁగా నితరమంత్రధ్యాన[౮]తద్దేవతా
క్రమమాయాపటలంబు లన్నియును వీఁకం గ్రాఁగు సర్వేశ్వరా!

---

(౬౫) ౧. ప్రా. దప్పడే న్మహి. వా. దప్పఁడేనియు. ౨. ప్రా. బాహ్యుండు సర్వేశ్వరా, ప. బెంపొంద. రూపింప అనియుఁ గలదంట. (౬౬) ౩. ప. ష్ఠీవ్యాదివ్యాధిత్వోభ మాటింపన్ అనియుఁ గలదు. ౪. ప. యొసంగ. (౬౭) ౫. ప్రా. బద్ధఃపుల. ప. బంధ విపులత్వాగ్మజచ్ఛిదానర్గళ. (౬౮) ౬. ప్రా. తారుచో. ౭. తన్నుఁగాచుకొను అని ప్రా. పాఠము. (౬౯) ౮. చిద్దేవతా అనియుఁ గొన్నిచోటులలోఁ గలదు.

మ. చటులప్రాయగుణేంద్రియాత్ములకు వాంఛావృత్తి నీభక్తి సం
స్ఫుటమై యుండదు భక్తితత్పరులకుం బ్రాల్పొందఁగాఁ జిత్తము
త్కటదుష్టేంద్రియవర్గతామసపరిగ్రస్తంబు గా దెట్లు చీఁ
[1]కటికిం దిగ్మమరీచికిం గలదె సాంగత్యంబు సర్వేశ్వరా! ౬౦

మ. బలవంతుండును దుర్బలుండును మహాప్రౌఢుండు మూఢుండునుం
గులజుండున్ గులహీనజాతుఁడు ఘనక్రూరుండు శాంతాత్మని
శ్చలచిత్తుండును నొక్కరూప మది నీ సద్భక్తి చిత్తంబులోఁ
పల వర్ధిల్లిన మీఁద నేవిధమునన్ భావింప సర్వేశ్వరా! ౬౧

శా. కామోద్రేకవిజృంభణంబును సమగ్రక్రోధమున్ లోభమున్
వ్యామోహంబు మదంబు మచ్చరము దీవ్రం బైనపంచేంద్రియో
ద్దామా[2]టోపము గ్రాఁచి పెం పెసఁగుతత్త్వజ్ఞానికిం గాక తా
సామాన్యాత్ముల కేల నూలుకొను నీ సద్భక్తి సర్వేశ్వరా! ౬౨

మ. ఉరుపక్షంబులు వచ్చునంతకు నిరుద్యోగంబున న్వాలుకో
టరమధ్యంబున నుండుపక్షిగతి [3]నిష్ఠం గోరి నీభక్తివి
స్తరమాత్మం బ్రభవించునంతకును నీ సంసారకారాగృహాం
తరగేహంబున నుండి [4]జీవుఁ డతిచింతం బొందు సర్వేశ్వరా! ౬౩

శా. లింగారాధన జంగమార్చనము లోలిన్ భక్తి కంగంబు ప్రా
ణాంగవ్యాప్తియు నై స్ఫురించు [5]నిది తత్త్వార్థం బగుఁ గాన నా
యంగాభ్యర్చన జంగమాహితకరుం డై చేసినం దా శివ
శృంగారం బగు వానిభక్తి [6]మదిఁ జర్చింపంగ సర్వేశ్వరా! ౬౪

(60) ౧. ప. కటికిం గల్గునె దిగ్మరోచికిని. (62) ౨. ప. టోపమణంపఁ బెం పెసగు. (63) 3. ప్రా. నిష్ఠం గూలి అనియు, నిష్ఠం గూడి యనియును ఉన్నది. ౪. ప్రా. జీవి మది వంతం బొందు. తుది పంతం బొందు ననియుఁ గలదు. (64) ౫. ప్రా. నది తాత్పర్యంబు గాఁ జేసి తల్లింగాభ్యర్చన. ౬. ప్రా. తుదిఁ జర్చింపంగ. శివశృంగార మను స్థలమునందు గణము చెడిన దని పరిష్కర్తవారు వ్రాసిరి. కాని అది పొరపాటు. ఇట్టిప్రయోగము లనేకములు గలవు.

## భక్తియోగము

మ. [౧]ధరణిం గర్మవిధానభక్తివిభవధ్యానోత్తమజ్ఞానముల్
వరుసం [౨]బేర్కొన నాల్గుయోగములు తత్త్వం బెందు నీభక్తివి
స్తరబాహ్యక్రియ లెల్లఁ [౩]బొల్లు లగుటం దద్భక్తియోగంబు తాఁ
బరఁగం దక్కినమూఁడుయోగములకుం బ్రాణంబు సర్వేశ్వరా!

మ. అమరంగా ధన మిచ్చి కాతురు [౪]మహీయఃప్రీతిఁ బ్రాణంబుఁ బ్రా
ణము నర్థంబును నిచ్చి కాతు రభిమానంబు న్విశేషించి మా
నముఁ బ్రాణంబు ధనంబు నిచ్చి కడు సన్మానంబుగా [౫]నుత్తమో
త్తమచారిత్రులు భక్తిఁ గాతురు ప్రమోదం బంది సర్వేశ్వరా!

మ. [౬]అనుబద్ధేంద్రియభూతవర్గము యమాద్యష్టాంగ[౭]మంత్రోరుసా
ధన [౮]నుచ్చాటన సేసి పాసి గురుసద్వాక్యప్రకాశోత్తమాం
జనదృష్టిం బరికించి యేర్పఱిచి వాంఛం గోరి సాధించి చే
కొనుచున్మార్తికిఁ గాని [౯]భక్తినిధి నీలోఁ గాదెందు సర్వేశ్వరా!

మ. కనకంబందు ఘనీభవించిన కళంకం బెల్ల [౧౦]సువ్యక్తిగా
ననలాస్యంబునఁ గ్రాఁగి శోధగతి జీవాత్మం బ్రవేశించి చే
కొని వర్తించిన దుర్మలత్రయపరిక్షోభంబు నీభక్తిచే
తను బాపంబడుఁ గాని [౧౧]వేఱొకటిచేతం బోదు సర్వేశ్వరా!

మ. అమరంగా గురుమంత్రకార్ముకమునం దాత్మాస్త్ర మష్టాంగయో
గమహాముష్టి[౧౨]వివేకి యేయుటయుఁ [౧౩]దత్కాండం బజాండాదిత
త్త్వము లెల్ల న్వడి [౧౪]గ్రుచ్చి పాఱి భవదుద్యత్సూక్ష్మకైవల్యల
క్ష్యము[౧౫]నం దద్భుతశక్తితోడఁ [౧౬]గమియంగా నాటు సర్వేశ్వరా!

---

(65) ౧. ప. అరయం గర్మవిధానదానభవద్ధ్యానో. ౨. ప. బేర్కొను. 3. ప్రా. కొల్లలగుటన్. (66) ౪. ప. మహోద్యత్ప్రీతి. ప్రా. మదీయప్రీతిఁ బ్రాణంబు. ౫. ప్రా. సందుత్తమో. (67) ౬. ప. అనుబంధేంద్రియ అనియు నున్నది. ప్రా. లో అనపంచేంద్రియ అనియున్నది. ౭. యోగానుసా. ౮. ప. ముచ్చాటనసేసి పాపి. ౯. ప. భక్తినిధి. ప్రా. లలో, నిధి దాఁగోల్పోదు సర్వేశ్వరా అని యున్నది. (68) ౧౦. ప. కెల్లంబుగా. ౧౧. ప. ప్రా. లలో ఒండొకటిచేతంబోదు అని యున్నది. (69) ౧౨. ప్రా. వివేకుఁ జేయుటయు. ౧౩. నకాండం. ౧౪. ప. నుచ్చిపాఱి. ౧౫. సత్యద్భుత అని ప. పాఠము. ౧౬. ప్రా. గమయంగాఁబాఱు.

మ. ఇతనరం గాయవహిత్రమందు హృదయస్తంభాభిసంస్థానమై
చను నీధ్యానపటంబు నూల్కొలిపి భాస్వద్భక్తివాతాహతి
న్వినుతజ్ఞానపథంబు చేకొని సముద్వేగంబునన్ జీవుఁ డీ
ఘనసంసారమహార్ణవంబుఁ గడవం గాఁ బోలు సర్వేశ్వరా! ౭౦

మ. అకలంకస్థిరభక్తిమై నొసగయ నిన్నశ్రాంతముం జూచి పా
యక పూజించుమహామహుండు భవదైశ్వర్యుం డగుంగాక దా
సక లేచ్ఛావిషయంబులం బొరయుచుం జాపల్యతం జేయు నా
బకవేషార్చన లేల నిన్ను సొగయింపం జాలు సర్వేశ్వరా! ౭౧

మ. సమదోత్సాహసుఖాభిలాషలును నీ సంసారమాయావినో
దములు స్స్వర్గఫలాపవర్గఫలచిత్తభ్రాంతులుం బ్రాజ్యరా
జ్యమహాకాంక్షలు నెన్నిచూడ నివి నీ సద్భక్తి కత్యంతరా
యములై మాటికి మాటి కడ్డపడుఁ గార్యశ్రేణి సర్వేశ్వరా!

శా. మోహాంధ్వాంతములో మునింగినమహామూఢుం డతిభ్రష్టుఁ డై
సోహం బంచుఁ దొడంగి నీకుఁ గడు దూరాత్ముం డగుం గాని దు
ష్టాహంకారగుణంబు మాని మది సొంపారంగ సద్భక్తి దా
సోహం బన్న భవత్పదార్చకుఁడు నీ వై యుండు సర్వేశ్వరా! ౭3

శా. చావం బుట్టుచుఁ బుట్టఁ జచ్చుచు మహాచండాలసంసారపా
రావారంబునఁ గూలి తాఁ జెడుటకుం బ్రవ్యక్తిగా నాత్మలో
నేవం బొందక యేను నీ వనుట తా నేజ్ఞానమో శ్రీమహా
దేవా యిట్టికుతర్కముం గలదె? చింతింపంగ సర్వేశ్వరా! ౭౪

(70) ౧. ప. ఒనరం జ్ఞానపుటంబు వెల్గుఁ దమోద్యోగంబు పోఁజీవు. ౨. ప్రా. హృదయస్తంభాభిసంధానమై అనియును, సంధ్యానమై అనియును పాఠములు గలవు. (71) 3. ప. మై సొగసి మిన్నశ్రాంతమున్. ప్రా. లలో, మున్ సొగయుచున్న శ్రాంతమున్ అనియును, స్థిరభక్తిపూర్వముగ నిన్నశ్రాంత అనియును, భక్తితోఁ గదిసి నిన్నాద్యంతమున్ అనియును, పాఠములు కలవు. (72) ౪. ప్రా. సుఖాభిలాషము లని శుభాదిభావ. లని పాఠములున్నవి. స్వర్గఫలాపవర్గపదచింతా అనియు నున్నది. ౫. పూజ్య. ప. పాఠము. ౬. ప్రా. నిన్ను చూడనివి...కార్యశ్రేణి సర్వేశ్వరా అని ప. పాఠము. (73) ౭. ప. నీభక్తి.

మ. రసికుండై భవదంఘ్రిపద్మయుగ మారాధించుచో దుర్మద
వ్యసనాటోపము చిక్కులం బొరయుచు న్వర్తించుచున్నట్టిపా
లసుపూజావిభవం బదొప్పునె [౧]మహిన్ లక్షింప నారంభముం
గసవుం బెంచినచేనియట్లుఁ దలఁపంగా [౨]మీఁద సర్వేశ్వరా! ౭౫

## చిత్తవశీకరణము

మ. అమితోత్సాహము నంది నీకుఁ దనసర్వార్థంబులుం గూర్చి నే
మముతో నిచ్చుటకంటె శౌర్యగుణసామర్థ్యంబునం జేసి ప్రా
ణము నీ కిచ్చుటకంటె దుస్తరభవోన్మాదంబు మర్దించి చి
త్తము నీ కిచ్చుట పెక్కుభంగుల [౩]మహౌదార్యంబు సర్వేశ్వరా!

మ. ఘనవైరిప్రకరంబుఁ [౪]దాఁకి యనిలో ఖండించుకంటెన్ మృగేం
ద్రుని జేపట్టుటకంటె [౫]దిగ్గజముతో ద్రోపాడుకంటెన్ మహా
శనిఁ దా వ్రేయుటకంటె ఘోరభవదుశ్చారిత్ర వారించి రం
జనతోఁ జిత్తము శిక్ష సేయుట మహాశౌర్యంబు సర్వేశ్వరా! ౭౭

మ. అమితామోద నవప్రసూనముల నర్చించుచో గద్యప
ద్యము లూహించి నుతించుచో వివిధగీతవ్రాతము ల్పాడుచో
నమృతాహారము లిచ్చుచో నిపుణుఁడై యాటాడుచో [౬]నందుఁ జి
త్తము సద్భక్తియె నీవు చేకొనుపదార్థం బెల్ల సర్వేశ్వరా! ౭౮

మ. కసుఁ జిత్రంబుగఁ జేయఁగా నెఱసురంగం [౭]బయ్యెనే ఖడ్గముం
దిడకున్నం [౮]జెడురూ పదేమికొఱ దానిం బెక్కుపాటింపఁగా
నొడ [౯]లెబ్బంగుల నొప్పునే నియతితో నూహించి నిన్నాత్మలో
నిడకున్నం [౧౦]జనురూపు నేమికొఱ తా నీక్షింప సర్వేశ్వరా! ౭౯

---

(75) ౧. ప. భువిన్. ౨. ప. నెందు. ప్రా. లలో యుగ మారాధించుచున్ అని యును, విభవంబునొప్పునె అనియును పాఠములు కలవు. (76) 3. ప్రా. మహాధైర్యంబు సర్వేశ్వరా. (77) ౪. ప. దాఁటి. ౫. ప. వారినిధిలో దోగాడుకంటెన్. (78) ౬. ప. జిత్రముల్ రమణన్ భక్తియె నీవు చేకొని సదా రక్షింతు సర్వేశ్వరా. (79) ౭. ప్రా. సురంగం బయ్యెనా. ౮. ప్రా. పెఱనాటజేసి కొఱడా. ప. జెడనాటదేమి మెరదా. ౯. శోభంగుల నొప్పునే. ౧౦. జడరూ పదేమికొఱ. ప. పాఠము.

మ. జ్వరసంతాపవిశోషితాంగుఁడు సుధారసంకాశదివ్యాన్నపా
నరసస్రక్శశి భుజింప రోయుగతి నున్మాదేంద్రియధ్వాంతదు
స్తరసంసారమదప్రమత్తుఁడు మహాసౌఖ్యోత్సవం బైనమీ
చరణారాధనయందు బుద్ధిఁ జొనుపం జాలండు సర్వేశ్వరా! ౮౦

మ. కలయం గాష్ఠయుగంబుఁ గూర్చి తరువంగాఁ బుట్టి తత్సాధనం
బుల రెంటి న్దహియించువహ్నిగతిఁ దాఁ బొల్పొందఁ గాయంబు సం
ధిల సత్కర్మముతో మథింపఁగ భవచ్చిద్భక్తి సద్వహ్ని యు
జ్జ్వలమై కాయముఁ గర్మముం జెఱుచుఁ దత్త్వం బెన్న సర్వేశ్వరా!

మ. స్థిరబుద్ధిం దనసొమ్ము భక్తవరసుక్షేత్రంబునన్ బీజ మై
పరఁగంగా వెదపెట్టి మీఁద ధనసంపన్నుం డగుంగాక దా
నరిషడ్వర్గముపాలు సేసి భవమాయాగ్రస్తుఁ డై యిచ్చ నె
వ్వరి వేఁడం జనువాఁడొకో విషయదుర్వ్యాపారి సర్వేశ్వరా! ౮౨

శా. కాయం బన్నది వారిబుద్బుదసదృక్షం బందు రూపింప లేఁ
బ్రాయం బన్నది శారదాంబుదతటిత్ప్రాయం బగున్ దత్సుఖ
శ్రేయం బన్నది మాయ యి ట్లెఱిఁగియున్ శీఘ్రంబె నీధ్యానసం
స్థాయీభావనఁ బొందఁ డేమిటికయో సంసారి సర్వేశ్వరా! ౮3

మ. భవదీయస్థిరభక్తిలబ్ధియు భవద్భక్తైకగోష్ఠీమహో
త్సవలీలావిభవంబు నీయనుదినధ్యానానుమోదంబు లా
నివి నిత్యస్థితు లారయంగ విధి దేవేంద్రాదిభూతాఖిలో
త్సవభోగస్థితు లెల్లను మిథ్య లవి తత్త్వం బెన్న సర్వేశ్వరా! ౮౪

మ. తనయుక్తి స్భవదంఘ్రి[3]పంకరుహసద్భక్తుండు పాపంబు చే
సినఁ బుణ్యం బగు భక్తిహీనుఁడు శ్రుతుల్ చేపట్టి పుణ్యంబు చే
సినఁ బాపం బగు దీని కింతటికిఁ జర్చింపంగఁ జండీశ్వరుం
డును దత్తుండును సాక్షు లెన్న నగరాట్కోదండ సర్వేశ్వరా!

---

(83) ౧. ప. తటిత్ప్రఖ్యం బగున్. (84) ౨. ప. దుస్థితులు సత్యం బెన్న.
(85) 3. ప. సేవ గల సద్భక్తుండు.

శా. ప్రారంభించి చకోరపోతము మహీశయజ్యోత్స్నఁ దయం దుత్సవ
శ్రీ రంజిల్లుచు వేడ్కనుండుగతి నా చిత్తంబు నీదివ్యశ్శృం
గారధ్యానముసం దహర్నిశముఁ జొక్కం జేయవే దేవ శ్రీ
గౌరీలోచన నర్తకీనటన రంగస్థాన సర్వేశ్వరా! ౮౬

మ. తరులం బువ్వులు పిందెలై యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగున్
హర మీపాదపయోజపూజితము లై యత్యద్భుతం బవ్విరుల్
కరులౌ నశ్వములౌ ననర్ఘమణులౌఁ గర్పూర మౌ హారమౌఁ
దరుణీరత్నములౌఁ బటీరతరులౌఁ దథ్యంబు సర్వేశ్వరా! ౮౭

మ. ఒకపుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగ సద్భక్తిరం
జకుఁడై పెట్టినపుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదన్నఁ బా
యక కాలత్రితయోపచారముల నర్చించుచున్ బెద్దనై
ష్ఠికుఁడై యుండెడువాఁడు నీవగుట దాఁ జిత్రంబె సర్వేశ్వరా!

శా. ఆనందంబును బొందినప్పుడును నానాత్యాశ్చర్యకార్యార్థభా
వానీకంబులు దోఁచునప్పుడును రోగాపాయదుఃఖాతుర
గ్లానిం బొంది చరించునప్పుడును సత్కార్యంబున న్నీవు నా
ధ్యానంబం దుదయింపుమయ్య దివిజేంద్రస్తుత్య సర్వేశ్వరా! ౮౯

శా. నానాశాస్త్రసముచ్చయాగమపురాణప్రౌఢులై తత్త్వవి
జ్ఞానధ్యానసమాధివిద్య లతివిస్పష్టంబుగా నేర్చి రే
దానన్నేర్పుల నెల్ల నెల్లరు భవత్సద్భక్తివిద్యాసమా
ధానప్రస్ఫుటశక్తి నీకరుణచేతం గాని సర్వేశ్వరా! ౯౦

మ. ప్రకటింపంగ మదీయచిత్త మది దాఁ బంచేంద్రియోద్వృత్తమై
ప్రకటప్రాప్తిని సోలుఁగాని మఱి నీ పాదాబ్జసంసేవనం
బొకవేళన్ భజియింప నొల్లదు నిజం బూహింప నెట్లన్న నీఁ
గకు దుర్గంధము గాక సహ్య మగునే కస్తూరి సర్వేశ్వరా! ౯౧

(87) ౧. ప. పూజనముచే. (89) ౨. ప్రా. న న్నాచారచర్యాదికార్యానీకంబులు అనియును గలదు. 3. ప్రా. జ్ఞానము బేది చరించునప్పుడును. (90) ౪. ప్రా. దానీ నేర్పుల నెల్ల నొల్లరు అనియుఁ గలదు.

మ. మలినాంగుం డగు టేటికష్టము మనోమార్గంబు నీభక్తి ని
ర్మలసౌభాగ్యనిధానదీపశిఖ యై రంజిల్లదే భూమణో
జ్జ్వలదేహుం డగు టేమి తేజము మనోవ్యావృత్తి దుర్మోహచం
చలదుష్కర్మతమంబు వీడఁబడునే చర్చింప సర్వేశ్వరా! ౯౨

మ. ఇల నాచిత్తము యోగసాధనలయం దీఁదాడఁగాఁ గొంతని
శ్చలతం జేరఁగవచ్చు లేక తనవాంఛావృత్తిఁ బోనిచ్చినం
బొలుపై నీదెసఁ జేర దట్టి దకటా బోధించినం గాక కే
వలసంబోధన నేల నిల్చు బుజువై పత్రిల్లి సర్వేశ్వరా! ౯3

మ. ఉదకం బింకిన లావు నిదూలి వడిఁ దా నుష్ణింపఁగా రొంపిలోఁ
గడలంజాలని మీను వాన గురియం గ్రమ్మెక్కి పెన్నీటిలోఁ
బొదలం గన్నవిధంబునన్ భవములోఁ బోరాడుమర్త్యుండు దా
హృదయాబ్జంబున నిన్నుఁ గొల్వఁ గనునే యింపొంద సర్వేశ్వరా!

మ. భవదీయార్చన సేయుచోఁ బ్రథమపుష్పం బెన్న సత్యంబు రెం
డవపుష్పంబు దయాగుణం బతివిశిష్టం బేకనిష్ఠాసమో
త్సవసంపత్తి తృతీయపుష్ప మది భాస్వద్భక్తి సంయుక్తి యో
గవిధానం బవి లేనిపూజలు మహిం గైకోవు సర్వేశ్వరా! ౯౫

మ. అమరేంద్రాద్రిశరాసనంబు, హరి దివ్యాస్త్రంబు, భూమండలం
బమరంగా రథ, మర్కచంద్రులు తదీయాంగంబు లై యొప్పఁ జి
త్రిమె నీకుం బురలక్ష్య మేయునెడ నుద్యద్భాతి నత్యల్పకా
ర్యములం దైనను దా మహాఘనము నీ యత్నంబు సర్వేశ్వరా!

మ. దివిజేంద్రత్వముఁ బద్మజత్వము జగత్సేవ్యస్థిరానర్ఘలో
త్సవరూపం బగు కేశవత్వమును నీ సద్భక్తి సంవృద్ధిలో
లవమాత్రస్థితు లెన్న భక్తిజనితోల్లాసావనోద్యత్సుఖా
ర్ణవసౌభాగ్యపుమాన మెవ్వరికి నెన్న న్వచ్చు సర్వేశ్వరా! ౯౭

(92) ౧. ప. లో చంచలదుష్పంకము బొంది పీడఁబడగాఁ జర్చింప సర్వేశ్వరా. అనియును, సంకలితాటోపము మీఁదఁ బీడితునిగా గారింప ననియును పాఠములు గలవు. (94) ౨. ప. మాలి. ప్రా. మాని. 3. ప. భవములోఁ బొల్లాడు. (95) ౪. బును విశిష్టం. ౫. ప. మదిం గైకోవు. తదీయాంగంబు లట్లయ్యు అనియుఁ గలదు. (96) ౬. ర్యములందైన సదా. (97) ౭. ప్రా. సంపత్తిలో.

మ. పరమార్థంబుగ నామనంబున భవోద్భక్తిప్రభావంబు వి
స్తరమై పుట్టను పుట్టినం బ్రబల దంభోతిం గొంత వర్ధిల్లనే
విరసం బై యటమీఁదఁ జిక్కువడు భావింపంగ నెట్లన్న స
స్థిరుఁడం గాన జడుండఁ గాన బక వేషిం గాన సర్వేశ్వరా! ౯౮

శా. శ్రీకంఠాయ నమో నమో నతసురశ్రేష్ఠాయ రుద్రాయ లిం
గాకారాయ నమో నమో విగతసంసారాయ ¹శాంతాయ చం
ద్రాకల్పాయ నమో నమో దురితసంహారాయ తే యంచు ని
న్నాకాంక్షం బ్రణుతించుమానవుఁడు నీ వై యుండు సర్వేశ్వరా!

మ. భువనోత్పత్తి విధించుచో భవుఁడ వై పొల్పొందఁగా దాని ను
త్సవలీలం బ్రభవించుచో మృడుఁడ వై సర్వంబుఁ గల్పాంతభై
రవసంక్షోభ నటించుచో హరుఁడ వై త్రైగుణ్యశక్తిం దుదిన్
శివనామాంకముఁ దాల్చు నీమహిమ దాఁ జిత్రంబు సర్వేశ్వరా!

మ. కులశైలంబులు పాదుపెల్లగిలి దిక్కూలంబునం గూలినం
జలధుల్ మేరల నాక్రమించి సముదంచద్భంగి నుప్పొంగినన్
జలజాతప్రియశీతభానులు యథాసంచారము ల్దప్పినం
²దలఁకం డుబ్బఁడు చొప్పుఁ దప్పఁడు భవోద్భక్తుండు సర్వేశ్వరా!

శా. శూలస్థాపితుఁ డైనమానవునకున్ శూలంబు దుర్వారవా
త్యాలిం గంపము ³నొందకుండుట సుఖంబై తోఁచుమాడ్కిన్ భవా
భీలజ్వాలలఁ గ్రాఁగుమానవునకున్ బింబాధరాహారవ
స్త్రాలంకారము లించుకించుక సుఖంబై తోఁచు సర్వేశ్వరా!

శా. ఆకాశానలచంద్రసూర్యపవమానాత్మాంబువిశ్వంభరా
ప్రాకామ్యాంచితమూర్తిభేదముల నీ బ్రహ్మాండనానాఘటా
నీకప్రాకటజీవభావవిలసన్నిర్మాణకర్మాద్భుతా
స్తోకశ్రీకరమూర్తి వై నెగడు నీ స్థూలంబు సర్వేశ్వరా! ౧౦౩

---

(99) ౧. దివ్యాయ అని ప. పాఠములు. (101) ౨. ప. తలఁగం డెన్నఁడు.
(102) ౩. ప. నొంద కుండిన అనియును నొంద కించుక అనియును గలవు.

మ. అతివాఙ్మానస మై యజాండనిలయం బై యాదిమధ్యాంతవ
ర్జితరూపాధికనిష్కలంకపద మై సిద్ధాంత మధ్యాత్మసం
యుత మై కోటిరవిప్రకాశయుత మై యోంకారమంత్రాదిసం
స్తుత మై యొంచ నచింత్య మై వెలుఁగు నీసూక్ష్మంబు సర్వేశ్వరా!

మ. అజుఁ డై సృష్టి యొనర్చు రాజసమునం దండంబుగాఁ దా నధో
క్షజుఁ డై వర్ధిలఁజేయు సాత్త్వికము సంప్రవ్యక్తిగా గోపతి
ధ్వజుఁ డై సంహృతి సేయుఁ దామసమునం దత్సర్వముం గూడఁగా
నిజవిస్ఫూర్తి వెలుంగుఁ దుర్య మగుచున్ నీయాజ్ఞ సర్వేశ్వరా!

మ. సకలాధీశ్వరపట్టభద్రుఁడవు భిక్షాగామి వత్యంతశాం
తకళాత్ముండవు రౌద్రమూర్తి నతిసౌందర్యాంబికాసంగమా
ధికలోలుండవు దివ్యయోగివి మదిం దెల్లంబుగా నెట్టివా
రికిఁ దా శక్యమె నీనిజం బరసి చర్చింపంగ సర్వేశ్వరా! ౧౦౬

మ. భవదుఃఖార్ణవయానపాత్రము పరబ్రహ్మంబు యోగీంద్రహృ
ద్భవనప్రస్ఫురితప్రదీపము నఘధ్వాంతార్కబింబం బతి
శ్రవణానందకరంబు సన్మునిగణస్వాధ్యాయపాఠంబు మీ
శివనామాంకము భక్తపుంగవసదాసేవ్యంబు సర్వేశ్వరా! ౧౦౭

మ. అణిమాద్యష్టగుణప్రసిద్ధులు త్రికాలారాధ్యు లుద్యద్వచో
మణికోటిప్రతిమప్రభాపటలు లున్మాదేంద్రియధ్వాంతభీ
షణ దైత్యేంద్రవినాశకారణమహాశౌర్యోన్నతు ల్లోకర
క్షణదక్షుల్ వినుతింప నీప్రమథసంఘాతంబు సర్వేశ్వరా!

మ సకలాధీశ్వరు లై గణాధిపతు లై సర్వజ్ఞు లై నిత్యు లై
యకలంకాత్మకు లై మహామహిము లై యంభోజగర్భాండర
క్షకు లై యుండుదు రెల్లవారును భవత్సత్కృక్తి నానాగణా
ధికలీలావిధి నంతరంగముల వర్తింపంగ సర్వేశ్వరా! ౧౦౯

---

(104) ౧. ప. యేచి అనియును, మించి అనియును కలదు. (105) ౨.ప. ధ్వజుఁ డౌచున్ హృతిసేయు. 3.ప. నిజమూహింప నజాండభాండములలో. (106) ౪. ప. రికి శక్యం బగు. (107) గ్రే. సారంబు. (ఊ. స్వాధ్యాయిసారంబు.) (108) ౬. త్రిలోకారాధ్యులు.

మ. [1]అమరేంద్రాబ్జభవాచ్యుతాదులకు నీ యాజ్ఞాప్రభావం బలం
ఘ్యము నీకున్ భవదీయభక్తమహదాజ్ఞాపంబు నుద్యత్ప్రభా
వము లోకంబులలో నలంఘ్య మగుట న్వర్ణింపఁగా నీమహా
త్త్వముకంటెం గడుఁ జెల్లు భక్తులమహత్త్వం బెన్న సర్వేశ్వరా!

మ. శివ[2]సాహిత్యులసత్కరస్థలము కాశీక్షేత్ర మాహా స్తదే
[3]శవిశాలోన్నతశాఖ లారయఁగఁ బంచక్రోశ ఘాపాణిసం
భవశోభాన్వితచిత్రరేఖలు మహాభాగీరథీతీర్థముల్
శివలింగం బలవిశ్వనాథుఁ డరయన్ సిద్ధంబు సర్వేశ్వరా! ౧౧౧

మ. వరుసం బైకొని వచ్చుకర్మముల [4]ము న్వారించి మాయామల
[5]జ్వరము ల్గూల్చి యపారఘోరతరసంసారాబ్ధి లంఘించి భీ
[6]కరసూక్ష్మాంగవిచిత్రకంచుకము వీఁకం బుచ్చిపోవైచి తాఁ
[7]బరమవ్యోమము [8]సొచ్చునీయచలసద్భక్తుండు సర్వేశ్వరా!

మ. పరమార్థం బగు [9]తత్త్వమార్గమున నీ పాదాబ్జసద్భక్తుఁ డొ
క్కరుఁడుం దక్క సరోజజాద్యమరసంఘాతంబులో నెల్లఁ దా
నెరయం [10]గాచికొనంగఁజాలరు మహానిర్భీతుఁడున్ లేఁ డతి
స్ఫురణం గాలుఁడు దన్ను [11]వేచి వడిఁ గొంపో నుండ సర్వేశ్వరా!

మ. [12]తనచారిత్రము సన్నుతించుగురుభక్తశ్రేణి వర్ణింపఁగాఁ
దనచిత్తంబు భవత్పదస్మరణచేత న్నిన్ను మెప్పింపఁగా
ననుకూలస్ఫుట[13]నిష్కలంకబహిరంగాభ్యంతరంగస్థితి
న్వినుతిం బొందినతజ్జ్ఞుఁ డీజగములో నీమెచ్చు సర్వేశ్వరా! ౧౧౪

---

(110) ౧. ఈ పద్యము రెండుమూఁడుప్రతులలో లేదు. (111) ౨. దాకర—సాహిత్యలసత్కర (అ). ౩. శవిశేషోన్నతిఁ బొల్చునంగుళులు (అ). (ఈ. మాయాంగుళుల్ నవశాఖాసంభవమై పొందిన చిత్రరేఖలు.) (112) ౪. దా వారించి. ౫. జ్వరముం గాల్చి. ౬. కరసూక్ష్మాంగము పట్టుకంచుకము. ౭. బరమధ్యానము దాల్చు (అ). ౮. చొప్పు నుండును భవద్భక్తుండు. (113) ౯. తత్త్వ మారయఁగ. ౧౦. గాచికొనంగఁజాలి నిల్పు న్నే దేవుఁడు న్లేఁడతి. ౧౧. చేరి. (114) ౧౨. తనచారిత్రము తత్త్వవేత్తలగు. ౧౩. నిశ్చలత్వమున రా నభ్యం.

మ. క్షితి నత్యుగ్రతపంబునందు జఠరాగ్నిం[1] గాలఁగా[2] నేల మి
మ్మతిభక్తిస్థితిఁ [3] బూజసేయుమహనీయత్వంబు తాఁ జాలదే
[4] ప్రతిపక్షాలి నడంప రోగభవదుర్భరంబు వారింప న
ద్భుతసౌభాగ్యముఁ బెంప దివ్యసుఖముం బొందింప సర్వేశ్వరా!

మ. శివవాక్యస్ఫురితాక్షరద్వయసజ్జిహ్వా[5]ప్రదేశాత్ముఁ డీ
భవదుఃఖాంబుధి [6] దాఁటఁ జూచుతెఱఁ దత్పంచాక్షరీమంత్ర ము
త్సవలీలం గడు [7] శుద్ధుఁ డై జపము వాంఛం జేయు భాస్వద్గుణా
ర్ణవసౌభాగ్యముమాన మెవ్వరికిఁ గానన్వచ్చు సర్వేశ్వరా! ౧౧౬

## పంచాక్షరీమహిమ

మ. అరిషడ్వర్గబలంబులో మలసి మాయావృత్తి నాయం దతి
స్ఫురణం జేసినవాఁడు మోహుఁ డతనిన్ బోఁద్రోచి నీభక్తితోఁ
బరఁగం గూర్చి వివేకిఁ జేసి నెరయం బాటించి నాయం దధీ
శ్వరుఁ డై యుండఁగదయ్య రౌప్యకుధరవ్యాపార! సర్వేశ్వరా!

మ. అమలామ్నాయవిధిప్రబోధము లసంఖ్యాతంబు లై యుండు నా
గమమార్గోత్తమమంత్రతంత్రము లసంఖ్యాతంబు లై యుండుఁ ద
త్క్రమము ల్నాకవి యేల నీవు మెఱయంగా నిన్ను సద్భక్తియో
గమునం గొల్చి జయింపఁ జేయు నిదె మాహాత్మ్యంబు సర్వేశ్వరా!

శా. ఏదేశంబున నేదిశాముఖమునం దేయూర నేవాడ మీ
పాదాభ్యర్చన సేయునిర్మలుఁడు సద్భక్తుం డొకం డుండెనా
యాదేశంబును నాదిశాముఖమును న్నాయూరు నావాడ గం
గాదిస్నాననదీప్రవాహఫలదం బై [8] యొప్పు సర్వేశ్వరా! ౧౧౯

మ. ఒనరం జిత్తము శుద్ధిలేనినరుఁ డుద్యోగంబునం గోరి చే
సినపూజావిభవంబు సువ్రతములున్ శీలంబులు న్మంత్ర[9]సా
ధనముల్ తీర్థములుం దపంబులును మీపాదం బెట్టివాఁ డభ్యసిం
చినశస్త్రాస్త్రకళానిభంబు లగుఁ జర్చింపంగ సర్వేశ్వరా! ౧౨౦

---

(115) ౧. తపంబు చేసి. ౨. గ్రాఁగఁగా నేల. 3. బూజసేయ నియతుం డై యుండఁగాఁ. ౪. ప్రతిపక్షావలి నొంప. (116) ౫. ప్రదేశాత్ముఁ డై. ౬. దాఁటు నన్న మఱి. ౭. సిద్ధుఁ డై. (119) ౮. యుండు. (120) ౯. ఈ. సాధనముల్ ధర్మములున్ బదంబులు విషాదం బంద వాఁడభ్యసించిన.

మ. క్రమసంయుక్తి మనంబు బుద్ధియు నహంకారంబుఁ జిత్తంబు నా
౧యమలాంతఃకరణంబు నక్షరచతుష్కావాప్తిఁగాఁ దీర్చి పం
చమవర్ణంబుగ నాత్మఁ గూర్చి కడువాంఛన్ యోగి పంచాక్షరీ
సుమహన్మంత్రముతోడ ౨నైక్యపదవిన్ శోభిల్లు సర్వేశ్వరా!

మ. భవదీయాననపంచకంబువలనం బంచాక్షరశ్రేణి యు
ద్భవమై తత్పదవర్ణపద్ధతుల శుంభత్పంచభూతంబు లు
ద్భవనం బౌ చఖిలంబుఁ బుట్టెను లసత్పంచాక్షరీమంత్ర మీ
భువనాండంబులఁ దల్లి యై శుభములం బొందించు సర్వేశ్వరా!

## భక్తిసంస్కారఫలము

మ. పటుశాస్త్రాగమదృష్టి నివ్విధమునన్ భావించి వీక్షించి యు
ద్భటవృత్తిన్ భవదీయ౩భక్తినికరబ్రహ్మాండకుం డైన ౪నా
దట లోఁ గాచుకొనంగవచ్చు విదితోద్దండప్రతాపోత్కట
స్ఫుటకోపానలమూర్తి యై యముఁడు కొంకపోకుండ సర్వేశ్వరా!

మ. ౫కలవా రై మతిమంతు లై రసికు లై గంభీరు లై ధీరు లై
లలనామన్మథు లై సముజ్జ్వలవచోలాలిత్యు లై నిత్యు లై
బలవిభ్రాజితు లై యశోభరితు లై భాసిల్లుభాగ్యోదయుల్
తొలిజన్మంబుల మిమ్ముఁ గొల్చినమహాత్ముల్ వారు సర్వేశ్వరా!

మ. ఖలు లై యాచకు లై విరుద్ధవికటాకారాంగు లై పంగు లై
బలహీనాతురు లై రుజాపటలతాపచ్ఛన్ను లై ఖిన్ను లై
చలనాందోళితచిత్తు లై మలిను లై జాత్యంధు లై మందు లై
౬ తొలిజన్మంబున నిన్నుఁ గొల్వనిదురాత్ముల్ వారు సర్వేశ్వరా!

శా. ౭ఏయే వేళల నేవయస్సున నరుం డేభూమి నేయూరిలో
నేయేకర్మము నాచరించు నశుభం బేని న్శుభం బేనిఁ దా
నాయా వేళల నావయస్సున నరుం డాభూమి నాయూరిలో
నాయాకర్మఫలంబుఁ లెల్లనగు దథ్యం బింత సర్వేశ్వరా!

---

(121) ౧. ఈ. సమతాంతఃకరణంబు...'ర్చి. ౨. నైక్యము పదిన్. (123) ౩. భీతినికర. ౪. నంతట. (124) ౫. ఈపద్య మచ్చుప్రతిలోఁ గనఁబడదు. (125) ౬. యిల జన్మించుదురాత్ము లేమిడని వారీక్షింప సర్వేశ్వరా. యిల జన్మించెద రాత్మ మిమ్మిడక తా రక్షింప సర్వేశ్వరా. (అ). (126) ౭. ఈపద్యము మొదటిప్రతిలో మాత్రము గలదు.

శా. ఆడం బోయినచోట బాలురు వినోదార్థంబు పాషాణముల్
కూడం బెట్టి శివాలయం బనుచుఁ గోఁ బేరోల్కొన్నంతటం జేసి వా
రాడంబోయి సురాంగనాకలితదివ్యారామచింతామణి
క్రీడాశైలవిహారు లై వెలయుటల్ గీర్తింతు సర్వేశ్వరా! ౧౨౭

శా. కానీ దారసమన్వితుండు మిగులం గానీఁడు కందర్పునిన్
గోనీ మానవకోటిలో మనుల పైఁ గోనీఁడు మోహంబునున్
రానీ రాజితరాజ్యవైభవము పైఁ రానీఁడు గర్వంబునున్
లో నీవైనమహాత్ముఁ డన్యమునకున్ బోనీఁడు సర్వేశ్వరా! ౧౨౮

మ. తనులింగార్చనకంటె జంగమము సౌందర్యంబుగాఁ గొల్చు టు
త్తమభక్తస్థితి లింగజంగమముల న్సామ్యంబుగాఁ జేత మ
ధ్యమభక్తస్థితి లింగపూజ నధికుండై జంగమోపాసనా
క్షముఁడై యుండుట భక్తియం దది కనిష్ఠత్వంబు సర్వేశ్వరా!

## కృతి కాలము

శా. శాకాబ్దంబులు వార్ధిషట్కపురజిత్సంఖ్యాం బ్రవర్తింప సు
శ్లోకానందకరంబుగా మహిమతోఁ శోభిల్ల సర్వేశ్వర
ప్రాకామ్యస్తవ మొప్పఁ జెప్పె శుభకృత్ప్రవ్యక్తవర్షంబునన్
శ్రీకంఠార్పిత మై వసుంధరపయిం జెన్నొంద సర్వేశ్వరా! ౧౩౦

మ. అభిరమ్యంబుగ దూదికొండ మహనీయారాధ్యసోమేశ్వర
ప్రభుకారుణ్య వసంతసంజనిత (మత్పద్య) మద్వాక్యప్రసూనావళి
న్విభవం బొప్పఁగఁ గూర్చి యెంతయు లసద్విఖ్యాతి సంపత్సుఖ
ప్రభవం బైన భవత్పదద్వయము నారాధింతు సర్వేశ్వరా! ౧౩౧

(127) ౧. జేరోల్కొన్నంతమాత్రాన. ౨. చంద్రోపల క్రీడాగేహ (అ). (129) 3. జంగమోపాస్తిన (అ). (130) ౪. శా॥ శే॥ ౧౧౬౪. ౫. సంవత్సర శ్రీకాలంబునఁ గూలఁ గాక మదిఁ దర్కింపంగ సర్వేశ్వరా (మూల). ఈ 127 పద్యములే మొదటి ప్రతిలో నున్నవి. (ఈ. పరిషత్క శ్రీకంబై రసవంతమై.) (131) ౬. దూదికొండ యను గ్రామము కర్నూలుజిల్లా ప్రత్తికొండతాలూకాలోఁ బ్రత్తికొండకు సమీపమున నున్నది. (ఈ. 131 పద్యము. ఈ ప్రతిలో దూదికంటె మహనీయా......సంజనిత మత్పద్య ప్రసూనావళిన్ విభవం బొప్పఁగ భక్తియుక్తుల నవార్యవ్యాప్తి...నారంభింతు సర్వేశ్వరా.

శా. ఏ నిన్నే శరణందు బాంధవులు గాఁసి యెల్లవారుం బగే
కానీ మృత్యువు తల్లక్రిందుపడనీ కాలుండు గీవెట్టనీ
నానాకర్మచయంబు గెంజుకొననీ నా కేమి నే రాజ నిం
తే నీచాటున దాఁగియున్నపుడు భీతే యింక సర్వేశ్వరా! ౧౩౨

శా. ధాత్రి న్భక్తజనానురంజనముగాఁ దత్త్వప్రకాశంబుగాఁ
జిత్రార్థాంచితశబ్దబంధురముగా సేవ్యంబుగా సజ్జన
శ్రోత్రానందముగా శుభాంచితముగా శోధించి సర్వేశ్వర
స్తోత్రం బన్నయ చెప్పె నిజ్జగములో శోభిల్ల సర్వేశ్వరా! ౧౩౩

శా. బాలుం డాడెడుమాట లెల్ల నుపమింపం దండ్రికిం బ్రౌఢభా
వాలాపంబులకంటె మించుగతి నే నజ్ఞానభావంబునం
దాలోచించి రచించినట్టి కృతి యింపారంగ నీకు న్మహా
లాలిత్యస్తుతికంటెఁ గైకొనుఁగదా శ్లాఘ్యంబు సర్వేశ్వరా! ౧౩౪

మ. పరమార్థంబుగఁ దత్త్వము న్నెఱుఁగ నొప్పం దీర్చి డెందంబు నీ
కరుణాస్థానముఁ జేయ లేక తనవంకం బోవఁగానిచ్చి రే
నరకాబ్ధిం బడనైచుఁ దత్క్షణములోనం గానఁ దత్త్వక్షమం
బరయం జిత్తము ౧శూకలాశ్వమువిధం బై యుండు సర్వేశ్వరా!

మ. ౨భవదంఘ్రిద్వితయార్చనంబును భవత్ప్రఖ్యాతసద్భక్తపుం
గవగోష్ఠీవిభవంబులు న్విమలసూక్తిస్మృధ్యానయోగంబు నా
నివి సంపూర్ణసుఖంబు లెన్న మఱి దేవేంద్రాదిభోగంబు లు
త్సవసంబంధము లెల్ల దుస్థితులు తథ్యం బెన్న సర్వేశ్వరా!

మ. సమయోద్దిష్టసహస్రపంకరుహపూజాపూరణార్థంబు నే
త్రము విష్ణుండు సుభక్తి యేర్పడ భవత్పాదంబు లర్చించి చ
క్రము నీచేఁ గొని దైత్యకోటి ననిలో ఖండించెఁ దా నీపద
క్షమతాసేవ సమస్తదేవతలకు న్సత్త్వంబు సర్వేశ్వరా! ౧౩౭

(185) ౧. శూకలాశ్వము = శిక్షింపఁబడని గుఱ్ఱము. (186) ౨. ఈపద్య మచ్చుప్రతిలో లేదు.

మ. అమరస్వేదపురాణశాస్త్రములు మున్నా కాంక్షఁ దత్త్వప్రభే
దము లూహింపఁగ నేరవన్న మఱియాతత్త్వంబు లెట్లన్న ను
త్తమసంతోషమె కోరు నేని నరుఁ డుత్సాహించి నీభక్తస
త్తమసంతోష మొనర్పునే నతఁడు తత్త్వజ్ఞుండు సర్వేశ్వరా!

మ. అమితోద్యద్భవదీయతత్త్వము మహీయస్తోత్రవాణీవిలా
సము లై యొప్పు సమస్తవేదములు శాస్త్రశ్రేణియున్ దివ్యవి
భ్రమవాదంబులు నెన్ని చూడ నివి నీపంచాక్షరీమంత్రభా
వము లై యుండు సమస్తలక్షణములన్ వర్ణింప సర్వేశ్వరా! ౧౩౯

శా. సంకీర్ణాకలితాక్షరత్రయము భాస్వన్నాదబిందుక్రమా
లంకారద్వితయంబుతోఁ గలసి లీలన్ దివ్యయోగీంద్రహృ
త్పంకేజోద్భవకమ్రలంబు రూఢమగుచుం బంచాక్షరీమంత్ర మ
య్యోంకారాత్మక మౌలసన్మునిగణం బూహింప సర్వేశ్వరా!

మ. అమలజ్ఞానవికాసభాసురతనూయ్యష్టాంగపూజావిధి
క్రమయోగంబుల నిన్ను నెల్లపుడు జోకం గొల్వఁగా నేల ని
క్కము నీభక్తులగోష్ఠి చాలుఁ గడు నీకర్కశ ఘోరసంసారదుః
ఖము లెల్లం బెడవాపి నిన్ను వెలయంగాఁ జూప సర్వేశ్వరా!

మ. జయశక్తి న్రవిచంద్రతారకముగాఁ జెల్వెన్ యథావాక్కలా
న్వయసంజాతుఁడఁ సన్నమార్యుఁ డవనిన్ వర్ణించి నీసత్కథా
క్రియ సంబోధన నీదుభక్తిని మహానిర్ణీతవిశ్రాంతిగా
భయవిభ్రాంతులు లేక యీశతకముం బ్రఖ్యాతి సర్వేశ్వరా!

సర్వేశ్వరశతకము సంపూర్ణము

---

(138) ౧. ప్రబోధము (అ). (139) ౨. తదీయస్తోత్రవాణీసముద్రము లైయొప్పు సమస్తశాస్త్రములు పూర్ణశ్రేణులకు దివ్యవి। భ్రమవాదంబులు నిశ్చయింప నవి శ్రీపంచాక్షరీమంత్రభా ష్యము లైయొప్పు సమస్తలక్షణములం జర్చింప (అ). (ఊ. మదీయ శ్రోత్రపూర్ణానివాసము లై.) (140) ౩. త్రితయంబులో. (అ). (ఊ. క్షరద్వయము.) ౪. నందు గూఢమగుఁ దత్పంచాక్షరీమంత్ర ప। మ్యోంకారాక్షర మంత్ర సన్మునిగణం బూహించి (అ). (141) ౫. సద్భక్తి (అ). (142) ౬. ఈ పద్య మచ్చుప్రతిలో లేదు.

# పీ ఠి క

శ్రీ కృష్ణశతకము దేవకీనందనశతక మని నామాంతరమును గలిగి యాంధ్రదేశము నందు విశేషమైన వ్యాపకమును గలిగియున్నది. ఇంతవరకును ముద్రించిన ప్రతులయందును వ్రాఁతప్రతులయందును పాఠములందును పద్యములసంఖ్యయందును భేదములు గలవు. అడయారు ప్రతియందు ౧౧౯ పద్యములు గలవు. వావిళ్లవారి యచ్చు ప్రతియందు ౧౦౧ పద్యములు గలవు. కాలక్రమమున మూలమునందే మార్పులు గలిగి నటు లూహింపఁదగి యున్నది. దేవకీనందనశతకము నెవరు రచియించినదియును నిర్ణయించుటకుఁ దగినయాధారములు గనిపింపవు. మహాకవి తిక్కనసోమయాజులు దేవకీనందనశతకమును శ్రీకృష్ణాంకితముగ భారతరచనానంతరము రచియించె నను ప్రతీతి చిరకాలము నుండియును వ్యాపకమునం దున్నది.

"అరయక శంతనుసూనువై విదురువై నక్రూరువైఁ గుబ్జవై......" యనుపద్య మా శతకమునందలి దను ప్రతీతియును గలదు. తిక్కన రచియించినకృష్ణశతకము గనిపించుటలేదు. దేవకీనందనశతకమే కృష్ణశతక మని నిర్ణయించుటకును నాధారములు గనిపింపవు. తిక్కన భారతరచనకును దేవకీనందనశతకరచనకును భావములందును భాషయందును శైలియందును సాదృశ్యము గనఁబడదు. భీష్మనిముఖమునను తిక్కన చేసిన శ్రీకృష్ణస్తవమునకును కృష్ణ శతకమునందలి శ్రీకృష్ణస్తవమునకును గల భేదము సంశయనివారణమును జేయఁగలదు. జ్ఞానహృదయసంపన్నుఁడైన తిక్కనసోమయాజి భక్తిరసపూరితమైనను జ్ఞానహృదయము లేక. శృంగారభక్తిపరమైన దేవకీనందనశతకమును రచియించుట యసంభవము. విరాట పర్వాదిని తిక్కన వ్రాసిన యీక్రిందిపద్యము తిక్కనహృదయమును దెలుపుచున్నది.

ఉ. వైదికమార్గనిష్ఠ మగు • వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదము లేనిభక్తి నతి•నిర్మలవృత్తిఁ జేయుచుండి మ
త్పాదనిరంతరస్మరణ • తత్పరభారముకల్మి నాత్మ స
మ్మోదముఁ బొంది కావ్యరస•ముం గొనియాడుచు నుండు దెప్పుడున్. ౧౪

శాంతిపర్వమునందు భీష్ముఁడు చేసిన శ్రీకృష్ణస్తవమును తిక్కనహృదయమును విశదము చేయుచున్నది.

C

మ. యదువంశంబున వాసుదేవుఁ డనఁ గ్రీడార్థంబు జన్మించి దు
ర్మదదైత్యావలిఁ గూల్చి పార్థునకు సారథ్యంబు త్రైలోక్యస
మ్మద మారంగ నొనర్చి దేవమునిసమ్మానోద్ధతిం భూభరం
బు దొలంగించినచక్రి నంబుజముఖాసాంభుం గొల్తుఁ గృష్ణాత్మునిన్. ౪౭

పరమపవిత్రమైన తిక్కనహృదయమునకును దేవకీనందనశతకకర్తహృదయమున కును సంబంధ ముండఁజాలదు. దేవకీనందనశతకమునందుఁ గల శృంగారవర్ణన లీవిషయమువిచారము ననవసరముచేయుచున్నవి. తిక్కన పాండురాజును గోళకుఁడని వర్ణించియుండఁడు. తిక్కనకవిత్వము నంతయును గాలించినను గనఁబడని దోషములు- భావములు- గల దేవకీనందనశతకమును తిక్కనకవీంద్రుఁడు రచియించి యుండఁడు.

శ్రీ వంగూరు సుబ్బారావుగారు శతకకవులచరిత్రమునందు దేవకీనందనశతకమును వెన్నెలకంటి జన్నయ వ్రాసినటు లూహించి కవిచరిత్రమును విపులముగ వ్రాసిరి. పేమరాజు జక్కన తన విక్రమార్కచరిత్రమునందు "పరమహృద్యంబైన పద్యశతంబున దేవకీతనయు విధేయుఁ జేసె" నని వ్రాసియుండుటయే యీయూహకుఁ గారణము. జక్కనకవి ౧౪౧౦—౧౪౨౨ ప్రాంతములందు విక్రమార్కచరిత్రను వ్రాసినటులు కవులచరిత్రయందుఁ దెలుపబడినది. జక్కయ్య విక్రమార్కచరిత్రమును దేవరాయమంత్రియైన సిద్ధన్న కంకితముగ నొనర్చెను. సిద్ధన్నయు జన్నయ్యయు దేవరాయమహారాజునకు మంత్రులుగ నున్నటులు జక్కయ తన విక్రమార్కచరిత్రమునందుఁ దెలిపెను. జన్నయ్య ౧౪౦౬- ౧౪౨౨ ప్రాంతములందు నివసించి యున్నటులు కవులచరిత్రమునందుఁ దెలుపఁబడినది.

సాహిత్యపరిషత్తు గ్రంథాలయమునందును అడయారుగ్రంథాలయమునందును గల ప్రతులందు "కవిరత్నశ్రేష్ఠుఁడా మోదియై భువిఁ గావించినయట్టి కృష్ణశతకంబున్" అను పాదములు గల పద్యములు కలవు. దీనియందు ౧౧౭ సంఖ్య గల పద్యము. ఈపద్యములం కవిరాత్నుఁడు దేవకీనందనశతకమును రచియించినటులు స్ఫురింపఁజేయుచున్నవని సుబ్బారావుగారు వ్రాసిరి. ఈకవిరాత్నుఁ డెవఁ డైనదియును పద్యములు దేవకీనందనశతక కర్తృత్వమును నిరూపించుచున్నవియును నిర్ణయించుట కాధారములు గనిపింపవు. ఈపద్యములు కొన్నిప్రతులయందు లేవు. కవిరత్నకశ్రేష్ఠుఁ డనుటకే కవిరత్నశ్రేష్ఠుఁడని శతకకర్తవాడియుండవచ్చును. కవిరత్నశ్రేష్ఠపదమునకు కవిరాత్నుఁడనునర్థమును గ్రహించుట కవసరము గనఁబడదు. రత్నరత్నకపదములు సమానార్థకములుగ నున్నవి. కవిరాత్నుఁడు ౧౦౦౦ - ౧౩౦౦ నడుమ నున్నటులు కవులచరిత్రమునందు పంతులుగారు వ్రాసిరి. కవిరాత్నుఁడు దేవకీనందనశతకమును వ్రాసినటులు, నిదర్శనములు లేవు. శతకము ప్రాచీనము దైనను కర్తృత్వమును కాలమును నిర్ణయించుటకుఁ దగినసాధనములు

గనిపించవు. తెలియని విషయములం దూహలును కల్పనములును నిరుపయోగములు. పండితు లీవిషయమును పరిశోధించుదురు గాక.

**కాలము:**—శతకకర్తను నిర్ణయించుట సాధ్యము గానపుడు శతక కాలమును నిర్ణయించుటయును సాధ్యము గాదు. తిక్కన ౧౨౨౦–౧౩౦౦ ప్రాంతములందు నివసించినటులు వీరేశలింగము పంతులుగారును నితరపండితులును నిర్ణయించిరి. దేవకీనందన శతకము తిక్కనవెనుకటి దని శతకభావార్థము తెలుపుచున్నది. అప్పకవి తన లక్షణ గ్రంథమునందు దేవకీనందనశతకమునందలి ౩౨ వ పద్యమును దేశ్యనిత్యసమాసవిశ్రాంతికి లక్ష్యముగ నుదాహరించెను.

మ. చతురంభోధిపరీతభూవలయరాజానీకకోటీరరం
  జితమాణిక్యవిరాజమానపదరాజీవుండు ధర్మాత్మజుం
  డతికారుణ్యముతోడ మత్స్యపతికొల్వాసింపడే నీదుశా
  శ్వతకారుణ్యము గల్గునంతకును గృ... ౩౨

అప్పకవి తనలక్షణగ్రంథమును (౧౬౫౬-ఆగస్టు ౪) శా. శ. ౧౫౭౮-వ మన్మథ నామసంవత్సర శ్రావణ బ॥ ౧౦ గురువారమునాడు వ్రాయఁబూనుకొనెను. అప్పకవి కాలమునాటికే ప్రచారము గల దేవకీనందనశతకము పదియాఱవ శతాబ్దియందుఁగాని యంతకుఁ బూర్వముగాని రచియింపఁబడియుండును. వెన్నెలకంటి జన్నయ్యకృత మైనచో ౧౪౨౦ ప్రాంతమునను రచియింపఁబడియుండును. కాని ఈ శతకమునందలి శృంగారభక్తి రససమ్మిళితము లైన వర్ణన లీశతక కాలము పదునైదవశతాబ్ద్యంతమునకు నడుపు నని తోఁచుచున్నది. నారాయణశతకమునకును దేవకీనందనశతకమునకును గల పోలికలును కాలనిర్ణయమును జేయుటకుఁ దోడ్పడవు. నారాయణశతకకర్తృత్వమును సందియములతోఁ గూడియున్నది. ఇట్టి యసంగతపరిస్థితియందు కాలనిర్ణయమును జేయుటయును సాధ్యము గాకున్నది.

**శైలి:**—శతకశైలి సులభమును హృద్యమును నున్నది. శైలియందు వ్యాకరణాదిదోషములు గలవు. మాలాతినిన్, చుట్రా, పట్రా, చట్రా, కొలిచేదిక్, విహరించే మొదలగు నాడుకప్రయోగములు గలవు. సంస్కృతసమాసములను గల్పించుటయందుఁ గొన్ని వ్యాకరణదోషములును గొన్ని యతిదోషములును గలవు. సంస్కృతాంధ్రపదములు గలిసి శైలి సులభగ్రాహ్యముగ నున్నది. కొన్ని పద్యములందు దీర్ఘసమాసములును గలవు. "హాలాహల........సుధ్యంబుజన్" అని యొక దీర్ఘసమాసమును నుపయోగించెను. సామాన్యముగ పద్యము లర్థస్ఫురణమునకుఁ దగినపదజాలమును గలిగి శ్రావ్యముగ నున్నవి. శైలియందును రచనయందును వృషాధిపశతకమునందును సర్వేశ్వరశతకమునందును వ్యక్త

నగుచున్న శబ్దార్థాలంకారములును శాస్త్రీయపాండిత్యమును గనఁబడవు. శతకమునందు వ్యంగ్యార్థముగల శృంగారవర్ణనలు గలవు. ఈ క్రిందిపద్యములు శతకశైలిని దెలుపఁగలవు.

శా. మద్దుల్గూల్చినలాగొ వేగ మనిలో ♦ మన్నించి గాండీవికిన్
బుద్ధుల్ సెప్పినలాగొ మోదరస ము♦ప్పొంగన్ యశోదమ్మకున్
ముద్దుల్గా ॥ టియించులాగొ వరుసన్ ♦ ముప్పోళలన్ వేడుకన్
చద్దుల్మెక్కి రహించులాగొ ధరఁ గృ♦ష్ణా... ౨౮

మ. కొలిచేదిన్ వగలేకనే నడిగితే ♦ కోపించు టీలేకనే
చెలువం బెచ్చుట కోకనే విభవముల్ ♦ చేకూరుటల్ గూకనే
బలవంతుం డగు మూకనే సతి చెడున్ ♦ ప్రాణేశుఁ గైకోకనే
జలదశ్యామల శంఖచక్రధర కృ♦ష్ణా... ౪౨

శా. ఏలా విద్యలు పెంపు రూపవిభవం ♦ బేలా కులీనత్వమున్
శీలత్వంబును నేల యేటికి వయ♦శ్శ్రీ యేల బాహాబలం
బేలా చాతురి మీకృపాగరిమ సం♦క్షేపంబు లేకుండినన్
జాలిం బొందిరఁ గల్గునే సిరులు కృ♦ష్ణా... ౯౯

## శ త కా ర్థ ము

ఈ శతకమునకు మకుటము:—కృష్ణా! దేవకీనందనా!

దేవకీనందనశతకము విష్ణుభక్తిపరము లైన శతకములందు ప్రసిద్ధమైన శతకము. భాగవతభక్తి శివ కేశవ లక్ష్మీనృసింహాది దేవతాభక్తిగను నానాదేవతాభక్తిగను బరిణమించిన విధమును భక్తిశతకములచరిత్రము విశదము చేయుచున్నది. సంస్కృతవాఙ్మయమునందలి స్తోత్రములే యాంధ్రవాఙ్మయమునందు శతకరూపమును దాల్చినవి నాంధ్రశతకములకుఁ గల వ్యక్తిత్వమును శతకవాఙ్మయవిమర్శనమువలన విశద మగుచున్నది. పండ్రెండు పదుమూఁడవ శతాబ్దులందు దక్షిణభాగమునందు శైవవైష్ణవమతములకు సంరంభము గలిగిన విధమును శ్రీరామానుజాచార్యులచరిత్రము విశదము చేయుచున్నది. శివభక్తులయొక్క కాషాయాంబరములు వైరాగ్యబోధనలు భిక్షాటనములు ప్రపంచవ్యవహారమగ్నమైన ప్రజాహృదయమునకు సహ్యము గాకుండెను. భగవల్లీలాపరములై ప్రవృత్తిపరములైన విశిష్టాద్వైతసిద్ధాంతములు ప్రజాహృదయము నాకర్షించినవి. దివ్యములైన వైష్ణవవిలాసములకు సంసారప్రవృత్తియందు సమన్వయము గలిగినది. భక్తివిలాసములందు శృంగారవిలాసములకు స్థాయిభావము గలిగినది. శృంగారములు భోగములు కైంకర్యములు వైష్ణవభక్తికి లక్షణము లైనవి. వైష్ణవభక్తిమార్గమునే శివభక్తియును నవలంబించినది.

కాలాంతరమునందు మహమ్మదీయ క్రైస్తవమతములతో భాగవతభక్తికి గలిగిన సంబంధము నందు భక్తిరసమునకును శృంగారరసమునకును వియోగము గలిగినది. ఈ వియోగము వర్తమానభక్తిశతకములవాఙ్మయమునందు గోచరంబగుచున్నది.

భక్తిరసమును శృంగారరసముతో మేళవించినపుడు భక్తితరంగములందు సౌందర్యరసము ప్రసరించినది. శ్రీమద్భాగవతమునందు హృద్యముగ వర్ణింపఁబడిన భక్తిశృంగారరసలీలలు కాలాంతరమునను భౌతికశృంగారరసముగఁ బరిణమించి విషయవాసనలు భక్తులదృష్టిని విశేషముగ నాకర్షించినవి. పదుమూఁడవశతాబ్దియందు వెలసిన భాగవతశృంగారరసము పదునైదవశతాబ్దియందు కాముకశృంగారరసముగఁ బరిణమించినది. శ్రీకృష్ణశతకములు శృంగారశతకములు పుట్టి విజృంభించినవి. లీలాశుకుఁడు శ్రీకృష్ణకర్ణామృతమునందు వర్ణించిన శ్రీకృష్ణపరమాత్మని శృంగారలీలలు దేవకీనందనశతకమునందును శృంగారశతకములందును కాముకశృంగారలీలలుగఁ బరిణమించినవి.

దేవకీనందనశతకమునందుఁ బ్రత్యక్షముగ నున్న కాముకశృంగారవర్ణన లీలశతకము వైష్ణవభక్తివ్యాపనమునందు రెండవయుగమునకుఁ జెందుచున్నటులు నిర్ధారణ చేయుచున్నవి. శతకకర్త తన సంకల్పమునందు విశ్వలీలావిలాసవిహారియైన బాలగోపాలకృష్ణమూర్తి నుపాసింప నెంచినను జన్మసంస్కారము మనోవృత్తిని విషయవాసనలకు మరల్చినది. సంభావనయందు దివ్యసుందరలీలలును ననుభవమునందు విషయలోలతయును గోచరంబగుచున్నది. శ్రీకృష్ణమూర్తిని కొంటెదేవరనుగ వర్ణించిన ౧, ౨, ౧౩ పద్యములందును ౧౯, ౨౨, ౧౧౮ పద్యములందును కాముకశృంగారవాసనలు విశదమగుచున్నవి. శతకమునందు ౬౭ పద్యమునందు స్త్రీలశీలనిరసనమును ౭౦, ౭౧ పద్యములందు రాజులశీలనిరసనమును గలవు. శతకము సంసారవాసనాయత్తమైన ప్రవృత్తిని సూచించుచున్నను భక్తహృదయమును వెల్లడిచేయుచున్న విధమును పద్యములు దెలుపుచున్నవి.

శ్రీశంకరాచార్యులస్తోత్రములు కృష్ణకర్ణామృతము సర్వేశ్వరశతకము వైదికీతులు మొదలగు గ్రంథములు శతకకర్తకు భావసంగ్రహణమునకు దోడ్పడినవి. భజగోవిందస్తవమునందుఁ జెప్పఁబడిన—

శ్లో. బాల స్తావ త్క్రీడాసక్త । స్తరుణ స్తావ త్తరుణీసక్తః ।
వృద్ధస్తావ చ్చింతాసక్తః । పరే బ్రహ్మణి కోపి న సక్తః ॥ భజ ॥

ఈశ్లోకము దేవకీనందనశతకమునందలి ౮౩-వ పద్యము పోలియున్నది. సర్వేశ్వరశతకమునందలి

మ. సురల న్మర్త్యసమంబుగా మనుజులన్ • శోభిల్ల బృందారకో
త్కరముంగా ఘను నల్పు నల్పుని ఘనుం • గాఁ బుణ్యపాపాలిచేఁ
దిరుగన్వైచుచు నీమహామహిమ శ్రీలీలం బద్మజాండంబుఁగం
దరయన్ జీవుల నింద్రజాలములుగా • నాడింతు సర్వేశ్వరా! ౧౭

పై పద్యమును నీశతకమునందలి ౪౬వ పద్యము పోలియున్నది. దీనియందలి ౭౧, ౭౨, ౭౩ పద్యములు బద్దెనీతి సుమతిశతకమునందలి పద్యములను బోలియున్నవి. శ్రీకృష్ణకర్ణామృతమునందలి బాలగోపాలుని లీలావర్ణనముల యనుకరణము దేవకీనందనశతకమునం దంపటను గలదు. కృష్ణకర్ణామృతమునందలి—

శ్లో. ఆన్దోళితాగ్రభుజ మాకులనేత్రలీల, మార్ద్రస్మితార్ద్రవదనామ్బుజచన్ద్రబిమ్బమ్
శిఞ్జానభూషణశతం శిఖిపిఞ్ఛమౌళిం, శీతం విలోచనరసాయన మభ్యుపైతి. ౭౦

శ్లో. భవనం భువనం విలాసినీ శ్రీ స్తనయ స్తామరసాసనః స్మరశ్చ,
పరిచారపరమ్పరా సురేన్ద్రా స్తదపి త్వచ్చరితం విభో విచిత్రమ్. ౧౦౨

శ్లో. మృదుక్వణన్నూపురమన్థరేణ బాలేన పాదామ్బుజపల్లవేన,
అనుక్వణన్మఞ్జులవేణుగీత మాయాతి మే జీవిత మాత్తకేళి. ౭౭

మున్నగు శ్లోకములందలి భావములు దేవకీనందనశతకమునందలి ౪, ౫, ౧౬, ౧౭, ౨౫, ౨౬ ఇత్యాదిపద్యములందు ప్రతిబింబించుచున్నవి. తొంబదియవపద్యమందలి దీనావనవర్ణన శివానందలహరిలోని భావమును స్ఫురింపఁజేయుచున్నది. కవి పూర్వగ్రంథములనుండి భావములను సంగ్రహించి చిత్రరీతిని వ్యక్తముఁ జేసి రచనాచాతుర్యమును విశదముచేసెను.

శ్రీకృష్ణభక్తిభరిత మైన దేవకీనందనశతకమునందుఁ గల విశేషము నాంధ్రముఖస్థ మైన యీచాటుపద్యము విశదము చేయుచున్నది.

మ. అరయన్ శంతనుపుత్రుపై విదురుపైఁ • నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపయిన్ • నందవ్రజస్త్రీలపైఁ
బరగం గల్గు భవత్కృపారసము నాపైఁ గొంత రానిమ్ము మీ
చరణాబ్జంబుల నమ్మినాఁడ హరి కృష్ణా! దేవకీనందనా! ౯౭

శ్రీకృష్ణుఁడు యాదవవంశమునందు జన్మించి పాండవులను యాదవులను నుద్ధరించి ధర్మసంరక్షణమును జేసెను. భక్తప్రియుఁడైన శ్రీకృష్ణభగవానుఁడు పాండవుల నాపత్సముద్రమునుండి తనకృపాగరిమచే నుద్ధరించెను. గోపగోపికల నానందసాగరంబున నోలలాడించి లోకప్రియుఁడుగ మెలంగెను. మహాభారతమునందును శ్రీమద్భాగవతమునందును వివృతమైన భాగవతభక్తిని దేవకీనందనశతకముఖమునను శతకకర్త సంబోధించెను. సంసార

ప్రవృత్తియందు శృంగారలీలలు దుఃఖోపశమనమును సౌఖ్యానందమును గలుగఁజేయుటకు సులభసాధనములుగ నున్నవి. జీవేశ్వరసంబంధమునందును భక్తమాహేశ్వరలీలలందును సువ్యక్తమగు పరమభక్తిస్వభావము నాయికానాయకులచేష్టలందు గోచరంబగు శృంగారభక్తిభావమునను భక్తులు సంభావించుచుందురు. విశ్వేశ్వరుఁడు విశ్వమునకు తల్లియనియును తండ్రి యనియును సంభావించునటులు నాథుఁ డనియును సంభావించుటయు భక్తిపారవశ్యమునకు సాధనము.

భక్తిభావములందు ఆధ్యాత్మికపరములైన శృంగారలీలలు మోక్షమునకును ఆధిభౌతికపరములైన శృంగారలీలలు బంధనమునకును మూలము లగుచున్నవి. శృంగారలీలలకు కరుణారసము బీజముగ నున్నది. జగన్మోహనుని కరుణారసము సంసారప్రవృత్తియందుఁ బిపీలికాదిబ్రహ్మపర్యంతమును శృంగారవిలాసములందు వ్యక్తమగుచున్నది. విశ్వప్రవృత్తియందు కరుణారసానుభవమున కనన్యమైన భక్తియె సాధనముగ నున్నది. విశిష్టమైన భగవద్భక్తియందు శృంగారకరుణారసము వ్యక్తముగాఁగలవిధమును భారతభాగవతేతిహాసములు బోధించుచున్నవి. పాండవవిజయము. రాధామాధవవిహారములు గోపగోపీలీలావిలాసములు మనోహరమైన భక్తిశృంగారకరుణారసవిలసితములై పరమార్థమును బోధించుచున్నవి. భక్తవత్సలుని కరుణాస్వరూపుని శృంగారమూర్తిని దేవకీనందనుని శ్రీకృష్ణుని సంబోధించిన దేవకీనందనశతకము హృద్యమై ఆంధ్రప్రజాదరణమునకుఁ బాత్రమైనది. కవి దీనహృదయముతో భక్తితత్పరుఁడై శృంగారపరమైన భక్తిశతకమును శ్రీకృష్ణున కర్పించి శతకవాఙ్మయమునందు ప్రతిష్ఠను శ్రీకృష్ణప్రసాదమును బడసెను.

మ. శరణాగత్యనుకూల భక్తజనరక్షా సత్కృపాసేవ్య స
త్కరుణాపూరసుధారసంబు గల శృంగారంబు నీమూర్తియుం
దరణోపాయ మెఱుంగలేని కలుషాధారుండ నన్ం దావక
స్మరణాధీనునిఁ జేయ మ్రొక్కెదను కృష్ణా! దేవకీనందనా! ౯౪

దుందుభి పుష్య శుద్ధ
౨ బుధవారము. మద్రాసు.

కాశీనాథుని నాగేశ్వరరావు.

పాఠభేదములు:—ఈ శతకమును ముద్రించుటకు ముందుగా ఈ క్రింద కనఁబఱచిన వ్రాఁతప్రతులతో సంప్రతించుకొన్నా మని కృతజ్ఞతతో తెల్పు చున్నాము.

వ్రాఁతప్రతులు :—(1) (సం॥ ౧౬౭౯ గలది) బంటు పురుషోత్తముఁడు, అనువారిచే రుధిరోద్గారి సం॥ ఆషాఢ శు ౧ సోమవారము వ్రాయఁబడినది పరిసమాప్తముగాని ప్రతితో సరిచూడఁబడినది. (2) (సం॥ ౧౬౮౧)—రెండవకృతి. ఓరియంటల్ లైబ్రరి ప్రతి 13-4-29. ఖర సం॥ ఆషాఢ శు ౫. ప. స॥ 107. (3) అ. ఈచిన్నాముతో అచ్చుటచ్చుట నున్న పాఠభేదములు అడయారు లైబ్రరీలోనివి.

శ్రీ ర స్తు

—

# దేవకీనందనశతకము

శ్రీకైవల్యగణాధినాథ [౧]నిను సద్భక్తిం గీర్తనల్ సేసి కా
దా కంజాతభవేంద్రనారదశుకవ్యాసాంబరీషార్జునుల్
నీ కారుణ్యముఁ గాంచుటల్ వసుమతిన్ నే నెంతధన్యుండనో
నాకున్ [౨]జేకుఱె నట్టిభాగ్యములు కృష్ణా దేవకీనందనా. ౧

శా. శ్రీవైకుంఠనివాస గోత్రధర లక్ష్మీనాథ గోపాలలీ
లావిర్భావ పతంగవాహ యదువంశాంభోధిచంద్రోదయా
నీవే దిక్కని యున్నవాఁడను [3]దయన్ వీక్షించి రక్షింపవే
నావిజ్ఞాపనఁ జిత్తగించి మదిఁ గృ॥ ... ౨

శా. శ్రీరామావసుధాకళత్రములపైఁ జెన్నొందుపాదాబ్జముల్
గారామారఁగఁ [౪]జూచి శేష[౫]ఫణి దాఁ గౌతూహలం బొప్పఁగా
క్షీరాంభోనిధిఁ బవ్వళించి యమరుల్ సేవింపఁగా నొప్పు ని
న్నారాధింతు మదీయచిత్తమునఁ గృ॥ ... 3

శా. నీడల్ దేఱెడు చెక్కుటద్దములతో నిద్దంపునెమ్మోముతో
కూడీకూడని [౬]చిన్నికూఁకటులతో గోపార్భకశ్రేణితో
క్రీడాశూన్యకటీరమండలముతో [౭]వేడ్కన్ వినోదించుచు
న్నాఁడా శైశవమూర్తి నేఁ దలఁతుఁ గృ॥ ... ౪

---

(1) ౧. నిను. ౨. చేకుఱు. (2) 3. కృప వీక్షించి ప్రోవంగదే। నావాక్యంబుల నాదరింపఁగదె కృష్ణా. (3) ౪. జూచి. ౫. ఫణిపైఁ. (4) ౬. చిప్పకూఁకటులతో. ౭. వ్రేపల్లెలో నీవు నాఁడాడే శైశవ.

శా. అందెల్ చిన్నిపసిండి[1]గజ్జియలు మ్రోయన్ మేఖలాఘంటికల్
క్రందై ముద్దులరావిరేక నదుటన్ గంపింప గోపాంగనా
నందం బారగ వెన్నముద్దలకునై నర్తించు మీబాల్యపుం
జందం బాదివిజుల్ [2]నుతింపఁదగుఁ గృ ... ౫

శా. వేదోద్ధారకుఁగా [3]సుధాప్రదునిఁగా విశ్వంభరావాహుఁగా
వాదావిర్భవుఁగాఁ [4]ద్రయీవటువుఁగా వర్ధిష్ణుతాయుష్యుఁగాఁ
గోదండాశుగపాణిఁగా బలునిఁగా ఘోరవ్రతచ్ఛేదిఁగా
[5]నాదిబ్రహ్మముఁగాఁ దలంతు మదిఁ గృ ... ౬

మ. అమరు ల్మ్రొక్కులచే మునుల్ నుతులచే నార్యు ల్మహానిష్ఠచే
సమరోత్సాహజనుల్ పురశ్చరణచే సాధుల్ దయాంభోధిచే
సమితోదారకళాఢ్యు లర్పణముచే నధ్యాత్ము లైక్యంబుచే
సమతం గాంచిరి మీపదాబ్జములు కృ ... ౭

మ. జపముల్ సేయఁగ [6]నేర నీమమున నిచ్చ ల్పూజ గావింపలే
నుపవాసవ్రతభక్తిఁ [7]జొప్పెఱుఁగ వేదోక్తక్రమస్తుంగఁ గా
నపరాధంబులు నాయెడం దలఁచు నే నజ్ఞాని నెబ్భంగులన్
జపలుం డంచు నుపేక్ష సేయకుము కృ ... ౮

మ. సుకరంబై సురసేవ్యమై సులభమై సువ్యక్తమై సూక్తమై
ప్రకటంబై పరమాప్తమై ప్రమదమై ప్రద్యోతమై పథ్యమై
యకలంకామృతమై [8]యఘాపహరమై యానందమై యందమై
[9]సకలంబున్ ఫలియించు మీమహిమఁ గృ ... ౯

శా. కొండల్వంటి కవీశ్వరుల్ శతకము ల్గూర్పంగఁ గోటానకో
ట్లుండన్ నీవును జెప్పఁబూనితి వదేమో యంటివా వింటివా
వండే నేర్పులఁ బెక్కురీతుల రుచుల్ వర్తింపవే శాకము
ల్వండ న్నామన వాలకింపు మదిఁ గృ ... ౧౦

---

(౫) ౧. గజ్జెలును. ౨ నుతించెదరు. (౬) 3. సుధాప్రభవుఁగా. ౪. త్రిపాత్పరిభువుఁగా నర్థీకృతా. ౫. నాదిబ్రహ్మముఁ గల్కిఁ గాఁ దలఁతుఁ గృష్ణా. (౮) ౬. నోపనేమమున. ౭. చొప్పడదు. (౯) ౮. యఘౌఘహరమై. ౯. సకలంబై.

శా. చన్నే నిన్నును బాలుఁగాఁ దలఁచి యిచ్చెం బూతనాకాంత దాఁ
జన్ను ల్నిండఁగఁ జేదుఁ [1]బూసికొని యాచన్బాలు నీ కిచ్చినం
జన్నుంబాలకు లోనుగాక [2]యసురన్ సాధించి యాయింతికిన్
సన్నన్ ముక్తి నొసంగి తీవు భళి కృ ... ౧౧

## శృంగారరసము

మ. విలసిల్లం బదియాఱువేలసతులన్ వీక్షించి వారిండ్లలో
పల వర్తించుచు నుండి వీఁకఁ గల గోపస్త్రీలనెల్లం [3]గడున్
బలిమిం బట్టి రమించినాఁడవు భళీ ప్రాజ్ఞుండ [4]వీవే మహా
స్థలి నీవేకద కొంటెదేవరవు కృ ... ౧౨

మ. పొలుపొందన్ నడిరేయిఁ గుక్కుటరవంబుల్ సూపి గోపాలకా
వళి విభ్రాంతులఁ జేసి మందలకు నై వారేఁగఁ దత్కామినీ
కలనాయత్నము తామ చూడగతులన్ [5]గావించి నీకీర్తి ర
చ్చల కెక్కెం గదఁ గొంటెదేవరవు కృ ... ౧౩

మ. అనిరుద్ధాచ్యుత యీశ కేశవ ముకుందాధోక్షజోపేంద్ర వా
మన దామోదర చక్రపాణి హరి రామా [6]శౌరి శార్ఙ్గి జనా
ర్దన పీతాంబర భక్తవత్సల నమో దైత్యారి వైకుంఠవా
స నృసింహాంబుజనాభ ప్రోవు ననుఁ గృ ... ౧౪

మ. ఇల గోవర్ధన మెత్తితీ వనుచు బ్రహ్మేంద్రాదు [7]లెంతో నినుం
బలుమాఱు ల్నుతు లొప్పఁ జేసెదరు పద్మాక్షీ కుచాగ్రంబునం
జులుక న్నెత్తినరాధ నెన్న దిదిగో [8]సొంపొంద సత్కీర్తి ని
శ్చలపుణ్యాంబునఁ గాక చొప్పడునె కృ ... ౧౫

(11) ౧. బోసి. ౨. మనునిం జచ్చించి నీదాసులు జన్నుంబాలకు లోను గారు, ధరఁ గృష్ణా. (12) ౩. మహా. ౪. పౌరాఁ. (13) ౫. గావించు నీవృత్తి ర. (14) ౬. చార్ధశౌరీ. (15) ౭. లెన్నెన్ని భంగులఁ గీర్తింతురు గాని నిన్నుఁ ద్రిజగత్కాంతా. ౮. సొంపారు.

శా. హాళిం బింఛపుదండ మొప్పఁగ నటింపం గాను శృంగారపున్
శ్రీ లెంచంగను పిల్లఁగ్రోవి పమున్ జేకోలయున్ జెక్కుచున్
గేలన్ మై ప్పొదవింప గోపకులతోఁ గ్రీడాపరస్ఫూర్తి నీ
వాలం గాచువిధంబు నేఁ దలఁతుఁ గృ ॥ ... ౧౬

శా. పెచ్చుల్ ప్రేలుచుఁ బిల్లఁగ్రోవిరవమున్ బెంపొందఁగాఁ జొక్కుచున్
నిచ్చల్ నిన్ను భజించు గోపగణమున్ నిత్యోత్సవక్రీడమై
నిచ్చల్ మచ్చిక ముచ్చటచ్చపడఁగా నెన్నెంచి యాలించు నీ
సచ్చారిత్రము విన్నఁ బుణ్య మగుఁ గృ ॥ ... ౧౭

మ. కలలనాకుంచిత వేణువం దడవి మొల్లల్ జాఱఁ గస్తూరికా
తిలకంబుం గరఁగంగ చేతనగవుల్ దీపింప నెమ్మోమునన్
దళుకుం జెక్కులఁ జూపు లోరగిల నానానారీతులన్ వేణుపు
వ్కలనాదంబులసొంపుఁ జూపుదువు కృ ॥ ... ౧౮

మ. కల కాంచీమణికింకిణీమధురని క్వాణంబు మంజీరమం
జులరావంబును గోపకాంత వినవచ్చెన్ బట్ట లేనైతి నం
కిలి నిద్రించుట మోసపుచ్చె హితవాగ్గేయుండు నేఁ డుచు ని
చ్చలు మీచౌర్యము లెంచు గోపసతి కృ ॥ ... ౧౯

మ. కలనైనన్ నగిమైనఁ గోప మెనఁగంగా నైన మీనామని
ర్మలవర్ణద్వయ మేర్పడం దలఁచినం బాపౌఘము ల్నాయు ను
జ్జ్వలభానుప్రతిమానచండకిరణవ్రాతాహతిం జీకటుల్
చలనం బంది తొలంగుచందమునఁ గృ ॥ ... ౨౦

మ. నిను నెవ్వాఁడు దలంచు నీమహిమ వర్ణింపంగ నెవ్వాఁడు నే
ర్చునఁ బూనున్ నినుఁ గొల్చునట్టిఘనుఁడా పుణ్యాత్ములోకైకమా
న్యుఁడుగా ధన్యుఁడుగా వివేకనిధిగా సద్యద్గుణాంభోధిగా
ననిశంబుం గొనియాడఁ గోరుదురు కృ ॥ ... ౨౧

(16) ౧. .రొప్పు నటియింపన్. ౨. జెక్కుమున్. (17) 3. హెచ్చించి యాలించు.
(18) ౪. ౬౦. ౫. వేణియుం దడవి. ౬. దీండ్రిం ప. ౭. ఉల్లసిల. (20) ౮. మెవ్వఁడేఁ. ౯. భాను
ప్రథమాన. ౧. భానుప్రభభాసమాన. (21) ౧౦. గొల్చినట్టిజనుఁ డా. ౧౧. ననయంబుం

## శృంగారభక్తి

శా. శీలంబున్ ¹గులమున్ వివేకనిధి లక్ష్మీకాంతవక్షస్స్థలిన్
హేళిం బాయక యుండు కాముకుఁడవై యహంకారవృత్తిన్ సదా
²స్త్రీలోలుం డన రాధతోఁ బెనఁగుట ల్చిత్రంబులు న్నేర నీ
జాలం బే మని సన్నుతించెదను గృ ... ౨౨

శా. శ్రీలక్ష్మీనిభ రుక్మిణిం గలసి కూర్మిన్ మిత్రవిందా సుదం
తాలోలాక్షులఁ గూడి జాంబవతి సత్యన్ లక్షణాభద్రలన్
గాళిందిన్ ³మరుకేళిఁ దేల్చితివి శృంగారాంగగోపాంగనా
జాలంబున్ దనియింతువా రతులఁ గృ ... ౨౩

శా. మద్దు ల్గూల్చినలాగొ వేగ ననిలో మన్నించి గాండీవికిన్
బుద్ధుల్ సెప్పినలాగొ మోదరస ముప్పొంగన్ యశోదమ్మకున్
ముద్దుల్గా నటియించులాగొ వసుధన్ ముప్పేళలన్ వేడుకన్
జద్దు ల్మెక్కి రహించులాగొ ధరఁ గృ ... ౨౪

మ. చరణాబ్జంబులు వీక్షవడ న్నిలిచి మోజన్ దట్టిలోఁ బిల్లఁగ్రోల్
కర మొప్పారఁగ నుంచి ⁴యింపొదవఁ జంకన్ గోల ⁵నందిచ్చి ప
ల్వురు గోపాలురు చుట్టునుం గొలువ వేల్పు ల్గుక్కలున్ మ్రింగఁగా
⁶నరయం జల్ది భుజింపవే ⁷యడవిఁ గృ ... ౨౫

మ. మెఱుఁగు ⁸ద్దేఱుమహేంద్రనీలనిభ మామేనన్ సమీపాత్తగో
ఖురనిర్ధూతధరాపరాగలవపజ్జు ల్గప్పఁగా నొక్కచేఁ
⁹బురిగోలొక్కటఁ బాలకుండఁ గొనుచుం ¹⁰బాల్పొంద గోధుగ్జనాం
తరవర్తిష్ణుఁడ వైన నిన్ ¹¹గొలుతుఁ గృ ... ౨౬

---

(22) ౧. గుణంబు గల. ౨. శ్రీలోలుండవు. (23) ౩. సుఖకేళి నేలి వన. (25) ౪. యేపొదవ. ౫. సంధించి. ౬. సరసాన్నంబు. ౭. మచటఁ. (26) ౮. ల్మీఱు. ౯. మురిగోలొక్కటు. ౧౦. మహ్వొంగి. ౧౧. దలఁతు.

శా. ఆధివ్యాధిహరంబు జన్మమరణ[1]వ్యాపారదుష్కర్మదు
ర్బోధవ్యాప్తినివారణంబు సతతస్ఫూర్జజ్జగద్రక్షణో
త్సేధాయుక్తము భక్తవాంఛితఫలాసీకప్రథానైకదీ
క్షాధౌరేయము నీమహామహిమ కృ । ... ౨౭

శా. హాలాహలశిరోధి వహాళి-నయనో[2]ద్యద్ధ్భమధూమధ్వజ
జ్వాలాభీలకరాళకూటవిషని[3]శ్శ్వాసోష్ణకృష్ణాంబుదం
భోభాస్వరకాళియస్ఫుటఫణాభోగాగ్రమధ్యంబునన్
హాళిం దాండవమాడు చుందువఁటె! కృ । ... ౨౮

మ. తినదే చెట్టున నాకు మేఁక, గుహఁగొందిం బాము నిద్రింపదే,
వనవాసంబునఁ బక్షులున్ మృగములున్ వర్తింపవే, నీటిలో
మునుకల్ వేయవె మత్స్యకచ్ఛపములున్ మోక్షార్థమాముక్తికిన్
మనసే మూలము నీదుభక్తులకుఁ గృ । ... ౨౯

శా. [4]వింటిన్ గొంతగ మీమహత్త్వములు నుర్విన్ దర్పసంప్రాప్తిచే
ఘంటాకర్ణుని నుగ్రసేనతనయుం గైవల్య[5]తేజంబు ని
న్నంటం జేయవె మాటమాత్రమున ని ట్లాశ్చర్యమున్ బొందఁగా
[6]జంటం బొందని వేల్పు నిన్ [7]గొలుతుఁ గృ । ... 30

మ. విలసత్కావ్యకళా[8]ధురీణతలు తద్విద్యాపరిజ్ఞానవే
త్తలకుం గాక వివేల [9]మూర్ఖులకు సిద్ధం బెందు భాగీరథీ
దళితాంభోరుహషండ[10]మండితమరందద్రాగాసమాధుర్యవాం
ఛలు జోరీఁగల కేల తేంట్లగతిఁ గృ । ... 3౧

---

(27) ౧. వ్యాపాది. (28) ౨. గోధినయనో. 3. తీక్ష్ణాంశుజాంభోలీలా. (30) ౪. వింటేఁ గ్రొత్తలు నీమహత్త్వములు పృథ్వి. ౫. తేజంబున. ౬. జంటంబల్కిన పల్కు. ౭. బొగడఁ. (31) ౮. రసజ్ఞతలు తద్విద్యాపరిశ్రామవే. ౯. మూఢులకు సిద్ధం బెందు. ౧౦. సంభవ.

## శ్రీకృష్ణ నిగ్రహానుగ్రహము

మ. చతురంభోధిపరీతభూవలయ[౧]రాజానీకకోటీరరం
జితమాణిక్యవిరాజమానపదరాజీవుండు ధర్మాత్మజుం
డతి[౨] కారుణ్యముతోడ మత్స్యపతికొల్వాసింపఁడే నీదు శా
శ్వతకారుణ్యము గల్గునంతకును గృ॥ ... 3౨

మ. శుకనగ్నాతమకణ్వ[3]కౌత్సజమదగ్న్యోదంకశాండిల్యశౌ
నకపారాశరకాశ్యపాత్రిఘటజాహ్వేంద్రప్రభూతత్రియం
బకకంజోద్భవనారదాదిమునిహృత్పంకేజసామ్యాప్తిపా
స కృపాసాగర నీకు మ్రొక్కెదను గృ॥ ... 33

మ. [౪]వివిధోగ్ర స్తవన[౫]ప్రచండబలవిద్వేషావనీనాయకో
త్సవ[౬]భంజీకృతచాపుఁ డర్జునుఁడు దోస్సత్త్వుండు మత్స్యావనీ
ధవు గేహంబున నాట్యతాళధరి యై తా నిల్వఁడే సన్ముని
స్తవ నీసత్కృప గల్గునంతకును గృ॥ ... 3౪

మ. బలభేదిన్ నలయించి ఖాండవవనిన్ భస్మంబు గావించి ము
న్నలమిన్ దైత్యులఁ ద్రుంచి యొక్కట శివున్ నిర్జించి కౌరవ్యులన్
బలి గావించి కిరీటి బోయలకు గోపస్త్రీల నొప్పింపఁడే
యల నీతేజము నీవు గైకొనినఁ గృ॥ ... 3౫

మ. బలవద్వైరినృపాలఫాలఫలకప్రత్యగ్రరక్తచ్ఛటా
కలితోదారగదావిజృంభణభుజాగర్వంబు భీముండు కు
క్కలకుం జూపఁడె యేకచక్రపురభీత్యావేళ యుష్మత్సము
జ్జ్వలకారుణ్యము గల్గునంతకును గృ॥ ... 3౬

---

(౩౨) ౧. రాజత్కోటి. ౨. కార్పణ్యముతోడ (ఇది మూలములో నుండఁదగును). (౩౩) 3. వత్సజమదగ్న్యోదంక. (౩౪) ౪. వివిధోగ్రాంతరగణప్రచండ (వివిధోగ్ర స్ఫురణప్రచండ). ౫. వివిధోగ్రాస్తరణ అని యున్నది. ౬. భంజితస్థిరచాపుఁ డర్జునుఁడు.

మ. అతిసౌందర్యసమగ్రధైర్యఘనశౌర్యస్ఫూర్తియుం గీర్తియు
న్నతులప్రాభవరేఖయున్ గలుగ భాగ్యశ్రీ బెన్నఁగా ఘోటక
ప్రతతిం దిద్దఁగ నిత్యమున్ నకులుఁ డింపారంగ నీసత్కృపన్
సత మానంతకు రాజ్యవైభవము కృ॥ ... ౩౭

మ. బకదైతేయుమహాబలున్ సనుఁ భూభాగంబునన్ వాయుపు
త్రకుఁ ద్రుంచిన నేకచక్రపురివారల్ మెచ్చి యింటింట కం
టకము ల్వెట్టిరిగాని భిక్ష యనుమాటన్ మాన్పలేరైరి యం
తకు వారల్ గాంచఁ లేమి చాలుటకుఁ గృ॥ ... ౩౮

మ. గహనావాసములోన నన్నలకుఁ దా గారాబుతమ్ముండు నై
విహరించె తఱి భావికాలగతి సంశ్వేషించుచున్ శౌర్యసం
గ్రహుఁడై యాపులఁ గాచె మత్స్యపురిలోఁ గర్మానుగుణ్యక్రియ
న్సహదేవుం డటధైర్యమార్గమునఁ గృ॥ ... ౩౯

మ. వినుతానేకతురంగవారణ ధోర్వీనాథదీవ్యన్నికే
తనచక్రధ్వజచామరాదిమహితోద్యత్ప్రాభవుం డై సుయో
ధనుఁ డేకాకియుఁ బాదచారియును నై దర్పంబు వోనాడెనే
జనుఁ డెట్లో తలంచిచూడఁగను గృ॥ ... ౪౦

శా. రక్షింపం గదగుపీరుఁ డెవ్వఁ డిల నీరాజుల్ వృథా తేజులే
మోక్ష శ్రీ యొసఁగన్ విభుం డెవఁడు వే మోహాకృతిన్ దేవతల్
రక్షోజాత శుభప్రధానగరిమన్ రాజిల్లు రాజేంద్రులన్
సాక్షాద్బ్రహ్మము నీవె ధన్యులకుఁ గృ॥ ... ౪౧

---

(37) ౧. నీతియు. ౨. బెన్న మత్స్యేంద్రువాహాహతిం ౩. మత్స్యేంద్రువాహతతిన్. 3. డింపారంగ. (38) ౪. కంటకము ల్పెట్టిరిగాని యేమొసఁగి రాడ స్వేదలై యుండి యంతకునుం జాలినవార లేమియెడఁ గృష్ణా. ౫. కంటకముల్ చూపిరి గాని యే మొసఁగి కాడన్ ఖేదలై యిండ్లపంచకుఁ జేరంజనువార లేమియెడఁ గృష్ణా - అని యున్నది. (39) ౬. నందు. ౭. తమ్ముండనన్. (40) ౮. తనచంచద్ధ్వజ, చామరప్రకటితోద్యత్ప్రాభవుం డాసుయో. (41) ౯. గలధీరు లెవ్వరును లే. ౧౦. రక్షా మోక్షసుఖప్రదాన మహిమన్ రంజిల్లు.

మ. ౧కాలిచేదిన్ వగలేకనే నశిగితే। కోపించు టీలేకనే
చెలువం బెప్పట కోకనే విభవముల్। చేకూరుటల్ రాకనే
బలవంతుం డగుసుయూకనే సతి చెతున్। ప్రాణేసుం గైకోకనే
జలదశ్యాముల శంఖచక్రధర కృ। ... ౪౨

మ. బలశౌర్యోన్నతి శత్రులం గెలిచి సప్తద్వీపవిశ్వంభరా
స్థలి ౨నేలించి సమస్తవైభవములన్। ౩దీపించి దిక్పాలకా
వళి కీర్తింప మెలంగునైషధుండు। దా వర్తింపఁడే తొల్లి పం
టలవాఁడై ఋతుపర్ణుచెంగటను కృ। ... ౪౩

## శ్రీకృష్ణకటాక్షము

మ. ధరలో గోళకుండైనపాండునికి శత్రంబందు వేశ్యల యే
పురకున్ ౪బుట్టినపాండునందనులు దివ్య ౫ల్మెచ్చ వర్తింపఁ ద
చ్చరితం బంతయు భారతం ౬బని ప్రశస్తం బయ్యె నీనామసం
స్మరణప్రౌఢిమఁ గాదె ౭యాఘనత కృ। ... ౪౪

మ. క్రతువుల్ నూఱొనరించి యింద్రపదవి। నర్హించి యింద్రాశికై
ధృతిదూలన్ ౮మదనెచ్చఁగా నహుషుఁ డర్హద్దేవేంద్రభోగానుసం
గతిగాఁ గోరినఁ గుంభసంభవుఁడు ౧౦గికన్యం దిట్టినం జెందఁడే
సతతంబుం బెనుఁబాముచందమునఁ కృ। ... ౪౫

మ. ౧౧ఘనులన్నీచుల నీచులన్ఘనుల సత్కారార్హులన్ దుష్క్రియా
జనితోద్యోగుల నర్థవంతులను భిక్షాయుక్తులన్ భిక్షులన్
ధనికవ్రాతముగా నొనర్చుచును నిత్యంబున్ మహాగారడం
బని నందించువినోదరాయ హరి కృ। ... ౪౬

---

(42) ౧. ఈపద్యము ఇతరతాళపత్త్రగ్రంథములలో లేదు. (43) ౨. ఏలిం
చి. 3. దర్పించి. (44) ౪. బుట్టిల. ౫. ల్మెచ్చి వర్ణింప. ౬. బనఁ. ౭. యారయఁగ.
(45) ౮. మరులెచ్చఁగా. ౯. దేవేంద్రభోగంబు సంగతితోఁ గోరిన. ౧౦. వీకన్.
(46) ౧౧. ఈపద్యమును దాళపత్త్రగ్రంథములో లేదు.

## భక్తరక్షణము

శా. శ్రీలక్ష్మీధవ వాసుదేవ వరరాజీవాక్ష పద్మాసనా
వ్యాళాధీశ్వరశర్వషణ్ముఖశుకాద్యస్తోత్రసత్పాత్ర [౧]గో
పాలానీకముఖాబ్జభాస్కర కృపాపాథోధి నన్ గావు మూ
ర్ధాలంకారమయూరపింఛధర కృ॥ ... ౪౭

మ. పతులైదేవురు నెన్నఁగాఁ గలిగి భూపాలాంగనానీకముల్
సతతంబున్ గనుసన్నలన్ మెలఁగు చైశ్వర్యంబులో నున్న తా
నతిభక్తిం [౨]జని యాసుదేష్ణకును జేయం బూనదే ద్రౌపదీ
సతి యాశ్చర్యము మీవిలాస మిల కృ॥ ... ౪౮

శా. మీ[౩]సామర్థ్యము గల్గునంతకుచు నేమింబాండుసూనుండు నా
యాసం [౪]బొంది మహాక్షుభితంబుగ విరాటాధీశుపట్టణంబులో
గ్రాసోపాయము లేక [౫]భిక్షు మనుగం గాషాయముం బూని [౬]స
న్న్యాసంబున్ ధరియింపఁడే యచటఁ గృ॥ ... ౪౯

మ. విరటుం [౭]గొల్చినవాఁడు నొక్కఁడిలఁ బృథ్వీనాథులన్ [౮]గూల్చి సం
గరభూమిన్ ఘనవైరివీరతతులన్ గారించుచున్ ద్రుంచి [౯]యి
ద్ధరకున్నగ్రజు రాజు[౧౦]జేసియుఁదుదిన్ దానీకృపం[౧౧]బాయుటల్
[౧౨]సరిపోదే భువి నింద్రసూనుధృతి కృ॥ ... ౫౦

మ. అమరుల్పద్మజు వ్రాఁతదాఁటి యుపుడొక్కబ్దంబు[౧౩]ప్రొద్దయ్యె దు
ర్దమదోర్దండపటుప్రతాపనిజసంరంభామరానీకవి
క్రమకుర్వారగజాసురప్రళయ మింకం [౧౪]జేయ ఫాలాక్షునిన్
సమరక్షోణి జయించె నర్జునుఁడు కృ॥ ... ౫౧

---

(47) ౧. గోపాల. (48) ౨. బని (49) ౩. సాహాయ్యము. ౪. బొంది జగద్ధితంబుగ. ౫. భైక్షు. ౬. సన్న్యాసత్వంబు ధరింపఁడే. (50) ౭. గొల్చినవాఁడె యొక్కమరి. ౮. గెల్చి. ౯. యుద్ధరకుం ధర్మజు. ౧౦. జేసిన. ౧౧. జేయవే. ౧౨. సరిపోయెన్ భువి. (51) ౧౩. నేఁడయ్యె. ౧౪. జేయు నాయీశ్వరున్. అ. జేయున ట్లీశ్వరున్.

శా. అక్రూరాత్మకులైనపాండవులబా[1]హాశక్తిఁయున్ ధాత్రి ని
ర్వక్రంబయ్యె ననట్లుసేతు ననుచున్ । వాత్సల్య[2]మింపొంద నా
[3]శక్రాత్మోద్భవు తేరిపై దురమునన్ । సారథ్యముం జేసితో
చక్రీ! నీమునికోలకున్ జయము కృ । ... ౫౨

శా. [4]గంభీరంబుగ రాయబారగరిమం । గాంతేయ కార్యార్థనై
శుంభల్లీలల ధార్తరాష్ట్ర[5]సభలో । సూచించి తద్వాక్యము
[6]ల్సంభాషింపఁగ వారవజ్ఞ దలఁపన్ । సర్వంబు నీవైనచో
శంభుండే యెఱుఁగున్ భవన్మహిమ కృ । ... ౫౩

మ. హరి దామ్రుచ్ఛిలి మంటిబెడ్డఁ దిని నమ్మాయందు రాముండు స
త్వాలీలం బలుకెంచి చెప్పిన యశోదాదేవి ధట్టించి ము
దరనిన్ బెట్టుక నోరు చూపు మనిన । బ్రహ్మాండము ల్వక్త్రగ
హ్వరమార్గంబునఁ గుక్షిఁ జూపితివి కృ । ... ౫౪

శా. ఏలా విద్యలు పెంపు రూపవిభవం । బేలా కులీనత్వమున్
శీలత్వంబును నేల యే[7]కి వయశ్శ్రీ యేల బాహాబలం
బేలా చాతురి [8]మీకృపాగరిమ నిర్వేపంబు లేకుండినన్
జాలిం బొందినఁ గల్గునే సిరులు కృ । ... ౫౫

శా. సర్వజ్ఞుండును సర్వలోకగురుఁడున్ । సర్వంసహానాథుఁడున్
[9]సర్వేశుండును సర్వసాధకుఁడు సా । సర్వేశ నీమూర్తి దా
సర్వంబు న్గలిగించుఁ బెంచు నణఁచున్ సందేహ మేలా [10]స్మృతుల్
'సర్వం విష్ణుమయం జగ' త్తనఁగఁ గృ । ... ౫౬

---

(౫౨) ౧. యిద్ధాత్రి. ౨. ముప్పొంగ. ౩. శక్రాంశోద్భవు. (౫౩) ౪. గంభీరమ్ముగు. ౫. సభలో సూచింపఁ దద్వాక్యముల్. ౬. సంభావింపకవాఁ డవజ్ఞ. (౫౫) ౭. ఇది యేల. ౮. సత్కృపాగరిమ ని న్వీక్షింప లేకుండినన్. (౫౬) ౯. సర్వస్థుండును. ౧౦. శ్రుతుల్.

మ. పుడమిన్ [1]బెద్దలబోటివారి నడుగం । బోరాదె చోద్యంబు పా
ల్కడలిన్ [2]గల్గినముద్దరాలు గలుగం । గా బుట్టి కాలబునన్
[3]బడవెల్లన్ గడుఁ దగ్గి [4]దానవునితో । బొంకైనమాటాడి మున్
డుగు ల్నేలను వేడఁగాఁ జనవె కృ । ...  ౫౭

శా. రంగత్పౌత్రిభీమ భార్గవుం గెలిచి కౌరవ్యుల్ భయం బంద వీ
రాంగంబుం ధరియించి జీవము సతంబై యుండ వర్తించు నా
గాంగేయుండు శిఖండిచేతఁ దెగె నీ । కారుణ్యముం దప్పియుం
డంగా మృత్యువుధాటి కోపుమరె కృ । ...  ౫౮

శా. అక్రూరస్థితి నుండఁగా వలయు రా । జాస్థానమధ్యంబునన్
వక్రింపం బనిలేదు ధర్మమునకై । వర్తింపఁగాఁ బోయినన్
శుక్రాచార్యునికన్నుఁ బో [5]డఁపవే । సూటిన్ గుశాగ్రంబునన్
జక్రీ నీకరపంకజాంతరము కృ । ...  ౫౯

మ. వరసౌందర్యవివేకధైర్యవినయ । వ్యాపారధౌరేయుఁడీ
ధరణీనాయకరత్న [6]మంచు మహితార్థం బాశ్రితశ్రేణికిన్
స్థిరసామ్రాజ్యవిభుత్వ మాధునివసకున్ । దేజంబు గా నిచ్చి తా
సరణిన్ మీకృప గల్గువాఁ డగుటఁ గృ । ...  ౬౦

శా. ధారాపూర్వము గాఁగ సంయమికి స । ప్తద్వీపముల్ సూనృత
ప్రారంభంబున నిచ్చి చేతితడి యా । అన్ లేక [7]వర్తింపఁడే
శారీరార్థము గాఁగ భైక్షము హరి । శ్చంద్రుండు సంసారని
స్సారశ్రీ నిటువంటి వెవ్వరికిఁ గృ । ...  ౬౧

(57) ౧. బెద్దలు(బేదలు)దొడ్డవారినడఁగం బోవేమి. ౨. బుట్టిన. 3. కర్మంబునన్. ౪. ఒడలెల్లన్. ౫. దానవు ఖలు న్మొక్కల్పని నీవు మూ. (59) ౬. బొడుచవే. (60) ౭. వాక్చాతుర్య. ౮. మిచ్చును. (1) ౯. భక్షింపఁడే, భిక్షింపఁడే. ౧౦. హరిశ్చంద్రుండు లేదొర సంసారశ్రీ నిటువంటి వెవ్వరికిఁ గృష్ణా.

మ. పటుబాహాబలసత్త్వనైఖరుల దిక్పాలుర్ ప్రశంసించునం
తటివాఁడయ్యుఁ ద్రిశంకునందనుఁడు కాంతారత్నమున్ విక్రయిం
చుటలున్ నీమహిమంబుచేఁగద యిటుల్లాశ్చర్యమే మర్త్యు లెం
తటివారైనను నేమి చేసెదరు కృ ॥ ... ౬౨

మ. తనశౌర్యోన్నతి యుగ్రసాధనముగా దాక్షాయణీశున్ శివున్
దనరన్ మెచ్చఁగఁజేసి లోకము జయస్తంభంబు గావించినన్
మును దాఁ జేసినకర్మవార్ధి ఘనమై ముంపం గడుంబాలుచేఁ
జనఁడే దుర్దశ విక్రమార్కుఁ డిలఁ గృ ॥ ... ౬౩

మ. తెగువ న్నిర్జరులన్ జయించుచు మదోద్రేకంబునన్ గానలో
మృగనేత్రన్ ధరణీతనూజ నసురుల్మెచ్చ న్వడిం దెచ్చి న
న్వగలం బెట్టి విధిప్రయత్నమున నిర్వంశంబుగా ౩రాముచే
జగతిం గూలఁడె యాదశాననుఁడు కృ ॥ ... ౬౪

మ. పరనారీహరణం బొనర్చినమహాపాపాత్ముఁ డారావణుం
డరయ న్నాతనితమ్ముఁ డైనదనుజుం డత్యంతసద్భక్తిమై
శరణన్నం దయఁ జూచి యగ్రజునిరాజ్యం బిచ్చి రక్షింప వా
౪సరణిన్ నీపదభక్తినే ఘనము కృ ॥ ... ౬౫

మ. నెఱిచైనన్ మఱచైనఁ గార్యమునటిన్ ౫వేసారుచున్నైన నా
దరమొప్పైనను మాయనైన నృపతుల్ దండింపఁగా నైననున్
బరిహాసంబున నైన మిమ్ము నుడువం బ్రాపించుపుణ్యాత్మకుల్
నరకావాసముఁ జెంద రాఘువులు కృ ॥ ... ౬౬

మ. నొసలం గన్ను గలయ్యగాదె సతి నంతోభక్తిసోఁ జూడఁగా
నిసుమంతైన భయంబు లేక తలమీఁ దెక్కన్న దెట్లన్న నీ
వసుధన్ భర్తలు స్త్రీల కెవ్వరయినన్ వశ్యాత్ములై మట్టు లే
కను మియ్యం దల కెక్కుకుదురరె కృ ॥ ... ౬౭

(62) ౧. విక్రయం బటు గావింపఁడే మీ మహామహిమ లత్యాశ్చర్యముల్. (63) ౨. మహేశుని. (64) 3. మర్త్యుచే. (6 ) ౪. సరవిన్. (6 ) ౫. వేసారుచో నైన. ౬. మందైనను. ౭. పుణ్యంబులన్. (67) ౮. న్నదట్లాగ యీ.

మ. కరితోఁ దోమ మృగేంద్రుతో ౧నరుఁడు బంగారంబుతోఁ గంచు భా
స్కరుతో మిణ్గుఱుఁబుర్వు కల్పకముతోఁ గానుంగు రత్నాకరే
శ్వరుతో నూషరపల్వలంబు సురశేషస్వామితో ౨మిడ్డయున్
౩సరి యైనన్ సరి యన్యదైవములు కృ॥ ... ౬౮

మ. ౪నుతలోకప్రతిసృష్టనిర్మలకళానూతాబ్జగర్భున్ మహా
ప్రతిభున్ గాశికుఁ గుక్కమాంసము భుజింపంజేసి మాలాతనిన్
బ్రతిమాలింపవె చండచండతరక్షుద్బాధ౫త్వంబు ప్రాణ్మాలు నా
శతగా నెవ్వరి కేమి సేయ వీఁకఁ గృ॥ ... ౬౯

మ. వరభోగాధ్వరదానధర్మ౬గుణముల్ వర్జించి తృష్ణారతిన్
౭నరు లత్యంతవిమూఢలోభ౮మతులై నారీరతిం గూర్తురాఁ
౯దరముం గానిధనంబు ౧౦తస్కరనరున్ ధాత్రీశులుం జేకొనన్
సరఘువ్రాతము చేర్చు తేనె క్రియఁ గృ॥ ... ౭౦

మ. ఖలవాక్యప్రతిపాలకుల్ పరధనాకాంక్షుల్ పరస్త్రీరతుల్
కులధర్మాఘనిబద్ధచిత్తులు నయాకూపారపారంగతుల్
కలుషుల్ రాజులు వారి సేవకుల౧౧కెల్లం గల్గు నత్యంతని
శ్చలసౌఖ్యంబులు నిన్భజింపఁగను గృ॥ ... ౭౧

శా. బొంకు ల్లక్షలు ౧౨నిత్యసంభరితసంభోగారతుల్ దుర్మదా
హంకారంబులు కోట్లసంఖ్యయగు మోహంబా యనంతంబు దు
౧౩ష్పంకాభార మపార మిన్ని గలభూపవ్రాతసర్పావళి ని
శ్శంకం బ్రాజ్ఞులు చేర నోపుదురె కృ॥ ... ౭౨

---

(68) ౧. నలుఁడు. ౨. డుండుభుల్. 3. సరియా నీసరి యన్యదై. (69) ౪. నుతసృష్టిం బ్రతిసృష్టి నిర్మిత. ౫. క్షుత్తీవ్రమల్ రెండునా. (70) ౬. నియతిన్. ౭. నరుఁ డత్యంత. ౮. మతియై నానాగతిం. ౯. తరముల్. ౧౦. తస్కరవరుల్. (71) ౧౧. కేలా. (72) ౧౨. బింకము ల్బహుశతంబుల్ జంకెనల్. ౧౩. ష్పంకాచార.

శా. చీమల్ పుట్టలు వెట్టుచుండ [౧]నవి విస్తీర్ణంబు [౨]గావించినన్
పాముల్ [౩]చేరినరీతి లోభిజనసంపన్నార్థరాసుల్ వృథా
[౪]భూమీపాలురపాలుగాఁగఁ గనియుం బుణ్యంబు లే లొల్లరో!
సామాన్యంబె ధనాశ [౫]నాథులకుఁ గృ|| ... ౭౩

మ. కొదవై జేపటినీడచందమున [౬]నిచ్చల్ స్రుక్కి దుష్టాత్మసం
పద పెంపై ధర నిల్వ[౭]దించుకయు సౌభాగ్యప్రభాభాసి యై
పొదలున్ మాపటినీడకైవడి భవత్పూజా[౮]విధేయుండై
సదయుం డైనను లేమి చేకుఱునె కృ|| ... ౭౪

శా. కీడున్ మేలును వచ్చుఁ గాలవశతం గ్రీడాగతిన్ జోకలై
యోడన్ వచ్చును బండ్లు నెక్కడ ధరం దొక్కఁబ్బడాబండ్లపై
నోడల్ [౯]సాఁగద దేశకాలగతి శీతోష్ణంబు లీరీతి నా
జాడన్ వచ్చును దుఃఖసౌఖ్యములు కృ|| ... ౭౫

శా. అంతశ్శత్రుల గెల్వలేరు మమతాహంకారము ల్మానలే
రంతర్మూర్ఖము వీడలేరు భవదీయాంఘ్రిద్వయీచింత నా
చింతారత్నముఁ గానలే రిలను దుశ్చిత్తు ల్వృథా వేదవే
దాంతంబుల్ చదువంగ నేమి యగుఁ గృ|| ... ౭౬

శా. నానా వేదపురాణశాస్త్రముల నానందింపఁగా [౧౦]నిత్య మిం
పౌ నార్యు ల్వినుతింప ధార్మికరహస్యంబు ల్వినన్ వచ్చు సా
[౧౧]మీనానామాంకభవద్వివేకులకు మున్నాశ్చర్యమే సత్వరా
జ్ఞానాధిక్యము గాని ముక్తిఁ గనఁ గృ|| ... ౭౭

---

(73) ౧. మతి. ౨. గావచ్చినన్. 3. జేరొనురీతి. ౪. భూమీశు ల్గాని పోవఁగా సకట దా పుణ్యం. ౫. మర్త్యులకు. (74) ౬. నిక్కల్. ౭. డెంచఁగను సద్భాగ్యంబు భాసిల్లుచుం. ౮. విధేయాత్ముఁడున్. (75) ౯. వచ్చును. (77) ౧౦. వచ్చు నిచ్చల్. ౧౧. నానాలీకభవాదిమానులకు నైనన్ శక్య మా తావక జ్ఞానాధిక్యముఁ గాంచి ముక్తిఁ గనఁ గృష్ణా.

శా. గర్త్రాలన్ బెను కానలన్ గుహల గంగాసింధుదేశంబులన్
వర్త్రాతాక్షుల దేహమెల్లఁ ౧జెడఁగన్ వర్తించినన్ మేరువున్
చిత్రా యేఁబదిమార్లు మెట్టిన మనశ్శుద్ధుండు గాకుండినన్
చిత్రా వానిప్రయాస మంతయును కృ ... ౭౮

శా. గంగాజన్మపదాబ్జమందు ౨నభిషేకంబు ల్సదా గాంచెదన్
సంగారార్చన చేసి యేరణమునన్ సర్పింతు సంభోధరా
శృంగారాధిప కౌస్తుభాభరణ యేశృంగారముల్ చేతు మీ
కంగీకారము గాఁగ నాతరమె కృ ... ౭౯

మ. అతిమోహాంధులఁ బాపకర్ముల మహాహంకారులన్ దోషదూ
షితులన్ గర్వితి౩దుర్విచారులఁ బ్రశంసింపంగ నాశక్యమా
వితతివ్యాప్తిదనంబు లేగెఁ ద్రిజగద్విఖ్యాతయుష్మత్సము
న్నతసేవాభిముఖుండనైతి నికఁ గృ ... ౮౦

మ. పలుమా ఱైహికభోగకాంక్ష సభలన్ బాండిత్యముల్ సేయువా
౪రలయజ్ఞానము మాన్పఁగాఁ గలరె యెట్లన్నన్ బ్రకాశించుకో
మలదీపాళిఁ దొలంగఁ ద్రోయునె భవన్మాయాంధకారంబు ను
జ్జ్వలితానందమయస్వరూపయుత కృ ... ౮౧

మ. ౫ఉఱిదిం బాఱునుమహానదీజలము ౬లాయూరూరునందెల్లఁ గూ
డురుఘోషంబున వంకలై కలియఁగా యోగ్యంబులైనట్లు మీ
స్మరణల్ మాయిరువుల్ సదా శుభములై సంపూజ్యముల్ గా భవ
చ్చరణంబుల్ మది నిల్పి కొల్చెదను కృ ... ౮౨

(78) ౧. బడలన్. (79) ౨. ౯భిషేకం జేమిగావించెదన్, సంగారాధన నేవిధిం జలుపఁగా సర్పింతు సజ్జోదరా. (80) ౩. దుర్విదగ్ధుల. (81) ౪. రిల సజ్ఞానమడంపఁగాఁగలరె యింటింటం బ్రకాశించును! జ్వలదీపాళి యడంగఁజేయునె. (82) ౫. ఈ పద్యము అన్ని ప్రతులలో రెండవదిగా నున్నది. ౬. ఉరుడింబారు. ౭. లో నూరూర. ౮. వంతెల్ల.

శా బాలక్రీడలఁ గొన్నినాళ్లు పిదపన్ । భామాకుచాలింగనా
లోలాభ్యున్నతిఁ గొన్నినాళ్లు మఱియుఁ ల్లున్ ¹మ్రుంగిబెం గొన్నినా
ళ్లీలీలన్ విహరించితిన్ సుఖఫలం । ²బెందేనియున్ లేదుగా
³చాలున్ నీపదభక్తిఁ జేసెదను గృ ।... ౮3

మ.మతిలోమిమ్ముఁ దలంచుపుణ్యుఁ డిల ⁴సా । మాన్యుండు గాఁ డాతఁ డే
వెతలం బొర్లఁడు భాగ్యవంతుఁ డగుఁ । విన్ దివ్యమృష్టాన్నసం
⁵గతిఁ బోనాడి మనుండు భిక్షము నొసంగన్ నేర్చునే శూలభృ
చ్ఛతురాస్యప్రముఖామరప్రణుత కృ ।... ౮౪

శా.అన్నం బైనను దక్షమైనఁ దగుతో । యం బైన నభ్యాగతుల్
దన్నాశించిన నేరియు న్నిడక యే । ధర్మంబునుం జేయ కే
మన్న న్నారకయుండుజీవశవమ । ర్త్యశ్రేణి యిద్ధాత్రిపైఁ
జన్న న్నేమగు నున్న నే మగును గృ ।... ౮౫

శా.ప్రారబ్ధానుభవంబు దీఱ కపవ । ర్గప్రాప్తి లేదండ్రుగా
ధీరశ్రేష్ఠు లనంత ⁶కోటు లిక నై । తే వారికర్మంబులున్
బ్రారబ్ధంబులు గావె ముందరికి నో । భావజ్ఞ ⁷సైరించి నా
ప్రారబ్ధంబుఁ లఁ దీర్పవే కరుణఁ గృ ।... ౮౬

శా.¹⁰శ్రీజన్మప్రభుతావిశేషుఁ డగురా । ¹¹జేంద్రుండు ధీపాలనా
జ్ఞాజాగ్ర ¹²త్త్వరిదానకీర్తిహితర । త్నాద్యక్షుణాధుర్యుఁ డై
రాజిల్లుం బహుకష్టుఁ డైన ధర సా । మ్రాజ్యంబుఁ బాలించుచో
నైజంబై తగునా విశేషములు కృ ।... ౮౭

---

(83) ౧. ముంగిలై. ౨. బెం దేనియున్. 3. చాలున్ నీపదభక్తిఁ జేము మీకఁ గృష్ణా. (84) ౪. భజించు. ౫. సామాన్యాపరాశోధనన్. ౬. గతి పోనాడి ఘనుండు భైక్షు మడుగంగా. (86) ౭. కోటిజని నైతిం దీఱ వీక్షర్మముల్. ౮. నాసంచిత ౯. లడంపవే. (87) ౧౦. ఆజన్మ ౧౧. జై తే ధరా. ౧౨. ద్వార.

మ. సమరద్వేషులసంగరాంగణములన్ । సాధించి సామ్రాజ్యసౌ
ఖ్యముఁ దాఁ గాంచి [౧]వహించుచోఁ బటువివేకప్రాజ్ఞతల్గాంచుభూ
రమణశ్రేష్ఠుఁడు తావకాంశభవుఁడై । రాణించు శిక్షించు దు
ష్టమతి [౨]భ్రష్టమదాంధశత్రువులఁ గృ । ... ౮౮

మ. విగతక్లేశులు [౩]వీతకిల్బిషమయుల్ । విజ్ఞానవిద్యానిధుల్
నిగమార్థజ్ఞులు నిశ్చలవ్రతయుతుల్ । నిర్వ్యాజనిష్ఠా[౪]యుతుల్
సుగుణుల్ సూనృతవర్తనుల్ శుభకరుల్ । శుద్ధాంతరంగుల్ యతుల్
జగతీమండలి నీదు సేవకులు కృ । ... ౮౯

శా. దీను ల్గల్గిన నీదురక్షణా[౫]గుణాధిక్యంబు రాణించు. నా
దీనుం డెవ్వఁడు లేఁడు. నీదుకరుణాదృష్టిన్ గృతార్థుల్ సుమీ!
నేనే దీనుఁడ నన్నుఁ బ్రోవు శరణార్థిం ద్వ[౬]న్ముఖోదీర్ణసు
జ్ఞాన శ్రీకరసూర్తి [౭]నమ్మితిని కృ । ... ౯౦

శా. పాత్రాపాత్రవివేకము ల్సమసెఁ బాపం బెచ్చె [౮]ధర్మంబునన్
మిత్రఘ్నత్వము కల్లలాడుటలు స్వామిద్రోహముం గొండెమున్
ధాత్రిం బూజ్యము లయ్యె సజ్జనులచందం బెట్లు రక్షించెదో
సత్రాజిత్తనయామనోరమణ కృ । ... ౯౧

మ. [౯]అరయన్ శంతనుపుత్రుపై విదురుపై । నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపయి । న్నందవ్రజస్త్రీలపైఁ
బర్వఁగం గల్గు భవత్కృపారసము నాపైఁ గొంత రానిమ్ము మీ
చరణాబ్జంబుల నమ్మినాఁడ హరి కృ । ... ౯౨

---

(88) ౧. రహించుచోఁ బటు. ౨. శ్రేణి భరించు శిష్టు నిన్నుఁ గృష్ణా.
(89) ౩. పీతకిల్బిషభయుల్. ౪. పరుల్. (90) ౫. కళా. ౬. న్మనో. ౭. లీలఁగల.
(91) ౮. పుణ్యంబులే. (92) ౯. ఇదియును తాళపత్రగ్రంథములలో లేదు.

మ. అనుకూలాన్విత యైన ౧భార్యయును ధర్మార్థంబు నైనట్టినం
దనులున్ సజ్జను లైనసోదరులు నెన్నంగ౨గల్గు సంపత్క్రియా
ఘనుఁ డైనట్టిమహానుభావుఁడె భవత్కారుణ్యదృగ్జాలభా
జనుఁ డప్పుణ్యుని ౩జూచినన్ శుభము కృ॥ ... ౯౩

మ. శరణాగత్యనుకూల భక్తజనరక్షా సత్కృపాసేవ్యన
త్కరుణాపూరసుధారసంబు గలశృంగారంబు మీమూర్తియుం
దరణోపాయ మెఱుంగ లేని కలుషాధారున్ ననుం దావక
స్మరణాధీనునిఁ జేయు మ్రొక్కెదను కృ॥ ... ౯౪

మ. ప్రళయాభీలకరాళదావదహనప్రజ్వాల మబ్జోదరా!
జ్వలనాకారము దాల్ప దానిమొనకుం దప్తసంతాపవాం
ఛలు దివ్యుల్ మనులుం గృశాస్యు లగుచుం జల్లార్పఁగా లేక ని
చ్చలు నీపాదములన్ భజించెదరు కృ॥ ... ౯౫

మ. మొఱయాలింపవొ మానము న్నిలుపవో ముల్లోక మేలింపవో
మఱిదీ యంచును వెంటనే తిరుగవో మన్నింపవో వీరిలోఁ
గరినో ద్రౌపదినో సురాధిపతినో గాండీవినో యెప్పుడున్
ధర నిన్ గొల్చినవారిలో నెవఁడుఁ గృ॥ ... ౯౬

సుదర్శనచక్రము

మ. కుటిలారాతిని శాతకోటికదళీకూటాటవీభంజనో
ద్భటమత్తద్విప కేళిలోలమునలీ ప్రావీణ్యదైత్యాంగనా
స్ఫుటముక్తామణిరత్నహారలతికాపుంజాతలూనక్రియా
చటులజ్వాలము నీసుదర్శనము కృ॥ ... ౯౭

---

(93) ౧. గేహినియు ధర్మార్థంబు లైనట్టినందను. ౨. గల్గి సమ్యక్క్రియా. ౩. గాంచినన్. (94) ౪. గత్యనుషక్త. ౫. త్కటాక్షప్రవ. ౬. మూర్తికిన్. (95) ౭. దహనోగ్రజ్వాలముల్ జారవ. ౮. దాల్చెఁ గానిమొన దుస్సంతాప సంతప్త వాంఛలు విద్వన్మణులుం గృశాంగు లగుచుం. (96) ౯. వారిలోపలను గృష్ణా. (97) ౧౦. రాజ. ౧౧. విలసత్కారుణ్య. ౧౨. లతికాపుంజాంచలూన.

మ. కులిశానేకసహస్రకోటినిశితక్రూరోరుధారాముఖా
కలితార్చిఃప్రభవప్రభావ త్రిజగత్కల్యాణసంధాయి వై
విలసిల్లున్ భవదీయచక్ర మఖిలోర్వీభారనిర్వాపణో
జ్జ్వల[1]నిర్వాహపరాక్రమక్రమణ కృ... ౯౮

మ. అతికాకోలకరాళకాళియకఠోరాశీవిషావిర్భవ
క్షతివో నాటిన నాటిపాటు తలఁపన్ శంకించి [2]యుంకించెదా
[3]సతతోద్వర్తులవర్ణ సర్వభయదాంచత్పింఛచూడావతం
స[4]తతంగారుడ[5]కేతనోద్ధృతియుఁ గృ ... ౯౯

శా. నక్రోదగ్రతఁ బ్రాణవాయువులు [6]మేనం బాయఁగా నోప నో
చక్రీ నన్ దయ గావు మన్నఁ [7]గరుణన్ జాజ్జ్వల్యచక్రంబుచే
నక్రంబుం దెగఁ జూచి కాచితిగదా నాగంబు వేగంబునన్
శక్రాద్యామరవందితాంఘ్రియుగ కృ ... ౧౦౦

మ. [8]కరి నేలింది హుళక్కి ద్రౌపదికిఁ గోకల్ మెచ్చి యిచ్చింది ద
బ్బఱ కాకాసురునిం గటాక్షమునఁ జేపట్టిం దబద్ధం బహో
శరణన్నన్ బగవానితమ్మునికి రాజ్యం బిచ్చుట ల్కల్ల యి
త్తఱి నన్నేలిన నిక్క మీకథలు కృ ... ౧౦౧

మ. చటులోగ్రాహవభూమిలో నదులలో శాకీరహృత్పీడలో
నటవీఘోరమృగాహితస్కరులలో నాపత్పృథాంభోధిలో
బటుమోహాంధతకాలకింకరులలోఁ బ్రత్యక్షమై కాతు వె
చ్చుట నీదాసులఁ జెందునే భయము కృ ... ౧౦౨

---

(98) ౧. నిర్వక్రపరాక్రమ. (99) ౨. యుంకించితో. 3. సతతోద్యత్తరవర్ణసర్వ. ౪. తతిం. ౫. కేతనోద్యుతి. (100) ౬. మేన న్నిల్వఁగానోప నో. ౭. సుమహా. (101) ౮. ఈ పద్యము తాళపత్త్రగ్రంథములో లేదు.

మ. అరినాసీరకనత్ఖలీనముఖ నానారట్టఘోటీ సమి
ద్ధరణీధూళి తదీయకంఠఘనరక్తశ్రేణిచే మాన్చు నా
నరుఁ డచ్చోటనె భీరుతామయముఁ బూనండే భవత్సత్కృపా
చరణాబించుక యోసరించుటయుఁ గృ॥ ... ౧౦౩

మ. హితులై పెద్దలు ద్రోణ భీష్మ కృప బాహ్లీకాదు లుండంగ నా
శ్రితులై వ్యాస శుకాదు లుండ నృపులై సేవింప భూలోక మూ
ర్జితులై యేలిన రాజరాజు విధిచే నీకారు గాకుండెనా?
సతమా యీసిరి? జీవుఁ డేనిజము? కృ॥ ... ౧౦౪

మ. హరిదీశుల్ తగ సాధ్యులై పనులు చేయన్రాజసూయాధ్వరా
చరతం గీర్తులు నించి పెక్కుదిశలన్ సప్తార్ణవీసప్తకీ
శ్వరతం బెంపు వహించి మించినహరిశ్చంద్రుండు ప్రేతావనీ
శ్వరుఁడై యుండి మసండె తొల్లి ధరఁ గృ॥ ... ౧౦౫

మ. సకలక్షోణిపతిం బదాతి భటరాజశ్రేష్ఠు నార్తావనీ
పకు నర్థిన్నిజదాత ధర్మనిరతుం బాపాత్ముఁ బాపాత్మ ధా
ర్మికునింగా నొనరించు యుష్మకురుసాంద్రీభూత మాయాప్రపం
చక మత్యద్భుతలీలఁ గాలగతిఁ గృ॥ ... ౧౦౬

శా. దారిద్ర్యానలతప్తమానసులకున్ దైవంబుపైఁ జీతనం
బేరూపంబునఁ గల్గు ధర్మవిధి తా నెప్పాలఁ జొప్పారెడిన్
సారాచారవిచార మెక్కడిది వాచానైపుణు బేడ వి
స్తారోల్లాసపరత్వ మెట్లొదవుఁ గృ॥ ... ౧౦౭

మ. కరియార్తధ్వనియు స్వభక్తహితచక్రధ్వానమున్ యంతచం
డరణోజ్జృంభితమైన యమ్మకరికంఠచ్ఛేదనారావమున్
సరి నేకంబున రా నుతించిరి సురల్ సద్భక్తరక్షావిధం
బరయ న్వచ్చెరు వొచఁగా వశమె కృ॥ ... ౧౦౮

---

(104) ౧. అ. తగ సాధ్యులై.

శా. స్థాణుబ్రహ్మల కందరాని పరమ। స్థానంబు నీపట్టు నా
నాణీయ స్త్వమహ త్త్వశాలివి విభూ। త్వాధారి వీ వాస్తవ
త్వాప్రాణిప్రాణులఁ బ్రోతు వెవ్వఁడును స। ర్వజ్ఞున్ దయాభిజ్ఞునిన్
జాణ ల్గెల్తురు భక్తియోగమునఁ గృ। ... ౧౦౯

మ. శరచాపస్థిరకచ్ఛపాదిమకిటి। స్తంభోద్భవోపేంద్రభూ
సుర రామత్రయ బుద్ధకల్కు లనఁగా। శోభిల్లి త్రైలోక్యమున్
గరుణం బ్రోచిన నాఁటి నీమహిమ వ। ర్ణింపఁగా నేర్తురే
హరివైన న్నిటలాక్షుం డయినఁ గృ। ... ౧౧౦

శా. ధన్యుం జిన్మయరూపు శాశ్వతుఁ బరం। ధాము న్నిను న్లోకసా
మాన్యుంగాఁ దలపోసి నందుసతి సం। భావించి తా నర్థితో
స్తన్యం బిచ్చి సముద్ధరించెనఁట యా। శ్చర్యంబు ని న్నాదిరా
జన్యుం డంచుఁ దలంప దించుకయుఁ గృ। ... ౧౧౧

మ. లలితాభోగపరిశ్రమాంబుకణము। ల్స్నానంబులు న్వాద్యము
ల్గళశంఖధ్వను లంచితాంబర మలం। కారంబు దివ్వె ల్మెఱుం
గులు నైవేద్యము మోవి మాధురిమగా। గోపాంగన ల్నిన్ను ని
చ్చలు సేవింతురు భక్తియోగమునఁ గృ। ... ౧౧౨

మ. జపము ల్సేయఁగ నేల బోడితలతో। సన్న్యాసి గా నేల ని
స్పృహులై కోమలి మాన నేల। యడవిన్ శాకాదిమూలాదుల
న్నుపవాసంబుల మ్రగ్గనేల నొకమా। ఱోకృష్ణ నారాయణే
శ పరబ్రహ్మ యటన్న ముక్తుఁ డగుఁ గృ। ... ౧౧౩

శా. అన్నా కృష్ణమ నేఁడు వేల్పులకు మీఁ। దన్నారు మావాడలో
వెన్న ల్మ్రుట్టకు మన్న గోపయువతి। న్వీక్షించి నాకన్న వే
ల్పున్నారే యని నవ్వి వెన్నఁ దిను చా। ర్య ల్వింత లన్నన్న రా
జన్నీరేజవిరాజితాంఘ్రియుగ కృ। ... ౧౧౪

మ. భువనోత్కృష్ట మురాసురాంతక మహా।భోగీంద్రపర్యంక కే
శవ నారాయణ కౌస్తుభాభరణ విష్వక్సేన వైకుంఠ మా
ధవ గోవింద ముకుందుఁడా యనుభవ।త్కల్యాణనామంబు లు
త్సవలీలం బఠియింతు రుత్తములు కృ। ... ౧౧౫.

శా. ఆకాశంబు పదాంబుజాత మఁటగా। యామీఁద మి న్నెంతయో
లోకాలన్నియుఁ గుక్షి నుండు నఁటగా। లో నెంత విస్తీర్ణమో
నీకుం గన్నులు చంద్రసూర్యు లఁటగా। నెమ్మోము దా నెంతయో
యాకీ లెవ్వ రెఱుంగ నేరరఁట కృ। ... ౧౧౬.

*మ. సదయస్ఫూర్తికళల్ ఘటించు కవి స।త్కుఃశ్రేష్ఠుఁ డుత్సాహి యై
పదివేల్పద్యములందు నూటపది యా।పద్యంబు లర్పించి మీ
పదనీరేజములందు దివ్యతటినీ।పాథః ప్రపూరాభిము
ఖ్యదశం గాంచినఁ దక్క నీకరుణ కృ। ... ౧౧౭.

♦క. ఈకృష్ణశతక మెప్పుడు
పైకొని విన్నట్టివారు। వ్రాసినవారల్
చేకొని పఠించువారలు
శ్రీకృష్ణునికరుణ కలిగి। చెలఁగుదు రెలమిన్. ౧౧౮

దేవకీనందనశతకము - సంపూర్ణము

---

* ఈ పద్యముక్రింద అడయారుప్రతిలో నిట్లున్నది.

క. ధరలోను మున్ను చెప్పిన, అరయఁగ నీకృష్ణశతక ♦ మతిమోదముతోఁ
బరువడి వ్రాసెను ఈపురి, వరకవి పురుషోత్తమాఖ్య ♦ వసుధిమలోనన్.

మ. కవనాచాతురి మీఱ మున్ను కవిర।త్నశ్రేష్ఠుఁ డామోదియై
భువిఁ గావించినయట్టి కృష్ణశతకం।బుం భక్తితాత్పర్యమై
భవ మొప్పన్ లిఖియించి సద్వరకవి।ప్రావీణ్యుఁ డౌ భాస్కరా
హ్వయరగ్రాజుణి మీలసత్కరుణ కృ।ష్ణా దేవకీనందనా.

♦ ఈ పద్యము తాటియాకుప్రతులలో కానరాదు.

# పీఠిక

శ్రీ రఘువీరశతకమునకు జానకీనాయకశతక మను నామాంతరమును మకుటము సూచించుచున్నది. వ్రాతప్రతులందు జానకీనాయకశతక మనియును గలదు. అచ్చుప్రతు లన్నియును రఘువీరశతక నామమునే వాడినవి. కవి శతకమునకు రఘువీరశతక నామకరణమును చేసినటులు అరువదియైదవపద్యము తెలుపుచున్నది. పద్యాంతములందు జానకీనాయకా! యని సంబోధించినను రఘువీరనామము రూఢియైనది.

శా. తారుణ్యోదయ యొంటిమిట్టరఘునాథా నీకు నేఁ బద్యముల్
నూఱుం జెప్పెద నూరు పేరు వెలయన్ నూత్నంబుగా నంత నా
నోరుం బావన మౌను నీకరుణఁ గాంతున్ భక్తి నస్పందమున్
రా రమ్మందురు గారవించి రఘువీరా జానకీనాయకా.

శతకమును వ్రాసినకవి శతకమునందు తన కులగోత్రములను వంశనామములను దెలుపలేదు. కృతినిర్ణయము నితరగ్రంథముల యాధారమున పండితులు చేసిరి. అయ్యలరాజు వంశజుడైన రామభద్రుడు సకలనీతిసారసంగ్రహమును రామాభ్యుదయమును రచియించెను. సకలనీతిసారసంగ్రహమును శ్రీ కృష్ణదేవరాయలవారి యాజ్ఞానుసారముగ రచియించినటులు గ్రంథమునందు గలదు. రామాభ్యుదయమును గొబ్బూరి నరసింహరాజున కంకితము నిచ్చెను. రామాభ్యుదయమునం దాశ్వాసాంతగద్యములు రఘువీరశతక నామముం జేర్కొనుచున్నవి.

"ఇది శ్రీమదొంటిమిట్ట రఘువీరశతక నిర్మాణకర్మఠ జగదేకఖ్యాతిధుర్యాయ్యలరాజు తిప్పయ్యమనీషి పర్వతాభిధాన పౌత్రాక్కయార్య పుత్రపరిశీలిత సమిద్ధరామానుజమతసిద్ధాంతమర్మ ముమ్మడి వరదరాజాచార్య కటాక్ష వీక్షాపాత్రహృదయపద్మాధిష్ఠిత శ్రీరామభద్రకవి ప్రణీతంబైన రామాభ్యుదయంబునందు—"

అయ్యలకవియు భాస్కరకవియు వ్రాసిన చెట్టుమతశాస్త్రమునం దీగద్యము గలదు:—

"శ్రీరఘునాయక దయాలబ్ధ సారస్వతులును రఘువీరశతక నిర్మాణకర్మఠ రాయకవి తిప్పనార్యపాలకులు మదీయాశ్రితులును"

అయ్యలరాజు తిప్పసచివాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుం డగుకొండధీశునిన్
జయ్యనఁ దిమ్మయప్రభుని సత్కవితారచనాఢ్యులైన మా
యయ్యలరాజువంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్. హంసవింశతి.

పై గద్యపద్యములు రఘువీరశతకకర్త అయ్యలరాజువంశజు డని తెలుపుచున్నవి. అయ్యలరాజు వంశజుడైన త్రిపురాంతకుడే రామభద్రుండని నిర్ణయించుట కీగద్యము పద్యము లుపచరింపవు. క్రీడాభిరామపీఠికయందు గల యీ క్రిందిపద్యము సందియమును దీర్చి తిప్పయ్యను నిర్దేశించుచున్నదని శ్రీ వంగూరు సుబ్బారావు గారు శతకకవుల చరిత్రమునందు వ్రాసిరి. ఈపద్యము తంజావూరు రఘువీరశతక ప్రతిలో నున్నదని కొందలు చెప్పుచున్నారు. ఈ ప్రాంతములందు గల ప్రతులలో నీపద్యము కన్పించుట లేదు.

చ. అతులప్రౌఢిమ మీఱు రాయకవి యయ్యలరాజు సత్పుత్రుఁ డం
చితభక్తిన్ద్రిపురాంతకుండు రచియించెన్ తెన్గుపద్యంబులన్
శతకం బొక్కటి దీని నీవు విని యాచంద్రార్కమై నిల్పు ప
ర్వతకన్యానుత యొంటిమిట్ట రఘువీరా జానకీనాయకా. క్రీ. రా.

క్రీడాభిరామ పీఠికయందును తంజావూరిప్రతియందును గల పైపద్యము రఘువీర శతక కర్తృత్వమును నిర్ణయింపజాలదు. త్రిపురాంతకు డొకశతకమును రచియించెనని యును నయ్యది రఘువీరశతకమనియును నిర్ధారణచేసినను ఆరఘువీరశతకమే ఈ రఘువీర శతకమని పైపద్యము నిర్ధారణచేయజాలదు. రంగరాట్ఛందాది గ్రంథములందు వుత్తేటి రామభద్రుని రఘువీరశతకమునం దిందలి పద్యము లుదాహరింపబడినపుడు రామభద్రుడు రఘువీరశతకమును రచియించినటులు తెలియుచున్నది. రామాభ్యుదయ గద్యయును రామ భద్రుడు రఘువీరశతకమును రచియించినటులు నిర్ధారణ చేయుచున్నది. పరోక్షమైన సాధ నములు సందిగ్ధముగ నున్నపుడు రఘువీరశతకపరిశీలనము విషయనిర్ధారణమున కెంత ప్రయోజనకరమో పరిశీలింపదగియున్నది.

ఈశతకమునందలి రెండవపద్యమునందు కవి తా నితర కావ్యములను వ్రాసినటులు దెలిపెను. రామభద్రుడు వ్రాసిన కావ్యములు గలవు. తిప్పయ్య వ్రాసిన కావ్యములు గనుపింపవు. రామభద్రుడు కృష్ణదేవరాయల నాశ్రయించినటులును రాయలకు గృతినిచ్చి నటులును సకలకథాసారసంగ్రహము తెలుపుచున్నది. రామభద్రుడు పేదఱికము ననుభ వించినటులు శతకమునందలి 18, 84 పద్యములు చాటుచున్నవి. రామభద్రుడు వీరవైష్ణ వమతము నవలంబించినటులు రామాభ్యుదయమునందలి గద్య తెలుపుచున్నది. రఘువీర

శతకమునందలి 28, 67, 4౯, పద్యములు వీరవైష్ణవ మతస్వీకారమును జాటుచున్నవి. రఘువీరశతకకర్త రఘువీర నామమును బెట్టుకొనినటులు 46-వ పద్యము తెలుపుచున్నది.

శా. నీపాదోదక మక్షులం దదుముకొంటిన్ గొంటి నాలోనికిన్
నీపళ్లెంబు ప్రసాదముం గుడిచితిన్ ♦ నీపేరునుం బెట్టితిన్
నీ వెన్ముద్రలు దాల్చితిన్ భుజములన్ ♦ నీ వింక నన్నేగతిన్
బ్రాపై ప్రోచెదొ కాని పూని రఘువీ♦రా జానకీనాయకా.

ఈ పద్యార్థము రామభద్రున కన్వయించునుగాని త్రిపురాంతకున కన్వయింపదు. రామభద్రుడు "ఆంధ్రవాగ్భాగవతకర్త నభినుతించి" యని రామాభ్యుదయమునందు పోతనామాత్యుని సంస్మరించెను. ఈ శతకమునందు భాగవతపద్యములను నారాయణశతక పద్యములనుబోలిన పద్యములు గలవు.

మ. పరనారీకుచకుంభపాళికలపైఁ ♦ బాదాబ్జయుగ్మంబుపై
గిరుమూలంబులపైఁ గపోలతటిపైఁ ♦ గంఠంబుపైఁ గొప్పుపైఁ
బరువుల్ వారెడు నాతలంపులు మిమున్ ♦ భావింపఁగాఁ జేసి స
ర్వరసాధీశ్వర నన్నుఁ బ్రోవు రఘువీ♦రా! జానకీనాయకా!

మ. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై ♦ నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ ♦ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట మీఁ♦దై నాకరంబుంటమేల్
గాదే! రాజ్యము గీజ్యమున్ సతతమే? ♦ కాయంబు నాపాయమే.

[భాగ. స్కం. 8, 592.]

రఘువీరశతకమునందలి 107, 109, పద్యములకును నారాయణశతకమునందలి 12, 17, పద్యములకును పోలిక గలదు. రామభద్రుడు 1509 - 1575 ప్రాంతములందును రామభద్రుని తాత తిప్పయ్య 1460 ప్రాంతములందును నివసించినటులు శ్రీయుత వావిలకొలను సుబ్బారావుగారును వంగూరి సుబ్బారావుగారును నిర్ధారణచేసిరి. భాగవతమును రచియించిన పోతరాజుకాలము 1450 ప్రాంతమునందు నిర్ణయింపబడుచున్నది. సమకాలికులైన తిప్పయ్యకును పోతనకును భావానుకరణము సాధ్యముగాదు. ఎనుబదేండ్ల తరువాతను నివసించిన రామభద్రున కిది సాధ్యము. మహానుభావుడైన భాగవతకర్త రఘువీరశతకము ననుకరించి వ్రాసెననుట సంభావ్యముగాదు. రఘువీరశతకకర్తయే భాగవతమును నారాయణశతకమును ననుకరించుట సంభావ్యము. మహానుభావుడైన పోతన ననుకరించుట సామాన్యుల కలవి గాదు. సామాన్యుల యనుకరణము రసాభాసముగ నుండునని యనుకృతములైన భావములును పోకడలును విశదము చేయుచున్నవి. పండితులు స్వాభిమాన

మును వదలి గ్రంథపరిశోధనలను జేసి రఘువీరశతకకర్త తిప్పయ్యయో రామభద్రుడో నిర్ణయించి సత్యమును వెల్లడిచేయుదురుగాత! కవి అయ్యలరాజు వంశజుడు. నియోగిబ్రాహ్మణుడు. ఆపస్తంబసూత్రుడు. కాశ్యపగోత్రజుడు. రామానుజమతస్థుడు. ఒంటిమిట్టయందు వెలసిన శ్రీరఘురామునికి భక్తుడు.

శైలి:—రఘువీరశతకపు శైలి ధారాళమైన ప్రవాహము గలిగి శ్రావ్యముగ నున్నది. శబ్దార్థాలంకారములు పొందికలు భావములు రచనలు ప్రౌఢములు గాకయును సామాన్యముగ నున్నవి. భాగవతమునందువలె నేకార్థమును దెలుపు వివిధపదజాలము వాడినను దానియందుగల మాధుర్యమును రసోదయమును నిందు గానఁబడని విధమున నీకవి ప్రయోగములు నిదర్శనములు.

"హత్యాదిదోషంబులున్ పేచించున్ విదళించు ద్రుంచుఁ దునుమున్ ♦ వెంటాడు నంటుంబడున్, రాచుం ద్రోచు నశించు నొంచు రఘువీ♦రా! జానకీనాయకా!" శబ్దాలంకారములు ౩౩, ౪౨ పద్యాదులందు జూడనగును. రచనమునందును మాటలందును కొన్నివాడుక ప్రయోగములును సామాన్యములైన భావములును నున్నను పద్య రచనయును భావసంధానమును వైష్ణవభక్తి భరితములై అనుభవసిద్ధములై రఘువీరశతకము భక్తిశతకములందు ప్రతిష్ఠను బడసినది. ఈకవి ఇతరకావ్యముల రచియించినటులు ౨-వ పద్యము తెలుపుచున్నది. ఆపద్యమును సమన్వయముచేయగల విధమునైన జర్చింపబడినది. శైలిని జూపుటకు స్థలాంతరమునం దుదాహరింపబడినపద్యములు గాక నీక్రిందిపద్యములును నుదాహరింపబడుచున్నవి.

మ. సకృపాలోకన! నందగోపుని తనూ♦జాతుండవై గొల్లవై
సకలక్షోణుల నేలినాఁడవఁట, మిం♦చం గశ్యపబ్రహ్మగ
న్న కుమారుండన మిన్నుముట్టి కులుచై♦ నాఁడేల నాడేల నే
రక దానంబుగ నేఁడుకొంటి రఘువీ♦రా! జానకీనాయకా!

మ. శరణంబన్నను మాటమాత్రమున వి♦శ్వద్రోహితోఁబుట్టుకున్
గరుణాపూర్ణవిలోకనం బొదవ లం♦కారాజ్యసింహాసన
స్థిరపట్టం బొనరించినాఁడ వఁట యే♦దేవుండు నీసాటి యు
ర్వరలోనన్ భవరోగదూర! రఘువీ♦రా! జానకీనాయకా!

మ. నిను నారాయణమూర్తిగాఁ దలఁచుచున్ ♦ నీదండ నాదండకా
వన వాచంయము లెల్లఁ జేరి కొలువన్ ♦ వారిం గృపం జూచుటల్
వనధిం గట్టుట రావణుం దునుముటల్ ♦ వర్ణింతు రామావతా
ర నిరూఢాకృతి నిన్ను నౌర రఘువీ♦రా! జానకీనాయకా!

ఈ శతకమునందలి 50-వ పద్యము సర్వేశ్వరశతకమునందలి 87,88 పద్యములను బోలియున్నది. సర్వేశ్వరశతకమునందలి భావము గంభీరముగ నున్నది. రఘువీరశతకము నందలి 57-వ పద్యమునందును సర్వేశ్వరశతకమునందలి 46-వ పద్యమునందును దెలిపిన "భ్రమరకీటన్యాయ" భావము రెండుశతకములకును గల భేదదృష్టికి నిదర్శనము.

## భా వా ర్థ ము

రఘువీరశతకమునకు మకుటము:—

రామా! రాఘవ! రామభద్ర! రఘువీరా! జానకీనాయకా!

శతకమకుటమునందు కవి శ్రీరాముని జానకీనాయకా! యని సంబోధించుటచే జానకీనాయకశతక మనుటకు వీలున్నను రఘువీరశతకనామకరణమునే కవి చేసెనని శతకము తెలుపుచున్నది.

శా. తారుణ్యోదయ! యొంటిమిట్టరఘునాథా! నీకు నే బద్యముల్
నూఱుం జెప్పెద నూఱుఁ బేరు వెలయన్ నూత్నంబుగా; నంత నా
నోరుం బావన మౌను నీకరుణఁ గాంతున్ భక్తి నన్నందఱున్
రా రమ్మందురు గారవించి రఘువీరా! జానకీనాయకా!

ఈ పద్యము శతకనామమును కవిహృదయమును విశదముచేయుచున్నది. భక్తులు భగవంతుని వారి వారి సంస్కారమున కనురూప మగు సంకల్పమున కనుకూలముగ భజించుచుందురు.

శ్లో. చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ! గీ. అ. 7, 16 శ్లో.

లోకమునందు పుణ్యాత్ములు 1. దుఃఖార్తులుగను 2. జిజ్ఞాసువులుగను 3. అర్థార్థులుగను 4. జ్ఞానులుగను భగవంతుని భజింతురు. భక్తులందు జ్ఞాను లుత్తము లైనను దుఃఖార్తులును నర్థకాములును నధికముగ నుందురు. రఘువీరశతకకర్త కర్ణాటకరాజుల నాశ్రయించి కృతుల నిచ్చినను గౌరవముగాని ధనముగాని పొందలేదు. స్వస్థలాధీశ్వరు డైన శ్రీరఘువీరస్వామికి కృతి నిచ్చి పావనుడై గౌరవమును సన్మానమును నానందమును బొందగలిగెను. రాజులకు కృతినిచ్చుటయందు గల యనౌచిత్యమును కవి యీక్రిందిపద్యమునందు దెలియజేసెను.

మ. పసిఁడిం జూచి మహాప్రదాత యని బీభత్సాతిమత్సాంగునిన్
బ్రసవాస్త్రప్రతిమానరూపుఁ డనుచున్ బందం బ్రియం బంద శ
త్రుసమూహాంతకుఁ డంచు నెప్పుడు నరస్తోత్రంబు గావించు నీ
రసుఁడన్ నిన్ను నుతింపనేర రఘువీరా! జానకీనాయకా!

మ. అడిగెవిద్యకు లోను చేసితివి నన్నాదంత యాదంత లే
కడియాసల్ గొనుచుం దురాత్మకుల సేవనర్థించుచున్నాఁడ; నె
న్నఁడు రక్షించెదొ నీవు నన్ను బలె సన్నుం జేదవా? యేల యా
జడిఁ బెట్టేవు? రమావిహార! రఘువీరా! జానకీనాయకా!

"నిధి చాలసుఖమా? శ్రీరాముని సన్నిధి చాలసుఖమా!" యనుకీర్తనయందు త్యాగరాజు మనోహరముగ కీర్తనముచేసినభావముసే కవి రఘువీరశతకమునందును బాడెను. ఆత్మనిరసనము రాజనిరసనము అర్థాపేక్ష మోక్షాపేక్ష మొదలగుభావములు కవి యనుభవించిన హృదయ సంతాపమును దెలుపుచున్నవి. ఆత్మేశ్వరుడైన శ్రీరామమూర్తికి కవి యాత్మార్పణమును జేసి కృతార్థుడైనను శతకమునందు తన్మయత్వమును దెలిపెడి భక్తిరసానుభవము ప్రత్యక్షమగుటలేదు.

భక్తిశతకముల చరిత్రమునందు రఘువీరశతకము నవీనమార్గము నవలంబించినది. సర్వేశ్వరవృషాధిప కృష్ణశతకాదులందు కవులు సంకీర్తనము చేసిన యిష్టదైవములు శ్రుతిశాస్త్రపురాణాగమప్రసిద్ధులై వ్యాప్తినొందిన యవతారమూర్తులు. ఆబాలగోపాలము సతతము సంస్మరించెడి శ్రీరామకృష్ణాదుల మహిమవాత్సల్యవిభవాదిలీలలను కవులు సంకీర్తనము చేసి భక్తిరసావేశమును వారుబొందుచు నితరులకు భక్తిరసావేశమును గలుగజేయుచుండురు. రఘువీరశతకమునకు నాయకుడు శ్రీమద్రామాయణమునందు వాల్మీకి దివ్యముగ జిత్రించిన శ్రీరామమూర్తియే యైనను ఒంటిమిట్టయందు వెలసిన రఘురాముడు. అవతారమూర్తి యైన శ్రీరామమూర్తి ఒంటిమిట్టరఘురామమూర్తిగ వెలసెను. స్థలదేవతాపరములైన శతకము లిప్పుడు వందలకొలదిగ గనుపించుచున్నవి. స్థానికమగు దైవభక్తి గాఢమైన భక్త్యావేశమునకు గారణంబైనను సంకుచితమైన దైవభక్తియై పరదైవదూషణముగ సయితము పరిణమించుటకు హేతువైనది.

రఘువీరశతకము భక్తిశతకచరిత్రమునందు మఱొక విశేషమును దెలుపుచున్నది. ప్రజలకు శివకేశవాదులవలె శ్రీరామకృష్ణులును నిష్టదైవములు. వేణుగానప్రియుండైన గోపాలకృష్ణునివలె సీతాలక్ష్మణసహితుడైన శ్రీరామచంద్రుడును పరదైవము. వేణుగోపాలుని రసలీలలు శ్రీరాముని రసపరిగ్రహణము రసానుభవానందమునకు లక్ష్యములు. భోగత్యాగములు భక్తిజ్ఞానములు కర్మధర్మములు రసానుభవమునందు సమత్వమును బొందుచున్నవి. యమునాతీరమునందలి బృందావనవిహారములు- కావేరీతీరమునందలి శ్రీరంగకైంకర్యములు- వైష్ణవభక్తివిలాసములు. రాధామాధవుల మాయాశృంగారలీలలు సీతారాముల మానవప్రేమలీలలు భక్తిరసాశ్రయములు. భక్తిరసాశ్రయము లైన భాగ

శతరామాయణములు భక్తిప్రభావమును మనోహరముగ వర్ణించుచున్నవి. విశ్వమయుడైన గోపికావల్లభుడును, ఆత్మారాముడైన సీతాపతియును భక్తత్రాణపరాయణులు. భోగమూర్తియైన శ్రీకృష్ణునిలీలలును త్యాగమూర్తియైన శ్రీరాముని లీలలును దివ్యావతారమహిమలను బోధించుచున్నవి. ఆంధ్రహృదయము ఈ యుభయవైష్ణవమూర్తుల భక్తియోగైక్యమును వెల్లడిచేయఁగలిగినది. భక్తిరసామృతభరితమైన భాగవతమును రామకథామృతభరితములైన రామాయణములు కావ్యములు శతకములు భక్తిజ్ఞానసమ్మిళితమైన యాంధ్రహృదయమును దెలుపుచున్నవి. దేశమునందలి గ్రామగ్రామమునందును నెలకొన్న శ్రీరామాలయములు, రామభజనలు, రామోత్సవములు, రామనామపారాయణములు, రామకోటులు శ్రీరామభక్తివ్యాపనమును తెల్పుచున్నవి. ఆ వ్యాపనమునే రఘువీరశతకము దెలుపుచున్నది. ఆంధ్రహృదయమునకు శ్రీభద్రాద్రిరాము డిష్టదైవము. మనోహరమైన శ్రీరామనామమును మధురాక్షరములలో కవులు గాయకులు పండితులు పామరులు కీర్తించి యాంధ్రహృదయస్వరూపమును సువ్యక్తము చేసిరి. శ్రీ రఘువీరశతక మాంధ్రావనియందు శ్రీరామభక్తివ్యాపనమునందలి యొక ఘట్టమును సూచించుచున్నది.

ఈ శతకము శ్రీవైష్ణవమతసంప్రదాయవ్యాపనమునం దీశతకము వేఱొక ఘట్టమును దెలుపుచున్నది శ్రీరామానుజాచార్యులు పదునొకండవ శతాబ్దియందు స్థాపించిన శుద్ధవైష్ణవము పదునైదవ శతాబ్దికి వీరవైష్ణవముగ బరిణమించినది. వైష్ణవభక్తికి బాహ్యలక్షణములు ప్రమాణములైనవి. త్రిపుండ్రధారణము చక్రాంకితములు తీర్థప్రసాదములు తులసీమాలలు భక్తచిహ్నములై వైష్ణవభక్తిరసప్రవాహమును శుష్కింపజేసినవి. మతరహస్యసంప్రదాయములు నిర్జీవకళలై సదాచారములు దురాచారము లైనవి.

శా. నీపాదోదక మక్షులం దదుముకొం◆టిం, గొంటి నాలోనికిన్
నీపళ్లెంబు ప్రసాదముం గుడిచితిన్, ◆ నీపేరునుం బెట్టితిన్
నీపెన్ముద్రలు దాల్చితిన్ భుజములన్ ◆ నీవింక న న్నేగతిన్
బ్రాపై బ్రోచెదొ కాని పూని రఘువీ◆రా ! జానకీనాయకా !

— విశ్వవ్యాపకుడైన భగవంతునకు రూపావరణములు స్థలావరణములు గలిగినవి. పండితపామరులదృష్టి యాంతరంగికలక్ష్యమునుండియును సాధనమునుండియును మరలి బాహ్యలక్ష్యములందును సాధనములందును లగ్నమైనది.

శ్రీరామభక్తపరాయణుండైన రఘువీరశతకకర్తను నీవాసన సోకినది. చిత్తము శ్రీరాముని చింతనమును గోరుచున్నను భక్తిని బాహ్యవేషధారణము లాకర్షించినవి.

చిత్తము "రామా! రాఘవ! రామభద్ర! రఘువీరా! జానకీనాయకా!" యనుచు మహాక్రందనమును జేయుచున్నను హృదయగ్రంథులు వీడి శ్రీరామభక్తిరసానుభవము చేయుట దుర్లభమయినది. సర్వేశ్వర వృషాధిప నారాయణ కాళహస్తీశ్వర దాశరథీ ప్రభృతులగు శతకములందు గల భావశుద్ధి మతావేశము భక్త్యావేశము తత్త్వసందర్శనము రఘువీరశతకమునం దరుదుగ గన్పట్టుచున్నది.

చిత్తవృత్తికిని సంసారప్రవృత్తికిని భక్తిరంగమునం దైక్యము గలుగలేదు. కవి దురభిమానమును వదలి ముక్తికి ప్రతిబంధకములైన మలినమనోవృత్తులను వ్యక్తముచేసెను. తనచిత్తవృత్తుల నాకర్షించిన కాంతాకనకాదులభ్రాంతిని నివృత్తిచేసి ముక్తి నొసంగుటకు, శ్రీ సీతారాముని- కోదండరాముని- ఒంటిమిట్టరఘురాముని- కవివర్యుడు- కొలిచి కొనియాడి- కీర్తికాముడై- జన్మమును సఫలము చేసెను.

శా. మోక్షాపేక్ష జనించె నాకు నిది యే•మో కాని యీజన్మమం
దక్షీణోదయముక్తి కెవ్వఁ డొడయం • డాపుణ్యు నేఁ జెప్పదో
దక్షారిస్తుత నీవె కర్త వయితే • దక్కొల నీవే ననున్
రక్షించేదొ యెటుంగఁ జెప్పు రఘువీ•రా! జానకీనాయకా!

రుధిరోద్గారి అధిక జ్యేష్ఠ శుద్ధ 2 బుధవారము. } కాశీనాథుని నాగేశ్వరరావు.

## ప్రతులు

రఘువీరశతకమును బ్రహ్మశ్రీ, వావిలకొలను సుబ్బారావుగారును, వావిళ్లవారును, కనుపర్తి మార్కండేయశర్మగారును ముద్రించిరి. సుబ్బారావుగారు పెద్దపీఠిక నువ్రాసిరి శ్రీ వంగూరు సుబ్బారావుగారు శతకకవులచరిత్రమునం దీశతకవిషయములను విపులముగ విమర్శించిరి. సాహిత్యపరిషత్పుస్తకాలయమునందును ప్రాచ్యలిఖితపుస్తకభాండారమునందును వ్రాతప్రతులు గలవు. ఈ శతకముద్రణమునం దీప్రతు లన్నియును నుపయోగపడినవి. ఇందలి పాఠభేదములు వానినుండియే తెలుపబడినవి.

శ్రీ ర స్తు

—

# ఒంటిమిట్ట రఘువీర శతకము

శ్రీకల్యాణగుణాభిరామ విబుధశ్రేణీకిరీటద్యుతి
వ్యాకీర్ణాంఘ్రిసరోరుహద్వయ సహస్రాక్షస్తుతా యచ్యుతా
నాకుం బ్రాపును దాపు నీవె యగుచున్ నన్నేలుమీ రామభ
ద్రా! కారుణ్యసముద్ర ధీర రఘువీరా జానకీనాయకా. ౧

శా. ఆకర్ణాటకమండలాధిపతిచే నాస్థాన[౧]మధ్యంబునన్
[౨]నా కావ్యంబులు మెచ్చఁ జేసితివి నానారాజులుం జూడఁగా
నీకుం బద్యము లిచ్చుచో [3]నిపుదు వాణీదేవి నాజిహ్వకున్
[౪]రాకుండ న్వసియించు టెట్లు రఘువీరా జానకీనాయకా. ౨

శా. నీకేలన్ దృణ మంటి [౫]వైవ నదియున్ నిర్ఘాత[౬]పాతక్రియన్
గాకాకారవికారదానవుని లోకాలోకపర్యంత మీ
లోకంబుల్ పదునాల్గు ద్రిప్పినది [౭]కాళ్లు ల్మోపఁగానీక యా
రా! కాకుత్స్థకులాగ్రగణ్య! రఘువీరా జానకీనాయకా. 3

మ. సకృపాలోకన నందగోపుని[౮]తనూజాతుండవై గొల్లవై
సకలక్షోణులు నేలినాఁడవఁట మించన్ గశ్యపబ్రహ్మ గ
న్నకుమారుం డన మిన్ను ముట్టఁ గుఱుచై[౯]నాఁ డేల యాలీల నూ
రక దానంబులు వేఁడుకొంటి రఘువీరా జానకీనాయకా. ౪

---

(2). ౧. మధ్యంబులో. ౨. నాకార్యంబులు. 3. నపుడ. ౪. రాకుండెట్లు వసించు గాక. (రాకుండ కెట్లు వసించుగాక. ఇది అసంపూర్తిగా నున్న రెండవతాళపత్రగ్రంథమున నున్నది.) (3) ౫. వైచినక్రియం. ౬. పాతక్రియా. ౭. కాలుక్ మోపగా నేరదా (కాల్మోపగా నీక—వేఱొకప్రతి). (4) ౮. తనూజన్ముండవై. ౯. నాడేలన.

మ. సకలామ్నాయములన్ బఠించుఫల మబ్జాతాక్షునామంబులం
దొక యొద్దైనఁ బఠింపఁగల్గు సటువంటుత్కృష్టపుణ్యప్రవ
ర్తకనామంబులు చక్రపాణికి సహస్రం బౌ సహస్రంబు ల
క్షకులా! నీశుభనామ మౌర! రఘువీరా జానకీనాయకా. ౫

శా. కొంకం గారణ మేమి? ధర్మములు పెక్కుల్ చేసి మర్త్యుండు నీ
వంకన్ జిత్తము నిల్పలేక పెఱత్రోవల్ ద్రొక్కినన్ సర్వముం
బొంకై తోఁచుఁ గురంగనేత్ర తగునోముల్ వేయునున్ నోఁచి తా
రం కాడంగఁ దొడంగినట్లు రఘువీరా జానకీనాయకా. ౬

శా. ఆగారీశ్వరకీర్తనీయుఁ డగు నిన్ స్మర్చింపఁగా లేని వా
రోగుల్ గాక నిజాన యోగు లయినన్ యోగ్యానుసంధానులా?
మా గుర్వాన యథార్థ మాడితిని నీమంత్రంబె మంత్రంబురా
రాగద్వేషవిదూర! ధీర! రఘువీరా! జానకినాయకా! ౭

మ. జగముల్ మూఁడు సృజింపఁ బ్రోవఁ బిదపన్ సంహారముం జేయఁగాఁ
ద్రిగుణాకారము దాల్చినట్టి వరమూర్తీ వాసుదేవాచ్యుతా
నిగమస్తుత్య పవిత్రగాత్ర నృహరీ నీలాభ్రవర్ణా మహో
రగతల్పా జనకల్పభూజ రఘువీరా జానకీనాయకా. ౮

శా. నీచారిత్రముఁ జెప్ప [2]నద్భుత మగున్ నీనామసంకీర్తనం
బాచండాలునకైన మోక్షమొసఁగున్ హత్యాదిదోషంబులన్
వే చించున్ విదళించుఁ ద్రుంచుఁ దునుమున్ [3]వేటాడు వెంటంబడున్
రాచున్ ద్రోచు నడంచుఁ [4]జీల్చు రఘువీరా జానకీనాయకా. ౯

శా. తేజం బొప్పఁగ నీవె కావె మొదలన్ త్రేతాయుగాంతంబునన్
రాజై పుట్టితి వింక నీకలియుగాంత్యంబందునన్ రౌతవై
వాజిం దోలి విరోధులం దునుమ దేవా నీవ యొం డెవ్వఁ డా
రాజున్ [5]రౌతవు నీవ కావె రఘువీరా జానకీనాయకా. ౧౦

(8) ౧. సహస్రాభ మ. (9) ౨. సద్భుతము నా. 3. వెంటాడు నంటుంబడున్. ౪. నంచు. (10) ౫. రౌతను.

శా. గాజుంబూస సురేంద్రనీలమణిగాఁ । గల్పించుచందంబునన్
బాజుం జర్మము¹మీఁద శేఁగెడుపొరల్ । బంగారుచేసేగతిన్
నాజన్మంబు పవిత్రభాజనముగా । నన్నేలరా యేలరా
రాజీవాక్ష కృపాకటాక్ష రఘువీ।రా జానకీనాయకా. ౧౧

శా. నాజన్మాంతరవాసనావశమునన్ । నాపాలిభాగ్యంబునన్
నాజాడ్యంబులు వోవుకాలముతటిన్ । నాపుణ్యా²పాకంబుచే
నీజన్మంబున నిన్నుఁ గొల్వఁగలిగెన్ । హీనుండఁ గా నింక నే
రాజన్నాకెవ రెవ్వరుర్వి? రఘువీ।రా జానకీనాయకా. ౧౨

శా. నేఁటం దీక్ష ననేకజన్మములనుం।డిన్ నన్ను వెంటాడుచున్
వాటంబై చనుదెంచుపాపములు శ్రీ।వత్సాంక సేవంక నీ
పాటల్ పాఠము సేయువారికి మఱిన్ । బాపంబులం బాపుఁ గ
ర్ణాటాధీశ్వర యొంటిమిట్టరఘువీ।రా జానకీనాయకా. ౧౩

మ. పటునిర్ఘాతకఠోరనాదము ఘన।బ్రహ్మాండభాండంబు పి
క్కటిలం జేయుచు వచ్చునప్పుడితరుల్ । గాండీవినామంబు లె
న్నుట మేలందురు వైష్ణవుల్ దలఁప రన్యం। గోరి యెంతెంతదు
ర్ఘటముల్ వచ్చిన ³నిన్నె కాని రఘువీ।రా జానకీనాయకా. ౧౪

మ. కొడుకుల్ బ్రహ్మలు కూఁతు రీశ్వరశిరః।కూటంబుపైఁ గాఁపురం
బుడురాజున్ ⁴గ్రహరాజుఁ గన్న లహరీ।జయ్యాలమంచంబు నీ
పడఁతుల్ శ్రీయు ధరిత్రియున్ సవతు చొ।ప్పన్ వేఱె⁵నీకున్నె యా
రడి మర్త్యుల్ గనలేరు గాక రఘువీ।రా జానకీనాయకా. ౧౫

మ. వడి మీఱంగ నమోఘమై నిగుడునీ।వాలమ్ము వాలమ్ము దాఁ
కెడు నంచున్ మెడ యొగ్గినన్ జమరిపైఁ । గల్గొన్న కారుణ్య మే
ర్పడమున్నేసినయమ్ము వేఱొకనా।రాచమ్మునన్ ద్రుంచి పే
ర్పడి తౌరా విలుకాండ్రలోన రఘువీ।రా జానకీనాయకా. ౧౬

---

(11) ౧. మీఁదిశేఁగెడుపొరల్. (12) ౨. పాకంబునన్. (14) ౩. నిన్నె కాక.
(15) ౪. దినరాజు, ౫. నీకాన్పు లా.

మ. చెడుగన్ గష్టుఁడ దుష్టచిత్తుఁడఁ బర।స్త్రీలోలుఁడన్ బాలుఁడన్
జడుఁడన్ మూఢుఁడఁ గొండెకాఁడను దురా।చారిన్ నిషేధాత్ముఁడన్
గడుసన్ గాకరిఁ గల్లగుల్లఁ గపటిన్ । గర్విన్ననున్ గావు మూ
రడి యున్నాఁడను నీవె దిక్కు రఘువీ।రా జానకీనాయకా. ౧౭

మ. అడిగేవిద్యకు లోను చేసితివి న।న్నాదంతయా దంత లే
[౧]కడియాసల్ గొనుచున్ దురాత్మకుల నే। సర్థించుచున్నాఁడ నె
న్నఁడు రక్షించెదు నీవు నన్నుబలె నే।న్నం బేదవా [౨]యేల యా
రడిఁ బెట్టేవు రమావిహార రఘువీ।రా జానకీనాయకా. ౧౮

మ. ప్రణుతింపన్ మృతదేహుఁ బ్రోచి బ్రతికిం।పన్ బ్రహ్మరుద్రుల్మరు
ద్గణనాథాదులు నోప రద్భుతముగా।దా నీదుభృత్యుండు ల
క్ష్మణుప్రాణంబులు దెచ్చెఁ జచ్చినతఱిన్ । సంజీవనీప్రక్రియన్
రణభూభాగములోనఁ దానె రఘువీ।రా జానకీనాయకా. ౧౯

శా. ఏతాత్పర్యము గల్గి కొల్చెదవురా । యే నేల నిన్నెంతురా
నీతో నాకుఁ బనేమిరా యనక మ।న్నింపన్ దగున్ [౩]నీకు నీ
చేత న్మోక్షము గన్నవారి [౪]వినరా । చిత్రంబుగా నిర్జరా
[౫]రాతిన్ రాతిఁ గిరాతుఁ దొల్లి రఘువీ।రా జానకీనాయకా. ౨౦

శా. [౬]దాతల్ తాతలు తల్లిదండ్రులు మఱిన్ । దైవంబు [౭]లాప్తుల్ చెలుల్
భ్రాతల్ తక్కినవారు చుట్టములు మీ।పాదాలమీఁ దాన [౮]నా
దాతల్ [౯]తాతలు తల్లిదండ్రులు మఱిన్ । దైవంబు [౧౦]లాప్తుల్ చెలుల్
భ్రాతల్ సర్వము [౧౧]నీవ కావె రఘువీ।రా జానకీనాయకా. ౨౧

మ. శ్రుతిపాథోధి మథించి శాస్త్రమహిమల్ । శోధించి యష్టాదశ
స్మృతు లాలించి మహేతిహాసకథలున్ । జింతించి తా రొక్కస
మ్మతమై సన్మును లాచరించిన మహా।మార్గంబు నీసేవ దు
ర్మతు లీమార్గము గాన రేరు రఘువీ।రా జానకీనాయకా. ౨౨

---

(18) ౧. కడియాసల్ గొల్పె. ౨. యాదవా. (20) 3. నన్ను(మున్ను - వేఱొక ప్రతి) ౪. వినరా. ౫. రాతిం నాతిగ రాతిదొల్లి. (21) ౬. కర్తల్ దాతలు. ౭. లాత్మల్. ౮. మా. ౯. కర్తలు. ౧౦. లాత్మల్. ౧౧. మాకు నీవె.

మ. మతి నూహింపరు గొంద ఱీసుకృత మేమార్గంబునం దున్న ను
గ్రతపోధ్యానము సామగానమును తీర్థస్నానమున్ దానమున్
గ్రతుసంధానము నేల నేలఁ దులసిం ౧గుర్వాద్యైనో యూర నీ
ప్రతిమ ల్లేవా నమస్కరింప రఘువీరా జానకీనాయకా. ౨౩

మ. సుతులంచున్ హితులంచు బంధుజనులంచున్ దల్లులు న్దండ్రులున్
సతులుం బారులునంచు నెంచుకొనుచున్ సంసార౨మోహాంబులో
గతజన్మంబులఁ దేలుచున్ మునుఁగుచున్ గర్వించి యే నిన్ననా
రతముం గొల్వనిమోస గల్గె రఘువీరా జానకీనాయకా. ౨౪

మ. క్షితిలోఁ ౩దానము బ్రహ్మసృష్టికిఁ బునస్సృష్టిన్ వినిర్మించియున్
గ్రతువిఘ్నం బొనరించు౪దానవులమూకం దోలఁగా లేక నాఁ
డతిబాలున్ నినుఁ౫దోడుదోడుకొని పోఁడా గాధిసూనుండు ౬నీ
ప్రతి౭శూరాగ్రణి యెవ్వఁ డింక రఘువీరా జానకీనాయకా ౨౫

మ. క్షితిలో నల్పులమీఁదఁ జెప్పినకృతుల్ చీచీ ౮నిరర్థంబు లా
నుతికిం బాత్రము గావు మేఁకమెడచన్నుల్ ౯నేతిబీఱకులున్
౧౦వితతప్రౌఢిని నీకుఁ జెప్పినకృతుల్ వేదాలు శాస్త్రాలు భా
రతరామాయణముల్ దలంప రఘువీరా జానకీనాయకా. ౨౬

శా. సంతానంబును బారిజాతకమహీజాతంబు మందారమున్
జింతారత్నము కామధేనువు సుధా౧౧సింధూత్తమంబున్ మఱిన్
జింతింపన్ సరిగావు౧౨నీకు విజయశ్రీధామ౧౩శ్రీరామ య
శ్రాంతత్యాగవివేకపాక రఘువీరా జానకీనాయకా. ౨౭

శా. ఏదైవాల వరాలకంటె సులభం ౧౪బెవ్వాని కైనన్ దుదిన్
నీదాతృత్వము ౧౫చెప్పఁ గ్రొత్త శర ణంటే కాతు విం తేల? నీ
పాదాంభోజరజంబు రాతి కయినం బ్రాణంబు ౧౬లీఁజాలు నౌ
రా దిక్పూరితకీర్తిహార రఘువీరా జానకీనాయకా. ౨౮

---

(23) ౧. గుర్వాద్యైనో నూర. (24) ౨. మోహాబ్ధిలో. (25) ౩. దానము. ౪ దానవునివీకం (దానవులవింగం – వేఱొకప్రతి) ౫. బాల. ౬. మా. ౭. వీరాగ్రణి యెవ్వ రింక. (26) ౮. నిరర్థంబులే. ౯. నేతిబీఱకులా. ౧౦. వితతప్రౌఢిమ. (27) ౧౧. సీమంత మంబున్. ౧౨. మీకు. ౧౩. శ్రీరామ యన్నంతం తావక మయ్యేఁ గాక. (28) ౧౪. బెవ్వారి. ౧౫. చెప్పనేల. ౧౬. లీఁజాలు నే.

శా. విందున్ వేదపురాణశాస్త్రముల గో।విందున్ ముకుందున్ హరిన్
విందున్ వేల్పునునైన భక్తసులభున్ । విశ్వంభరున్ సచ్చిదా
నందున్ నందుఁడు గన్నచిన్నిశిశువున్ । నాపాలిపాపాలిఁ బా
అం ద్రోలే నరసింహ నిన్ను రఘువీ।రా జానకీనాయకా. ౨౯

శా. సందిం బూసలలోన నీశవచర।క్షామంత్రరాజంబు పెం
పొందన్ వ్రాసి [1]ధరించినాతఁడు రిపు।వ్యూహంబులోనైన నే
[2]కందుం బొందక వజ్రపంజరముఁ బో। గాపున్నచందానఁ [3]బా
అం ద్రోలున్ బగవారినైన రఘువీ।రా జానకీనాయకా. 3౦

మ. వృథగా డెవ్వఁడు నిన్నుఁ గొల్చినఁ గృపన్ । వీక్షించి వాఁ డేమనో
రథమున్ వేఁడిన [1]నట్టులే యిడుదుగా । రక్షావిధేయుండవై
కథ గా దీవచనంబు నిక్క మటులే । కాదేని ము న్నేల సా
రథివై యర్జును తేరు దోల రఘువీ।రా జానకీనాయకా. 3౧

మ. ఘనసారంబులు లోనికిం గొనిన శ్రీ।గంధంబు పైఁ బూసినన్
దినమున్ మర్దనచేసినన్ గడిగినన్ । దృష్టంబులోనన్ దొలం
గనిదుర్గంధము నైజ మీమునికిదా।క్కల్ నమ్మి ని న్గొల్వనే
రనిమూఢాత్ముల నేమి చెప్ప ? రఘువీ।రా జానకీనాయకా. 3౨

మ. [1]ఇనుమా ఆశ్రితునిల్పువాఁడ వినుమా । జేమూటయున్ సాయకం
[2]బినుమా ఆహవభూమిఁ బూన విదిగా । కింకొండు మేలంచు నీ
[3]వినుమా త్రై దురితాంధకారపటలం । బేరీతి విన్పత్తు వు
గ్రనిశాటాంతక రామభద్ర రఘువీ।రా జానకీనాయకా. 33

మ. మును నే నెన్నఁడు వేదశాస్త్రపఠనం।బుల్ రిత్త తీర్థాటనం
బును దానంబును జేయఁబోను సతతం।బున్ నిన్ను సేవించి కీ
ర్తనఁ జేసేమతి లేదు దానమున క।ర్థస్వల్ప (?) మిం కెట్లు బో
రన నాదుష్కృతముల్ దొలంగు రఘువీ।రా జానకీనాయకా. 3౪

---

(30) ధరించువాఁడు రిపుస్గ్రాహంబులోనైన. ౨. కందం బొందక. 3. నార. (31) ౧. నట్లుసేయుదువుగా. (33) ౧. ఇనుమా రాస్మృతు లిచ్చువాడు ఇనుమా రామాటకున్ మాలకన్. ౬. వినమాకావనభూమి భూజనులరా కీవొడ్డుమేలంచు నీ. ౭. యినుమా రీ దురితాంధకారపటలం బేరీతి వీక్షింతువు.

మ. మును నా కెన్నఁడు [1]దోషముల్ గలవు నా । మ్రోలన్ భయంబంద కే
[2]మని దుర్మార్గులు కాలుబంటు లిఁక న । న్నాపేరు నీపేరు పె
ట్టినవానిం బరలోకదూరుఁ డని ప । ట్టే దెట్లు పొం డంచు బో
ధన రమిమ్మా యిపు డడ్డగింప రఘువీ । రా జానకీనాయకా. ౩౫

మ. అనఘుం డైన దశాశ్వమేధకృత[3]పుణ్యస్ఫూర్తి నీ కొక్క[4]ప్రా
ద్ధు నమస్కారము చేయఁ గల్గు నని వి । దున్ యాగధర్మంబులన్
గొనసాగున్ జననంబు [5]లొక్కమఱి నీ । కున్ [6]మ్రొక్కనేనిం బున
[7]ర్జననం బేడి తలంచిచూడ రఘువీ । రా జానకీనాయకా. ౩౬

మ. [8]దనుజద్విడ్జ్వలనాంతకాసురసము । ద్రస్వామివాయుత్రిలో
చనమిత్రాభవసూర్యసోమధరణీ । జాతాంబుజాతద్విజ
జ్ఞ[9]నాంగీరసశుక్రభానుతనయ । స్వర్భానుకేతు ప్రవ
ర్తనముల్ నీవిభవంబు లౌర రఘువీ । రా జానకీనాయకా. ౩౭

మ. కనుఁగొన్నప్పుడె గుప్పఁడే కుజనులన్ । గాలుండు కాలుండు పొం
డనుచున్ రౌరవనారకాగ్నులఁ బడన్ । హత్తించి యయ్యగ్నులన్
మునుఁగంజాలఁ బరేతరాజునకు న । న్నొప్పింప [10]నొప్పింప కు
గ్రనిశాటాంతక రామభద్ర రఘువీ । రా జానకీనాయకా. ౩౮

మ. నిను సేవించెద నంచుఁ గోరుకొని యుం । డే వానికిన్ బూర్వక
ర్మనిమిత్తంబు[11]నఁ గల్గుకష్టముల వే । మాయింప నీ వడ్డ మౌ
దని చెప్పంబడు ద్రౌపదిన్ గరిని బ్ర । హ్లాదున్ ధ్రువున్ మున్ను బో
రన రక్షించుట కల్దొ లేదొ రఘువీ । రా జానకీనాయకా. ౩౯

మ. అనిశంబున్ నినుఁ గొల్చుమానవులు ప్రా । ణాత్యంబునన్ రోగ[12]తా
పనిమిత్తంబున రామరామ యనుచున్ । వాక్రువ్వ లేకుండినన్
జననాథాగ్రణి నీవు వారిరసనా । స్థానంబునన్ నిల్చి బో
రన రామా యనిపింతు వౌర రఘువీ । రా జానకీనాయకా. ౪౦

---

(35) ౧. దోసముల్ గలవు నోపంబొందకే. ౨. మని...లిక న న్నా పేరు నా పేరుపె. (36) 3. పుణ్యశ్రీలు. ౪. మాటు. ౫. లొక్క మొగి. ౬. మ్రొక్క నీమంబున. ౭. జననం బెట్టిదలంపదొడ్డ. (37) ౮. దనుజుల్ రుజ్జ్వలకాంత. ౯. నాంగీరస (ప్రతిలో లేదు). (38) ౧౦. నొప్పింప(లేదు) (39) ౧౧. నఁ గల్గుకష్టముల వేమాయింప(లేదు) (40) ౧౨. బాధ

మ. ఇనవంశోత్తమ వేదశాస్త్రములలో । నే వింటి నేవింటివాఁ
డును నీకుం బ్రతి గాఁడు నీకుఁ గలబం । టున్ నన్ను రక్షించు కా
లునిబాటున్ [1]విదళింపఁగావలయు నా । లోనుండుమీ మెండుమీ
ర నమోఘాస్త్రము విల్లుఁ బూని రఘువీ । రా జానకీనాయకా. ౪౧

మ. జననాథాగ్రణి నిన్నుఁ గొల్చునతఁ డా । చండాలుఁ [2]డైనన్ బున
ర్జననం బొందక ముక్తిఁగాంచు నెనరన్ । సద్భక్తుఁ డేనిన్ మఱిన్
జనుఁ జండాలకులంబులోన నుదయిం । చన్ గోరి నీనామకీ
ర్తన సేయన్ నిరసించునేని రఘువీ । రా జానకీనాయకా. ౪౨

మ. జనకుం డెవ్వఁడు నీకు? నీకడుపులో । సర్వంబు నుండంగ నీ
యునికిస్థానము దుగ్ధవార్ధినడుమన్ । యోగీంద్రహృద్గేహ మే
మని వర్ణింపుదు నీమహత్త్వములు [3]స । ర్వాశ్చర్యముల్ పుణ్యవ
ర్తన రాజన్యయశోవిహార రఘువీ । రా జానకీనాయకా. ౪౩

మ. జనకుండా జనకుండు [4]సీసతికిఁ! గౌ । సల్యా యహల్యాఘమో
[5]చను నిగ్గాంచినతల్లి! [6]పంక్తిరథుఁడా । సర్వేశ మీతండ్రి! యే
మినిమిత్తంబున [7]నుద్భవించితివొ! న । మ్మెట్లు నీపుట్టు వు
గ్రనిశాటాంతక రామభద్ర రఘువీ । రా జానకీనాయకా. ౪౪

మ. హనుమంతుం డొకయబ్ధి దాఁటెనని యే । లా ప్రస్తుతుల్ సేయఁగా
దనుజారాతి భవత్పదాబ్జములు హృ । త్పద్మంబునన్ నిల్పునా
ఘనపుణ్యుండు భవాంబురాసులు తృణీ । కారంబుగా దాఁటు బో
రనఁ దా నెన్నను గొంకు లేక రఘువీ । రా జానకీనాయకా. ౪౫

శా. నీపాదోదక మత్తులం దదుముకొం । టిన్ గొంటి నాలోనికిన్
నీపళ్లెంబు ప్రసాదముం గుడిచితిన్ । నీపేరునుం బెట్టితిన్
నీపెన్ముద్రలు దాల్చితిన్ భుజములన్ । నీ వింక నన్నేగతిన్
బ్రాపై ప్రోచెదొ కాని పూని రఘువీ । రా జానకీనాయకా. ౪౬

---

(41) ౧. విదళింప. (42) ౨. డైనన్ తుదిన్. (43) 3. సర్వైశ్వర్యముల్. (44) ౪. మీసతికి. ౫. చన నిన్గన్న దితల్లి. ౬. పంక్తిరథుఁడో. ౭. నుద్భవించితివి నెమ్మిన్ నిట్లు.

మ. తపముల్ చేసినఁ బోనిపాపములు మం।త్రంబుల్ ౧దివారాత్రముల్
జపముల్ చేసినఁ బోనిదోషము నదీ।స్నానంబునన్ బోనిఘో
రపుకర్మంబులు వాయు నెక్కషరి శ్రీ।రామా యనేమాట క
ర్ణపథం బందునఁ జొచ్చెనేని రఘువీ।రా జానకీనాయకా. ౪౭

శా. కంపింతున్ మును దండధారికిని మ।త్కాయంబు వీక్షించి యుం
కింపన్ గారణ మేమి? నా కిఁక నినుం। గీర్తింపుచున్నాఁడ బల్
దుంపల్ గట్టిన ఘోరపాపముల సం।దుల్ ౨గోసివైవంగఁ బెన్
ఱింపం బైనది నీచరిత్ర రఘువీ।రా జానకీనాయకా. ౪౮

శా. నీమంత్రంబు ౩గదా సదాశివుఁడు ప।త్నీయుక్తుఁడై కాశిలో
౪నేమం బొప్ప జపించు నంచు స్మృతు ల।న్నీ నిన్నె వర్ణింపఁగా
నేమా నిన్ను నుతించువార ౫మయునన్ । నే నేర్చిన ట్లెన్నెదన్
రామా రాఘవ రామభద్ర రఘువీ।రా జానకీనాయకా. ౪౯

శా. నీమంత్రంబు జపించుమానవులకున్ । ౬నిశ్రేయమున్ శ్రీనిధుల్
హేమంబుల్ గొడుగుల్ తురంగములు మ।త్తేభంబు లాందోళికల్
గ్రామంబుల్ నగరంబులున్ విభవముల్ ।రాజ్యంబులున్ రత్నముల్
౭రామారత్నము లేమిలెక్క రఘువీ।రా జానకీనాయకా. ౫౦

శా. గోమేధాధ్వర మశ్వమేధశతముల్ । గోదానభూదానముల్
హేమాద్రుల్ తిలపర్వతంబులు ౮సువ।ర్ణేభాశ్వదానంబులున్
౯నీమంత్రం బగు నక్షరద్వయిని బొం।దేపుణ్యముం బోల దో
రామా రాఘవ రామభద్ర రఘువీ।రా జానకీనాయకా. ౫౧

శా. గోమాంసాశని మద్యపాని ౧౦సగరున్ । గొండీఁడు చండాలుఁడున్
హేమస్తేయుఁడు సోదరీరతుఁడు కూ। డేకాదశిన్ ౧౧భుక్తిచే
నేమాఘాత్ముఁడు లోనుగాఁగలుగు దు।శ్శీలాత్ముఁ డైనన్ దుదిన్
రామా యన్నను ముక్తి ౧౨గాంచు రఘువీ।రా జానకీనాయకా.

---

(47) ౧. సమర్పణంబులా. (48) ౨. గోసివేసెతిరెన్. (49) 3. సదా. ౪. నీమం బొప్ప జపించె నంచు శ్రుతులన్ నిన్నెన్ని వర్ణింపగా. ౫. మనుచుం. (50) ౬. నిశ్రేయసహా నర్థముల్ (నిశ్రేయసశ్రీనిధుల్ వేఱొక ప్రతి) ౭. రామారత్నమ యేమిలెక్క. (51) ౮. సువర్ణాశ్వాది దానంబులన్. ౯. మీమంత్రంబగు అక్షరద్వయమునం యేపుణ్యముం బోలదో (నక్షరద్వయమునే నీపుణ్యముం బోలదో. వేఱొక ప్రతి) (52) ౧౦. సగరిన్. ౧౧. భుక్తిగొన్న. ౧౨. గాంతు.

శా. ఏమీ పాతకులార మాపురికి ౧రా । రీపుట్టునం దున్నత
శ్రీమైఁ బోయెద రెందుకన్న జమునిన్ । గ్రీఁగన్నులన్ జూచుచున్
రా మయ్యా యిఁకమీఁద నంచు నపవ । ర్గస్వర్గముం జొత్తురో
రామయ్యా నినుఁ గొల్చువారు రఘువీ । రా జానకీనాయకా. ౫౩

శా. స్వామిద్రోహిని తమ్ముఁ డెట్టు ఘనరా । జ్యం బెట్టు నీవిచ్చు టె
ట్టామాటల్ విని కాదె నిన్ను నడిగే । యాశక్తి నాకున్న దొం
డేమిన్ బల్మఱు వేసరింప ౨కిఁక నే । సీరాదె నీసీమలో
గ్రామం బొక్కటి చాలు నాకు రఘువీ । రా జానకీనాయకా. ౫౪

శా. మామాయంచును మామ యంచు నెపుడున్ । మాయల్లుఁడుద్వృద్ధతిన్
హేమాద్రి ప్రతిమానమైన ౩హరువి । ల్లేవిల్లు మోపెట్టఁగా
సామర్థ్యంబున ౪మేటి యీతఁ డనుచున్ । సత్త్వంబు ౫వర్ణించునా
రామా రాఘవ రామభద్ర రఘువీ । రా జానకీనాయకా. ౫౫

మ. కమరం గ్రాఁగిన లోభివానితలపు । న్కం గుక్కమాంసంబు మ
ద్యముతో వండుక తిన్నమాలఁడయినన్ । దత్పాపకర్మంబులన్
యమకూపంబులలోపలం బడఁడు జి । హ్వాగ్రంబునన్ రామమం
త్రము పేర్కొన్నను నార! రామ రఘువీ । రా జానకీనాయకా. ౫౬

మ. యమకూపంబులలోపలం బడి ౬మహా । హైన్యంబునుం బొందకుం
డ ముదంబారఁగ నన్నుఁ బ్రోచి కరుణన్ । సాయుజ్య మిమ్మా తుదిన్
గ్రిమిరూపున్ దనరూపుగాఁ బెనచి ర । క్షింపన్ విచారించునా
భ్రమరంబుం బలెఁ బాపదూర రఘువీ । రా జానకీనాయకా. ౫౭

మ. మమకారంబున సార్వకాలమును నీ । మంత్రంబు వాక్రుచ్చుడెం
దము నాకుం గలుగంగని మ్మటుల నై । నన్ ౭మృత్యువక్త్రమ్ము దూ
ఱము నిన్నున్ మతిదూఱమంతనపవ । ర్గస్వర్గమార్గంబు దూ
రము గాకుండును మాకు ౮రామ రఘువీ । రా జానకీనాయకా. ౫౮

---

(౫౩) ౧. రా రీపట్టునం దున్నత. (54) ౨. కవిసే. (౫౫) ౩. హరివి ల్లేపార. ౪. వీడు మేటియని నీ. ౫. వర్ణింపుచున్. (57) ౬. మహాదైన్యంబునుం. (౫౮) ౭. మత్యువశ్యము. ౮. ఔర.

మ. తమగర్వంబున దారుపుంగుఁ డగుచున్ । దైవంబు మంత్రంబు తం
త్రములన్ వీడఁగ నాడుచున్ దిరుగుని। ర్భాగ్యుల్ మహారాజులై
మము నూరింపఁగ నేము ని న్నెఱఁగి నీ। మంత్రం బొజెంగిన్ దరి
ద్రమతిన్ వేడఁగఁబోవు టెట్లు రఘువీ। రా జానకీనాయకా. ౫౯

మ. హిమధామ ప్రతిమానకాంతియుతు లై । యింద్రాదిదిక్పాలకుల్
తములన్ ¹స్తోత్రము సేయ నుండుదురు నీ । దాసానుదాసుల్ సుర
ప్రమదాపల్లవపాటలాధరసుధా। పానాది కేళీవిహా
రములన్ మీఱుచు మీరు చూడ రఘువీ। రా జానకీనాయకా. ౬౦

మ. ప్రమదారత్న మహల్య ²గౌతమమునీం। ద్రప్రాప్తపాషాణరూ
పముతోఁ బెక్కుయుగంబు లుండఁగ హరి। బ్రహ్మాదులుం ³బాపలే
ని మహాపాపముఁ బాప నోపినదిగా । ⁴నీపాదరేణుప్రకా
రము నే నేమని ⁵నన్నుతింతు రఘువీ। రా జానకీనాయకా. ౬౧

శా. నిమ్మాం ⁶గొల్వఁ దలంచి పాపముల నెమ్మిన్ ⁷ద్రోసినా నింక నే
నెమ్మిన్ సౌఖ్యముఁబొందువాఁడ ⁸నగుచున్ । నీమూర్తి భావించెదన్.
⁹మమ్మాదీనితలంపు మేలని కృపన్ । ¹⁰మన్నించి నాలోనికిన్
రమ్మా నన్నుఁ గృతార్థుఁ జేయ రఘువీ। రా జానకీనాయకా. ౬౨

శా. నాయజ్ఞానముఁ బాపు మంచు మదిలో । నానాప్రకారంబులన్
గూయం గూయ న దేమిరా యనవు నీ। కున్ మ్రొక్కినా కుక్కినా
చీ యం చేటికి రోఁతగించెదవు నీ । చిత్తంబు రాకుండినన్
బ్రాయశ్చిత్తము నాకు నెద్ది రఘువీ। రా జానకీనాయకా. ౬3

మ. నియమం బొప్ప ననేకజన్మములనుం। డిన్ దాఁచుకొన్నట్టి సం
చయదోషంబులు మాటమాత్రమునఁ గొం। చంబోవుఁ జోరత్వ మె
న్నియుపాయంబుల ¹¹నభ్యసించినవియో । నీనామముల్ వేయు నా
రయ ¹²లీలన్ వివరించు టెట్లు రఘువీ। రా జానకీనాయకా. ౬౪

(60) ౧. స్తుత్యము సేయ. (61) ౨. గౌతమునిశాపఃప్రాప్తి (గౌతమమునీశాప
ప్రాప్త. (వేఱొకప్రతి) 3. బాపరామి. ౪. మీపాదరేణుప్రభావము: ౫. నిన్నుతింతే.
(62) ౬. గొల్చి తలంచి పాపములు. ౭. జొచ్చిరానీకనే (బోసినానింకనే). ౮. నను
చుం. ౯. రమ్మా వీనితలంపు. ౧౦. రక్షించ. (64) ౧౧. నభ్యసించినదియో. ౧౨. నీలా
న్వివరించు టెట్లు.

శా. ౧తారుణ్యోదయ యొంటిమిట్టరఘునాథా నీకు నేఁ బద్యముల్
౨నూఱుం జెప్పెద నూరు పేరు వెలయన్ నూత్నంబుగా నంత నా
నోరుం బావన మౌను నీకరుణఁ గాంతున్ భక్తి నన్నుం దయన్
రా రమ్మందురు గారవించి రఘువీరా జానకీనాయకా. ౬౫

శా. చీరల్ దియ్యకు చన్నుగుబ్బలపయిన్ జీకాకుగాఁ గాకుగా
చేరల్ దియ్యకు మందబోయఁ డడె వచ్చెన్ వద్దురా వద్దురా
జారల్ మేనులజారలం గవయుకృష్ణా యేకపత్నీవ్రత
ప్రారంభం బిపు డేల నీకు రఘువీరా జానకీనాయకా. ౬౬

మ. తిరునామంబు ధరింపఁడేని నొసటన్ దిక్పూరితం బైన నీ
వరనామంబు దలంపఁడేని మదిలో వాంఛించి నీపాదపం
కరుహశ్రీతులసీదళోదకము ద్రాగండేని వాఁ డెట్టినే
ర్పరి వైకుంఠపురంబు చేర రఘువీరా జానకీనాయకా. ౬౭

మ. శరణం బన్నను మాటమాత్రమున విశ్వద్రోహితోఁబుట్టుకున్
గరుణాపూర్ణవిలోకనం బొదవ లంకారాజ్యసింహాసన
స్థిరపట్టం బొనరించినాఁడవట యే దేవుండు ౩నీపాటి యు
ర్వరలోనన్ భవరోగదూర రఘువీరా జానకీనాయకా. ౬౮

మ. పరనారీకుచకుంభ౪పాళికలపైఁ బాదాబ్జయుగ్మంబుపై
గరమూలంబులపైఁ గపోలతటిపైఁ గంఠంబుపైఁ గొప్పుపైఁ
బరువుల్ ౫వాఱెడు నాతలంపులు మిమున్ భావింపఁగాఁ జేసి స
ర్వగసాధీశ్వర నన్నుఁ బ్రోవు రఘువీరా జానకీనాయకా. ౬౯

మ. నరకుల్ గ్రాఁగినయినుప ౬కంబముల నంటం గట్టఁగాఁ గొట్టఁగాఁ
బొరలం బొర్లఁగఁ గక్కురాలఁ గొని వీపుల్ గోయఁగా వ్రేయఁగా
నరకావాసులలోన నుండెదరు నీనామంబు వర్జించి దు
ర్మరణంబుల్ గని చన్నవారు రఘువీరా జానకీనాయకా. ౭౦

(65) ౧. కారుణ్యోదయ ఒంటిమిట్ట. ౨. నూఱుల్ చెప్పిన నోర చేరు. (68) 3. నీ
సాటి పూర్వరలోనన్. (69) ౪ పాలికలపై. ౫. బారెడు (70) ౬. కంభముల.

మ. పురసంహారునిచాపమున్ ౧జివుకదం।పుద్రుంచి పోఁజూచినన్
౨బరశూదగ్రభుజుండు పోవిడుచునే। ౩భంజించుఁగా కంచు ని
ష్ఠురముల్ పల్కినభార్గవున్ ౪నిజబలా।టోపంబు వారించి ని
ర్భరశాంతంబునఁ గాచి తౌర రఘువీ।రా జానకీనాయకా. ౭౧

మ. స్మరసంహారుడు గౌరిపొత్తున భుజం।పన్ బిల్వ నే రాను శ్రీ
హరినామంబులు వేయు నెన్నవలె ని।త్యం బైననో మన్న నో
౫యరవిందానన వేయు నేటికిని రా।మా యన్ననే చాలుమం
త్రరహస్యంబు దలంతు నేను రఘువీ।రా జానకీనాయకా. ౭౨

శా. బాలత్వంబునఁ గొంతకాలము వృథా। ౬పాల్మాలి దుర్బుద్ధినై
౭చాలన్ యౌవనమందు గర్వమతినై। సంసారినై దుష్క్రియా
జాలభ్రాంతిఁ జరింతుఁ గాని నినుఁ గాం।చుం గొల్వలే దయ్యె హే
రాళం బైనది చింత వంత రఘువీ।రా జానకీనాయకా. ౭౩

శా. సాలగ్రామశిలాశిలోచ్చయగయా।స్థానప్రయాగస్థలుల్
పోలం జూచెద నంచుఁ బోవఁదలఁతున్। బోలేను మీదాసులన్
బోలే నన్నను బుద్ధి పుట్ట దిఁక నేఁ। బుణ్యాత్ముఁ డౌ టెట్లు హే
రాళం బైనది చింత వంత రఘువీ।రా జానకీనాయకా. ౭౪

మ. కొలువం జాలక మాన నీనుతులు పె।క్కుల్ సేయుట ల్మాన నిన్
దలఁపం జాలక మాన నేఁ గలసి నీ। దాసానువర్గంబుతో
నిలువం జాలక మాన నేఁ గడపటన్। నీ నామముల్ విన్నవా
రలకుం గల్గును మోక్షలక్ష్మి రఘువీ।రా జానకీనాయకా. ౭౫

మ. తలఁపన్ జిత్రము మీ౮మహత్త్వములు మీ।దాసుల్ మహాభాగ్యవం
తులు త్రైలోక్యమునన్ ౯బదస్థులు ధ్రువుం। డుండున్ నభోమండలిం
బలి పాతాళమునన్ విభీషణుఁడు భూ।భాగంబునన్ బద్మజ
ప్రళయం బైనను బోవ కౌర రఘువీ।రా జానకీనాయకా. ౭౬

---

(71) ౧. చివుకవంచుక్ ద్రుంచిపోవై చినం. ౨. బరశూరాగ్రభుజుండ. 3. భజంతుగా కంచు. ౪. నిజభుజాటోపంబు. (72) ౫. యరవిందాసన. (73) ౬. పాశంబుచే. ౭. జాలుం జవ్వనమందు. (76) ౮. మహాత్మ్యములు. ౯. బదస్థుఁడై ధ్రువుఁడుండున్.

మ. చెలఁగెన్ మర్త్యులు వేగి లేచి తమచేసే వెల్లఁ బాపంబులే
కలుషంబుల్ పెడవాయ నేది గతి యింకం ద్రోవ యొండేది పు
ర్వులగుట్టం బడఁబోక [1]భూతదయ నేర్పున్ బుద్ధియున్ గల్గువా
రలు నీసేవకు లౌట లెస్స రఘువీరా జానకీనాయకా. ౭౭

మ. కలకాలంబు వ్రతంబులున్ జపములున్ గావించి యన్యుల్ తుదిన్
గలకాలంబునుబోలె నిర్జరపురీకాంతాకుచాలింగనం
బులఁ గొన్నాళ్లు సుఖించి క్రమ్మఱ నిలం బుట్టేరి నే మెచ్చ ని
ర్మలముక్తుల్ నినుఁ గొల్చి కాంతు రఘువీరా జానకీనాయకా. ౭౮

మ. నిలువెల్లన్ బులకాంకురంబు లొదవన్ నీపాదతీర్థంబుఁ దు
దులసీపర్ణ మొకించుకంతఁ గొనినన్ దోషాలు ఖండింపఁగాఁ
[2]బాలసాకుల్ దినఁగాన నుబ్బులబడిన్ బోనేల మోహంబు కూ
రలనుం నారల నేల గల్గు? రఘువీరా జానకీనాయకా. ౭౯

మ. [3]చెలువంబొప్పుసువర్ణముద్ర లితరుల్ చెల్లించుచోఁ గ్రొత్తకా
కలనీముద్రలు చూడఁ జెల్లుబడిచక్రా లంచు [4]వేయించుమమం
డలనాథాగ్రణి క్రొత్త నీబలిమి నానావర్ణపుందోలుము
ద్రలుచెల్లించితి విందు నందు రఘువీరా జానకీనాయకా. ౮౦

మ. ప్రళయాపాదితకాల[5]మృత్యునిభ యీ రాకాసి రా కౌశివా
దులు వారింపఁగ నోప రింక నెటుఁ జొత్తున్ [6]నెత్తుఁగా కన్నసం
చలితున్ గౌశికుఁ గాచి [7]తాటకను శస్త్రజ్వాలచేఁ ద్రుంచి దో
ర్బలశక్తిన్ విలసిల్లి తౌర రఘువీరా జానకీనాయకా. ౮౧

మ. చిలుకన్ [8]ముద్దులు చిల్కఁ [9]బల్కుతఱి రాజీవాక్షి యొక్కర్తు[10]ని
చ్చలు రామారఘురామరా వెయనినన్ సాలోక్య[11]సామీప్యముల్
కొలఁదుల్ మీఱఁగ నిచ్చినాఁడవట నీకుం బిడ్డపే రిడ్డ వా
రల[12]పుణ్యంబున కేది మేర రఘువీరా జానకీనాయకా. ౮౨

(77) ౧. భూతదయ (ప్రతిలో లేదు) (79) ౨. బాలపాకుల్. (80) 3. చెలువంబైన సువర్ణముద్రవితతుల్. ౪. వేయించ. (81) ౫. మృత్యువగుయా. ౬. జొత్తుగా కున్న సంజలితుం. ౭. తాటకి నొక (తాటకి మహా) (వేఱొకప్రతి) (82) ౮. బుద్ధుల (వేఱొకప్రతి) ౯. బల్చెతఱి రాజీవాక్షు యొక్కర్తె. ౧౦. యిచ్చల నోరాఘవ. ౧౧. సాయుజ్యముల్. ౧౨. పుణ్యంబుల.

మ. ఇల నిన్నుం దొలుబామునం దలఁపనై । తీజన్మమం దైన నా
తలఁపుల్ మీపదపంకజంబులపయిన్ । దాఁపింతు నే నిఁక బి
డ్డలలోఁ జిట్టెలలోన నంబువులఁ బుట్టం బుట్టఁగా నోపఁ గ
ర్మలతాబంధముఁ బాపుమయ్య రఘువీరా జానకీనాయకా. ౮౩

మ. ఇల నీమీఁదను జాల భక్తి గలవాఁ । డేమెట్టివాఁడైన నే
ఖలుఁడైనన్ దుది నుత్తమోత్తముఁడగున్ । గాదన్నఁ గొంగిడ్చెదన్
దెలుపన్ నిల్చిన నాఁడుకొన్నఁ బరవాదిన్ గెల్చెదన్ వేదశా
స్త్రులసద్వ్యాఖ్యనుతప్రతాప రఘువీరా జానకీనాయకా. ౮౪

శా. దేవా నా దొకవిన్నపంబు గల దేదీ యంటివా వింటివా
త్రోవన్ దండధరుండు ౨దుర్గతుల కే త్రోవన్ విచారించునో
యేవిఘ్నం బొనరించునో యెఱుఁగరాదే ముక్తికిన్ బోవుచో
రావే వెంబడి నింతనంత రఘువీరా జానకీనాయకా. ౮౫

శా. గోవం దొల్లిటికాలజన్మముల నీకుం బంటు గానైతిఁగా
చీ వక్రంబులె కాక నాకు నివి లక్షింపంగ జన్మంబులా
చావుం బుట్టువు మాన్పకోవలయు నీజన్మావ నీవాఁడ నై
రావా నామది కింక నైన రఘువీరా జానకీనాయకా. ౮౬

శా. చావుల్ మర్త్యుల కెల్లఁ గల్గుటను నిన్నుం దేహముల్ దేహముల్
చేవల్ గల్గిననాఁడె ౩శ్రీహరి గయా । శ్రీవేంకటాహోబల
గ్రావప్రాంత్యములందుఁ జేరవలెఁ జేరంబోవ కే లబ్బు నా
ర్యావాణీస్తుత మోక్షలక్ష్మి రఘువీరా జానకీనాయకా. ౮౭

శా. త్రోవ న్మానవుఁ డొంటిఁ బోవుతఱి నీస్తోత్రంబు వాక్రుచ్చినన్
నీవుం దమ్ముఁడుఁ దోడు ౪వత్తురఁట నా । నెయ్యంబు తియ్యంబుగా
౫నీవంటాప్తుఁడు నిన్నుఁ బోలుహితుఁడున్ నీవంటిభక్తప్రియా
ప్రావీణ్యుండును లేఁడు ౬చూడ రఘువీరా జానకీనాయకా. ౮౮

---

(84) ౧. వాఁడైయెట్టి. (85) ౨. దుర్గతులకై. (87) ౩. శ్రీగిరి. (88) ౪. వత్తు వటకా వత్తువట నీ (వేఱొకప్రతి) ౫. నీవంట్యాప్తుడు. (నీవొంట్యాత్ముఁడు) (వేఱొక ప్రతి) ౬. యింక.

మ. నవనీతంబుల కేల పాఱెదవురా । నాయన్న రా యన్న రా
యివి దూత్యంబులు గాఁగ గోపికలు నీ।యింటన్ బదార్థంబు లె
య్యవి లే వంచు వచించునమ్మకడ కో।య్యం జేరు[౧]నీచేయుమా
రవినోదంబులు నేఁ దలంతు రఘువీ।రా జానకీనాయకా. ౮౯

మ. వివిధబ్రహ్మలయంత్యకాలముల [౨]నే।వీ నిల్వ వా వేళలన్
ధ్రువుఁ డుండు విభీషణుండు బలి యుం।డున్ వారు నీదాసులై
నవిశేషంబునఁ గాక తక్కొరుల కుం।డంబోలునే యింద్రరు
ద్రవిరించిస్తుతశౌర్యసార రఘువీ।రా జానకీనాయకా. ౯౦

మ. చెవి నీనామము వింకనో యని కడున్ । శంకించి కర్ణంబులన్
రవముల్ మీఱినఘంట లంట నిడి ఘం।టాకర్ణుఁ డే తేరఁగా
నవి చూచిన్ వర మిచ్చినాఁడవట నీ । యంఘ్రిద్వయీసేవక
ప్రవరుం గాచుట యేమిలెక్క రఘువీ।రా జానకీనాయకా. ౯౧

మ. రవిసూనునన్ బరిమార్చి యింద్రసుతునిన్ । రక్షించినాఁ డందునో
రవిసూనుం గృపనేలి యింద్రసుతుఁ బో।రం ద్రుంచినాఁ డందునో
యివి నీయందును రెండునుం గలవు నీ । కే దిష్టమో చక్కఁగా
రవివంశాగ్రణి తెల్పవయ్య రఘువీ।రా జానకీనాయకా. ౯౨

శా. దోసంబుల్ కులపర్వతంబులకొలం।దుల్ గల్గినన్ గల్గనీ
మీసంకీర్తనశబ్దమాత్రమున భ।స్మీభూతముం [౩]జేయుఁగా
త్రాసుల్ కోటిసహస్రముల్ గలిగి యం।తన్ రాని కార్పాసపున్
రాసుల్ సొప్పననిప్పువోలె రఘువీ।రా జానకీనాయకా. ౯౩

మ. కసుమాలంబగు దేహిఘట్టువుల నీ । కష్టంబులం బాపి ది
వ్యసుకాయంబొనరింతు వెవ్వఁడునినున్ । వాక్రుచ్చినన్ యోగి[౪]మా
నసగేహంబులనుండి లోహము సువ।ర్ణచ్ఛాయఁగాఁ జేయఁగా
రసవాదంబులు నేర్చి తౌర రఘువీ।రా జానకీనాయకా. ౯౪

(89) ౧. నీసేయు మావవినోదంబులు. (90) ౨. నేదీ నిల్వ దా వేళలన్. (93) ౩. సేయఁగా. (94) ౪. మానసగేహంబుల.

మ. పసులం గాచినగొల్లవాఁడ వనుచున్ । భావింతు నెంతున్ మదిన్
ముసలిప్రాయమువాఁడవైతి వనుచున్ [1]మూర్తిత్రయాకారుని
న్వసుధాధీశ్వరు నిన్ను [2]నిక్క మెఱుఁగన్ । సర్వాపరాధిన్ గృపా
రసపాథోనిధి కావుమయ్య రఘువీరా జానకీనాయకా. ౯౭

మ. పసిఁడిం జూచి మహాప్రదాత [3]యని బీభత్సాతిరుత్సాంగునిన్
ప్రసవాస్త్రప్రతిమానరూపుఁ [4]డనుచున్ । బంధన్ బ్రియం బంద శ
త్రుసమూహాంతకుఁ డంచు నెప్పుడు నరస్తోత్రంబు గావించునే
నసుఁడన్ నిన్ను నుతింపనేర రఘువీరా జానకీనాయకా. ౯౮

మ. బహురూపాలు ధరించుకొంచును గ్రియాభాషాంగముల్ ముట్టఁగా
బహుకాలంబులనుండి యాడితి నీకం । బాల్మోలిన ట్లయ్యెడిన్
దహలం బెట్టక చాల్పురే యనుము నీ । త్యాగంబు నే నెల్ల నా
గ్రహదైతేయపదాపహార రఘువీరా జానకీనాయకా. ౯౯

శా. మోక్షాపేక్ష జనించె నాకు నిది యేమో కాని యీజన్మమం
దక్షీణోదయ ముక్తి కెవ్వఁ డొడయం । డా పుణ్యు నేఁ జెప్పెదో
దక్షారిస్తుత నీవె కర్త వయితే । దక్కోల నీవే నన్
రక్షించేదో యెఱుంగఁ జెప్పు రఘువీరా జానకీనాయకా. ౯౯

శా. అక్షీణప్రతిమానదాన[5]విభవాహంకారపారీణ యో
రక్షోదైత్యమదాపహార [6]విబుధత్రైలోక్యసంరక్షకా
దక్షధ్వంసవధూటికావినుత నీ । దాసానుదాసుండ నన్
రక్షింపంగదవయ్య [7]రామ రఘువీరా జానకీనాయకా. ౯౯

మ. చదువుల్ [8]దొంగిలి సోమకాసురుఁడు భాషాభర్త గూపెట్టఁగా
నుదధుల్ [9]సొచ్చినఁ బాఱి పట్టుటకు నుద్యోగించి మత్స్యంబవై
యదనంటన్ రిపుఁ ద్రుంచి వేదములు దేవా దేవ శాండిల్యనా
రదకౌండిన్యనుతప్రతాప రఘువీరా జానకీనాయకా. ౧౦౦

(95) ౧. మూర్తిత్రయాకార. ౨. నిక్క మెఱుగక సర్వాపరాధిన్. (96) 3. యనుచుక బీభత్సరుత్సాంగునిన్. ౪. డగుచున్. (99) ౫. విభవోహంకార. ౬. విబుధా త్రైలోక్యసంరక్షకా. ౭. రామ (ప్రతి లేదు) (100) ౮. దొంగిలె. ౯. సొచ్చినవాని బట్టుటకునై నుద్యోగించి.

మ. దనుజాధీశులు నిర్జరాధిపతులున్ । దామందఱున్ [1]మందరున్
ఘనసత్త్వంబున నెత్తి పట్టి జలధిం । [2]గర్వంబుగాఁ ద్రచ్చుచో
మునుఁగం బోజకయుండఁ గచ్ఛపమవై । మున్నీటిలో నుండున
ర్తన మే నాత్మఁ దలంచుచుందు రఘువీరా జానకీనాయకా. ౧౦౧

మ. ధర కల్పాంతమునన్ గరంగబడి పాతాళంబులో [3]నంటినన్
[4]దారయన్ దొల్లిటియట్లకా నిలుప నుద్యోగించి క్రోడంబవై
[5]పారి నబ్భూతల మెత్తినట్టి ఘనదర్పున్ నిన్ను భావింతు ని
ర్భరకారుణ్య [6]నిరూఢచేత రఘువీరా జానకీనాయకా. ౧౦౨

శా. ఏతాఁగాక మురాంతకుండు గలఁడా । యెందైన నిందైన నీ
చేతల్ మానుమటంచుఁ దండ్రి సుతునిన్ । స్తంభంబులోఁ జూపరా
చూతం బన్న నృసింహరూపమున [7]నచ్చోనుండి దండింపవా
రాతిం బోలిన [8]దైత్యుమేను రఘువీరా జానకీనాయకా. ౧౦౩

మ. వడుగా నీ [9]వడుగంగనేర [10]నివిట నల్పం బైన [11]దానంబు న
న్నడుగన్ వచ్చితి వన్నఁ గన్గొని బలీంద్రా నాకు నీ విచ్చుమూఁ
డడుగుల్ మూఁడుజగంబులంచుఁగొనవా [12]ద్యంతంబులున్ మాటమా
ర్పడ [13]నాడే మతికాఁడ వౌర రఘువీరా జానకీనాయకా. ౧౦౪

మ. నిను నారాయణమూర్తిఁగాఁ దలఁచుచు । న్నిదండ నాదండకా
[14]వనవాచంయములెల్లఁ జేరి కొలువన్ । వారిం గృపన్ జూచుటల్
వనధిం గట్టుట రావణుం దునుముటల్ । వర్ణింతు రామావతా
రనిరూఢాకృతి [15]నిన్ను సౌర రఘువీరా జానకీనాయకా. ౧౦౫

మ. [16]సమరక్షోణిని బారబారగ జరాసంధాదులం ద్రుంచి చం
డమదాభీలుని ధేనుకాసురునిచట్టల్ చీటి ముష్టిప్రహా
రములన్ ముష్టికునిం బ్రలంబదనుజున్ । మ్రగ్గించితే రేవతీ
రమణాకారముఁ [17]దాల్చి యౌర రఘువీరా జానకీనాయకా.

---

(101) ౧. మంథరన్. ౨. గర్వంబుగా. (102) ౩. జొచ్చినన్. ౪. ధరయుం దొల్లిటియట్ల. ౫. త్వరితం భూతలమెత్తినట్టి ఘనసత్త్వం. ౬. నిరూఢచిత్త. (103) ౭. నచ్చోనుండవాఖండలా. ౮. దైత్యుమేల్. (104) ౯. వడుగన్నై రంగవిట. ౧౦. వది (వేటొకప్రతి) ౧౧. దానంబులం నడుగ న్వచ్చితి. ౧౨. అత్యంతమునం మాడుమా. ౧౩. నాడీముడి కాగడవౌదు. (105) ౧౪. వనవాసంయములెల్ల. ౧౫. నన్న నిన్ను. (106) ౧౬. సమరక్షోణు ల్బారబారగ. ౧౭. దాల్చితౌర.

మ. అమరారాతివధూటికారమణుల । న్నశ్వత్థనారాయణ
ద్రుమముం గౌఁగిటఁ జేర్పఁజేసి ¹⁰⁷వ్రతముం । దూలించి బుద్ధావతా
రమునన్ రుద్రసహాయుఁడై త్రిపురముల్ । వ్రగ్గించితౌ వీర ధీ
ర మునిస్తుత్య యశోవిహార రఘువీ।రా జానకీనాయకా. ౧౦౭

మ. కలికాలాంతమునన్ గిరాతజనముల్ । గర్వించినన్ తత్కిరా
తుల నెల్లన్ విదళింపుచుం గృతయుగో।ద్ద్యోతంబుఁ గావింప నిం
పలరన్ గల్కియనంగ నున్నహరి ని । న్నత్రాంతముం గొల్చువా
రలు పుణ్యాత్ములగణ్యశూర రఘువీ।రా జానకీనాయకా. ౧౦౮

మ.* అమరుల్ రాక్షసనాయకుల్ కణకతో । నత్యంతగర్వంబునన్
తమ సత్వంబుల మందరాచలముచే । దర్పంగ నంభోధిలో
రమణం దద్గిరి మోచి కాచిన జగ।త్ప్రాణుండ కూర్మావతా
ర మనంగమరితి నీవె కావె రఘువీ।రా జానకీనాయకా.

అయ్యలరాజ త్రిపురాంతక మహాకవివినిర్మిత మగు

ఒంటిమిట్టరఘువీరశతకము

సర్వము సమాప్తము

---

(107) ౧. వ్రతముల్ దూలించి.

# పీఠిక

శ్రీ నారాయణశతకమును పరమభాగవతోత్తముఁడు పోతనామాత్యుఁడు రచియించినటులు ప్రతీతి గలదు. ఆప్రతీతిని సమర్థించుటకు సరియైన యాధారము లింతవఱకును చిక్కలేదు. పోతరాజు వీరభద్రవిజయమును భోగినీదండకమును నారాయణశతకమును శ్రీమద్భాగవతమును రచియించినటులు వాడుక గలదు. వీరభద్రవిజయమును భోగినీదండకమును పోతన రచియించినదియును లేనిదియును ఇంకను నిర్ధారణ కాలేదు. పోతన రచియింపలేదను నభిప్రాయమే బలీయముగ నున్నది. ప్రస్తుతము విషయవాదము నారాయణశతకమున కవసరము గాదు. నారాయణశతకమును వెల్లంకి తాతంభట్టును కస్తూరిరంగయ్యయును పేర్కొనిరి. అందువలన నిది ప్రాచీనశతక మని తెలియుచున్నది. ఆంధ్రప్రజాముఖస్థమై సుప్రసిద్ధమై గంభీరమైన నారాయణశతకము నందలి ఈ క్రింది సుత్తేభవృత్తము

మ. ధర సింహాసన మై నభంబు గొడు గై ♦ తద్దేవతల్ భృత్యు లై
పరమామ్నాయము లెల్ల వందిగణ మై ♦ బ్రహ్మాండ మాగార మై
సిరి భార్యామణి యై విరించి కొడు కై ♦ శ్రీగంగ సత్పుత్రి యై
వరుస న్నీఘనరాజసంబు నిజ మై ♦ వర్ధిల్లు నారాయణా.

భావములందును భాషయందును శైలియందును భాగవతపు రీతులను గలిగి పోతనకర్తృత్వమును సకలవిధములను స్ఫురింపజేయుచున్నది.

నారాయణశతకమునకును భాగవతమునకును పద్యముల నడకయందును భాషయందును భావములందును భాగవతభక్తియందును శైలియందును గల సాదృశ్యము పోతనరచనను సమర్థించుచున్నది. ఈ శతకకర్తృత్వవిషయమునను ఇతరకర్తల బాధ లేనపుడును పోతనకర్తృత్వమును నంగీకరించుట యుక్తముగ నున్నది. నారాయణశతక కర్తృత్వమును పోతనకు నిరూపించుట సులభ మైనను విషయనిర్ణయమును సహేతుకముగఁ జేయుట దుర్లభముగ నున్నది. పోతన కాలనిర్ణయము స్థలనిర్ణయము దురవగాహమై దురభిమానమునకు మూలమైనది. ఆంధ్రహృదయప్రియుఁడును శ్రీమద్భాగవతకర్తయును నైన పోతనామాత్యుని నివాసస్థలవిషయమునను కాలవిషయమునను నిజము తేలక భేదాభిప్రాయములు ప్రబలియున్నవి. ఓరుగల్లు ఒంటిమెట్టవాద మందఱకును దెలిసినవిషయము. ఏకశిలానగర నామమును దాల్చిన యోరుగల్లు ప్రాంతమే పోతన్నకు వాసస్థల మనుభావము పండితాదరణమును బొందినది. పోతన యింటిపేరును నొసగూర్చిన బమ్మెరగ్రామము ఓరుగల్లునకు సమీపమునను గలదు. పండితులు బాగుగ విషయాన్వేషణమును జేసి సత్యమును వెల్లడిచేయుదురుగాత !

కర్తృత్వము:—శతకమునందు కవి తనకులగోత్రనామములను దెలుపలేదు. దేశమునందు పదిపండ్రెండు ప్రతు లున్నవి. శతకాంతమునందు ముద్రింపఁబడిన గద్యము తాళపత్రప్రతులందు లేదు. ఇది రెండు కాగితపుప్రతులలోమాత్రము వేఱుసిరాతో వ్రాసియున్నది. ప్రతులను వ్రాసినవారు పోతన భాగవతగద్యమునే శతకాంతమునందు వినికిడి

వలననో యూహావలననో చేర్చియుందురని యూహింపఁదగియున్నది. దేశమునందు వివిధ ప్రాంతములందుఁగల ప్రతులను కాలక్రమమున నేర్పడిన యనంతమైన పాఠభేదములును శతక వ్యాపనమునకును గౌరవమునకును నిదర్శనములు. నారాయణశతకమును పోతనామాత్యుఁడు రచియించినటులు ప్రతీతిగలదని గద్యము తెలుపుచున్నను కర్తృత్వమును నిరూపణము చేయుటకిది చాలదు. దీనియందలి ౯౮-వ పద్యమునందు "కృపకుం బాత్రుఁడనయ్య ధర్మపురిలక్ష్మీనాథ నారాయణా!" యని కవి నారాయణమూర్తిని సంబోధించెను. ఈపాదమునందలి భావార్థము విషయనిర్ణయమును జేయుటకు గొంత యుపయోగించుచున్నది.

ధర్మపురి సుప్రసిద్ధమైన స్థలము. మంథెన కాళేశ్వరము ధర్మపురి నిజాము రాష్ట్రమునందలి ఓరుగల్లున కనతిదూరమున గోదావరీతీరమునందు గలవు. కాళేశ్వరము మహాకవి భవభూతికి జన్మస్థానమని ఇటీవలి పరిశోధనలు తెలుపుచున్నవి. ప్రాచీనకాలమునందును నీప్రాంతము మహాకవులకును పండితులకును నివాసస్థానముగ నుండెను. శేషప్పకృతమైన నృసింహశతకము ధర్మపురి నృసింహస్వామిని సంబోధించుచున్నది. ఈగ్రామము లిప్పటికిని వేదశాస్త్రప్రవీణులైన బ్రాహ్మణోత్తములకు నివాసస్థలములుగ నున్నవి. ధర్మపురియందు లక్ష్మీనారాయణాలయము గలదు. శతకకర్త ధర్మపురియందు ప్రతిష్ఠింపబడిన శ్రీ లక్ష్మీనారాయణుని సహజముగ స్తోత్రముచేసియుండును. ఈ పాదార్థ మోరుగల్లువాదమునకును పోతరాజకర్తృత్వమునకును బలము నిచ్చుచున్నది. ఏకశిలానగరమునకు సమీపముననున్న ధర్మపురి నారాయణశతకకర్తకు నివాసస్థలమైనపుడు భాగవతకర్తకును నారాయణశతకకర్తకును సంబంధమును గల్పించుట కవకాశములు గలవు. ఈసంబంధము రెండుగ్రంథములను బరిశీలించినపుడు స్థిరపడుచున్నది. భాగవతమునకు హృదయమైన వైష్ణవభక్తి నారాయణశతకమునకును హృదయమై భావయును భావములును శైలియును నేకకవిహృదయమును స్ఫురింపఁజేయుచున్నవి. ఆదృష్టితో నారాయణశతకమును బరిశీలించునపుడు పోతరాజునకు కర్తృత్వము నారోపించుట కవకాశములు గనిపించుచున్నవి.

నారాయణశతకమునందు వైష్ణవశతకములందు సామాన్యముగ గనఁబడెడి దశావతారవర్ణనములకుఁ దోడుగ శ్రీకృష్ణావతారవర్ణన మిరువదిపద్యములందు ప్రత్యేకముగ గలదు. కృష్ణావతారవింశతియందలి భావములును భావయును శ్రీమద్భాగవతమునందలి కృష్ణావతారఘట్టమును స్ఫురింపజేయుచుండును. పోతన శ్రీమద్భాగవత రచనారంభమునందును శ్రీమన్నారాయణకథాభివర్ణనమును జేయఁబూనుకొనినటులు ప్రారంభించెను. ఇదియును బోతనకర్తృత్వమున కుపపన్నముగ నున్నది.

శ్రీయుత వంగూరి సుబ్బారావుగారు "పోతరాజు నారాయణశతకమునందు భాగవతార్థమును బీజరూపముగ వర్ణించినాఁడనియును భాగవతమునందు బీజములను పల్లవింపజేయ నుద్దేశించినటులు సూచించినాఁడనియును" శతకకవులచరిత్రయందు వ్రాసిరి. నారాయణ శతకమునందలి 45, 46, 47, 48, 49, 50, 51, పద్యములందును నితర పద్యములందును గల "భావింతు, వర్ణింతు, జర్చింతు, వీక్షింతు, మన్నింతు, జూతు" పదములకు వర్తమానార్థమునకు బదులు భవిష్యదర్థమును గల్పించిరి. ఈ యూహా

వారిసిద్ధాంతమున కనుకూలముగ నున్నను నిశ్చితార్థమును నిర్ణయించుటకు జాలకున్నది. రెండు గ్రంథములకును మూలమైన భాగవత హృదయభావైక్యము నారాయణశతకమును భాగవతమును రచియించిన పోతనకృతి యని యూహింపవగి యున్నది.

రెండుగ్రంథములకును గల భావైక్యమును బాంధవ్యమును జూపుటకు గొన్ని పద్యము లుదాహరింపబడుచున్నవి.

శా. భూతవ్రాతము నంబుజాసనుఁడ వై • పుట్టింతు విష్ణుండవై......నారాయణా.

మ. ఇరవొందన్ ద్రుహిణాత్మకుం డయి రమా•ధీశుండు విశ్వంబు సు
స్థిరతన్ నిల్పి కృపాకటాక్షమున ర•క్షించున్ సమస్తప్రజో
త్కరసంహారము సేయునప్పుడు హరాం•తర్యామియై యింతయున్
హరియించుం బవనుండు మేఘముల మా•యం జేయు చందంబునన్. భా.ద్వి.ప.276

మ. పటు గర్భాంతరగోళభాగమున నీ•బ్రహ్మాండభాండంబు...నారాయణా.

మ. మును కల్పాంతమునందు గుక్షి నఖిలం•బున్ దాఁచి యేకాకివై
జనలోకోపరిలోకవాసులును యు•వమ్మత్తత్త్వమార్గంబు చిం
తనముం జేయ బయోధియందు నహిరా•ట్తల్పంబునం బవ్వళిం
చిన నీరూపము నేఁడుసూపితివి ల•క్ష్మీనాథ దేవోత్తమా. భా. చ. ప. 199

మ. దళదిందీవర నీలనీరదసము • ద్యద్భాసితాకార.........నారాయణా.

మ. త్రిజగన్మోహన నీలకాంతితను వు•ద్దీపింపఁ బ్రాభాతనీ
రజబంధుప్రభ మైన చేలము పయిన్ • రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసే•వ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెకాఁడు మది నా•వేశించు నెల్లప్పుడున్. భా.ప్ర.ప.218

మ. పరమంబై పరతత్త్వమై సకల సం•పత్సారమై భవ్యమై.........నారాయణా.

మ. అధికాఘౌఘతమోదివాకరమునై•యచ్ఛేంద్రజాజిహ్వాకున్ ..నారాయణా.

మ. పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై • ప్రాదుర్భవస్థానసం
హరణక్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై • యంతర్గతజ్యోతి యై
పరమేష్ఠిప్రముఖామరాధిపులకుం • బ్రాపింపరాకుండు దు
స్తరమార్గంబునఁ దేజరిల్లు హరికిం • దత్త్వార్థినై మ్రొక్కెదన్. భా. ద్వి. ప. 58

మ వరదుగ్ధాబ్ధితరంగడోలికలలో • వైకుంఠలోకంబులో.........నారాయణా.

మ. అల వైకుంఠపురంబులో నగరిలో • నామూలసౌధంబుదా
పల మందార వనాంతరామృతసరః•ప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోది యగు నా•పన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహిపాహియనఁ గు•య్యాలించి సంరంభియై. భా. అ. ప. 95

మ. నిను వర్ణింపనివాఁడు మూఁగ మదిలో • నీ సత్కథాలాపముల్ ... నారాయణా.
మ. నిను వర్ణింపని నీచబంధమతి దా • నిర్భాగ్యుఁడై మూఢుఁడై ..... నారాయణా.
మ. నిను వర్ణింపని జిహ్వ దాఁ బడఁటికా ? • నీలాభ్రదేహాంగకా ... నారాయణా.

చ. హరి భజియించు హస్తములు • హస్తము లచ్యుతుఁ గోరి మ్రొక్క త
చ్ఛిరము శిరంబు చక్రధరుఁ • జేరినచిత్తము చిత్త మిందిరా
వరుఁ గనుదృష్టి దృష్టి మురవైరి నుతించినవాణి వాణి య
క్షరు కథ లాను కర్ణములు • కర్ణములై విలసిల్లుఁ బో భువిన్. భా. ద. ప. 965

శా. రాణించెం గడు నంచు నీసహచరుల్ • రాగిల్లి సోలంగ ..... నారాయణా.

మ. నవమాధుర్యము గల్గు కృష్ణు మురళీ • నాదామృతస్యందముల్
చెవులం జొచ్చి హృదంతరాళముల భాసిల్లన్ సవత్సంబులై
యవిదా మేపులకుం దొలంగి మృగగో • యూథంబు లుత్కంఠతో
దివికిం గంఠము లెత్తి లోవదలుఁ బో • దేహేంద్రియవ్యాప్తులన్. భా.ద.ప.1127

మ. మమతన్ మోములు మీఁదికెత్తుకొని గో • మంథంబు సాలించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి మురళీ • గానామృతశ్రేణి క
ర్ణములం గ్రోలుచు మేత మాని గళితా • నందాశ్రులై చిత్రితో
పమలై గోవులు సూచుచున్న వవిగో • పద్మాక్షి వీక్షించితే. భా. ద. ప. 788

శా. చన్నుల్ మీఁదికిఁ జొక్కిలింప నడుముం • జవ్వాడఁ గందర్ప... నారాయణా.

మ. స్తనభారంబున డస్సి తుస్సి యొసఁడై • జవ్వాడు మధ్యంబుతో
జనితస్వేదముతోఁ జలత్కబరితో • స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణ గూడఁ బాటి తిరిగెన్ • వారించుచున్ వాకిటన్
ఘనయోగీంద్రమనంబులన్ వెనుకొనం • గా లేని లీలారతున్. భా. ద. ప. ౮70

శతకార్థమును విమర్శించెడి సందర్భమునం దీవిషయము వివరముల విమర్శింపబడును.

పోతనామాత్యుఁ డారువేలనియోగి బ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. శివభక్తులైన బమ్మెర కేసన లక్కమాంబల తనయుఁడు. ఓరుగల్లునకు సమీపమునందు గల బమ్మెరనివాసియై యుండును.

కాలము:—శ్రీమద్భాగవతకర్తయైన బమ్మెర పోతనామాత్యుని కాలమును నిర్ణయము చేయుటయును సులభసాధ్యము గాదు. కవులచరిత్రమునందు పోతరాజు క్రీ. శ. 1405 ప్రాంతములందు జననమొంది శ్రీనాథునకు సమకాలికుఁడైనటులు వ్రాయఁబడినది. భాగవతపీఠికయందు పోతరాజు 1378 ప్రాంతములందు జననమొందినటులు వ్రాయఁబడినది. సాహిత్య పత్రికయందు పోతరాజు 1300 ప్రాంతములందు నివసించినటు లూహింపఁబడినది. వంగూరి సుబ్బారావుగారు శతకకవులచరిత్రమునందు 1480-1520 ప్రాంతములందు పోతరాజు నివసించియుండు నని యుక్తియుక్తముగ నిర్ణయించి. ఈ కాలనిర్ణయముల పరిశీలన మీ శతకసందర్భమునందు దుర్లభము.

నారాయణశతకమునందు వైష్ణవమతవ్యాపనమునందు వీరవైష్ణవమును వర్ణించెడి వర్ణనలు తక్కువగ నున్నవి. రామానుజమతవ్యాపనమును సూచించెడి భావములును తక్కువగ నున్నవి. రఘువీరశతకమునందుగల వైష్ణవసంప్రదాయములు నారాయణశతకమునందు గనఁబడవు. పోతనామాత్యుని తలితండ్రులు శివభక్తులని భాగవతమునందు పోతన వర్ణించెను. భాగవతరచనకాలమునందు శైవమత మోరుగల్లు ప్రాంతమునందు ప్రబలియున్న విధమును చరిత్రము విశదముచేయుచున్నది. ఈ కారణములవలనను నారాయణశతకము వైష్ణవమతవ్యాపనమునందు మొదటిభాగమునకే చెందియున్నటులు నిర్ణయమగుచున్నను తగిన యాధారములు లేకపోవుటవలనను కాలనిర్ణయము చేయుట కష్టసాధ్యము. నారాయణశతకకర్త పోతనామాత్యుఁడు శతకమును భాగవతమునకు బూర్వమే రచియించె నని యంగీకరించినపుడు శతకము పదునాలవశతాబ్దియందు రచియింపబడినటు లూహింపదగియున్నది.

శైలి:—శతకశైలి భాగవతశైలివలె మనోహరముగ నున్నది. భాగవతమునందువలె మహాప్రవాహమును గలిగి శైలి రసవంతమై కర్ణపేయముగ నున్నది. శతకము శబ్దార్థాలంకారములతో నిండి భాగవతశైలిని సంస్మరింపజేయుచున్నది. భావములు భాగవతభక్తిభరితములై భక్తిరసావేశమును గలుగజేయుచున్నవి. భాగవతరచనమునందువలె పద్యములు సంస్కృతాంధ్రపదమిశ్రితములై పండితపామరాదరణమును బొందుచున్నవి. పద్యములందు గల పదలాలిత్యము ధారాప్రవాహము మంజులస్వరము మహాకవిహృదయమును వ్యక్తముచేయుచున్నవి. భావములను భాషయును నన్యోన్యానుకూలతను గలిగి పండితహృదయమును వ్యక్తముచేయుచున్నవి. శతకమునందలి 5, 61 పద్యములు కవీశ్వరునకు వేదపురాణశాస్త్రములందు గల పరిచయమునకు నిదర్శనములు.

శతకమునందలి యనేకపద్యము లేకభావమును భిన్నపదజాలముల ముఖమునను హృద్యముగఁ దెలుపగల ప్రజ్ఞకు నిదర్శనములుగ నున్నవి.

మ. ఒసర న్ముక్తికిఁ ద్రోవ పుణ్యములకుం • బుట్టిల్లు మోదంబునం
దునికిస్థాన మ దివ్యభోగములకు • న్నుత్పత్తి యేప్రొద్దునున్
ఘనపాపంబులవైరి మద్రిపులకున్ • గాలావసానంబు మీ
వినుతాంఘ్రిద్వయ పద్మసేవన గదా • విశ్వేశ నారాయణా.

మ. నిరతానంద వియోగులై నిరసులై • నిర్భాగ్యులై నీచులై
కరుణాహీనమనస్కులై కఠినులై • కష్టాత్ములై నష్టులై
పరమవ్యాధినిబద్ధులై పతితులై • భగ్నాంగులై ప్రగ్గువా
రరయం మి మ్మొగి నాత్మయం దడనివా • రబ్జాక్ష నారాయణా.

శబ్దాలంకార ప్రయోగములు శతకమునం దంతటను గనుపట్టుచున్నవి. భావరూపకల్పనలయందు శతకశైలి శ్రీకృష్ణకర్ణామృతము సర్వేశ్వరశతకము శివానందలహరీమహిమ్నాదిస్తోత్రములు భాగవతము మొదలగు గ్రంథములశైలిని బోలి గంభీరముగను మనోహరముగను నున్న విధము నీ క్రిందిపద్యములు తెలుపుచున్నవి.

మ. లలితంబైన భవత్తనూ నవలస • ల్లావణ్య దివ్యామృతం
బలుఁ గుల్కొందఁ గటాక్షవీక్షణముల • నందంద గోపాంగనల్
తలఁపు ల్వాదులు గట్టి కందళితనూ • త్నస్త్రీలు వాటింతు రా
కెలఁతల్ తీవెలు చైత్రవిస్ఫురణమా • నీయొప్పు నారాయణా.

మ. విదితామ్నాయనికాయభూతములలో • విజ్ఞానసంపత్కళా
స్పదయోగీంద్రమనస్సరోజములలో • బ్రహ్మేంద్రదిక్పాలక
త్రిదశవ్రాతకిరీటరత్నములలో • దీపించుచున్నట్టి మీ
పదపద్మంబులు భావగేహమున నే • వర్ణింతు నారాయణా.

శా. కేలం గోలయుఁ గూటిచిక్కము నొగిం • గీలించి నెట్టెంబుగాఁ
బీలీపింఛముఁ జుట్టి నెన్నడుమునం • బింఛావళిం గట్టి క
ర్ణాలంకారకదంబగుచ్ఛమధుమ • త్తాళీస్వనం బొప్ప నీ
వాలం గాచినభావ మిట్టి దని నే • వర్ణింతు నారాయణా.

నారాయణశతకకర్త కావ్యకళాదక్షుఁ డని శతకరచన విశదము చేయుచున్నది. శతకమును ప్రాకృతశతకముల సంప్రదాయము ననుసరించి వివిధశీర్షికల క్రిందను విభజించి విషయావగాహనమును సులభము చేసినవిధము తుది పద్యము తెలుపుచున్నది.

శతకమును ౧. ఆదిదశకము ౨. అవతారదశకము 3. దివ్యరూపదశకము ౪. నామప్రభావదశకము ౫. కృష్ణావతారవింశతి, ౬. జ్ఞానవింశతి ౭. మోక్షవింశతి యను శీర్షికలక్రిందను విభజించి విషయపరిజ్ఞానమును సులభముచేసి కవి తన కళానైపుణ్యమును సువ్యక్తము చేసెను. ఇతర భక్తిశతకములందును భగవంతుని నామరూపమహిమాదుల వర్ణనములున్నను నారాయణశతకమునందువలె విషయవిభాగము స్పష్టముగఁ గనబడదు. శైలి సంస్కృతాంధ్రపదమిశ్రితమై భాగవతభావగర్భితమై శబ్దార్థాలంకారరంజితమై సరళగతి శోభితమై రసవంతముగ నున్నను పోతనామాత్యుని భాగవతశైలితో దులదూగజాలదు.

## భావార్థము

నారాయణశతకమునకు మకుటము:—నారాయణా!

పురుషార్థప్రద మైన యష్టాక్షరీమంత్రము వైష్ణవమంత్రరాజము. నారాయణ శతకకర్త నారాయణ మంత్రోపాసకుఁ డని శతకార్థము విశదము చేయుచున్నది.

మ. కలుషాగాధవినాశకారి యగుచుం • గైవల్యసంధాయి యై
యిలి నొప్పారెడు మంత్రరాజ మగు నీ • నామంబు ప్రేమంబుతో
నలర న్నెవ్వని వాక్కునం బొరయదే • నన్నీచు మాఘోరాత్మమముం
వెలయం భూరుహకోటరం బదియ నూ • వేదాత్మ నారాయణా.

నారాయణశతకము పరిశుద్ధమైన వైష్ణవభక్తిని బోధించుచున్నది. శ్రీకృష్ణుని శృంగారలీలలందును శ్రీమన్నారాయణుని నిర్గుణస్థితియందును పరిశుద్ధమైన వైష్ణవభక్తి వైష్ణవభక్తులకు ప్రత్యక్షమగుచున్నది. వాసుదేవు నేరీతిని గొలుచుచున్నారో వారల కారీతిని గోవిందుడు ప్రత్యక్షమగుచుండును.

మ. ఇల నెవ్వారిమనంబులం దెలుక దా నెంతెంత గల్గుండు నా
కొలదిం జెంది వెలుంగుచుండువు వెసన్ గోవింద నీరూపులన్
సలిల స్నేబుమితంబులై సరసిలో నంభోరుహంబుల్ దగన్
నిల నొప్పారెడుచంద మొందెదె దెపుడు న్నీలాంగ నారాయణా.

భగవద్భక్తికి మూలసాధనము చిత్తసమర్పణ మనియును చిత్తశుద్ధిలేని బాహ్యాభేషజములు నిరర్థకములనియును నారాయణశతకము బోధించుచున్నది. ఆబోధ శతకము నందంతటను గోచరంబగుచున్నది.

మ. తపముల్ సత్క్రతుపంచయజ్ఞఫలముల్ దానక్రియారంభముల్
జపము ల్పుణ్యసుతీర్థసేవఫలముల్ సద్విప్రవిజ్ఞానముల్
ఉపవాసవ్రతధర్మశీలఫలముల్ నొప్పారు నిన్నాత్మలో
నపమింపంగలవారికిం గలవు వేయు న్నేల నారాయణా.

చిత్తశుద్ధిని గలిగి శ్రీమన్నారాయణుని సేవించి తరించుటకు సదాచారము ముఖ్యసాధనము. సదాచారవర్జితము లైన జపనియమాదులు కొంగజపములై భాగవత భక్తికైంకర్యమునకు నిరుపయోగములుగ నుండును.

మ. సతతాచారము సూనృతంబు గృపయున్ సత్యంబునున్ శీలమున్
అతిశాంతత్వము చిత్తశుద్ధికరమున్ నధ్యాత్మమున్ ధ్యానమున్
ధృతియుం ధర్మము సర్వజీవహితముం దూరంబు గాకుండ స
మ్మతికిం జేరువ మానివాసనసుఖమున్ మానాథ నారాయణా.

నారాయణశతకము వైష్ణవపదము నర్థించుచున్నను విశిష్టాద్వైతసిద్ధి నేకాక అద్వైతసిద్ధిని సయితము నర్థించుచున్నది. జ్ఞానవింశతియందును మోక్షవింశతియందును నీభావము వ్యక్తమగుచున్నది. నారాయణశతకమునందు బీజరూపమునసున్న యీభావము భాగవతమునందన్ని ఘట్టములందును గోచరంబగుచున్నది.

మ. పరిఘోరాంధక బోధకారణ విపత్సంసారమాలిన్యముం
బరమానంద సుయోగనిర్మల లసద్భస్మంబుపై నూది యా
నిరతజ్ఞానసుకాంతి దర్పణమున న్నిస్సంగుడై తన్నుం దా
నరయం గాంచినవాడు నిన్నుం గనువా డజ్ఞాతు నారాయణా.

నారాయణశతకము మోక్షప్రాప్తికి సాధనములైన కర్మమార్గమును జ్ఞానమార్గమును భక్తిమార్గమును ఉపదేశించుచున్నను శతకమునకు భక్తియే హృదయముగ నున్నది. కవి "నే నీదాసుఁడ నీవు నాపతివి నిన్నేకాని యొండెవ్వరిన్ ధ్యానింపం బ్రణుతింపను" అని శ్రీమన్నారాయణున కాత్మసమర్పణమును జేసినవిధమును శతకము విశదము చేయుచున్నది. కవి సంబోధించిన నారాయణుఁడు కాలాంతరమునను వెలసిన స్థలనారాయణుఁడు గాక విశ్వమయుఁడైన యాదినారాయణుఁడు. ఆదినారాయణుఁ డవ్యక్తుఁడు దివ్యాత్ముఁడు వేదాత్ముఁడు నిత్యాత్ముఁడు భూతాత్ముఁడు దోషఘ్నుఁడు కర్మఘ్నుఁడు. ఆదినారాయణమూర్తి విశ్వలీలావిహారములందు భిన్నరూపములను ధరించి లోకము నుద్ధరించుచుండును. వామనుని భయంకరలీలలందును శ్రీకృష్ణుని శృంగారలీలలందును నారాయణస్వరూపము భాగవతోత్తములకు గోచరంబగుచుండును. ఈభావమునే కవి నారాయణశతకమునందు సువ్యక్తము చేసినను శతకమునందు శ్రీకృష్ణుని శృంగారలీల లధికతరాదరణమును బడసినవి.

పోతరాజునకు శ్రీమన్నారాయణమూర్తి శృంగారమూర్తి, చారుకరుణామూర్తి సద్భక్తిమందారమూర్తి. భగవంతుని శృంగారవిభూతులు విశ్వమును భాగవతమయముచేయుచు కారుణ్యామృతమును చరాచరప్రపంచమునందును బ్రత్యక్షముచేయుచుండును. బాలగోపాలుని మురళీగానము గోవర్ధనమునకును గోబృందమునకును గోపాలురకును గోపాంగనలకును బ్రహ్మానందమును గలుగజేసినది. కవి నారాయణశతకమునందు త్రికరణశుద్ధిగ విశ్వమయుఁడైన భగవంతుని గొనియాడి పరమార్థమును బొందగలిగెను. కవి చిత్తశుద్ధిగల భాగవతశ్రేష్ఠుఁడనియును, భౌతికసంపదల నారాధించి విఫలమనోరథుఁడైన విరాగి కాఁడనియును శతకార్థము దెలుపుచున్నది. నారాయణశతకమునందు భాగవతమునందు బ్రత్యక్షముగనున్న యద్వైతసిద్ధి పరిస్ఫుటము గాకపోయినను విశుద్ధమైన భాగవతహృదయము సర్వత్ర గోచరంబగుచున్నది. నారాయణశతకమునం దాంధ్రహృదయ లక్ష్యములైన భక్తిజ్ఞానయోగములు మనోహరముగ సంయోగమును బొందె. భక్తిశతకములం దీశతకమునకు బ్రతిష్ఠ గలిగినది. కవి మమతాహంకారములను విసర్జించి యార్తహృదయముతో నారాయణోపాసనమును జేసి కైవల్యపదమును జేరి జన్మసాఫల్యమును గాంచిన విధమును ఈశతకము భక్తులకు జూపుచున్నది.

మ. మమతాకార వికారసంపద మహా॰మత్తాళిలో నంధకా
రముచే ముక్తికి నేగుమార్గ మెఱుఁగన్ ♦ రా దింక నాలోనికిన్
విమలాపాంగ దయాదివాకరు వెసన్ ♦ వీక్షింపఁగాఁ జేయు మీ
కమలానందవిహారవక్ష లలితా ♦ కంజాక్ష నారాయణా.

రుధిరోద్గారి ఆషాఢ బ॥ 3 సోమవారము } కాశీనాథుని నాగేశ్వరరావు.

పాఠాంతరములు:— ఈ శతకమును ముద్రించునప్పుడు చెన్నపురిలోని ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునందలి వ్రాతప్రతులతో సంప్రతించి పాఠాంతరములను గైకొంటిమి. కావున సర్వదా వారియెడల నిందులకు కృతజ్ఞతఁ జూపుచున్నారము.

శ్రీరస్తు

# నారాయణశతకము

## ఆదిదశకము

శ్రీరామామణిపాణిపంకజ మృదు శ్రీతజ్ఞపాదాబ్జ (1)శృం
గారాకారశరీర చారుకరుణా గంభీర సద్భక్తమం
దారాంభోరుహ(1)పత్త్రలోచన కళాధారోరుసంపత్సుధా
పారావారవిహార! నాదురితముల్ భంజింపు నారాయణా. ౧

మ. కడకుం బాయక వేయినోళ్లు గల యా కాకోదరాధీశుఁడుం
గడముట్ట న్వినుతింపలేక నిగుడం గ్రాలంగ నొప్పరు మి
మ్మడరన్ సన్నుతిసేయ నాదువశమే యజ్ఞాని లోభాత్ముఁడన్
జడుఁడ (2)న్నజ్ఞుఁడ నైకజిహ్వుఁడ జన స్తబ్ధుండ నారాయణా. ౨

శా. నే నీదాసుఁడ నీవు నాపతివి నిన్నే కాని యెం డెవ్వరిన్
ధ్యానింపం బ్రణుతింప నట్లగుటకు న్నా నేర్చు చందంబునన్
నీనామస్తుతు లాచరించు నెడల న్నేతప్పులుం గల్గినన్
వానిన్ లోఁ గొనుమయ్య తండ్రి! విహితవ్యాపార నారాయణా.

మ. నెరయ న్నిర్మలమైన నీస్తుతికథానీకంపు పద్యంబులో
నొరుగుల్ మిక్కిలి గల్గెనేనియుఁ (4)గడు న్యోగ్యంబె చర్చింపఁగా
కుఱుగుంపైనను వంకబోయినఁ గడుం గుజ్జైనఁ బేడెత్తినం
జెఱుకుంగోలకుఁ దీపు గాక కలదే (5)చేఁ దెంగు నారాయణా. ౪

మ. చదువుల్ పెక్కులు సంగ్రహించి పిదపం జాలంగ సుజ్ఞాని వై
మదిలోఁ బాయక నిన్ను నిల్పఁదగు నామర్మంబు వీక్షింపఁడే
మొదలం గాడిద చారుగంధవితతుల్ మోవంగ శక్యంబు కా
కది సౌరభ్యపరీక్షఁ జూడఁ గుదురే యవ్యక్త నారాయణా. ౫

---

(1) ౧. శృంగారాగార, ౨. చారులోచన. (2) 3. మూఢుఁడ. (4) ౪. నదిన్. ౫. చేఁ దందు.

మ. లలిఁ గబ్బంబుకరాట మివ్వసుధ నెల్ల [1]న్నిర్మించెఁబో నీకథా
వలి కర్పూరము [2]నించిన న్నితరమా । వ్యర్థార్థకామోదముల్
వెలుచం బూనినయ[3]క్కరాటము తుదిన్ । ప్రేతౌ[4]కరాటంబె పో
చలదిందీవరపత్రలోచన ఘన। శ్యామాంగ నారాయణా. ౬

మ. మనమార న్నచలేంద్రజాధిపతికి । న్మస్తాగ్రమాణిక్య మై
మునికోపానలదగ్ధరాజతతికి । న్ముక్తిస్ఫురన్మార్గ మై
మెనయన్ సాయకశాయికిం జనని యై । యేపారుమిన్నేటికిం
జనిమూలం బగు నంఘ్రి నాదుమదిలోఁ । జర్చింతు నారాయణా.

శా. నీపుత్రుండు చరాచరప్రతతుల । [5]న్నిర్మించి పెంపారఁగా
నీపుణ్యాంగన సర్వజీవతతుల । న్నిత్యంబు రక్షింపఁగా
నీపాదోదక మీజగత్త్రయముల । న్నిష్పాపులం జేయఁగా
నీపెం పేమని చెప్పవచ్చు సుగుణా । నిత్యాత్మ నారాయణా. ౮

శా. బ్రహ్మాండావళిలోన సత్త్వగుణి వై । [6]బాహ్యంబునం దాదిమ
బ్రహ్మాఖ్యం బరతత్త్వభోగములకున్ । భవ్యాధినాథుండ వై
[7]బ్రహ్మేశామరవాయుభుక్పతులకున్ । భావింపరాకున్న నీ
జిహ్మావ్యాప్తుల నెన్న నాదువశమే । చిద్రూప నారాయణా. ౯

మ. ధర సింహాసన మై నభంబు గొడు గై । తద్దేవతల్ భృత్యు లై
పరమామ్నాయము లెల్ల వందిగణమై । బ్రహ్మాండ[8]మాగార మై
సిరి భార్యామణి యై విరించి కొడు కై । శ్రీగంగ సత్పుత్రి యై
వరుస న్నీఘనరాజసంబు నిజ మై । వర్ధిల్లు నారాయణా. ౧౦

## అవతారదశకము

మ. మగమీనాకృతి వార్ధిఁ జొచ్చి యసుర । న్మర్దించి యవ్వేదముల్
మగుడం దెచ్చి విరించి కిచ్చి యతని । న్మన్నించి [9]యేపారఁగాఁ
బగ సాధించిన దివ్యమూర్తి వని నే । భావింతు నెల్లప్పుడున్
ఖగరాజధ్వజ [10]భక్తవత్సల జగ। త్కారుణ్య నారాయణా. ౧౧

---

(6) ౧. న్నిర్మించుఁ. ౨. నించినం దదితరవ్యర్థా. 3. కరాటమె. ౪. కరాటంబగున్. (8) ౫. న్నిత్యంబు నిర్మింపఁగా. (9) ౬. బ్రహ్మంబవై శ్రీపరబ్ర. ౭. బ్రహ్మేశాన దిగీశ వాక్పతులకు. (10) ౮. మాకార. (11) ౯. యొప్పారు శ్రీభగవంతుండగు నాదిమూర్తి మదిలో భావింతు నిన్నెప్పుడున్. ౧౦. భక్తపాలన జగత్కల్యాణ.

మ. అమరుల్ రాక్షసనాయకుల్ కడఁకతో । నత్యంతసామర్థ్యులై
భ్రమరీదండము మందరాచలముగాఁ । బాథోనిధిం ద్రచ్చఁగా
దమకింపన్ భువనత్రయంబును గిరుల్ । దంతావళుల్ [౧]మ్రొగ్గినం
గమఠం బై ధరియించి మించిన జగ । త్కల్యాణ నారాయణా. ౧౨

శా. భీమాకారవరాహమై భువనముల్ । భీతిల్లి కంపింప ను
ద్దామోర్విం గొనిపోయి [౨]నీరనిధిలో । డాఁగున్న గర్వాంధునిన్
హేమాక్షాసురు వీఁకఁ దాఁకి [౩]జయలక్ష్మిన్ గారవింపంగ నా
భూమిం దక్షిణదంష్ట్ర నెత్తిన [౪]నినుం । బూజింతు నారాయణా.

శా. స్తంభంబందు నృసింహమై వెడలి య । చ్చండాట్టహాసధ్వనుల్
దంభోళిం గడవంగ [౫]హేమకశిపు । ద్దండాసురాధీశ్వరుం
శుంభద్గర్భము వ్రచ్చి వానిసుతునిన్ । శోభిల్ల మన్నించి య
జ్జంభారాతిని [౬]ప్రీతిఁ దేల్చిన [౭]నినుం । జర్చింతు నారాయణా. ౧౪

మ. మహియు న్నాకసముం బదద్వయపరీ । మాణంబుగాఁ [౮]బెట్టి యా
గ్రహ మొప్పం బలిమస్తకం బాకపద । గ్రస్తంబు [౯]గావించియున్
[౧౦]విహరింపం బరికించి శంకరమహా । విఖ్యాతదివ్యా[౧౧]కృతిన్
సహజం బై విలసిల్లువామన లస । చ్చారిత్ర నారాయణా. ౧౫

మ. ధరణిన్ రక్తమహాహ్రదంబు లెలమిం । త్రైలోక్య[౧౨]నిర్దిష్టమై
పరఁగం బైతృకతర్పణంబు కొఱకై । ప్రఖ్యాతిగాఁ దీవ్రతన్
నిరువమ్మొక్కటిమాఱు క్షత్రనరుల । [౧౩]న్నేపార నిర్జించు త
త్పరశుభ్రాజితరామనామ [౧౪]మొసరన్ । భావింతు నారాయణా.

మ. వరుసం దాటకిఁ [౧౫]జంపి కౌశికు మఖ । స్వాస్థ్యంబు[౧౬]గాఁ జేసి శం
కరుచాపం బాగిఁ ద్రుంచి జానకిఁ దగం । గళ్యాణమై తండ్రి పం
పరుదారన్ వనభూమి కేగి జగదా । హ్లాదంబుగా రావణుం
ధరణిం గూల్చి[౧౭]న రామనామము కడున్ । ధన్యంబు నారాయణా.

---

(12) ౧. ప్రగ్గినన్. (13) ౨. వారినిధిలో. 3. జయలక్ష్మీసుందనై మించి యా. ౪. మిమ్ముం (14) ౫. హేమకశిపుం దండాసురా. ౬. భీతి. ౭. మిమ్ముం. (15) ౮. మెట్టియా. ౯. గాఁ జేసియున్. ౧౦. విహరిం చింద్ర విరించి. ౧౧. కృతుల్. (16) ౧౨. నిర్దిష్టమై. ౧౩. హింసించి యొప్పారు మీపరశు. ౧౪. కడున్ భవ్యంబు నారా. (17) ౧౫. నొంచి. ౧౬. గావించి. ౧౭. యయోధ్య యేలితిగదా ధాత్రీశ నారా.

మ. యదువంశంబునఁ గృష్ణునగ్రజుఁడ వై [౧]యాభీలశౌర్యోన్నతిన్
మదవద్ధేనుక [౨]ముష్టికాద్యసురులన్ మర్దించి లీలారసా
స్పద కేళీరతి రేవతీవదనకంజాతాంతభృంగం బవన్
విదితంబా బలరామమూర్తి వని నిన్ వీక్షింతు నారాయణా. ౧౮

మ. పురము ల్మూఁడును మూఁడులోకములు నేప్రొద్దు న్విదారింపఁ ద
త్పురనారీమహిమోన్నతుల్ [౩]చెడుటకై బుద్ధుండవై బుద్ధితో
వరుసం దద్ద్రుమసేవఁ జేయుటకునై వారిం బ్రబోధించి య
ప్పురముల్ [౪]గెల్చిన మీయుపాయము జగత్పూజ్యంబు నారాయణా.

మ. కలిధర్మంబునఁ బాపసంకలితులై గర్వాంధులై తుచ్ఛులై
కులశీలంబులు మాని [౫]హేయగతులం గ్రొవ్వారు దుష్టాత్ములం
బలిగాఁ జేయఁదలంచి ధర్మ మెలమిం బాటించి నిల్పంగ నిం
పలరం గల్క్యవతార [౬]మొందఁగల నిన్ భావింతు నారాయణా.

మ. ఇరవొందన్ సచరాచర[౭]ప్రతతుల న్నెన్నంగ శక్యంబె కా
కరయన్ పద్మభవాండభాండచయము న్నారంగ [౮]మీకుక్షిలో
నరుదార న్నుదయింపఁ బెంప నడప న్నన్నారికేళోద్భవాం
తరవాఃపూరము[౯]చంద మొంద నెపుడున్ దైత్యారి నారాయణా.

## దివ్యరూపదశకము

మ. దళదిందీవర నీలనీరద [౧౦]సముద్యద్భాసితాకార శ్రీ
లలనాకౌస్తుభ చారువక్ష విబుధ[౧౧]శ్లాఘ్యోద్భవస్థాన కో
మలనాభీ చరణారవింద జనితా[౧౨]మ్నాయాద్యగంగా! లస
జ్జలజాతాయతనేత్ర నిన్ను మదిలోఁ జర్చింతు నారాయణా. ౨౨

(18) ౧. యత్యద్భుతోద్దండతన్. ౨. దానవా. (19) ౩. చెఱపఁగా బుద్ధావతారంబునన్ వరబోధిద్రుమసేవ. ౪. గూల్చిన. (20) ౫. యేహ్యా. ౬. మెత్తఁగలం. (21) ౭. ప్రతతులై యెన్నంగ శక్యంబుగా. ౮. నీయందులో నరుదార న్నుదయించు మించు నణఁగు న్నన్నారి. ౯. చంద మొంది యెపుడున్. (22) ౧౦. తనూద్యద్భాస్వదా. ౧౧. శ్లాఘ్యామృతస్థాన. ౧౨. యాభ్రగంగా.

మ. జగదాధారక భక్తవత్సల కృపా । జన్మాలయాపాంగ! భూ
గగనార్కేందుజలాత్మ పావక [౧]మరు । ద్గాత్ర! ప్రదీప ప్రమో
దగణస్తుత్య [౨]మహాఘనాశన! లస । ద్గీర్వాణసంసేవితా!
త్రిగుణాకార! ముకుంద! నాదుమదిలో । దీపింపు నారాయణా. ౨౩

శా. భూతవ్రాతము నంబుజాసనుఁడ వై । పుట్టింతు విష్ణుండ వై
ప్రీతిం బ్రోతు హరుండవై చెఱుతు ని । ర్భేద్యంబ వై త్రైగుణో
[౩]పేతంబై పరమాత్ముఁడై నిలుతు నీ । పెంపెవ్వరుం గాన ర
జ్జాతోద్భూత [౪]సుజాత పూజితపదా । బ్జశ్రేష్ఠ నారాయణా. ౨౪

మ. వరనాభీభవశాంబుజోదరమునన్ । వాణీశుఁ గల్పించి య
ప్పురుషశ్రేష్ఠుని ఫాలమందు శివునిం । బుట్టించి యామేటికిం
బరమోత్తంసముగా వియత్తలనదిం । బాదంబునం గన్న మీ
[౫]సరి యెవ్వారలు మీరు దక్కఁగ రమా । సాధ్వీశ నారాయణా.

మ. [౬]ప్రభ మీ నాభిజనించినట్టి విలస । త్పద్మోరుసద్మంబునం
బ్రభవంబైన విరించి ఫాలజనిత । ప్రస్వేదసంభూతుఁ డై
యభిధానంబును గోరి కాంచెను భవుం । డార్యేశుఁ డూహింపఁగా
నభవాఖ్యుం[౭]డవు నిన్నెఱుంగ వశమే । యబ్జాక్ష నారాయణా.

మ. పటుగర్భాంతరగోళభాగమున నీ । బ్రహ్మాండ[౮]భాండంబు ప్రా
కటదివ్యాద్భుతలీల దాల్చి [౯]జనితా । కల్పాంత మంభోధిపై
వటపత్రాగ్రముఁ జెంది యొప్పిన మిము । న్వర్ణింపఁగా శక్యమే
నిటలాక్షాంబురుహాసనా[౧౦]దులకు నో । నిర్వాణ నారాయణా. ౨౭

మ. సవిశేషోరుసువర్ణబిందువిలస । చ్ఛృంగ లింగాకృతిన్
భవుచే [౧౧]నుద్ధవుచేఁ బయోజభవుచేఁ । బద్మారిచే భానుచే
[౧౨]దివిజేంద్రాది దిశాధినాయకులచే । దివ్యన్మునీంద్రాళిచే
సవదివ్యార్చన లందుచుందువు రమా । నారీశ నారాయణా. ౨౮

(23) ౧. మరుత్కాయాత్మ సర్వాత్మమో. ౨. భవాఘనాశన హృషీకేశాద్రిజాతార్చితా । త్రిగుణాతీత. (24) ౩. పేతంబైన పరాత్ముఁడై. ౪. శివాదీ. (25) ౫. సరి యింకెవ్వరు నీవె కర్తవు రమాసంబంధ నారా. (26) ౬. ప్రభ నాభిన్ జనియించి మించిన. ౭. డఁట. (27) ౮. తండంబు. ౯. మహిమం గల్పావసానాబ్ధిలో వటపత్రంబునఁ బవ్వళించిన. ౧౦. నాధికులకు. (28) ౧౧. హృద్భవుచే. ౧౨. దివిజేశాది.

శా. సర్వంబున్ వసియించు నీ తనువునన్ । సర్వంబు[1]నంనుం దగన్
సర్వాత్మా [2]వసియించు దీవని మదిన్ । సార్థంబుగాఁ జూచి యా
గీర్వాణాదులు వాసుదేవుఁ డనుచున్ । గీర్తింతు [3]శేప్రార్థు నా
శీర్వాదంబు భవన్మహామహిమ ల । క్ష్మీనాథ నారాయణా. ౨౯

మ. గగనాద్యంచిత [4]పంచతత్త్వమయమై । కంజాత[5]జాండావళిన్
సగుణబ్రహ్మమయాఖ్యతం దనరుచున్ । సంసారి వై [6]చిత్కళా
సుగుణంబై విలసిల్లు దీవు నిరత । స్థూలంబు సూక్ష్మంబు నై
నిగమోత్తంస జయాదిహంస-విగుణా । నిత్యాత్మ నారాయణా.

## నామప్రభావదశకము

మ. [7]ఎలరారం భవదీయనామపఠనం । బేమర్త్యుచిత్తంబులోఁ
[8]బొలుపారం దగిలుండునేని నఘముల్ । పొందంగ నెట్లోపెడున్
కలయం బావకుచేతఁ బట్టునడు న । క్కాష్ఠంబుపైఁ గీటముల్
నిలువన్నేర్చునె [9]భక్తపోషణ కృపా । నిత్యాత్మ నారాయణా. ౩౧

మ. కలయం దిక్కులు నిండి చండతరమై । కప్పారు మేఘౌఘముల్
వెలయన్ ఘోరసమీరణస్ఫురణచే । [10]వేఁ బాయుచందంబునన్
జలదంభోళి మృగాగ్ని తస్కరరుజా । [11]శత్రూరగవ్రాతముల్
దొలఁగు న్నీ[12]దగుదివ్యమంత్రపఠనన్ । దోషఘ్న నారాయణా. ౩౨

మ. [13]కలుషాగాధవినాశకారి యగుచుం । గైవల్యసంధాయి వై
నలి నొప్పారెడు మంత్రరాజ మగు నీ । నామంబు ప్రేమంబుతో
నలర న్నెవ్వని వాక్కునం బొరయదే । నన్నీచు [14]ఘోరాత్మయుం
వెలయం భూరుహకోటరం బదియ సూ । వేదాత్మ నారాయణా.

---

(29) ౧. నం దెల్లెడన్. ౨. వసియింతు వీవ యనుచున్. ౩. శెల్లప్పు డాశీర్వాదాఢ్యభవ. (30) ౪. పంచభూత. ౫. జాతాండమున్. ౬. సుగుణనిర్వాణ. (31) ౭. ఎలమినిన్మజగదేకనామజప మిందేమర్త్యు. ౮. పొలుపొందం దగిలుండినన్ దురితము లొప్పొందుండఁగా నేర్చునే. ౯. భక్తవత్సల. (32) ౧౦. వేపాలు. ౧౧. శత్రూరగాఘౌఘముల్. ౧౨. త్రిపదాదినామపఠనన్. (33) ౧౩. కలుషవ్రాత. ౧౪. నోరారయున్.

మ. పరమంబై పరతత్త్వమై సకలసం।పత్సారమై భవ్యమై
సురసిద్ధోరగయక్షపక్షిముని।శ్రేష్ఠహృద్గుహాంతస్స్ఫుర
ద్వరసుజ్ఞానసుదీపమై శ్రుతికళా।వ్యాపారమై సిద్ధమై
౧సరిలేకెప్పుడు నీదునామ మమరున్ । సత్యంబు నారాయణా.

మ. ౨అధికాఘౌఘతమోదివాకరము నై । యద్రీంద్రజాజిహ్వకున్
సుధయై వేదవినూత్నరత్నములకున్ । సూత్రాభిధానంబు నై
బుధసందోహ౩మనోహరాంకురము నై । భూదేవతాకోటికిన్
విధియై మీబహునామరాజి వెలయున్ । వేదాత్మ నారాయణా.

మ. ఒనర న్ముక్తికిఁ ద్రోవ పుణ్యములకుం । బుట్టిల్లు మోదంబునం
దునికిస్థానమ దిష్టభోగములకు । న్నుత్పత్తి ౪యేప్రొద్దునున్
ఘనపాపంబులవైరి ౫షడ్రిపులకున్ । గాలావసానంబు మీ
వినుతాంఘ్రిద్వయపద్మసేవన గదా । విశ్వేశ నారాయణా. ౩౬

మ. భవరోగంబులమందు పాతకతమో।బాలార్కబింబంబు౭క
ర్మవిషజ్వాలసుధాంశువాతురతుషా।రవ్రాతపాథోధి మూ
ర్తివికైవల్యధనావలోకనకళా।దివ్యాంజనశ్రేష్ఠమై
భువిలో ౯మీదగుమంత్రరాజ మమరున్ । భూతాత్మ నారాయణా.

మ. వరుసం గర్మపిపీలికాకృతతనూ।వల్మీకనాళంబులోఁ
౧౦బరఁగంగా వసియించియుండెడు మహా।పాపోరగశ్రేణికిం
బరమోచ్చాటనమై రహస్యమహిమన్ । బాటించుచున్నుండు మీ
తిరుమంత్రం బను మంత్రరాజ మమరుం । దివ్యాత్మ నారాయణా.

మ. హరుని న్నద్రిజ నాంజనేయుని గుహు । న్నయ్యంబరీషున్ ధ్రువుం
గరిఁ బ్రహ్లాదు ౧౧విభీషణాఖ్యుని బలిన్ । ఘంటాశ్రవు న్నారదున్
౧౨అగర మొప్ప న్విదురున్ బరాశరసుతున్ । గాంగేయునిన్ ద్రౌపదిన్
నరు నక్రూరునిఁ ౧౩బాయకుండును భవ।న్నామంబు నారాయణా.

---

(34) ౧. ధరనీవ్యావళివర్ణమంత్ర మమరుం।దత్త్వాత్మనారా. (35) ౨. అధికాఘోరగరాజి మంత్రకళయై. ౩. మనోరథాంకుర. (36) ౪. యేపట్టునన్. ౫. పుట్టువులకుం. ౬. త్రయమంత్రరాజ మెగదా. (37) ౭. కర్మవిపద్ధ్వాంతసుధాంశుఁ డాతుర. ౮. భూ।దివకైవల్యపదావలోకము నకున్. ౯. మీద్వయమంత్ర. (38) ౧౦. పరుసాకారముతో. (39) ౧౧. విభీషణు న్బలిశుకున్. ౧౨. సిరిభూవాగ్విధి వ్యాసుభీష్మవిదురున్ శేషున్ శ్రుతింద్రౌపదిన్. ౧౩. దార్ఢ్యఁబాయదు.

శా. శ్రీకి న్మందిరమైన వక్షము సుధాజ్యేష్ఠోద్భవస్థాననా
భీకంజాతము [1]చంద్రికాంతరసుధాభివ్యక్తనేత్రంబులున్
లోకస్తుత్యమరున్నదీ[2]జనని యా లోలాంఘ్రియున్ [3]గల్గుచున్
లోకారాధ్యుఁడవైననిన్నెపుడు నాలోఁ [4]జూతు నారాయణా. ౪౦

## కృష్ణావతారవింశతి

శా. విందుల్ విందు లటంచు గోప[5]రమణుల్ వ్రేపల్లెలోఁ జన్ననా
డందెల్ మ్రోయఁగ ముద్దుమోమలర నిన్నాలింగితున్ జేయుచో
డెందంబుల్ [6]దనివార రాగరసవీటీలీలలన్ దేల్చు మీ
మందస్మేరముఖేందురోచులు మము న్మన్నించు నారాయణా. ౪౧

శా. విందు ల్వచ్చిరి మీయశోదకడకు న్[7]వేగంబె పొమ్మయ్య యో
నందానందన చందనాంకురమ కృష్ణా! యింకఁ [8]బోవేమి మా
మందం జాతరఁ[9]సేయఁబోద మిదె రమ్మా యంచు నిన్నెత్తుకో
చందం బబ్బిన నుబ్బకుండుదురె ఘోషస్త్రీలు నారాయణా. ౪౨

శా. అన్నా కృష్ణమ నేఁడు నేల్పులకు మీ దన్నార మీచట్లలో
వెన్నల్ ముట్టకు మన్న నాక్షణమున న్విశ్వాకృతిస్ఫూర్తినై
[10]యున్నన్ దిక్కులుచూచుచున్ బెగడిని న్నోలిన్నుతుల్ సేయుచున్
గన్నుల్ [11]మూయు యశోదకున్ జెలుతవై కన్పింతు నారాయణా.

శా. ఉల్లోలంబులుగాఁ గురుల్ [12]నుదుటిపై నుప్పొంగ మోమెత్తి ధ
మ్మిల్లం బల్లలనాడ రాగరససమ్మిశ్రంబుగా నీవు వ్రే
పల్లెం దాడుచు గోపగో[13]నివహగోపస్త్రీలయుల్లంబు ఖిః
పిల్లంగ్రోవిని [14]బట్టి రాఁ దిగుచు నీపెం పొప్పు నారాయణా. ౪౪

మ. కస వొప్పం బసిమేసి ప్రొద్దుగలుగం గాంతారసుం బాసి య
ప్పసులు న్నీవును వచ్చుచో నెదురుగాఁ బైకొన్నగోపాంగనా
రసవద్వృత్తపయోధరద్వయహరిద్రాలేపనామోదముల్
పసిఁగొంచుం బసిఁగొంచువచ్చుటలు నే భావింతు నారాయణా.

---

(40) ౧ చంద్రికాతపశుభాభివ్యక్త. ౨. జనకయా. 3. గల్గు సుశ్లోకా. ౪. నుంతు. (41) ౫. వనితల్. ౬. గని వారిరాగరసకేళీ. (42) ౭. వేగంబ రాఁబంచెనో. ౮. రావేని. ౯. జూడఁ. (43) ౧౦. యెన్నం బెక్కుగురూపులై నఁగని చేమెత్తి స్తుతుల్. ౧౧. మోడ్చు. (44) ౧౨. చెమటపై. ౧3. వృషభ. ౧౪. ఙట్టి.

శా. చన్నుల్ మీఁదికిఁ జౌకళింప నడుముం। జవ్వాడఁ గందర్పసం
[౧]పన్నాఖ్యంబు నటింపఁ జూడ్కిఁ గబరీ।భారంబు లూటాడఁగా
విన్నాణంబుల [౨]నెప్పు గోపికలు గో।బృందంబుతో వచ్చు మీ
వన్నెల్ కన్ను[౩]ల ముంచి గ్రోలుటలు నే। వర్ణింతు నారాయణా.

మ. పెరుఁగుల్ ద్రచ్చుచు నొక్కగోపిక మిముం। బ్రేమంబునంజూచి [౪]రా
గరసావేశత దుత్తబ్రువ్వనిడియెం। గవ్వంబు నీవు న్మనో
హారలీలం గనుఁగొంచు ధేను వని [౫]య।య్యాఁబోతునుం బట్టితే
వరవృత్తాంతము లేను బుణ్యకథగా। వర్ణింతు నారాయణా. ౪౭

శా. కేలం గోలయుఁ గూటిచిక్కము నొగిం। గీలించి నెట్టెంబుగాఁ
బీలీపింఛముఁ [౬]జుట్టి నెన్నడుమునం। బింఛావళిం గట్టి క
ణ్ణాలంకారకదంబగుచ్ఛమధుమ।త్తాళీస్వనం బొప్పు నీ
వాలం గాచినభావ మిట్టి దని [౭]నే। వర్ణింతు నారాయణా. ౪౮

శా. కాళిందీతటభూమి నాలకదుపుల్। కాలూఁది మేయన్ సము
త్తాలాలోలతమాలపాదపశిఖాం।తస్థుండ వై వేణురం
ధ్రాలిన్ రాగరసంబు [౮]నిండ విలస।ద్రాగంబు సంధించి గో
పాలవ్రాతము గండుగోయిలలుగా। [౯]వర్ణింతు నారాయణా. ౪౯

శా. రాణించెం గడు నంచు నీసహచరుల్। రాగిల్లి సోలంగ మీ
వేణుక్వాణము వీనులం బడి మనో।వీథుల్ బయల్ [౧౦]ముట్టఁగా
ఘోణాగ్రంబులు మీఁది కెత్తుకొని లాం।గూలంబు లల్లార్చి గో
శ్రేణుల్ చిందులు[౧౧]ద్రొక్కియాడుటలు। నేఁ [౧౨]జర్చింతు నారా.

మ. పసులంగాపరి నేమెఱుంగు మధుర।ప్రామోల్లసద్వల్లవా
గ్విసరారావము మోవి దాఁ వెదురుగ్రో।విం [౧౩]బెట్టినాఁ డంచు నిం
గసరుల్ దోఁపఁగ నాఁడుగోపికలఁ ద।ద్గానంబునన్ మన్మథ
వ్యసనాసక్తులఁ జేయుచందములు నే। వర్ణింతు నారాయణా. ౫౧

---

(46) ౧. పన్నాట్యంబు నటించులీలఁ. ౨. వచ్చి. ౩. లఁగ్రోలుట ల్మనమునన్ వర్ణింతు. (47) ౪. తాఁ గరుణావేశత. ౫. యుర్వ్యాఁబోతుకుం బెట్టితే. (48) ౬. గట్టి. ౭. నా కంటింపు. (49) ౮. నించునిను నెయ్యంబొప్ప నీక్షించి గో. ౯. భావింతు. (50) ౧౦. నెట్టఁగా. ౧౧. వెట్టి. ౧౨. జింతింతు. (51) ౧౩. బట్టి.

మ. జడి యెంతో తడవయ్యె [1]జెయ్యియలసెన్ । శైలంబు మా చేతులం
దిడుమన్నన్ జెలువవ్వుతో వదలినన్ । హీనోక్తి గీవెట్ట నె
క్కుడు గోపుల్ ప్రియమంద నింద్రుఁ డడలం । గోవర్ధనాద్రీంద్రమున్
గొడుగై యుండఁగఁ గేలఁబూనితిగదా । గోవింద నారాయణా. ౫౨

మ. లలితాకుంచిత వేణినిం దడవి మోఁ । ల్లల్ జాఱ, ఫాలస్థలిన్
దిలకం [2]బొప్పలరంగఁ గుండలరుచుల్ । దీపింప లేఁ జెక్కులన్
[3]మొలకన్నవ్వుల చూపు లోరగిల మే । న్మోవ్వంకలన్ బోవఁగా
నలిఁ గైకొందువ్రగాదె నీవు మురళీ । నాట్యంబు నారాయణా. ౫౩

శా. మాపాలం గడుఁ గ్రొవ్వి గోపికలలో । మత్తిల్లి వర్తింతువే
మాపాలంబలెవచ్చి యుండుదు వెస । న్మాపాలలో నుండుమీ
మాపాలైన [4]సుఖాత్మ వీవె యనుచో । మన్నించి తా గొల్లలన్
మాపాలం గల వేల్పు [5]వీవె యని కా । మన్నింతు నారాయణా.

మ. ఒక కాంతా[6]మణి కొక్కఁడీవు మఱియు । న్నొక్కర్తె కొక్కండవై
సకలస్త్రీలకు సంతసం బలర రా । స క్రీడ తన్మధ్యక
ల్పకమూలంబున వేణునాద[7]రస మొ । ప్పంగాఁ బదార్వేల గో
పికలం జెంది వినోద మొందు నెడ నీ । పెం పొప్పు నారాయణా. ౫౫

మ. లలితంబైన భవత్తనూ[8]నవలస । ల్లావణ్యదివ్యామృతం
బలుఁ గుల్కొందఁ గటాక్ష[9]కుల్యములుగా । నందంద గోపాంగనల్
తలఁపు ల్పాదులుగట్టి కందళితనూ । త్నస్త్రీలు వాటింతురా
నెలఁతల్ [10]ంతీవెలు చైత్రవిస్ఫురణమా । నీమొప్పు నారాయణా.

---

(52) ౧. జేయలసె మాశైలంబు. (౫౩) ౨. బొయ్యఁ గరంగ. 3. మొలవ న్నవ్వులచూపులం గడు మెయిన్. (54) ౪. మహాత్మ వీవె యనిన న్మన్నించి తద్గోపికన్. ౫. నీవ యెపుడున్. (55) ౬. మణిప్రక్క నీవు మఱియు న్నొక్కర్తె కొక్కండవై. ౭. రవ మొప్ప న్నీవు గావింప బోధకమై వచ్చిరి గోపకాంతలు వినోదంబంది నారాయణా. (56) ౮. విలసనన్. ౯. కుల్యములు. ౧౦. తీవెలో చైత్రవిస్ఫురణమో.

శా. ¹లీలన్ బూతకి ప్రాణవాయువులు పాలిండ్లందు వెళ్లించి ²దు
ష్కీలుండై చను బండిదానవు ³వెసం జిందై పడందన్ని యా
లోల మ్మద్దులు గూల్చి ధేనుదనుజున్ రోజంగ ⁴నీల్గించి వే
కూలం గంసుని గొట్టి గోపికలకోర్కుల్ దీర్తు నారాయణా. ౫౭

మ. రసనాగ్రంబున నీదునామరుచియున్ రమ్యంబుగా ⁵జెవ్రులకున్
నసలారంగ భవత్కథాభిరతియున్ హస్తాబ్జయుగ్మంబునన్
⁶వెస నీపాదసుపూజితాదియుగమున్ విజ్ఞాన మధ్యాత్మకున్
⁷వెస నింపొందనివాడు దా బశువు సూ ⁸వేదాత్మ నారాయణా.

మ. ⁹వరదుగ్ధాబ్ధితరంగడోలికలలో వైకుంఠలోకంబులో
¹⁰విరజాపార నయోధ్యలో మధురలో వ్రేపల్లెలో ద్వారకా
పురిలో ¹¹నాడెడుభంగి నాదుమదిలో భూరిప్రసన్నాననాం
బురుహం బొప్ప నటించు టొప్పును సితాంభోజాక్ష నారాయణా.

శా. చల్ల ల్వేలోకయూర నమ్మికొను నాసం బోవుచో ద్రోవ నీ
వల్లాసంబున నడ్డకట్టి మదనోద్యోగానులాపంబులం
జల్లం జల్లనిచూపు ¹²జల్లుమని ఘోషస్త్రీలపై జల్లు మీ
చల్లుంబోరు తెలంగు జిత్తమున నే జర్చింతు నారాయణా. ౬౦

## జ్ఞానవింశతి

మ. కలయ ¹⁴వేదములున్ బురాణములు బ్రఖ్యాతంబుగా దెల్సి మీ
వలనం భక్తివిహీనుడైన పిదపన్ వ్యర్థప్రయత్నంబె పో
గులకాంతామణి గొడ్డుపోయినగతిం గ్రొవ్వారు సస్యంబు దా
ఫలకాలంబున నీచిపోవుపగిదిం బద్మాక్ష నారాయణా. ౬౧

---

(57) ౧. హేళన్. ౨. దుష్కీలాత్ముం డగు. ౩. దివిం జిందై. ౪. హింసించి. (58) ౫. చాల కింపసలారన్. ౬. వెస నీపాదసమర్చనాభిగుణమున్. ౭. పస. ౮. పద్మాక్ష. (59) ౯. వరదుగ్ధాంబుధిలో ద్రిధామద్రుపులలో. ౧౦. విరజావీథి. ౧౧. బ్రహ్మాదిశేశ్వరాదికహృదంభోజంబులోనుండు వైఖరి నాలోపలనుండు భాగవత సాక్షాత్కారనారాయణా. (60) ౧౨. గాభిలాషంబువై. ౧౩. చల్లయును ఘోష స్త్రీ. (61) ౧౪. వేదపురాణశాస్త్రములు.

శా. స్నానంబుల్ నదులందుఁ జేయుట గజ । స్నానంబు చందం బగున్
మానం బొప్పఁ బఠించు వేద మటవీ । మధ్యంబులో నేడ్పగున్
నానాహోమము లెల్ల బూడిదలలో । న న్వ్రేల్చు నెయ్యై చను
న్నీ [1]నామోక్తియు నీపదాబ్జరతియున్ । లేకున్న నారాయణా.

మ. అలనీటం [2]దగురొంపి పైఁ [3]జలికిన । న్నానీటనే పాయు [4]నా
కిలపాపంబులు దుర్భరత్వము మహా । హేయంబునం బొందినం
బలునై జీవుని దొప్పఁదోఁగినవి యా । బాహ్యంబునం బాయునే
పొలియుంగాక [5]భవత్సపాదజలమునుం । బ్రోక్షింప నారాయణా.

మ. తనచిత్తాబ్జము మీ [6]పదాబ్జములకున్ । దాత్పర్యసద్భక్తితం
తున బంధించిన బంధనంబుకతనం । దుష్పాపపుంజంబు లె
ల్లను వీడన్ జని తాలవాల మహిమో । ల్లాసాబ్ధి యైనట్టి దా
సున కింపొందును మోక్షవైభవము దా । సుశ్లోక నారాయణా.

మ. తనువుం జీవుఁడు నేకమైనపిదపం । ధర్మక్రియారంభుఁడై
యనయంబు న్మది [7]దన్నెఱుంగక తుది । న్మాయాచే మగ్నుఁడై
తనుతత్త్వాదివియోగ మైనపిదపం । దా నేర్చునే నీదు ద
ర్శన మింపారఁగ [8]భక్తవత్సల సితా । సంకాశ నారాయణా. ౬౫

మ. తనకున్ సాత్త్వికసంపదాస్పద మహా । దాసోహభావంబునన్
ననయంబు న్మది నన్యదైవభజనం । బారంగ దూరింపుచున్
జనితాహ్లాదముతోడ నీచరణముల్ । సద్భక్తిఁ బూజించి నిన్
గనుఁగొన్నంతనె కల్మషంబు లడఁగుం । గర్మఘ్న నారాయణా. ౬౬

(62) ౧. నామస్తుతి. (63) ౨. గల. 3. గడిగినన్. ౪. కోయిలభావంబున నైన దుర్భర. ౫. భవత్సేవజలధిం బొందింప నారాయణా. (64) ౬. పదాబ్జములకైఁ. (65) ౭. నన్యదైవభజనం బారంగదూరింపుచున్ । జనితానందముతోడ నీచరణము ల్బర్చించు పుణ్యాత్ముని౦ । గనుఁగొన్నంతనె కల్మషంబు లడఁగుం గర్మజ్ఞ నారాయణా ॥ ౮. భక్తపోషణకృపా నిత్యాత్మ నారా.

మ. పరికింప [౧]న్వాలిభక్తి భేషజునకున్ । [౨]భవ్యంబుగా మీఁద మీ
చరణాంభోరుహదర్శనంబు గలదే । సద్భక్తి [3]లేకున్న ని
ధరలోఁ జోరుఁడు తన్ను [౪]డాపక పర । ద్రవ్యంబుపై నాసలం
బోరయన్నేర్చునె దుర్లభంబునఁ [౫]గృపాం । భోజాక్ష నారాయణా.

మ. పరమజ్ఞానవివేకపూరితమహా । [౬]భవ్యాంతరాళంబునన్
బరఁగ న్నిజ[౭]నామమంత్ర మొనరన్ । భక్తి న్ననుష్ఠింపుచుం
దురితాన్వేషణకాలభూతము [౮]వెసన్ । దూలంగ వాఁకట్టి వాఁ
డరుగున్ [౯]భవ్యపదంబు నొందుటకునై । యవ్యక్త నారాయణా.

మ. నరిఘోరాంధక బోధకారణ విప । త్సంసారమాలిన్యముం
బరమానంద సుయోగ[౧౦]నిర్మల లస । ద్భస్మంబుపై నూఁది యా
నిరతజ్ఞానసుకాంతి దర్పణమున । న్నిస్సంగుఁడై తన్నుఁ దా
నరయం గాంచినవాఁడు నిన్నుఁ గనువాఁ । డబ్జాక్ష నారాయణా.

మ. పరుషాలాపము లాడ నోడి [౧౧]మది నీ । పాదార్చనారంభుఁడై
నిరసించేరికిఁ గీడు సేయక మది । న్నిర్ముక్త[౧౨]కర్ముండునై
పరమానందనిషేధముల్ సమముగా । భావించి [౧3]వీక్షించు నా
పరమజ్ఞాని భవత్కృపం బొరయు నో । పద్మాక్ష నారాయణా. ౭౦

మ. ఒరులం దన్ను [౧౪]నెఱుంగు సయ్యెఱుకయు । న్నొప్పార నేకాంతమం
దరయం బైపడు నన్య[౧౫]భామినుల నా । కాంక్షించు దూరత్వమున్
మరణావస్థను నీదునామము వెస । న్మానంబునం దోఁచుటల్
ధరలోఁ[౧౬]గన న్నివి దుర్లభంబులు సుధా । ధామాక్ష నారాయణా. ౭౧

(67) ౧. న్నిజభక్తి. ౨. భద్రంబుగా. 3. నెట్లన్నఁ దా ధర. ౪. గావక. ౫. గృపాంభోరాశీ. (68) ౬. భావాంతరబద్ధస్థలిన్. ౭. మూర్తి శ్రీయుతముగా భక్తిం బ్రతిష్ఠిం. ౮. కడుందూరంబు. ౯. భవ్యపదంబుకు న్సుజనుఁడై. (69) ౧౦. దీపకళచే భస్మంబునొందించి. (70) ౧౧. మదిలోఁ బాపార్జితారంభముల్. ౧౨. దుస్సంగుఁడై. ౧3. వర్తించునా. (71) ౧౪. నెఱుంగనేర్చు నెఱుక. ౧౫. కామినియెడ న్నాకాంక్ష. ౧౬. నిన్నియు.

మ. నెరవొప్ప న్బహుశాస్త్రమర్మము లొగి । న్వీక్షించి వే తెల్సి మీ
వరనామామృతపూర ¹మానుచుఁ దగన్ । వైరాగ్యభావంబునన్
సరి న్శాంతముఁ ²గోరువారు పిదపన్ । సంసారమాతుఃపయో
ధరదుగ్ధంబులు ³గ్రోలనేరరు వెసం । దైత్యారి నారాయణా. ౭౨

శా. వేదంబందు సునిశ్చయుండగు మహా । వేల్పెవ్వఁడో యంచు నా
వేదవ్యాసపరాశరుల్ వెదకుచు । న్వేఱొండు లేఁ డంచు మీ
పాదాంభోజము లెల్లప్రొద్దు మదిలో । భావింతు రత్యున్నతిన్
శ్రీదేవీవదనారవిందమధుపా । శ్రీరంగ నారాయణా. ౭౩

మ. సుతదారాప్తజనాదివిత్తములపై । శూన్యాభిలాషుండు నై
యతనోద్రేకయుతంబులై పొదలు న। య్యైయింద్రియవ్రాతమున్
మృతిఁబొందించి ⁴దమంబునన్ శమమునన్ । మీఱంగ వర్తించు ని
ర్గతసంసారి ⁵భవత్కృపం బొరయు నో । కంజాక్ష నారాయణా. ౭౪

మ. ప్రమదం బారఁగఁ బుణ్యకాలగతులన్ । ⁶భక్తి న్ననుష్ఠింపుచున్
నమర న్నన్నసువర్ణగోసలిల క। న్యాధారుణిగ్రామ దా
నము లామ్నాయ⁷విధోక్తి భూసురులకున్ । సన్మార్గుఁడై యిచ్చువాఁ
డమరేంద్రార్చితవైభవోన్నతుఁ డగు । న్నామీఁద నారాయణా.

మ. ఇల నెవ్వారిమనంబులం దెఱుక దా । నెంతెంత గల్గుండు నా
కొలఁదిం జెంది వెలుంగుచుండు⁸వు వెసన్ । గోవింద నీరూపులన్
నలర న్నంబుమితంబులై సరసిలో । ⁹నంభోరుహంబుల్ దగన్
నిల నొప్పారెడుచంద మొందె దెపుడు । న్నీలాంగ నారాయణా.

మ. మదిలో ¹⁰నం దమభక్తిపీఠముపయిన్ । మానాథ మీపాదముల్
గదియం జేర్చినవాని కేనొడయఁడం । గా నంచు నత్యున్నతిన్
బదిలుండై సమవర్తి ¹¹భృత్యుచెవిలో । భారంబుగాఁ బల్కు మీ
పదపద్మార్చకు ¹²లెంతపుణ్యులో కృపా । పారీణ నారాయణా. ౭౭

(72) ౧. మాత్మసుమహా. ౨. గ్రోలుఁవారలు పునః. 3. ద్రావనేరరు ధరన్.
(74) ౪. మదిందమంబు శమమున్. ౫. భవన్నివాసగతుఁడౌ. (75) ౬. భక్తిస్వవర్త్రీవ్రతి
గా. ౭. విధిజ్ఞ భూసురుల కానందంబుతో నిచ్చువా. (76) ౮. వెపుడున్. ౯. నంభో
రుహం బొప్పమీ । నెలవొప్పా. (77) ౧౦. నుత్తమభ క్తి. ౧౧. భృత్యతతికిన్. ౧౨. లెట్టి.

మ. [౧]కుల మెన్నం గొలఁదేల యేకులజుఁడుం । [౨]క్రోధాభిమానాభిలా
షలు నజ్ఞానముఁ బాసి జ్ఞానము మదిన్ । సంధించి శుద్ధాత్ముఁడై
[౩]యలరారం బరుసంబు సోఁకు నినుమున్ । హేమాకృతిస్తోమమై
[౪]కలయున్నాకృతి వాఁడు ముక్తి కరుగుం । [౫]గంజాక్ష నారాయణా.

మ. నిరతానంద వియోగులై [౬]నిరసులై । నిర్భాగ్యులై నీచులై
కరుణాహీనమనస్కులై [౭]కఠినులై । కష్టాత్ములై నష్టులై
పరుషవ్యాధినిబద్ధులై పతితులై । భగ్నాంగులై మ్రగ్గువా
రరయం మి మ్మొగ్గి నాత్మయం దిడనివా । రబ్జాక్ష నారాయణా.

మ. ఘన[౯]భోగాస్పదులై గతాఘమతులై । కారుణ్యులై పుణ్యులై
ధనకీర్తిప్రదులై దయాభిరతులై । ధర్మాత్ములై నిత్యులై
మనుజాధీశ్వరులై మనోజనిభులై । మాన్యస్థులై స్వస్థులై
[౧౦]వనర న్నొప్పెడువారు నీపదతతుల్ । వర్ణింప నారాయణా. ౮౦

## మోక్షవింశతి

మ. విదితామ్నాయ నికాయభూతములలో । విజ్ఞానసంపత్కళా
స్పదయోగీంద్ర మనస్సరోజములలో । బ్రహ్మేంద్రదిక్పాలక
త్రిదశవ్రాత కిరీటరత్నములలో । దీపించుచున్నట్టి మీ
పదపద్మంబులు భావగేహమున నే । [౧౧]వర్ణింతు నారాయణా. ౮౧

మ. వెలయన్ యౌవనకాలమందు మరుఁడున్ । [౧౨]వృద్ధాప్యవేళంబులన్
బలురోగంబులు నంత్యమందు యముఁడుం । బాధింపఁబట్టైన యీ
పలుజన్మంబులు చాల దాఁటితి ననుం । బాలింపవే దేవ మీ
ఫలితానంద దయావలోకనము నాపైఁ జేర్చి నారాయణా. ౮౨

(78) ౧. కుల మెన్నంగను నేల. ౨. క్రోధాభిలాషంబులన్ బోలియంజేసి త్వదీయ భక్తిమదిలోఁ బొందించి. 3. మలయు స్వేపరుసంబు సోఁకి నినుము హేమంబైనచందంబునన్. ౪. వెలయ న్నీకృప. ౫. వేవేగ నారాయణా. (79) ౬. నిగతులై. ౭. కృపణులై. ౮. నిమగ్నులై పలువలై పాటిల్లు దుర్బుద్ధులిం దరయన్. (80) ౯. భోగోన్నతులై సరాగమతులై. ౧౦. యొనర న్నొప్పెడువారు నీపదనతుల్ నూహింప. (81) ౧౧. భావింతు. (82) ౧౨. వృద్ధాప్యకాలంబునన్.

మ. బలుకర్మాయతపాశ[1]బంధవితతిన్ । బాహాపరిశ్రేణికిం
జలయంత్రాన్వితబాధయాతనగతిన్ । సంసారకూపంబులో
నలరం ద్రిమ్మరుచుండు నన్ను నకటా! । యార్తుండనై వేఁడెదన్
వెలయ న్నీకృపచేతఁ జేదుకొనవే । [2]విశ్వేశ నారాయణా. ౮౩

మ. మమతాకారవికార[3]సంపద మహా। మత్తాళిలో నంధకా
రముచే ముక్తికి నేగుమార్గ మెఱుఁగన్ । రా దింక నాలోనికిన్
విమలాపాంగ[4]దయాదివాకరు వెసన్ । వీక్షింపఁగాఁ జేయు మీ
కమలానందవిహారవక్ష. లలితా । కంజాక్ష నారాయణా. ౮౪

మ. పరిపంథిక్రియ నెత్తి వెంటఁబడు [5]న। ప్పాపాళికిం దూలి మీ
చరణాబ్జస్థితిపంజరంబు శరణ। చ్ఛాయ జొచ్చితిం గావుమీ
బిరుదుం జూడుము మీరు సూడఁగ భవ। ద్భృత్యుండు దుఃఖంబులం
బొరయ న్నీ కపకీర్తి గాదె[6] శరదం। భోజాక్ష నారాయణా. ౮౫

మ. తపముల్ సత్క్రతుపంచయజ్ఞఫలముల్ । దానక్రియారంభముల్
జపము ల్పుణ్యసుతీర్థసేవఫలముల్ । సద్విప్రవిజ్ఞానముల్
ఉపవాసవ్రతధర్మశీలఫలముల్ । నొప్పారు ని న్నాత్మలో
నుపమింపంగలవారికిం గలవు వే। యు న్నేల నారాయణా. ౮౬

మ. సతతాచారము సూనృతంబుఁ గృపయున్ । సత్యంబును న్శీలమున్
సతిశాంతత్వము చిత్తశుద్ధి[7]కరమున్ । నధ్యాత్మమున్ ధ్యానమున్
ధృతియుం ధర్మము సర్వజీవహితముం । దూరంబు గాకుండ స
మ్మతికిం జేరువ మీనివాససుఖమున్ । మానాథ నారాయణా.

---

(౮౩) ౧. బంధనవిధిన్ బాహాపరిప్రేంఖనన్. ౨. వేవేగ. (౮౪) 3. సంభవమహా మత్తాళిలోభాంధకా । రముచే నిన్బొడగాంచు మార్గ మరయన్ రా దింక నాలోన నీ । కటాక్షదీపకళలే వెల్గించి నిన్జూపవే. ౪. కమలాకౌస్తుభ చారువక్ష విలసత్కంజాక్ష నారాయణా. (౮౫) ౫. నాపత్పంక్తికిందూలి మీ । చరణాబ్జస్తుతిపంజర. ౬. కరుణాంభోరాశీ. (౮౭) ౭. దమము న్నధ్యాత్మికధ్యానమున్: ౮. భూతహితముం దూరంబుగానుండు దుర్మతికిం దూరము.

మ. భవనాశిన్ గయఁ దుంగభద్ర యమునన్ । భాగీరథిం గృష్ణ వే
త్రవతి న్నర్మద పెన్న బాహుదఁ బయో । రాశి న్వియద్గంగయం
దవగాహంబున నైన పుణ్యము లొగి । న్నారంగ నేఁ డిచ్చటన్
భవదంఘ్రి[1]స్మరణంబునం గలుగు నో । పద్మాక్ష నారాయణా. ౮౮

మ. ధర గ్రామాధిపునింటిదాసుఁ [2]డొరు తెం । తో ద్రోహముం జేసినన్
పరఁగం జెల్లుట సూచితీ భువనసం । పాద్యుండ వైనట్టి మీ
[3]వరదాసావళిదాసదాసుఁడయి దు । ర్వారాఘముల్ చేసితిన్
గరుణం జేకొని కావుమయ్య [4]త్రిజగ । త్కల్యాణ నారాయణా. ౮౯

మ. గణుతింపం బహుధర్మశాస్త్రనిగమా । ఘుం బెప్పుడు న్ని న్నకా
రణబంధుం [5]డను నత్తెఱంగు కడుదూ । రంబయ్యె [6]నా మానినం
బ్రణతుల్ చేసెదఁ గొంతయైన గణుతిం । పం [7]బాటి లేకుండినన్
ఋణమా నానుతి నీవు శ్రీపతివి నీ । కేలప్ప? నారాయణా. ౯౦

మ. కరినాథుండు జలగ్రహగ్రహణదుః । ఖాక్రాంతుఁడై యీశ మీ
శరణం బన్న కృశానుభాను [8]శతతే । జస్ఫూర్తి యైనట్టి మీ
కరచక్రంబున నక్రకంఠము వెసన్ । ఖండించి మించెం దయా
పర సద్భక్తభయానకప్రకరస । త్ప్రాకార నారాయణా. ౯౧

శా. ఏభావంబున నిన్ దలంచె గజయూ । థేంద్రుండు నాపన్నుఁడై,
యేభావంబున [9]ద్రౌపదీయెడ రమా । ధీశా యనె న్వాయసం
బేభావంబున నిన్ శరణ్య మనెనో । [10]యీశా కృపాదృష్టిచే
నాభావంబున నీతలంపుఁ గలుగ । న్నాకిమ్ము నారాయణా. ౯౨

శా. నీలగ్రీవుఁడు చేతిపుఱ్ఱ విడిచె । న్నీ[11]యింతి భీతుంబునన్
నీలగ్రీవుఁడు [12]యీశ్వరాఖ్యఁదనరె । న్నీనామజప్యంబునన్
నీలగ్రీవుఁడు మించి త్రుంచెఁ బురముల్ । నీప్రాపు సేవించినన్
నీలగ్రీవముఖాబ్జభాస్కరకృపా । నిత్యాత్మ నారాయణా. ౯౩

---

(88) ౧. స్మరణార్చనం. (89) ౨. డొగి. 3. వరదాసీగృహదాసదాసినని. ౪. విలసత్కంజాక్ష. (90) ౫. డని తెల్ప నాతెఱఁగు. ౬. నేమానినీ. ౭. బాడిగాకుండినన్. (91) ౮. పతితోసాదృశ్యమైవచ్చి. (92) ౯. ద్రౌపదిందలఁచె కారణ్యేంద్రయత్నంబుకున్. ౧౦. యీశానుఁడు న్వాయసం । బాభావంబుఁ దలంచు నేర్పుకృపచేయం బాడి నారాయణా. (93) ౧౧. యింటి. ౧౨. నీకుఁ డయ్యె సతిదా నీనామమే యెన్నియున్.

మ. నిను వర్ణింపని[౧]వాఁడు మూఁగ మదిలో । [౨]నీ సత్కథాలాపముల్
విని మోదింపని[౩]వాఁడు చెవ్డు మరి నిన్ । వేడ్కన్ మనోవీథినిన్
గని పూజింపని[౪]వాఁడు నాశకరుఁడౌ । కర్మక్రియారంభుఁడై
తనలోఁ గానని[౫]వాఁడు నీచమతి పో । తత్త్వజ్ఞ నారాయణా. ౯౪

మ. నిను వర్ణింపని నీచబంధమతి దా । నిర్భాగ్యుఁడై మూఢుఁడై
పెనుదైవంబులఁ [౬]గోరి తా మనమునం । బ్రీతిన్ సుశీలంబుగా
ననలం బాఱిన భూతియందు వెలయ । న్నాజ్యాహుతుల్ పూని వే
ల్చినచందంబున వ్యర్థమై తనరు సూ ! । చిద్రూప నారాయణా. ౯౫

మ. నిను వర్ణింపని జిహ్వాదాఁ బదటికా ? । నీలాభ్ర దేహాంగకా
నిను నాలింపని [౭]చెవ్లు దా బదటికా? । నీరేజపత్రేక్షణా!
నినుఁ బూజింపని కేలు దాఁ బదటికా? । నిర్వాహక క్ష్మాతలా!
నినుఁ జింతింపనియాత్మ దాఁ బదటికా? । నిర్వాణ నారాయణా. ౯౬

శా. నీవే తల్లివి నీవె తండ్రి వరయ । న్నీవే [౮]జగన్నాథుఁడౌ
నీవే నిశ్చలబాంధవుండ వరయ । న్నీవే మునిస్తుత్యుఁడౌ
నీవే శంకరమూలమంత్రమయుఁడౌ । నీవే జగత్కర్తవున్
నీవే దిక్కనువారలే కద కడు । న్నీవారు నారాయణా. ౯౭

మ. అపరాధంబులు నిన్ను నమ్మి [౯]విను మే । నాజన్మపర్యంతమున్
విపరీతంబుగఁ జేసినాఁడ నికఁ నీ । వే దిక్కు [౧౦]నాలోనికిన్
గపటం బింతయు లేక దండధరుకుం । గట్టీక రక్షింపుమీ
కృపకుం [౧౧]బాత్రుఁడ నయ్య ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా.

శా. చెల్లం జేసితి పాతకంబులు మదిన్ । శ్రీనాథ మీనామముల్
పొల్లుల్వోవని నమ్మి[౧౨]నాఁడ నిఁక నా । పొంతన్ గృపామూర్తివై
చెల్లంబో నను నమ్మె వీఁడని దయం । జేపట్టి రక్షింపుమీ
తల్లిం దండ్రియు నీవుగాక యొరులే । తర్కింప నారాయణా. ౯౯

(94) ౧. వాఁడె. ౨. నిన్నెన్ని నీసత్కథల్. ౩. వాఁడెచాడువెలయన్వేడ్కన్. ౪. వాఁడె ౫. వాఁడె. (95) ౬. గొల్చి తామసమునన్. (96) ౭. చాలు. (97) ౮. జగత్కర్తవున్. (98) ౯. మదిలో. ౧౦. నీబోఁటికిన్. ౧౧. బాత్రుని జేసి. (99) ౧౨. నేఁ గొలిచితిం బూర్ణానుకంపాదృతిన్.

శా. నీమూర్తుల్గన నీకథల్వీన మది । న్నీపాద నిర్మాల్య ని
ష్కామోదంబు లెఱుంగ నీచరణతో।యం బాడ నైవేద్యము
న్నేమం బొప్ప భుజింప నీజపము వ।ర్ణింపం గృపం జేయవే
శ్రీ మించ న్బహుజన్మజన్మములకున్ । శ్రీయాదినారాయణా.

మ. నరసింహాచ్యుత వాసుదేవ వికస।న్నాళీకపత్రాక్ష భూ
ధర గోవింద ముకుంద కేశవ జగ।త్త్రాతా అహితల్పాంబుజో
దర దామోదర తార్క్ష్యవాహన మహా।దైత్యారి వైకుంఠ మం
దిర పీతాంబర భక్తవత్సల కృపం । [౧]దీపింపు నారాయణా. ౧౦౧

మ. కడకంటం గడలేని సంపద లోఁగిం । గావింపు లక్ష్మీశ పా
ల్కడలిన్ బన్నగశాయివై భువనముల్ । గల్పించు సత్పుత్రునిన్
బొడమం జేసిన నాభిపంకజ జగ।త్పుణ్యాత్మ భాగీరథీ
పడఁతిం గన్న పదారవింద మిము నే । భావింతు నారాయణా.

మ. రమణీయంబుగ నాదిమంబు నవతా।రంబు న్భవద్దివ్యరూ
పము నామామృతముం దలంపఁగ దశ।ప్రాప్త్యమ్యెఁ గృష్ణావతా
రము సుజ్ఞానము మోక్షము ద్వాదశసం।ప్రాప్తి న్కృతాంధ్రాఖ్యకా
వ్యము నర్పించితి మీపదాబ్జములకున్ । వైకుంఠ నారాయణా.

* ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర
సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన
నారాయణ శతకంబున సర్వంబును

సంపూర్ణము

---

(101) ౧. దృష్టింపు.

* ఈగద్యము తాళపత్రగ్రంథములో లేదు. కాగితపుఁబ్రతిలో వేఱుసిరాతోఁ దర్వాత వ్రాయఁబడినది.

# పీఠిక

శ్రీ కాళహస్తి సుప్రసిద్ధమైన శివక్షేత్రము. సువర్ణముఖీతీరమునందు కొండలనడుమ నలరారుచు నీక్షేత్రము యాత్రికుల నాకర్షించుచున్నది. ఈక్షేత్రపురాణమునకు సంబంధించిన కన్నప్ప సాలెపురుగు పాము ఏనుగులయుదంతము క్షేత్రమాహాత్మ్యమునందు రమ్యముగ వర్ణింపబడినది. పృథివ్యప్తేజోవాయ్వాకాశలింగరూపములను దాల్చిన యీశ్వరుడు కాళహస్తియందాకాశలింగముగను వెలసినటులు స్థలపురాణము వర్ణించుచున్నది.

> శ్లో. శ్రీశైలం కాశి కేదారం కాళహస్తించ పట్టిసమ్;
> పంచక్షేత్రం పఠే న్నిత్యం మహాపాతక నాశనమ్.

ఈచాటుశ్లోకము శ్రీ కాళహస్తిక్షేత్రపు ప్రసిద్ధిని విశదము చేయుచున్నది.

శ్రీకాళహస్తీశ్వరశతకము శివభక్తిపరమైనశతకములందు మంచి వ్యాపకము గల శతకము. శతకకర్త ధూర్జటికవి యని ప్రతీతి కలదు. కా దనువారును గలరు. "ధూర్జటికవి పాకనాటి యాఱువేల నియోగి. భారద్వాజగోత్రజుడు. ఆపస్తంబసూత్రుడు. కాళహస్తినివాసుడు. శివభక్తుడు" అని శ్రీ వీరేశలింగము పంతులుగారు కవుల చరిత్రమునందు ధూర్జటికవిప్రణీతం బైన శ్రీ కాళహస్తిమాహాత్మ్యముసందలి ప్రమాణముల ననుసరించి వ్రాసియుండిరి. లోకప్రతీతి యిటు లున్నను శతకమునందుమాత్రము కర్తృత్వాదికములను నిర్ణయించుటకు సాధనంబు లేవియును లేవు. కస్తూరిరంగకవి అభేదయుతికిఁ దన రంగరాట్ఛందము

నందు దీనియందలి ౧౧౪-వ పద్యము నుదాహరణముగను గైకొని ధూర్జటికవి కాళహస్తీశ్వరశతకమును పేర్కొనెను.

శా. నీకుం గానికవిత్వ మెవ్వరికి నే ♦ నీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిం బిరుదంబు కంకణము ముం♦జేఁ గట్టితిం బట్టితిన్
లోకుల్ మెచ్చ వ్రతంబు నాతనువుకీ♦లుల్ నేర్పులుం గావు ఛీ!
ఛీ! కాలంబులరీతి దప్పెడుఁజుమీ ♦ శ్రీకాళహస్తీశ్వరా! ౧౧౪

వాడుకనుబట్టి శతకకర్త ధూర్జటియని యంగీకరించినను నిర్ణయమును సమర్థించుటకు దగినయాధారములు గనుపట్టవు. ధూర్జటికవి ప్రణీతంబులైన రెండు గ్రంథములను పోల్చినను నీసంశయ మింతవఱకును తీఱలేదని పండితులమతము. పరిశోధకు లీవిషయవిమర్శనమును జేసి శతకకర్తను నిర్ణయింతురుగాక! కాళహస్తిచరిత్రమును ధూర్జటివంశచరిత్రమును నిందులకు సాధనంబులు గాగలవు.

కాలనిర్ణయము:—మహాకవి యైన ధూర్జటి శ్రీకృష్ణదేవరాయల సమకాలికుడు. ఈకవివంశజుడు కుమారధూర్జటి తన రత్నావళీపరిణయమునందు ధూర్జటి నిటులు ప్రస్తుతించెను:

మ. పటుగంగాలహరీతరంగ సమసం♦భ్రత్ప్రౌఢతాంచత్కళా
ఘటనన్ శాదవినమ్రకృష్ణనర రా♦డ్గంభీరకోటీరవి
స్ఫుటరత్నద్యుతిపాటలీకృతపదాం♦భోజాతు సర్వజ్ఞు ధూ
ర్జటినిం గొల్చెద నస్మదీయకులక♦ర్తన్ భక్తి రంజిల్లఁగన్.

కవులచరిత్రమునందు ధూర్జటికాలము ౧౫౩౦ ప్రాంతములందు నిర్ణయింపబడినది. ధూర్జటియే కృతికర్తయైన గ్రంథమును నాకాలమునకు జెందియుండును.

శైలి:—శతకశైలి రసవంతమై సరళమై హృద్యముగనున్నది. కాళహస్తీశ్వరునిస్తోత్రపరము లైన శతకములు ౧. కాళహస్తిలింగశత

కము ౨. కాళహస్తిశతకము (శరభకవికృతము) 3. కాళహస్తీశ్వర శతకము (నాగపూడి కుప్పుస్వామయ్యకృతము) ౪. తిమ్మయ్య, ౫. విరూపాక్షుడు మొదలగు శతకములున్నను నీ శతకము వలె నితరశతకములు జనాదరణమును బడయలేదు. శతకకర్త పండితుడు, రసజ్ఞుడు, శివభక్తుడు. శతకమునందలి ౪౯, ౫౧, ౬౫, ౭౭, ౧౧౪ పద్యములు కృతికర్తప్రతిభను దెలుపుచున్నవి. కవి తన చిత్తసంక్షోభమును దాపక ఆర్తహృదయవేదనను ఆర్తత్రాణపరాయణుండైన కాళహస్తీశ్వరునకు నివేదించెను. పద్యములు భక్తిరసావేశ భరితములై భక్తులచిత్తముల నాకర్షించుచున్నవి. భాష సంస్కృతాంధ్రపదముల సమ్మేళనము నుచితరీతిని గలిగి సుబోధ్యముగ నున్నది. వర్ణనలు సామాన్యములైనను రసవంతములై హృదయరంజకములుగ నున్నవి. క్వచిత్తుగ గ్రామ్యప్రయోగము లున్నను రచనకావ్యసరణిని గలిగి పండితహృదయమును దెలుపుచున్నది. గులాము, చేసే, అంతా, పూసిందేమిటి, తీర్థాలు, మొదలగు ప్రయోగము లున్నను రచన రసవంతమై పాండిత్యమును దెలుపుచున్నది. భావార్థవిచారణసందర్భమునం దుదాహృతములైన పద్యములు శతకశైలిని దెలుపుటకు చాలియున్నను మఱి కొన్నిపద్యము లిచట నుదాహరింపబడుచున్నవి. కవి శివానందలహరి సర్వేశ్వరశతకము మొదలగు గ్రంథములందలి భావములను గ్రహించినటులు పద్యములు దెలుపుచున్నవి.

మ. దినముం జిత్తములో సువర్ణముఖరీ♦తీరప్రదేశాగ్రకా
ననమధ్యోపలవేదికాగ్రమున నా♦నందంబునం బంకజా
సన నిష్ఠ న్నినుఁ జూడఁగన్న నదివో♦ సౌఖ్యంబు లక్ష్మీవిలా
సిని మాయానటనల్ సుఖంబు లగునే♦ శ్రీకాళహస్తీశ్వరా. 3౫

మ. పవి పుష్పంబగు నగ్ని మంచగు నకూ♦పారంబు భూమిస్థలం
బవు శత్రుం డతిమిత్రుఁడౌ విషము ది♦వ్యాహారమౌ నెన్నఁగా
నవనీమండలిలోపలన్ శివశివే♦త్యాభాషణోల్లాసికిన్
శివ! నీనామమె సర్వవశ్యకరమౌ ♦ శ్రీకాళహస్తీశ్వరా! ౪౫

శా. పాలుం బువ్వయుఁ బెట్టెనం గుడువరా ♦ పాపన్న రా! యన్న నే
తేలెమ్మన్న నరంటిపండ్లుఁ గొని ♦ తే లేకున్న నే నొల్ల నం
చేఁ లాలింపరె తల్లిదండ్రు లపు డ♦ట్లే తెచ్చి వాత్సల్యల
క్ష్మీలీలావచనంబులం గుడుపరా ♦ శ్రీకాళహస్తీశ్వరా. ౫౨

శా. ఆధివ్యాధులు దీపనాదులు కళ♦త్రాపత్యముల్ చాలవా
బాధన్ బెట్టఁగ నన్నదమ్ములను బాం♦ధవస్వాంతులం దోడుగా
నేధర్మం బని కల్గఁజేసితివి న ♦ న్నీరీతిఁ బీడించు వా
రే ధీరుల్ నినుఁ గొల్వ కుండఁగలనా ♦ శ్రీకాళహస్తీశ్వరా. ౧౩౩

## భా వా ర్థ ము

"శతకమకుటము:—శ్రీ కాళహస్తీశ్వరా!"

శ్రీ కాళహస్తిమాహాత్మ్యమునం దీమకుటార్థము రమ్యముగను వర్ణింపబడినది. స్వయంభవమైన లింగమునకు సాలెపురుగును పామును ఏనుగును కన్నప్పయును జేసినయుపచారములనుబట్టి యీపేరు గలిగినటులు పురాణగాథ గలదు. కావ్యము కవిహృదయభావావేశమును దెలుపుచున్నను మానవప్రవృత్తిని ద్యోతకముచేయుచు జనాదరణమును బడయుచున్నది. నిత్యజీవితానుభవమునందు మానవులకు గావ్యములు సుఖదుఃఖానుభవములను బ్రత్యక్షముచేయుచు పురుషార్థములను బడయుటకు సాధనంబులగుచున్నవి. ఈ శతకకర్తకు సంసారతాపత్రయానుభవము వైరాగ్యమును గలుగజేసి మోక్షకాంక్షను బుట్టించినది. కవి ఆకాలపు కవులవలె రాజాశ్రయమును జేరియును రాజుల నేకారణముననో విశేషముగనిరసించెను. శతకమునందుగల "రాజాధమ శ్రేణీద్వారము" "రాజుల్మత్తులు" "రాజకీటకముల్" "నృపాలాధముల్" "లోకకంటకులు" "అధములు" "భూభృచ్చండాలురు" "రాజుల్మత్తులు వారి సేవ నరకప్రాయంబు" మొదలగు ప్రయోగములు రాజనిరసనమును సూచించుచున్నవి. దీనియందలి ౧౪, ౪౯, మొదలగు పద్యములు

కాముకచిత్తవృత్తిని, ౩౬, ౯౫, ౧౩౪ పద్యములు బాంధవద్వేషమును దెలుపుచున్నవి. కవికి యౌవనమునందు సమ్మోహనమునకు గారణంబులైన కామినీకనకంబులు కాలాంతరమునందు వైరాగ్యమునకు సాధనంబులైనవి. భోగములు యోగమునకు సాధనంబులైనవి. కవి యౌవనదశయందు కామపరతంత్రుడై సను కాలక్రమమునను కర్మపరిపాకమున మోక్షార్థియైనటులు శతకార్థము విశదముచేయుచున్నది. తప్పులను జేయుట మానవస్వభావము. త్రికరణశుద్ధిగను పశ్చాత్తాపమును బొంది చిత్తమును శివార్పణముచేయుట ముక్తికి మార్గము. కాళహస్తీశ్వరశతకమునందీభావార్థములను నీక్రిందిపద్యములు విస్పష్టము చేయుచున్నవి.

శా. సంతోషించితిఁ జాలుఁజాలు రతిరా♦జద్వారసౌఖ్యంబులన్
శాంతిం బొందితిఁ జాలుఁజాలు బహురా♦జద్వారసౌఖ్యంబులన్
శాంతిం బొందెదఁ జూపు బ్రహ్మపదరా♦జద్వారసౌఖ్యంబు ని
శ్చింత న్శాంతుఁడ నాదు నీకరుణచే ♦ శ్రీకాళహస్తీశ్వరా! ౬౨

రతిరాజద్వారసౌఖ్యంబులు రాజద్వారసౌఖ్యంబులు బ్రహ్మజ్ఞానమునకు సాధనంబులైనవిధమును పైపద్యము తెలుపుచున్నది.

మ. అయవారై చరియింపవచ్చుఁ దనపా♦దాంభోజతీర్థంబులన్
దయతోఁ గొమ్మనవచ్చు సేవకుని స♦ర్థప్రాణదేహాదు ల
న్నియు నాసొమ్మనవచ్చుఁ గాని పిరుల ♦ న్నిందించి నిన్నాత్మ ని
ష్క్రియతం గానఁగరాదు పండితులకున్ ♦ శ్రీకాళహస్తీశ్వరా! ౭౩

శ్రీరంగనీతుల నెన్నిటినైనను జెప్పవచ్చునుగాని నిష్కామచిత్తముతో నీశ్వరుని గొల్చుట దుర్లభము.

మ. వెనుకం జేసిన ఘోరదుర్దశలు భా♦వింపంగ రోఁతయ్యెడున్
వెనుకన్ముందరవచ్చు దుర్మరణము ♦ ల్వీక్షింప భీతయ్యెడు
న్ననుఁ నేఁ జూచియు నావిధు ల్దలఁచియు ♦ న్నాకే భయంబయ్యెడుం
జెనకుంజీఁకటి నాయెఁ గాలమునకున్ ♦ శ్రీకాళహస్తీశ్వరా! ౭౮

కవి తనపాపకార్యములకు బశ్చాత్తాపమును బొందినవిధమున కీ షద్యము నిదర్శనము.

శా. లేవో కానలకందమూలఫలముల్ ♦ లేవో గుహల్ తోయముల్
లేవో యేఱులఁ బల్లవా స్తరణము ♦ ల్లేవో సదా యాత్మలో
లేవో నీవు విరక్తుల న్మనుప జా♦లిం బొంది భూపాలురన్
సేవ ల్సేయఁగఁబోదురేలొకో జనుల్ ♦ శ్రీకాళహస్తీశ్వరా! ౮౪

రాజసేవానిరసనమును వైరాగ్యానందమును పైశ్లోకమునందు పరిస్ఫుటముచేయబడినది.

శా. రోసీ రోయదు కామినీజనుల తా♦రుణ్యోరుసౌఖ్యంబులన్
పాసీపాయదు పుత్రమిత్రజన సం♦పద్భ్రాంతి, వాంఛాలతల్
కోసీకోయదు నామనం బకట! నీ♦కుం బ్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు దీనిత్రుళ్లణఁపవే ♦ శ్రీకాళహస్తీశ్వరా! ౩౭

తృష్ణావేగమును సంహరించి చిత్తశాంతిని ప్రసాదించుట కీశ్వరుని వేడుచున్నాడను.

శా. జాతుల్సెప్పుట సేవసేయుట మృషల్ ♦సంధించు టన్యాయ్యవి
ఖ్యాతిం బొందుట కొండెకాఁడగుట హిం♦సారంభకుండౌట మి
థ్యాతాత్పర్యము లాడు టన్నియుఁ బర♦ద్రవ్యంబు నాశించి యా
శ్రీ తా నెన్నియుగంబు లుండఁ గలదో ♦ శ్రీకాళహస్తీశ్వరా! ౧౦౦

మ. మది నిన్నేమఱకుండువారలకు గా♦మక్రోధముల్ ముక్తిసం
పద లీనోపుట తెల్లమయ్యె నవినా♦భావైకవిజ్ఞానసం
పదలైనం జిలుకాడ వీవనుచు స♦న్మార్గంబునం భక్తరా
జి దివారాత్రులు చెప్పఁగా విని మదిన్ ♦ శ్రీకాళహస్తీశ్వరా! ౧౨౨

మ. కడుపే పట్టఁగలేక లోకముల కా♦కంబట్ల నూరూరివెం
బడి నింటింటఁ గడుంగడుం గృపణతం ♦ దైత్యం బపేక్షించి వే
డెడి నిష్కారణదుఃఖవృత్తిఁ బడుచుం ♦ డెందంబునం నిన్ను దూ
రెడు నన్నుం గరుణింపరాఁదగదె! యో ♦ శ్రీకాళహస్తీశ్వరా! ౧౪౧

మానవులు భగవంతుని సేవించుచు గామితార్థములను బడయు దురని శ్రీకృష్ణభగవానులు గీతయందు వివరించినభావములకు శతకములు ప్రమాణములుగ నున్నవి.

శ్లో. చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ!

భగవద్భక్తులందు మోక్షకాము లైనజ్ఞాను లుత్తములు. మోక్షకామియైన శతకకర్త శ్రీకాళహస్తీశ్వరుని త్రికరణశుద్ధిగను స్తోత్రము చేసి భక్తిరసానందమును భక్తులకు సాక్షాత్కారముచేసి శివసాయుజ్యమును బడయగలిగెను.

మ. అడుగన్ బద్మజుకల్పముల్ బ్రదుకఁ బ◆ద్మాఢీశ్వరత్వంబు ని
న్నడుగన్ వాసవవైభవం బడుగ లో◆కై కాధిపత్యంబు నే
నడుగన్ నీచరణాంబుజాతయుగళ◆ధ్యానంబు నా కిమ్ము వే
చెడుచింతల్ దిగఁద్రావివైతు నిదిగో ◆ శ్రీకాళహస్తీశ్వరా. ౧౩౦

రక్తాక్షి పుష్య బ॥ ౫
గురువారము, మద్రాసు.

కాశీనాధుని నాగేశ్వరరావు.

పాఠభేదములు:— ఈ ప్రతిని సిద్ధముచేయుటయందీ క్రింది యైదు ప్రతులు సంప్రతింపబడినవి. అందు మొదటి మూడును చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండారమునందలి 10-3-21, 11-2-25, 11-2-27 నంబరులుగలవి. నాలవది వావిళ్లవారిచే 1911 సంవత్సరమున ముద్రితమయినది. ఐదవది మంజువాణివారిచే ముద్రితమయినది. వీనికి వరుసగా 'అ. ఆ. ఇ. వా. మం.' అను సంకేతాక్షరము లుపయోగింపబడినవి. శతకమునందు గల ౧౪౧ పద్యములసంఖ్య స్ఖాలిత్యమును సూచించుచున్నది. పద్యములు ౪౯, ౯౨ సమానార్థమును దెలుపుచున్నవి. ఇట్టిపద్యములు మఱికొన్ని గలవు. కాలక్రమమున ననుకరణపద్యములు క్రొత్తవి గ్రంథమునందు బ్రవేశమును బొందినవిధమును గ్రంథపరిశీలనము విశదీకరించుచున్నది.

శ్రీరస్తు

# శ్రీకాళహస్తీశ్వర శతకము

శ్రీ విద్యుత్కలితా[౧] జవంజవ మహా[౨]జీమూత పాపాంబుధా
రావేగంబున మన్మనోబ్జ[౩] సముదీర్ణత్వంబుఁ గోల్పోయితి
న్దేవా మీకరుణాశరత్సమయ మింతేఁజాలుఁ జిద్భావనా
సేవం దామరతంపరై[౪] మనియెదన్ । శ్రీకాళహస్తీశ్వరా. ౧

శా. వాణీవల్లభ దుర్లభంబగు భవద్ద్వారంబున న్నిల్చి ని
ర్వాణ[౫] శ్రీఁ జెఱవట్టఁజూచిన విచారద్రోహమో నిత్యక
ళ్యాణక్రీడలఁ బాసి దుర్దశలపాలై రాజలోకాధమ
శ్రేణీద్వారము దూఱఁజేసి[౬] తెపుడో । శ్రీకాళహస్తీశ్వరా. ౨

శా. అంతా మిథ్య తలంచిచూచిన నరుం[౭] డప్లౌటెఱింగేసదా
[౮]కాంత ల్పుత్రులు నర్థమున్ దనువు నిక్కంబంచుమోహార్ణవ
[౯]భ్రాంతిం [౧౦]జెంది చరించుఁగాని పరమార్థంబైన నీయందుఁ దాఁ
జింతాకంతయుఁ [౧౧]జింతనిల్పఁడుగదా । శ్రీకాళహస్తీశ్వరా. 3

శా. నీ నా సం.దోడఁబాటుమాట వినుమా । నీచేత జీతంబు నేఁ
గానింబట్టక [౧౨]సంతతంబు మది వేడ్కన్గొల్తు నంతస్సప
త్నానీకంబున [౧౩]కొప్పగింపకుము నన్నాపాటియేఁ జాలుఁ దే
జీ నెల్లం గరి నొల్ల నొల్ల సిరులన్ । శ్రీకాళహస్తీశ్వరా. ౪

---

(1) అ. ౧. జీవం జీవ. ఆ. ౨. పాదాంబుధా. అ 3. సమదీర్ణ. ఆ. ౪. బ్రతికెదన్. (2) ఆ. ౫. శ్రీ జెయిపట్టిచేసిన. ఆ. ౬. తకటా (తెపుడో. మం.) (3) మం. ౭. డప్లౌటఁ దా నెంచియున్. అ. ౮. కాంతలు పుత్రమిత్రులు అ. ౯. భ్రాంతిచేపొంది... మీయందు. ఇ. ౧౦. దేలుచునుండు. ౧౧. ఇ. ఆ. భక్తి నిల్ప డకటా. (భక్తి నిల్పడు గదా. మం.) (4) అ. ౧౨. సంతసంబు. అ. ౧౩. కోపగింపకుము.

మ. భవకేళీమదిరామదంబున మహాపాపాత్ముఁడై వీఁడు [5]న
న్ను వివేకింపఁ డటంచు నేను నరకార్ణోరాశిపాలైనఁ బ
ట్టవు బాలుం డొకచోట నాటతమిఁ గోఁడ నూ్నతఁ గూలంగఁ దం
డ్రి విచారింపక నుండునా? కటకటా! శ్రీకాళహస్తీశ్వరా. ౫

శా. స్వామిద్రోహముఁ [2]జేసి వేఱొకనిఁ గొల్వంబోతినో కాక నే
నీమాటన్విన నొల్లకుండితినొ నిన్నేదిక్కుగాఁ జూడనో
యేమీ! యిట్టి [3]వృథాపరాధినగు నన్నీదుర్భవాంభోధివీ
చీమధ్యంబున [4]నెంచియుంపఁదగునా? శ్రీకాళహస్తీశ్వరా. ౬

మ. దివిజక్ష్మారుహధేనురత్నఘనభూతిప్రస్ఫురద్రత్నసా
నువు నీవిల్లు నిధీశ్వరుండు సఖుఁ డర్ణోరాశికన్యావిభుం
డు విశేషార్చకుఁ డింక నీ కెన ఘనుండుంగల్గునే నీవుచూ
చి [1]విచారింపవు లేమి నెవ్వఁడుడుపున్ శ్రీకాళహస్తీశ్వరా. ౭

శా. నీతో యుద్ధముఁ జేయనోపఁ గవితానిర్మాణశక్తి న్నినుం
బ్రీతుం జేయఁగలేను [1]నీకొఱకుఁ దండ్రిం జంపఁగాఁజాల నా
చేత న్రోఁకట నిన్ను మొత్తవెఱతుం జీకాకు నాభక్తి యే
[2]రీతి న్నాకిఁక నిన్ను జూడఁగలుఁగున్ శ్రీకాళహస్తీశ్వరా. ౮

శా. ఆలుంబిడ్డలుఁ దల్లిదండ్రులు ధనంబంచు న్మహాబంధనం
బేలా నామెడఁగట్టినాఁడ విఁక నిన్నే వేళఁ జింతింతు ని
ర్మూలంబైన మనంబులోనఁ గడుదుర్మోహాబ్ధిలోఁ గ్రుంకి యీ
సీలామాలపుఁ జింత నెట్లుడిపెదో శ్రీకాళహస్తీశ్వరా. ౯

---

(5) ఆ. ౧. నన్ను విచారింప. (6) ఆ. ౨. జేస్తినో యొకని విశ్వాసింపగా (జేసి యేనొకని...అ.) ఆ. 3. నిరాపరాధి...దుఃఖవారాశిలో. ఆ. ౪. ముంచిముంచి విడువన్. (వా. మం. ముంచియుంపఁదగునా) (7) ఆ. ౧. విచారింపవు లేమియెప్పుడుకృపన్. (విచారింపనిజేమి యెవ్వఁ డుడుపున్. మం.) (8) ఆ. ౧. నీకునయి......బాలునా. ఆ. మం. ౨. రీతి నిన్నిక నాకుజూడగలుగున్.

శా. నిప్పై పాతకతూలశైల మడఁచు। న్నీనామమేమానవుల్
తప్పందాలను విన్న నంతకు భుజా। దర్పోద్ధత క్లేశముల్
తప్పుం దారును ముక్తులౌదురని శాస్త్రంబుల్మహాపండితుల్
చెప్పంగాఁదమకింక శంక వలెనా। శ్రీకాళహస్తీశ్వరా. ౧౦

శా. వీడెంబబ్బినయప్పుడుం దమనుతు। ల్విన్నప్పుడుం బొట్టలోఁ
గూడున్నప్పుడు శ్రీవిలాసములు పైకొన్నప్పుడుం గాయకుల్
పాడంగా వినునప్పుడున్ జెలఁగుదం। భప్రాయవిశ్రాణన
క్రీడాసక్తులు నేమిచెప్పవలెనో। శ్రీకాళహస్తీశ్వరా. ౧౧

మ. నిను సేవింపఁగ నాపదల్పొడమనీ। నిత్యోత్సవం బబ్బనీ
జనమాత్రుండననీ మహాత్ముఁడన నీ। సంసారమోహంబుపై
కొననీ జ్ఞానముగల్గనీ గ్రహగతుల్। గుందింపనీ మేలు వ
చ్చినరానీ యవి నాకు భూషణములో। శ్రీకాళహస్తీశ్వరా. ౧౨

శా. ఏ వేదంబుఁబఠించె లూత భుజగం। బే శాస్త్రము ల్సాచెఁ దా
నే విద్యాభ్యసనం బొనర్చెఁ గరి చెం। చే మంత్ర మూహించె బో
ధావిర్భావనిదానముల్ చదువుల। య్యా? కావు మీపాదసం
సేవాసక్తియె కాక జంతుతతికి। శ్రీకాళహస్తీశ్వరా. ౧౩

శా. కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ। గాయంబు వక్షోజముల్
రాయన్రాపడె రొమ్ము మన్మథవిహా। రక్లేశవిభ్రాంతిచేఁ
బోయెన్ప్రాయము బట్టఁగట్టెఁ దల చె। ప్పన్ రోఁత సంసారమేఁ
జేయంజాల విరక్తుఁ జేయఁగదవే। శ్రీకాళహస్తీశ్వరా. ౧౪

---

(10) ఆ. ౧. నీనామమున్మానవుల్. ఆ. ౨. తప్పుల్ దారులు ముక్తులౌదురట... (ఆ. తప్పందారుల...దండాహతి.) ఆ. 3. నికనాకు శంకగలదా. (దమ కింక శంక గలదా. మం.) (11) ఆ. ౪. బిచ్చిన యప్పుడుం దన. ఆ. ౫. దంభప్రాణ. ఆ. ౬. నగు నో. (12) ఆ. ౭. లొదవనీ. (13) ఆ. ౮. బూతి. ఆ. ౯. నేవిద్యాభ్యాసంబు చేసె. ఆ. ౧౦. సేవాభక్తియె. ఆ. మం. ౧౧. జంతువులకున్. (14) ఆ. ౧౨. పంచాంగుళి. ఆ. ౧౩. ప్రాయప్రాప్తికి బట్టగట్టె తల. (ప్రాయప్రాప్తి న్తలబట్టకట్టెను. ఛాయంబాయె ను...వా. మం.)

శా. నిన్నే రూపముగా భజింతు మదిలో । నీరూపు మోకాలొ? స్త్రీ
చన్నో?[1]కుంచమొ? మేకపెంటికయొ? యీ । సందేహముల్మాన్పి నా
కన్నారన్ భవదీయమూర్తి సగుణా । కారంబుగా జూపవే
చిన్నీరేజవిహారమత్తమధుపా । శ్రీ కాళహస్తీశ్వరా. ౧౫

మ. నిను [2]నావాకిలి గావుమంటినొ[3] మరు । న్నీలాలకభ్రాంతిఁ గుం
డెన పొమ్మంటినొ యెంగిలిచ్చి [4]తిను తిం । టేగాని కాదంటినో
[5]నిను నెమ్మిం దగ విశ్వసించు సుజనా । నీకంబు [6]రక్షింపఁ జే
సిన నావిన్నపమేల గైకొనవయా! । శ్రీ కాళహస్తీశ్వరా. ౧౬

శా. కాలన్ [7]ఉన్వను జేతులాడవు కుమా । రా రమ్ము రమ్మంచు నేఁ
జాలన్ [8]జంపఁగ నేత్రముల్దివియఁగా । [9]శక్తుండ నేగాను నా
శీలంబేమని చెప్ప నున్నదిఁక[10] నీ । చిత్తంబు నాభాగ్యమో
శ్రీలక్ష్మీపతి సేవితాంఘ్రి[11]యుగళా । శ్రీ కాళహస్తీశ్వరా. ౧౭

శా. [12]రాజుల్మత్తులు వారిసేవ నరక । ప్రాయంబు వా రిచ్చునం
భోజాక్షీచతురంతయాన తురగీ । భూషాదు[13]లాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్షచాలుఁ బరితృ । ప్తిం[14]బొందితిన్ జ్ఞానల
క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము దయతో । శ్రీ కాళహస్తీశ్వరా. ౧౮

శా. నీరూపంబు[15]దలంపఁగా దుదమొద । ల్నేఁ గాన నీవైననున్
[16]రారా రమ్మని యంచుఁ జెప్పవు వృథా । రంభంబు లింకేటికిన్
నీరన్ముంపుము పాల ముంపు మిఁక నీ । న్నే [17]నమ్మినాఁడం జుమీ
[18]శ్రీరామార్చిత పాదపద్మయుగళా । శ్రీ కాళహస్తీశ్వరా. ౧౯

---

(15) అ. ౧. మేండ్రుకమొ. (16) అ. ౨. నేవాకిలి. అ. 3. మరున్నీలాలక. (మరినీలాలకింగోరి ఇ.) అ. ఇ. ౪. తినకుంటేగాని. (తినకుంటే గాదంటినో. అ. తినకుంటేగాని కాదంటినో. మం) ఇ. ౫. నినుదానొందరు విశ్వసింప. (నిను నేనొందఁగ విశ్వసించి అ. నిను నెమ్మిం గడు విశ్వసించు. అ.) అ. ౬. చొప్పార. (17) అ. ౭. ఉప్పును. (ఉప్పగ. అ.) అ. ౮. జంపగలేను. అ. అ. ౯. నేశక్తుండనేగాను. అ. ౧౦. చేతులరాకట నిన్ను మొత్తవెఱతుం జీకాకు నాభక్తి యేకీతిం నిన్ను జూడగల్గున్. అ. ౧౧. కమలా. (18) అ. ౧౨. రాజుల్ ధూర్తులు. అ. ౧౩. రత్నవ్యథా. మం. ౧౪. జెందితి నొంతు. (19) అ. ౧౫. నతింపగా తుదిమొదల్ నేనేర. అ. ౧౬. రారా యీగతి...నాకేటికిన్. (రారా రమ్మని నాకు...లింకేటికిన్. మం.) అ. ౧౭. దూఱువాడం. అ. ౧౮. శ్రీరామాధిప సేవితాంఘ్రియుగళా.

శా. నీకు న్మాంసము వాంఛయేని కఱవా? నీచేత లేడుండఁగాఁ
జోకైనట్టి కుఠారముండ ననల జ్యోతుండ నీరుండఁగాఁ
బాకంబొప్ప ఘటించి చేతిపునుకన్ భక్షింప కాబోయచేఁ
జేకొం టెంగిలిమాంస మిట్లు దగునా శ్రీకాళహస్తీశ్వరా. ౨౦

శా. రాజైఁ దుష్కృతి జెందెఁ జందురుఁడు రారాజై కుబేరుండు దృ
గ్రాజీవంబునఁ గాంచె దుఃఖము, కురు క్ష్మాపాలుఁ డామాటనే
యాజిం గూలె సమస్తబంధువులతో, నారాజశబ్దం బిసీ!
ఛీ! జన్మాంతరమందు నొల్లనుసుమీ శ్రీకాళహస్తీశ్వరా.

శా. రాజన్నాతురుఁ డైనచో నెచట ధర్మం బుండు? నేరీతి నా
నాజాతిక్రియ లేర్పడున్? సుఖము మాన్యశ్రేణి కెట్లబ్బు? రూ
పాజీవాళికి నేది దిక్కు? ధృతినీ భక్తుల్ భవత్పాదనీ
రేజంబుల్ భజియింతు రే తెఱఁగునన్? శ్రీకాళహస్తీశ్వరా. ౨౨

మ. తరఁగల్ పిప్పలపత్రముల్ మెఱుఁగు టద్దంబుల్ మరుద్దీపముల్
కరికర్ణాంతము లెండమావులతతుల్ ఖద్యోతకీటప్రభల్
సురవీథీలిఖితాక్షరంబు లసువుల్ జ్యోత్స్నాపయఃపిండముల్
సిరులం దేల మదాంధులౌదురు జను ల్శ్రీకాళహస్తీశ్వరా. ౨౩

శా. నిన్నే నమ్మినరీతి నమ్మ నొరులన్; నీకన్న నా కెన్న లే
రన్నల్దమ్ములు తల్లిదండ్రులు గురుం డాపత్సహాయుండు; నా
యన్నా! యెన్నఁడు నన్ను సంసృతివిషాదాంభోధి దాఁటించి య
చ్ఛిన్నానందసుఖాబ్ధిఁ దేల్చెదొ కదే శ్రీకాళహస్తీశ్వరా. ౨౪

---

(20) అ. ౧. వాంఛయైనపటువైనట్టి. ఆ. ౨. చెప్పుమా. (21) అ. ౩. శబ్దంబె ఛీ. మం. ౪. సీ. ఆ. ౫. నొప్పదు సుమీ. (23) ఆ. ౬. లెండమావులుమతుల్. ఆ. ౭. లిఖితాక్షరంబులు తటి జ్యోత్స్నాపయఃపిండముల్. (24) అ. ౮. నిన్నే నమ్మిన. (నిన్నేనమ్మినరీతి నమ్మనొకరిన్. ఆ.) అ. ౯. నాకులే. అ. ౧౦. సంసృతాంభోరాశి. (సంసృతివికారాంభోధి. మం.) వా. ౧౧. దేల్చెదొకదే.

శా. నీపంచం బడియుండఁగాఁ గలిగినన్ భిక్షాన్నమే చాలు ని
క్షేపం బబ్బిన రాజకీటకముల న్సేవింపఁగా నోప నా
శాపాశంబులఁ జుట్టి త్రిప్పకుము సంసారార్థమై బంటుఁగాఁ
జేపట్టం దయఁగల్గెనేని మదిలో శ్రీకాళహస్తీశ్వరా. ౨౫

శా. నీపేరున్ భవదంఘ్రితీర్థము భవన్నిష్ఠ్యూతతాంబూలముల్
నీపళ్లెంబు ప్రసాదముం గొనికదా నే బిడ్డనైనాఁడ న
న్నీపాటిం గరుణింప నోప వికనే నెవ్వారికిం బిడ్డఁగాఁ
జేపట్టం దగుఁ బెట్టు మాన్పఁదగదా? శ్రీకాళహస్తీశ్వరా. ౨౬

శా. అమ్మా యయ్య యటంచు నెవ్వరిని నే నన్నన్ శివా నిన్ను నే
సుమ్మీ నీమదిఁ దల్లిదండ్రు లనటంచున్ జూడఁగాఁ బోకు నా
కిమ్మైఁ దల్లియుఁ దండ్రియున్ గురుఁడ నీవే కాక సంసారపుం
జిమ్మంజీఁకటి గప్పినన్ గడపు నన్ శ్రీకాళహస్తీశ్వరా. ౨౭

మ. కొడుకుల్ పుట్ట రటంచు నేడ్తు రవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నేగతుల్
వడసెం బుత్రులు లేని యా శుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్
చెడునే మోక్షపదం బపుత్రకునకున్ శ్రీకాళహస్తీశ్వరా.

మ. గ్రహదోషంబులు దుర్నిమిత్తములు నీకల్యాణనామంబు ప్ర
త్యహముం బేర్కొను నుత్తమోత్తముల బాధంబెట్టఁగా నోపునే
దహనుం గప్పఁగఁజాలునే శలభసంతానంబు నీసేవఁ జే
సి హతక్లేశులు గారు గాక మనుజుల్ శ్రీకాళహస్తీశ్వరా.

---

(25) అ. ౧. నీచేతిభిక్షాన్నమెచాలు నిక్షేపంబిచ్చిన రాజకీటముల సేవింపగా నోప. అ. ౨. సేవింపగాజాల నన్నా. (26) అ. 3. భవద్విఖ్యాతతాంబూలముం. అ. ౪. నీబిడ్డనైనాడ. అ. ౫. జేపట్టం...మాన్పగదవో. (జేపట్టన్దయగల్గెనేని మదిలో మం.) (27) అ. ౬. యన్నయటంచు నొప్పిబడి నే యన్నం శివుం నెన్న నే సుమ్మీనామది తల్లిదండ్రులనుచుం జూడంగగాబోకనా. అ. ౭. గల్గరే. అ. ౮. గడపటం. (28) మం. ౯. గల్గరటంచు. మం. ౧౦. గల్గరె. అ. ౧౧ సుఖం. (29) అ. ౧౨. యోగంబులు. అ. ౧3. మీకల్యాణ. అ. ౧౪. జాలునే. అ. ౧౫. నోపునో...మీసేవచే. అ. ౧౬. హతక్లేశులుంగారు మనుజులె.

మ. అడుగంబోను నిఁక నన్యమార్గరతులం । బ్రాణావనోత్సాహినై
యడుగంబోయినఁ బోదు నీదు పదప।ద్మారాధకశ్రేణి యు
న్నెడకున్ నన్ను భజింపఁగాఁగనియు నా।కేలా పరాపేక్ష కో
రెడిదింకేమి భవత్ప్రసాదమె తగు । శ్రీకాళహస్తీశ్వరా. 30

మ. మదమాతంగము లందలంబులు హరు । ల్మాణిక్యము ల్పల్లకుల్
ముదితల్ చిత్రదుకూలము ల్పరిమళం।బు ల్మోక్షమీఁజాలునే
మదిలో వీని నపేక్షచేసి నృపధా।మద్వారదేశంబునం గా
చి దినంబుల్ వృథఁ బుత్తు రజ్ఞు లకటా । శ్రీకాళహస్తీశ్వరా.

శా. రోసీ రోయదు కామినీజనుల తా।రుణ్యోరుసౌఖ్యంబులన్
పాసీ పాయదు పుత్రమిత్రజన సం।పద్భ్రాంతి, వాంఛాలతల్
కోసీ కోయదు నామనం బకట నీ।కుం బ్రీతిగా సత్క్రియల్
చేసీ చేయదు దీని త్రుళ్లణఁపవే । శ్రీకాళహస్తీశ్వరా. 3౨

శా. ఎన్నే ళ్లుండితి నేమి గంటి నిఁక నే । నెవ్వారి రక్షించెదన్
నిన్నే నిష్ఠ భజించెద న్నిరుపమో।న్నిద్ర ప్రమోదంబు నా
కెన్నం డబ్బెడు నెంతకాల మిఁక నే । నిట్లున్న నేమయ్యెడిం
జిన్నంబుచ్చక నన్ను నేలుకొనవే । శ్రీకాళహస్తీశ్వరా. 33

శా. చావం గాలము చేరువౌ టెఱిఁగియుం । జాలింపఁగాలేక త
న్నేవైద్యుండు చికిత్సఁ బ్రోవఁగలఁడో । యేమందు రక్షించునో
యేవేల్పుల్ కృపఁజూతురో యనుచు నిన్నింతైనఁ జింతింపఁ డా
జీవచ్ఛ్రాద్ధముఁ జేసికొన్న యతియు । శ్రీకాళహస్తీశ్వరా. 3౪

---

(30) అ. ౧. బ్రాణామనోత్సాహియై (బ్రాణావనోత్సాహినై. అ.) అ. ౨. గలిగినం. (గలిగె. అ.) ఆ. 3. భేమైన. (31) అ. ఆ. ౪. పల్లకీల్. మం. ౫. దినమ్ము ల్గడపుత్తు. (32) ఆ. మం. ౬. థన. (తన. అ.) (33) అ. ౭. ఇన్నేండ్లుండితి (ఇన్నే ళ్లుండితి. ఆ. మం.) ఆ. ౮. కెన్నం డబ్బెడినంతకాలమిక నే నేమంచు నెట్లయ్యెదం. (కెన్నం... నేమయ్యెడున్. మం.) (34) ఇ. ౯. చావొప్పగాలేక. (చెల్లింపగాలేక. అ.) ఇ. ౧౦. నిన్నెన్నండైన. ఇ. ౧౧. యతికిన్.

మ. దినముం [1]జిత్తములోఁ సువర్ణముఖరీ।తీర ప్రదేశామ్రకా
ననఁ [2]మధ్యోపలవేదికాగ్రమున నా।నందంబునం [3]బంకజా
సన నిష్ఠ న్నినుఁజూడఁ [4]గన్న నదివో । సౌఖ్యంబు లక్ష్మీవిలా
సిని మాయానటనల్ సుఖంబు లగునే । శ్రీకాళహస్తీశ్వరా. ౩౫

శా. ఆలంచు న్మెడఁగట్టి దానికి నప।త్యశ్రేణిఁ గల్పించి త
ద్బాలవ్రాతము నిచ్చిపుచ్చుకొను సం।బంధంబుఁ గావించి యా
[5]మాలర్కంబున బాంధవంబనెడి ప్రే।మం [6]గొంద ఱీడ్రింపఁగా
సీలన్సీల[7] యమర్చిన ట్లొసఁగితో । శ్రీకాళహస్తీశ్వరా. ౩౬

మ. తనువే నిత్యముగా నొనర్చు [8]మది।లేదా చచ్చిజన్మింపకుం
డ నుపాయంబు ఘటింపు [9]మీగతుల రెం।టన్నేర్పు లేకున్న నే
దని నాకిప్పుడె చెప్పు చేయఁగల కా।ర్యం బున్న సంసేవఁ జే
సి నినుంగాంచెదఁ [10]గాలకాలమున నో । శ్రీకాళహస్తీశ్వరా. ౩౭

మ. [11]పదునాల్గేలె మహాయుగంబు లొకభూ।పాలుండు; చెల్లించె న
య్యుదయాస్తాచల [12]సంధినాజ్ఞ నొకఁడా।యుష్మంతుఁడై ఏకియ
భ్యుదయం బెవ్వరు చెప్పఁగా వినరొ య।ల్పుల్మత్తులై యేల చ
చ్చెదరో రాజులమంచు నక్కటకటా । శ్రీకాళహస్తీశ్వరా. ౩౮

శా. రాజన్నంతనె పోవునాకృపయు ధ।ర్మం బాభిజాత్యంబు వి
ద్యాజాతక్షమ సత్యభాషణము [13]వి।ద్వన్మిత్రసంరక్షయున్
సౌజన్యంబు[14] కృతం బెఱుంగుటయు వి।శ్వాసంబు గాకున్న దు
ర్బీజ[15] శ్రేష్ఠులు గాఁ గతంబు గలదే । శ్రీకాళహస్తీశ్వరా. ౩౯

---

(35) అ. ౧. సువర్ణముఖినీతీర్థప్రవేశామ్ర. (సువర్ణముఖరీతిన్ ప్రదేశామ్ర. ఆ.) అ. ౨. మధ్యావలవేదికాగ్రముల. మం. ౩. న్నీరజా. అ. ౪. గలు. (36) అ. ౫. మాలర్కంబనెడి బాంధవప్రేమంబునం ద్రిప్పితా. ఆ. వా. మం. ౬. గొందఱిం ద్రిప్పఁగా. ఆ. ౭. సీలన్సీల యొసర్చి. (జీలం జీలయమర్చి. మం) (37) అ. ౮. మతిలేదా. మం. ౯. మాపనుల.వా. ౧౦. గాక. (38) అ. ౧౧. పదునాల్వేలు. (పదునాల్గేశ. ఆ.) అ. ౧౨. యాజ్ఞనొందె యొకనాడాయుష్మంతుడైనాడె (39) అ. ౧౩. దీర్ఘన్మిత్ర.(సద్విప్ర. ఆ.) అ. ౧౪. కృతంబుసేయు నలనిస్వానంబుగా. ఆ. ౧౫. శ్రేష్ఠులగాగతంబెఱుగనో. (శ్రేష్ఠ లకేగతంబుగలదో. మం.)

మ. మును నీచే నపవర్గరాజ్య౧పదవీ। మూర్ధాభిషేకంబు గాం
చిన పుణ్యాత్ములు నేను నొక్క౨సరివో। చింతించిచూడంగ నె
ట్లనినం ౩గీటఫణీంద్రపోత మదవేదండా౪గ్రహింసా౫విచా
రిని గాఁగా నినుఁ గానరాక మదిలో। శ్రీకాళహస్తీశ్వరా. ౪౦

మ. పవమానాశనభూషణ౫ప్రకరము। ల్భద్రేభచర్మంబునా
టవి౬కల్పంబు ప్రియంబులై భుజగశుం।డాలాటవీచారులన్
భవదుఃఖంబులఁ బాపుట౭ప్పుఁ గోలఁదిం। బాటించి కైవల్య మి
చ్చి వినోదించుట కేమికారణ మయా। శ్రీకాళహస్తీశ్వరా. ౪౧

మ. అమర౮స్త్రీల రమించినం జెడదు మో।హం౯ బింతయుం బ్రహ్మప
ట్టముసిద్ధించిన నాస దీఱదు ౧౦నిరూ।ఢక్రోధమున్ సర్వలో
కముల న్మ్రింగిన మాన దిందుఁగల సౌ।ఖ్యం౧౧బొల్ల నీసేవ జే
సి మహా౧౨పాతకవారిరాశిఁ గడతున్। శ్రీకాళహస్తీశ్వరా. ౪౨

మ. చనువారిం గని యేడ్చువారు౧౩ జముఁడా। సత్యంబుగా వత్తు౧౪మే
మనుమానం బిఁక లేదు నమ్మ మని తా।రారావేళ నారేవునన్
౧౫మునుఁగంబోవుచు బాస సేయుట సుమీ। ముమ్మాటికిన్ జూడఁగా
చెనఁటు ల్గానరు దీని౧౬భావ మిదివో। శ్రీకాళహస్తీశ్వరా. ౪౩

(40) అ. ౧. పదమున్ మూర్ధాభిషిక్తంబు. అ. ౨. సరిగా (సరియే. ఆ.) అ. 3. గీటమునిద్రపోతు మదలీలాంధుండు. (గీటమునిద్రపోత మదలీలాంధుం డహింసా. ఆ.) ఆ. ౪. విచారిణీగా నేనినుగానకాన. (విచారినిగాగా నినుగాన గాక. అ.) (41) అ. ౫. ప్రకరమున్ భద్రేభ. ఆ. ౬. కల్పంబు. అ. ఆ. ౭. చలదిం. (42) అ. ౮. శ్రీలవరించినం. అ. ఆ. ఇ. ౯. బేమియుం. ఇ. ౧౦. క్రోధమీ యల్లలోకముల (క్రోధమీ మూడులోకముల. అ.) ఇ. ౧౧. బొప్పనీసేఁ. (బొల్లమీ సేవ. అ.) అ. ౧౨. పాతకపారరాశిగడతున్. (పాతకరాశిబాయనడతున్. ఆ.) పాతకరాశి యోపనడతున్. ఇ.) (43) అ. ఆ. ఇ. ౧3. యముడా సర్వత్ర వచ్చేము. ఇ. ౧౪. నీకనుమానం... తారావేళ (గాయనుమానం... నానీటిలో. అ. నేమనుమానంబిక లేదు నమ్మమనుచున్ యావేళ. ఆ. నీకను... ఇక నేల హుమ్మనుచు. మం.) ఆ. ౧౫. మునిగేదెల్లను... (మునిగేభావము... మ్మాటికిన్ అ. మునిగింమార్గము... ఇ... కదా ముమ్మాటికిన్.) అ. ౧౬. భావమదిగా (మర్మమికనో. ఆ.)

మ. భవదుఃఖంబులు రాజకీటములఁ సం । ప్రార్థించినం బాయునే?
భవదంఘ్రిస్తుతిచేతఁగాక; విలసద్బాలక్షుధాక్లేశదు
ష్టవిధుల్మానునె చూడ మేకమెడచంటం? దల్లికారుణ్యదృ
ష్టి వినోదించుట కేమికారణమయా । శ్రీకాళహస్తీశ్వరా. ౪౪

మ. పవి పుష్పంబగు నగ్ని మంచగు నకూపారంబు భూమిస్థలం
బవు శత్రుం డతిమిత్రుఁడౌ విషము దివ్యాహారమౌ నెన్నఁగా
నవనీమండలిలోపలన్ శివశివేత్యాభాషణోల్లాసికిన్
శివ నీనామము సర్వవశ్యకరమౌ । శ్రీకాళహస్తీశ్వరా. ౪౫

శా. లేవో కానలకందమూలఫలముల్ । లేవో గుహల్ తోయముల్
లేవో యేఱులఁ బల్లవాస్తరణము । ల్లేవో సదా యాత్మలో
లేవో నీవు విరక్తుల న్మనుప జాలిం బొంది భూపాలురన్
సేవ ల్సేయఁగఁబోదు రేలొకో జను । ల్శ్రీకాళహస్తీశ్వరా. ౪౬

మ. మును నేఁబుట్టినపుట్టు లెన్నిగలవో । మోహంబుచే సందుఁ జే
సినకర్మంబులప్రోవు లెన్నిగలవో । చింతించినంగాన నీ
జననం బే యని యున్నవాఁడ నదియే । చాలింపవే నిన్నుఁ గొ
ల్చినపుణ్యంబునకుం గృపారతుఁడవై । శ్రీకాళహస్తీశ్వరా. ౪౭

మ. తనువెందాక ధరిత్రి నుండు నను నందాక న్మహారోగదీ
పనదుఃఖాదులఁ బొందకుండ నను కంపాదృష్టి వీక్షించి యా
వెనుక న్నీపదపద్మముల్దలఁచుచు । న్విశ్వప్రపంచంబుఁ బా
సినచిత్తంబున నుండఁజేయఁగదవే । శ్రీకాళహస్తీశ్వరా. ౪౮

---

(44) అ. ౧. చేబ్రార్థించి...బాయునే (...బోవునే. మం.) అ. ౨. విలసద్భావక్షుధాక్లేశముల్. అ. 3. విశేషంబున నిచ్చుచంటబలె నో. (45) అ. ౪. రవి పుష్పం బగు. (ఫలపుష్పంబగు. అ.) అ. ౫. నకూపారఁబులై (పవి...భూమిస్థలిం. ఇ.) అ. ౬. హావళత్రుండతి. (భవతస్త్రుండతి. ఇ.) అ. ౭. భక్ష్యాహారమౌ. ఇ. ౮. శివాత్మారాధనం సక్తికిం మం. (46) అ. ౯. భూజముల్. అ. ౧౦. బల్లవాస్తరణము. అ. ౧౧. సుజనుల్ (మనుజుల్. అ.) (47) అ. ౧౨. లో (తో. అ.) అ. ౧3. ప్రాపు లెన్ని. అ. ౧౪. చింతింపనేగాన. (చింతింపనోగాన. మం.) అ. ౧౫. నదియున్ చాలించి అ. ౧౬. వా.

మ. మలభూయిష్ఠమనోజధామముఁ సుషుమ్నద్వారమో? యూరుకుం
డలియో?-పాదకరాక్షియుగ్మములు షట్కంజంబులో?మోముచం
జలజంబో?నిటలంబు చంద్రకళయో? సంగంబుయోగంబో? గా
సిలి సేవింతురు కాంతలన్ భువి జను ల్శ్రీకాళహస్తీశ్వరా. ౪౯

మ. జలకంబుల్ రసముల్ ప్రసూనములు వాచాబంధముల్ వాద్యము
ల్గలశబ్దానము లంచితాంబర మలంకారంబు దీప్తుల్మెఱుం
గులు నైవేద్యము మాధురీమహిమగాఁ గొల్తున్నినున్ భక్తి రం
జిల దివ్యార్చనఁ గూర్చి నేర్చినక్రియన్ శ్రీకాళహస్తీశ్వరా. ౫౦

శా. ఏలీల న్నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షాధ్వని వ్యంగ్యశ
బ్దాలంకారవిశేషభాషల కలభ్యంబైన నీరూపము
జాలుంజాలు ంకవిత్వముల్ నిను యథేచ్ఛారూఢి వర్ణింపుచో
సీ! లజ్జింపరుగాక మాదృశకవుల్ శ్రీకాళహస్తీశ్వరా. ౫౧

శా. పాలుంబువ్వయుఁబెట్టెదం గుడువరా-పాపన్నరా! యన్న వే
రేలెమ్మన్న నరంటిపండ్లుఁ గొనితే లేకున్న నే నొల్ల నం
చేలాలింపరె తల్లిదండ్రు లపు డట్లే తెచ్చి వాత్సల్యల
క్ష్మీలీలావచనంబులం గుడుపరా శ్రీకాళహస్తీశ్వరా. ౫౨

(49) ఆ. ౧. సుషుమ్నద్వారమోయాది (సుఖమ్మద్వారమోనాభి. అ సుషుమ్న ద్వారమానారు ఇ.) అ. ౨. పాదకరాక్షిపద్మములు (పారకరాక్షిపద్మములు ఇ.) మం ౩. నై. ఆ. ౪. యోగంబుగా (యోగంబునా. ఇ.) ఆ. ౫. సిల...బుధజనుల్ - (చెలి...బుధజనుల్ ఇ. సిలసేవింతు రదేలకాంతలబుధుల్. అ.). (౫౦) ఆ. ౬. కుసుమ ప్రసూనములు వాక్సందర్భముల్. ఆ. ౭. లక్ష్మీతాంబర. మం. ౮. యుతమగు. (51) ఆ. ౯. భావలనవశ్యంబైన ..... (భావలకవాచ్యంబైన.....మం. భావల నవాచ్యంబైన నీరూపముల్. ఆ.) ఆ. ౧౦. కవిత్వము న్నిలుచునే సత్యంబు వర్ణించుచో. మం. ౧౧. మాదృశుల్గవులహో. (52) ఆ. ౧౨. మాయన్నరాలే. (రాయన్నరా. అ. ఇ. పాపన్నాయన్నలే. మం.) ఇ. ౧౩. లేలేమన్నను నంటిపండ్లుగొనితెస్తేగాని నేనొల్లనం. ఆ. ౧౪. చేలాలింపుచు తల్లిదండ్రులవియట్లే..... (చేలాలింపుచు......లవియెట్లో. ఆ. చేలాలించుట తల్లి...ఇ.)

మ. కలలంచు న్శకునంబులంచు గ్రహయోగం బంచు సాముద్రికం
బులటంచుం దెవులం చరిష్టమనుచు న్భూతంబులంచు న్విషా
దులటంచు న్నిమిషార్ధజీవనములందుం భీతిఁ బుట్టించి యీ
సిలుగుల్ ప్రాణుల కెన్ని చేసితి వయా! శ్రీకాళహస్తీశ్వరా. ౫౩

మ. తలమీఁదం గుసుమప్రసాద మలికస్థానంబుపై భూతియున్
గళసీమంబున దండ నాసికతుద న్గంధప్రసారంబు లో
పల నైవేద్యముఁ జేర్చు నేమనుజుఁ డా భక్తుండు నీ కెప్పుడుం
జెలికాఁడై విహరించు రౌప్యగిరిపై శ్రీకాళహస్తీశ్వరా. ౫౪

శా. ఆలుంబిడ్డలు మిత్రులున్ హితులు నిస్స్వార్థంబు లీనేర్తురే
వేళన్ వారి భజింప జాలిపడఁ గా నావిర్భూతమోదంబునం
గాలం బెల్ల సుఖంబు నీకు నిఁక భక్తశ్రేణి రక్షింపకే
శ్రీ లెవ్వారికిఁ గూడఁ బెట్టెదవయా! శ్రీకాళహస్తీశ్వరా. ౫౫

మ. సులభుల్ మూర్ఖులు నుత్తమోత్తములు రాజు లల్గ్గి యే వేళ న
న్నలఁతం బెట్టిన నీపదాబ్జములఁ బాయం జాల; నే మిచ్చినం
గలధౌతాచల మేలు, టంబునిధిలోఁ గాపుండు, టబ్జంబుపైఁ
జెలువొప్ప న్సుఖియింపఁ గాంచుటసుమీ శ్రీకాళహస్తీశ్వరా. ౫౬

మ. కలధౌతాద్రియు, నస్థిమాలికయు, గోగంధర్వము, న్బుక్కయుం
బులితోలుం, భసితంబుఁ, బాఁపతొడవుల్ లోపించుఁ దోఁబుట్లకై
తొలి నేవారలతోడఁ బుట్టఁగఁ గళాదుల్గల్గె మే లయ్యె; యీ
సిలువుల్దూరము చేసికొం టెఱిఁగియే శ్రీకాళహస్తీశ్వరా. ౫౭

---

(౫౩) ౧. మం. పాకంబంచు. ౨. దెవులంచు దుష్ట. (వేఱొక ప్రతి) అ ౩. న్భూత ములటంచున్ విషాదులటంచున్ మరులంచు జీవనముఁనందుం భీతి పుట్టించి. (౫౪) అ. ఇ. ఆ. ౪. నం. అ.౫. గళసీమన్ పువ్వుదండ...(దలసీమం బువుదండనాలికతుదన్గంధప్రసాదంబులో. ఇ. గళ......గంధప్రసాదంబులో. ఆ.) అ. ఇ. ౬. దాల్చు......(మాఘుసీమహిమ గా భక్తిన్ నినుంగొల్తు. అ. ౭. రంజిలఁ బ్వ్యాగ్ఘ్రన గూర్చి సేర్చినక్రియన్.) (౫౫) మం. ౮. న్వారు. ఆ. ౯. నావిర్భూత మోహంబునం. అ. ౧౦. సుఖంబె. (౫౬) ఆ. ౧౧. సుల భుల్ ధార్మికు లుత్త...ఆ. ౧౨. బెట్టకమీపదా......మం. ౧౩. తిన్. ఆ. ౧౪. జెలు వొప్ప న్మదమొంద. (౫౭) అ. ఆ. ౧౫. సేపాళ్లకై. ఆ. ౧౬. బుట్టగ గళాదుల్ మాని ......యా (బుట్టువకళాదుల్గల్గ మేలయ్యె యీ. మం.) అ. ౧౭. శిలుగుల్ దూరము చేసి కొంటిరి వీ లెరిగి. సిలుగుల్దూరము......యే. మం.)

మ. శ్రుతులభ్యాసము చేసి, శాస్త్రములు సంశోధించి, తత్త్వంబులన్
మతి నూహించి; శరీర మస్థిరము బ్రహ్మం బెన్న సత్యంబు గాం
చితి మంచున్ సభలన్ వృథావచనముల్ చెప్పంగనే కాని, ని
ర్జితచిత్తస్థిరసౌఖ్యముల్ దెలియరో శ్రీకాళహస్తీశ్వరా. ౫౮

మ. గతి నీవంచు భజించువార లపవర్గం బొందఁగా నేల సం
తతముం గూటికినై చరింప వినలేదా 'యాయు రన్నం ప్రయ
చ్ఛతి' యంచు న్మొఱవెట్టఁగా శ్రుతులు సంసారాంధకారాభిదూ
షితదుర్మార్గులు గానఁగానఁబడవో శ్రీకాళహస్తీశ్వరా. ౫౯

మ. రతిరాజుద్ధతిమీఱ నొక్కపతి గోరాజెక్కి నిన్నొక్కచో
నతఁ డాదర్పకుఁ వేగనొత్తఁగ వయం బాఁబోతునుం దాఁకి యు
గ్రతఁ బోరాడఁగ నున్నయన్నడిమి లేఁగల్వోలె శోకానల
స్థితిపాలై మొఱవెట్టినన్ మనుపవే శ్రీకాళహస్తీశ్వరా. ౬౦

శా. అంతానంశయమే శరీరఘటనం బంతా విచారంబె లో
నంతా దుఃఖపరంపరార్జితమె మేనంతా భయభ్రాంతమే
యంతానాంతశరీరశోషణమె దుర్వ్యాపారమే దేహికిన్
జింత న్నిన్నుఁ దలంచి పొందరు నరుల్ శ్రీకాళహస్తీశ్వరా. ౬౧

---

(58) అ. ౧. శాస్త్రగరిమల్ శోధించి. అ. ౨. బ్రహ్మంబెంచ...(బ్రహ్మం బెన్న నిత్యంబు. ఆ.) అ. 3. గాంక్షితమంచున్ మదిలో. అ. ౪. స్థితిసౌఖ్య. (చిత్తస్థితి. ఆ.) (59) ఆ. ౫. సంతసముం. ఆ. ౬. నకట సంసా........ (శ్రుతులు సంసారాబ్ధి దుర్మోహ. అ.) ఆ. ౭. చిన్మార్గులు మిమ్ము గాన కిలనో. ఆ. ౮. రకటా. (60) అ. ౯. మీఱు నొక్కపతి వైరాగ్యంబు నొక్కొక్కచో. (మీఱ నొక్కపతి వైరాగ్యేంద్రు డొక్కొక్కచో. ఆ.) అ. ౧౦. వీంక నొక్కగమనీ నాంబోతునాబోతు. (వేగ నొత్తమనం బాబోతునాంబోతు. ఆ.) ఆ. ౧౧. నుగ్రతబోరాట నొనర్చునాసడలిడేగం బోలి. (నుగ్రత బోరాడగనోర్చునా నడుమ. ఆ.) అ. ౧౨. పెట్టెదన్ మనుపవే. (61) ఇ. ౧3. శరీరలోభమును. ఇ. ౧౪. జింతల్ నన్ను దలంచ పనియ్యా వకటా.

శా. సంతోషించితిఁ జాలుఁజాలు రతిరాజద్వారసౌఖ్యంబులన్
శాంతింబొందితిఁ జాలుఁజాలు బహురాజద్వారసౌఖ్యంబులన్
[౧]శాంతింబొందెదఁ జూపు బ్రహ్మపదరాజద్వారసౌఖ్యంబు[౨] ని
శ్చింత స్వాంతుఁడ సాదు నీకరుణచే । శ్రీకాళహస్తీశ్వరా. ౬౨

శా. [౩]స్తోత్రం బన్యులఁ జేయనొల్లని వ్రతస్థుల్వోలె వేసంబుతోఁ
బుత్రీపుత్రకళత్రరక్షణకళాబుద్ధిన్ నృపాలాధమున్
[౪]బాత్రంబంచు భజింపఁబోదు రిదియున్ । న్నాభవ్యంబె యెవ్వారి[౫]చా
రిత్రం బెన్నఁడు మెచ్చ నెంచ మదిలో । శ్రీకాళహస్తీశ్వరా. ౬౩

మ. అకలంక[౬]స్థితి నిల్పి నాద మనుఘంటారావమున్ బిందు [౭]దీ
పకళాశ్రేణి వివేకసాధనము లొప్పన్బాని యానంద[౮]దా
వకదుర్గాటవిలో మనోమృగము గర్వస్ఫూర్తి వారించు వా
రికి[౧౦]గా వీడు! భవోగ్రబాధలతికల్ । శ్రీకాళహస్తీశ్వరా. ౬౪

మ. ఒకయర్థంబును నిన్ను నే నడుగఁగా । నూహింప నెట్లైనఁ[౧౨] బొ
మ్మ కవిత్వంబులు నాకుఁ జెందనవి యేమో యంటివా నాజి
హ్వాకు నైసర్గికకృత్య మింతయ సుమీ । [౧౩]ప్రార్థించుటే కాదుఁ కో
రికల న్నిన్నును గాన నాకు [౧౪]వశమా । శ్రీకాళహస్తీశ్వరా. ౬౫

---

(62) అ. ౧. భ్రాంతిం బొందెదజూపు (భ్రాంతింబొందగ జేయునీయుభయ సంబంధంబు చాలించి ఆ.) అ. ౨. నిశ్చింతస్వాంతుడనా భవత్కరుణచే (నిశ్చింత స్వాంతుడనైతి నీకరుణచే. ఆ.) (63) ఆ. 3. స్తోత్రంబుల్ స్తుతిసేయ. మం. ౪. మిత్ర. అ. ౫. బాత్రుడంచు......భావింపనే వారి (బాత్రుండంచు నుతింపబోదు రిది నా భాగ్యంబు నెవ్వారి. ఆ. బాత్రం......బోదురు కృపాపారీణ యెవ్వారి. మం.) అ. ౬. చారిత్రం బెప్పుడు మెచ్చ మెచ్చ మదిలో. (చారిత్రంబుల్ మది మెచ్చనికనో. ఆ. చారి......మెచ్చవచ్చు...మం.) (64) అ. ౭. స్థిరరమ్యనాదఘనఘంటారావముల్ విందు (స్థితినిల్చి నాఘఘనఘంటారావముల్ నీదు ఆ.) ఇ. ౮. దీపకుళశ్రేణి......యానంద (దీప......నంద. అ. దీందీప......నొప్పంబూని యానంద. ఆ.) ఇ. ౯. భావకులంగ స్థలిలో మనోమృగము...... (పావకకుండస్థలిలో......అ. ధీవకుడంగ స్థలిలో ......ఆ). అ. ౧౦. నా వీడుమహోగ్ర బంధుడకటా (గా......బంధులతకుల్. ఆ. గా......బంధు డధికున్. ఇ.). (65) అ. ౧౧. నేవేల (నట్లైన్న. ఆ.) ఆ. ౧౨. నమ్మి ......చెప్పెద వదేమీ యంటివా నాకు (నమ్మి......జెప్పెద వదేమీ యంటివా నాదు. ఆ. బొమ్మ......జెందనివియేమో......నాదు. వా). ఆ. ౧౩. ప్రార్థించుటల్. ఆ. ౧౪. వశమే.

మ. శుకము ల్కింశుకపుష్పము ల్గని[1] ఫలస్తో । మంబటంచు న్సము
త్సుకతం జేరఁగఁ[2]బోయినప్పటి మహా।దుఃఖంబు సిద్ధించుఁ [3]త
ర్కకళాభాషల కెల్లఁ బ్రాపులగు శా।స్త్రంబు ల్విలోకించువా
రికి[4] నిత్యత్వమనీష దూర మగుచున్ । శ్రీకాళహస్తీశ్వరా. ౬౬

మ. [5]ఒకరిం జంపి పదస్థులై బ్రతుకఁ దా । మొక్కొక్క రూహింతురే
లోకొ? [6]తా మెన్నఁడుఁ జావరో! తమకుఁబోవో సంపదల్ పుత్రమి
త్రకళత్రాదుల[7]తోడ నిత్యసుఖ[8] మం।దం గందురో యున్నవా
రికి [9]లేదో మృతి యెన్నఁడుం గటకటా । శ్రీకాళహస్తీశ్వరా. ౬౭

శా. నీకారుణ్యముఁ[10] గల్గవట్టి నరుఁ డే।నీచాలయంబుల జొరం
డే కార్పణ్యపుమాట లాడఁ[11] డరుగం । డెవ్వారితో వేషముల్
[12]గైకోఁ డేమతము ల్భజింపఁ డిల [13]నే।కష్టప్రకారంబులన్
జీకాకై చెడిపోఁడు [14]జీవనదశన్ । శ్రీకాళహస్తీశ్వరా. ౬౮

శా. జ్ఞాతుల్ ద్రోహులు; వారు[15] సేయు కపటే।ర్ష్యాది క్రియాదోషముల్
మాతండ్రాన సహింపరాదు[16] ప్రతికా।ర్యం బించు కేఁ జేయఁగాఁ
బోతే[17]దోషముగాన మాని యతినై । పో గోరినన్ సర్వదా
[18]జ్ఞాతిక్రోధము మాన దెట్లు నడుతున్ । శ్రీకాళహస్తీశ్వరా. ౬౯

---

(66) అ. ౧. ఫలస్తోమంబులంచు. అ. ౨. బోయినప్పుడు (బోవనచ్చుట. వా. బోయినట్లుగ. మం.) ఆ. 3. తర్కభాషలకెల్ల దాపులగు (తర్కశకలాపుల కెల్ల వారలకు. అ.) అ. ౪. నితరత్వమనీష. దూరమరయన్ (నీతత్వమనేక దూరమగుచున్. ఆ.) (67) అ. ౫. ఒక......బ్రతుకగా......రే (ఒక.........గానొక్కొక్క...రే. ఆ. ఒకనింజంపి పరస్థుడై బ్రతుకగా నూహించు నొండొక్కఁడే మం.) మం. ౬. తానెన్నడు జావడో తనకుబోవో (తా మెన్నడు జావరో తమకు......... చాలా......అ.) అ. ౭. తోటి. మం. ౮. మందగల్గునో అ. మం. ౯. లేదో సుఖమెన్నడుం (తానెన్నడు లేవొకో ఆ.) (68) ఆ. ౧౦. గల్గియున్న. అ. ౧౧. డడుగం డెవ్వారినే వేషముల్ (డడుగం డెవ్వానినే వేషముల్. మం. నడుగం డెవ్వారినే వేషముం ఆ.) అ. ౧౨. గైకొండే మతముం భజింపడెలమిన్. ఆ. ౧3. నే కల్పాంతకాలంబునం ఆ. ౧౪. దుర్జనదశన్. (౬౯) ఆ. ౧౫. వారుసేయు కపటేర్ష్యాది కృత్యంబులా. మం. ౧౬. కల్పం. అ. దోసముచెంటికిన్ సమముగా బుద్ధిన్విచారించినన్ (దోషముగాక ......సర్వదా. మం.) అ. ౧౭. చోతో దుఃఖము వాయదెట్లు నడతున్. (చేతః క్రోధము......వా. మం)

మ. చదువుల్నేర్చిన పండితాధములు స్వేచ్ఛా[1]భాషణక్రీడల
న్వదర౯ సంశయభీకరాటవులఁ ద్రోవ ల్దప్పి వర్తింపఁగా
మదనక్రోధకిరాతు[2]లందుఁ గని భీమప్రౌఢిచేఁ దాఁకినన్
[3]జెదరుం జిత్తము చిత్తగింపఁ గదవే శ్రీకాళహస్తీశ్వరా. ౭౦

శా. *రోసిం దేమిటి, రోఁత లేమిటి మనోరోగస్థుఁడై, దేహి తా
బూసిం దేమిటి, పూఁత లేమిటి మదాపూతంబు లీదేహముల్
మూసిం దేమిటి, మూఁత లేమిటి సదా మూఢత్వమే కాని తాఁ
జేసిం దేమిటి, చేఁత లేమిటి వృథా శ్రీకాళహస్తీశ్వరా. ౭౧

శా. శ్రీశైలేశు భజింతునో, యభవుఁ గాంచీనాథు సేవింతునో
కాళీవల్లభుఁ గొల్వఁబోదునొ మహాకాళేశుఁ బూజింతునో
నాశీలం బణు వైన [1]మేరు వనుచున్ రక్షింపవే నీకృపా
శ్రీశృంగార[2]విలాసహాసములచే శ్రీకాళహస్తీశ్వరా. ౭౨

మ. అయ[1]వార్లై చరియింపవచ్చుఁ దనపాదాంభోజ[2]తీర్థంబులన్
దయతోఁ [3]గొమ్మనవచ్చు సేవకుని నర్థప్రాణదేహాదు ల
న్నియు నాసొమ్మనవచ్చుఁ గాని[4] సిరుల న్నిందించి నిన్నాత్మ ని
ష్క్రియతం గానఁగరాదు పండితులకున్ శ్రీకాళహస్తీశ్వరా.

శా. మాయాజాండ కరండకోటిఁ బొడిగా మర్దించిరో విక్రమా
జేయుం గాయజుఁ జంపిరో కపటలక్ష్మీ[1]మోహముం బాసిరో
[2]యాయుర్దాయభుజంగ మృత్యువు లనాయాసంబునన్ గెల్చిరో
శ్రేయోదాయకు[3]లౌదు రెట్టు లితరుల్ శ్రీకాళహస్తీశ్వరా.

---

(70) ఇ. ౧. భావనక్రీడలం. అ. ఇ. ౨. దంతగని.....వం. (దండగని......మై. ఆ.) ఇ. 3. జెదరెచిత్తము (చెదరెన్ చిత్తము. అ. జెదరెంజిత్తము. వం.) (71) *(అన్నిపాదములలోన-వం.ప్రతిలో ఎట్టిది అనియు తాళపత్రగ్రంథములలో ఏటిది అనియు పాఠాంతరము.) (72) అ. ౧. మేరలనుచున్ రక్షించెదో సత్కృపా. (మేరు వనుచున్ • రక్షించెదో సత్కృపా. ఆ.) ఆ. ౨. కళావిలాసములచే. (73) ఆ. ౧. గార్లై ఆ. ౨. తీర్థాంబువుల్. అ. ౩. బొమ్మన. ఇ. ౪. పనులన్ నిందించి నిన్నాత్మ నిష్క్రియుడై జూడగరాదు పండితునకున్ (సిరులన్నిందించి మిమ్మాత్మ నిష్క్రియుడై చూడగరాదు పండితులకున్. ఆ. సిరు.....నీప్రియుడై చూడగరాదు పండితులకున్. ఆ.) (74) అ.౧౦. మోహముం. వం. ౧౧. యాయుర్వాయు...యాసంబుగా. వం. ౧౨. లెట్టులౌదు రితరుల్. (పాదాంత్యమున - అ. ప్రతిలో రో=రాయని పాఠాంతరము.)

మ. ¹చవిగాఁ జూడ వినంగ ²మూర్కొనఁదనూసంఘర్షణాస్వాదమొం
దఁ దనిర్మించెద వేల జంతువుల; నేత్రక్రీడలే పాతక
వ్యవహారంబులు ³సేసెదేమిటికి, మాయావిద్యచే ప్రొద్దుపు
చ్చి ⁴వినోదింపఁగ దీన నేమి ఫలమో? శ్రీకాళహస్తీశ్వరా. ౭౫

మ. వెనుకం జేసిన ఘోర ⁵దుర్దశలు భావింపంగ రోఁతయ్యెడున్
⁶వెనుకన్ముందరవచ్చు దుస్మరణము లీక్షింప భీతయ్యెడు
న్నను నేఁజూచి ⁷యు నావిధుల్దలఁచియున్నాకే భయంబయ్యెడుం
⁸జెనకుంజీకటి నాయెఁగాలమునకున్ శ్రీకాళహస్తీశ్వరా. ౭౬

మ. పరిశీలించితి మంత్రతంత్రములు; చెప్ప న్నింటి సాంఖ్యాదియో
గరహస్యంబులు వేదశాస్త్రములు వక్కాణించితిన్ శంక ¹⁰వో
దరయం గుమ్మడి¹¹ కాయలోని యలమాగింజంత! నమ్మించి సు
స్థిరవిజ్ఞానము త్రోవఁ ¹²జెప్పఁగదవే శ్రీకాళహస్తీశ్వరా. ౭౭

మ. మొదలం జేసిన ¹³వారిధర్మములు నిర్మూలంబుగాఁ జేసి దు
ర్మదులై ¹⁴యిప్పుడు వా రధర్మము లొనర్పం దమ్ము దైవంబు న
వ్వదె; తానున్న ¹⁵ఁమదాత్ములెల్లఁ దమత్రోవంబోవరే యేలచే
సెదరో మీఁదు దలంచిచూడ ¹⁶కథముల్ శ్రీకాళహస్తీశ్వరా.

---

(75) మం. ౧. చవిగో...సంస్పర్శనా. ఆ. ౨. మూర్కొన...నాతమోమవి నిర్మిం చిననేల జంతువులకుం మత్కీడ. ఆ. 3. చేసెడి వింధ్యామాయలం (సేయనేమిటికి మాయావిద్యచే. వా.) ఆ. ౪. వినగా జీర్ణవస్త్రదేహశుభగా. (76) మం. ౫. దుష్కృతులు. మం. ౬. వెనుకన్ముంగల (వెనుకన్ముందటు. వా.) మం. ౭. న. మం. ౮. న మం. ౯. ను. కుం. (77) ఇ. ౧౦. లో. ఆ. ఇ. ౧౧. కాయలోన నొకయావంతైన పన్నించి. ఇ.మంచి ౧౨. జూపగదవే (జూపగదవో. ఆ.) (78) ఆ. ౧3. దానధర్మములు నిర్మూలంబుగావించి. ఆ. ౧౪. యెప్పుడు తాముధర్మము తగం దూసంగలే కూరకే (యిప్పుడు తాము ..దైవంబు. అ. యిప్పటివారధర్మ.........దైవంబు. మం.) ఆ. ౧౫. మయతాత్ముల్ తమత్రోవబోవక వృథాహంకారముం తాము. (నవ్వరె తామున్న......రెల్లను. అ.) అ. ౧౬. రథ ముల్.

 

శా. కాసంతైన [1]సుఖంబొనర్చునె మనః। కామంబు లీడేర్చునో
వీసంబైనను వెంటవచ్చునొ జగ। ద్విఖ్యాతిఁ [2]గావించునో
దోసంబుల్చెడఁ బాపునో వలసినం। దోడ్తో మిముం జూపునో
సీ! సంసారదురాశ [3]లేలుడుపవో। శ్రీకాళహస్తీశ్వరా. ౭౯

మ. ఒకపూఁ టించుక కూడుతక్కు[4]వయిన। న్నోర్వంగ లేఁ; డెండ కో
పక[5] నీడ న్వెదకుం, జలిం జడిసి కుం। పట్లెత్తుకో[6]జూచు, వా
నకు[7] నిండ్లిండ్లను దూఱు, నీతనువు దీ। నన్వచ్చు సౌఖ్యంబు రో
సి, [8]కడాసింపరుగాక మర్త్యులకటా! । శ్రీకాళహస్తీశ్వరా. ౮౦

శా. కేదారాది సమస్తతీర్థములు కో। [9]ర్కెంజూడఁ బోనేటికిం
[10]గాదా ముంగిలి వారణాసి, [11]కడపే। కైలాసశైలంబు మీ[12]
పాదధ్యానము సంభవించునపుడే। భావింప[13] నజ్ఞాన ల
క్ష్మీమదారిద్రులు [14]గారె లోకు లకటా। శ్రీకాళహస్తీశ్వరా. ౮౧

మ. తమకం బొప్పఁ బరాంగనాజన పర। ద్రవ్యంబు[15]ల న్మెచ్చిలం
గ మహోద్యోగము సేయు[16]నెమ్మనము దొం। గం బట్టి వైరాగ్య[17]పా
శములం జుట్టి బిగించి నీదుచరణ। స్తంభంబున న్గట్టి [18]వై
చి ముదం బిప్పుడు గల్గఁ జేయఁగదవే। శ్రీకాళహస్తీశ్వరా. ౮౨

---

(79) మం. ౧. సుఖంబులిచ్చునో. అ. ౨. పాటించునో. ౩. అ. లేలతెగవా. (80) ఆ. ౪. వయితే నోర్వంగ ఆ. వగునే నోర్వంగ. వా. మ.) అ. ౫. నీడంచలి వెట్టినం. ఆ. ౬. జూత్రు. అ. ౭. యింటింటికి......నింటింటను..మం. నిండ్లలా దూర విడవడైన సౌఖ్యమేలబ్బు. ఆ.) ఆ. ౮. కళాశించరుగాక (సేవింపరు నిన్ను. అ.) (81) ఆ. ౯. వేడ్కం. మం. ౧౦. గాదే. ఆ. ౧౧. గడుపే. అ. ౧౨. నీ ఇ. ౧౩. భావజ్ఞులై ...(భావింపవిజ్ఞాన. అ.) ఆ. ౧౪. గాక. (గారు. ఇ.) (82) అ. ౧౫. చేమ్మెచ్చిలం. అ. ౧౬. నామనము. అ. ౧౭. పాశములంబట్టి (పాశమునం జుట్టి. ఆ.) ఆ. ౧౮. వేసిముదం బెప్పుడు.

శా. వేధం దిట్టఁగరాదు [౧]గాక భువిలో । విద్వాంసులం జేయనే
లా? ధీచాతురిఁ జేసి చేసిన గులా। మాపాటునే పోక తు
ద్వ్యాధాదుల్ [౨]రచియింపనేల? [౩]యది కృ। త్యంబైన దుర్మార్గులన్
[౪]ఛీ! ధాత్రీశులఁ జేయనేల యకటా! । శ్రీకాళహస్తీశ్వరా. ౮౩

మ. పుడమి [౫]న్నిన్నొక బిల్వపత్రమునఁ । బూజించి పుణ్యంబును
న్బడయన్నేరక [౬]బక్కదైవములకున్ । పప్పు ల్ప్రసాదంబులున్
గుడుము [౭]ల్దోసెలు సారెసత్తు । లటుకు ల్గుగ్గిళ్లుచుం బెట్టుచుం
జెడి [౯]యెందుం గొఱగాక[౧౦]పోదు రకటా! । శ్రీకాళహస్తీశ్వరా.

శా. విత్తజ్ఞానము పాదు[౧౧]చిత్తము భవా। వేశంబు రక్షాంబు[౧౨]వు
న్మత్తత్వంబు తదంకురం బనృతముల్ । మారాకు లత్యంత దు
ర్వృత్తుల్[౧౩] పుష్పవ్వలు పండ్లు మన్మథముఖా। విర్భూతదోషంబులుం
జిత్తా[౧౪]భ్యున్నతనింబభూజములకున్ । శ్రీకాళహస్తీశ్వరా. ౮౫

శా. నీపైఁ గావ్యముచెప్ప[౧౫]చున్నయతఁడు । న్నీపద్యము ల్వ్రాసియి
మ్మా పాఠంబొనరింతు నన్న [౧౬]యతఁడు । న్మంజుప్రబంధంబు ని
ష్టా[౧౭]పూర్తిం బఠియించుచున్నయతఁడే । సద్బాంధవుల్గాక ఛీ
ఛీ! పృష్ఠాగతబాంధవంబు నిజమా । శ్రీకాళహస్తీశ్వరా. ౮౬

---

(83) అ. ౧. గాకధరణిన్......ను బుట్ట (గాకధరణిం విద్వాంసులంబుట్టిం. ఆ. గానిభువిలో...జేయ. వా.) వా. ౨. కలిగింపనేల. ఆ. 3. యవి తథ్యంబైన. వా. మం. ౪. ఛీధాత్రీశులనేయనేటి కకటా (ఛీధాత్రీశులనేలజేసె నకటా అ. ఆ.) (84) అ. ౫. నీకొకబిల్వపత్రముదగన్...బు. (మిమ్మొక......దగన్ కైవల్య మున్. ఆ.) ౬. ఆ. మం. పెక్కుదైవముల. అ. ౭. బూరెలుసారసత్తు(ల్దోసెలుచారపప్పు. మం.) ఆ. ౮. లరిసెల్. ఆ. ౯. రెండుం. అ. ౧౦. మానవులుదా (పోదురు జనుల్. మం. అ. (85) ఆ. ౧౧. క్రోధము. అ. ౧౨. వున్మత్తత్వంబు నవాంకురంబులు......త్యంతదు (వున్మత్తత్వంబు నవాంకురం బనృతముల్ మారాకు లాశావనీ. ఆ.) అ. ౧౩. పుష్పము పండ్లు మన్మథము ఖావిర్భూతదోషంబులీ (..... ముఖావిర్భూతదోషంబులీ. ఆ.) ... ......ముఖావిర్భూతదోషంబులుం. వా.) ముఖావిర్భూతదోషౌఘముల్. మం.) ఆ. ౧౪. భ్యున్నతి. (86) ఆ. ౧౫. మన్న. ఆ. ౧౬. నీమంజుప్రబంధంబుని (నీమంజుప్రబంధంబులి. అ.) ఆ. ౧౭. పూర్వారబఠించు బఠించునతడుం సద్బంధుడుం గాక (పూర్తి న్రచియింపుమన్న యతడున్. మం. పూర్తిం బఠియించుచున్నయతడున్......వా.)

శా. ౧సంపద్గర్వముఁ బాఱఁద్రోలి రిపులన్ ౹ జంకించి యాకాంక్షలన్
౨దంపుల్వెట్టి కళంకముల్నఱికి బంధక్లేశ౩ దోషంబులం
౪జింపుల్సేసి వయోవిలాసములు నిక్షేపించి భూతంబులం
జెంపల్వేయక నిన్నుఁ గానఁ౫గలనా ౹ శ్రీకాళహస్తీశ్వరా. ౮౭

శా. రాజశ్రేణికిదాసులై సిరులఁ౬ గోరంజేరఁగా సౌఖ్యమో?
౭యీజన్మంబు తరింపఁ జేయఁగల మిమ్మెప్రొద్దు సేవించు ని
ర్వ్యాజాచారము సౌఖ్యమో? ౯తెలియలేరా మానవుల్పాపరా
౧౦జీజాతాతిమదాంధబుద్ధు లగుచున్ ౹ శ్రీకాళహస్తీశ్వరా. ౮౮

శా. నిన్నుం జూడరొ మొన్నఁ జూడరొ జనుల్ ౹ నిత్యంబుఁ జావంగ నా
పన్నుల్గన్ననిధాన మయ్యెడి ధనభ్రాంతి న్విసర్జింపలే
కున్నా రెన్నఁడు నిన్నుఁ గందు రిఁక ౧౧మర్త్యుల్గొల్వరో నిన్ను నే
౧౨చిన్నంబోవక యన్యదైవరతులన్ ౹ శ్రీకాళహస్తీశ్వరా. ౮౯

శా. నన్నే యేనుఁగుతోలుదుప్పటము; బువ్వా కాలకూటంబు చేఁ
గిన్నెబ్రహ్మకపాల ముగ్రమగు భోగే కంఠహారంబు; మే
౧౩ల్నిన్నీలాగున నుంటయుం దెలిసియు ౹ నీపాదపద్మంబు ౧౪చే
ర్చె న్నారాయణుఁ డెట్లు మానసమునన్ ౹ శ్రీకాళహస్తీశ్వరా.

---

(87) అ. ౧. సంపత్సారము. ఇ. ౨. పంపుల్ జేసి (తెంపుల్ వెట్టి. అ. న్గంపు ల్వెట్టి. మం.) మం. 3. దోషాదులన్. ఇ. ౪. తెంపుల్ చేసి వయోవికారముల నాక్షేపించి (జింపు.....వికారములు నాక్షేపించి. అ. జింపు.....సంక్షేపించి. వా.) ఇ. మం౫. గలనా. (గలరా. అ.) (88) అ. ఆ. ౬. జేరంగోరగా (గోరంజాలగా. మం.) అ. ౭. యాజ్ఞాండము పెంపు. ఆ ౮. జేయుమిక. అ. ౯. తెలియలేరా (తెలియరేలా. మం.) అ. ౧౦. జీజాతోమ...(జీజాతాతిమదాంధంబునదూగుచున్. ఆ) (89) ఆ. ౧౧. మృత్యుజేగియ్యుముల్ (మర్త్యుల్ గొల్వరేమో. వా. మర్త్యుల్ గొల్వరేలా. మం.) ఆ ౧౨. చిన్నంబోవగ నన్యదైవమతులం (...ప్రోవకుండు నెడలన్. వా.) (90) ఇ. ౧3 కిన్నిల్లాగులనుంటయున్ (.....నుండగా. మం.) ఇ. ౧౪. కన్నేలాగున వేసె మాధవుడయా.

శా. ద్వారద్వారములందుఁ గంచుకిజనవ్రాతంబు దండంబులన్
[౧]ద్వారంతస్థలి బగ్గనం బొడుచుచుం దుర్భాషలాడ న్మతిన్
వారిం బ్రార్థనచేసి రాజులకు సేవల్సేయఁగాఁ [౨]బోరు ల
క్ష్మీరాజ్యంబును గోరి నీపరిజనుల్ శ్రీకాళహస్తీశ్వరా. ౯౧

శా. ఊహూరం జనులెల్ల భిక్షమిడరో యుండం గుహల్ గల్గవో
చీరానీకము వీథులం [౩]దొరకదో శీతామృతస్వచ్ఛవాః
పూరం బేరులఁ బాఱదో తపసులం బ్రోవంగ [౪]నీవోపవో
చేరం [౫]బోవుట కేల? రాజుల జనుల్ శ్రీకాళహస్తీశ్వరా. ౯౨

మ. దయ సేయుండని గొందఱాడుదురు ని[౬]త్యంబు న్నినుం [౭]గొల్చు నా
నియమం బెం[౮]తొ ఫలంబు నంతియకదా [౯]సేవింతు; పిండెంతో యం
తియ[౧౦]కా వెప్పటికిం దలంచ బుద్ధిం జూడ నేలబ్బు స
త్క్రియలన్నిన్ను భజింప కిష్టసుఖముల్ శ్రీకాళహస్తీశ్వరా.

శా. ఆరావం[౧౧] బుదయించెఁ దారకముగా నాత్మాభ్రవీథి న్మహా
కారోకారమకారయుక్త[౧౨]మయి యోంకారాభిధానం బె[౧౩]చె
న్నారు న్విశ్వమనంగఁ దన్మహిమచే నానాదబిందు ల్సుఖ
శ్రీ రంజిల్లఁ[౧౪] గడంగు నీవదె సుమీ శ్రీకాళహస్తీశ్వరా. ౯౪

---

(91) అ. ౧. ద్వారంతస్థలిభర్జనం బొడుచుచున్ తుచ్ఛోక్తులాడున్ మదిన్ (ద్వా...భగ్గనంబొడుచుచుం తుచ్ఛోక్తులాడంమదిం. ఆ. ద్వా...భగ్గనంబొడుచు...నుం.) అ. ౨. బోదురా శ్రీరాము. న్మదిగోరరున్ బుధజనుల్. (బోరు లక్ష్మీరాము న్మదిగోరి..... ఆ.) (92) అ. ఆ. 3. దొఱకవో. అది. ౪. శీతామృతస్సందనా త్పూరం. అ. ౫. వో. ఆ. ౬. నీవల్లవో. అ. ౭. బోదురదేలరాజులనరుల్. (93) అ. ౮. గాంచుచో. అ. ౯. నీ క్షింప. అ. ౧౦. దానిప్పటియుం తలంపనని బుద్ధింజూడకేలబ్బు (కానిప్పటి యందలంప నని బుద్ధింజూడకేలబ్బు ఆ.) (94) ఆ. ౧౧. బుదయించి తారకము నున్మత్తాభ్ర వీథి స్తనో (బుద.....వీథిన్ ఘనోహం. అ.) అ. ౧౨. మయిహుంకారించితానంద (మయి యోంకారాభిధానంబు. ఆ.) అ. ౧౩. మేపారం.....యానందబిందుల్ సుర. (లేపా శంస్వచ్ఛమనంగ.....నానందమందం సుఖ. ఆ.) ఆ. ౧౪. నొసంగవీవది.

శా. నీభక్తుల్పది వేలభంగుల నినున్ ‖ సేవింపుచున్ వేఁడఁగా
లోభం బేటికి వారికోర్కులు కృపా ‖ ళుత్వంబునం దీర్పరా
దా? భవ్యంబుఁ దలంచి చూడు పరమా ‖ ర్థం బిచ్చి పొమ్మన్న నీ
శ్రీభాండారములోఁ గొఱంతయగునా? ‖ శ్రీకాళహస్తీశ్వరా.

మ. మొదలన్భక్తుల కిచ్చినాఁడవు గదా ‖ మోక్షంబు; నేఁడేమయా
ముదియంగా ముదియంగఁ బుట్టె ఘనమౌ ‖ మోహంబు లోభంబు స
న్నది సత్యంబు కృపం దలంప వొక పు ‖ ణ్యాత్ముండు నిన్నాత్మఁ గొ
ల్చి దినంబు న్మొఱవెట్టఁగా! కటకటా! ‖ శ్రీకాళహస్తీశ్వరా. ౯౬

శా. కాలద్వారకవాటబంధనము దుః ‖ ష్కాలప్రమాణక్రియా
లీలాజాలక చిత్రగుప్తముఖ వ ‖ ల్మీకోగ్రజిహ్వాన్విత
వ్యాళవ్యాళవిరోధిమృత్యుముఖదం ‖ ష్ట్రాహార్యవజ్రంబు ది
క్పాలాలంకృత! నీదునామ మరయన్ ‖ శ్రీకాళహస్తీశ్వరా. ౯౭

మ. పదివేలైనను లోకకంటకులచేఁ ‖ బ్రాపించుసౌఖ్యంబు నా
మదికిం బథ్యము గాదు; సర్వమునకు ‖ న్మధ్యస్థుఁడై సత్యదా
నదయాదుల్గలరాజు నాకొసఁగు మే ‖ న్నన్వాని నీయట్ల చూ
చి దినంబు న్మది మొందుదుం గడపటన్ ‖ శ్రీకాళహస్తీశ్వరా.

శా. తాతల్దల్లియుఁ దండ్రియున్ మఱియు బె ‖ ద్దల్పావఁగాఁ జూడరో
భీతిం బొందఁగ నేల చావునకుఁగాఁ ‖ బెండ్లాము బిడ్డల్హిత
వ్రాతంబు న్వలవింప జంతువులకు ‖ న్వాలాయమై యుండఁగా
జేతోవీథి నరుండు నిన్గొలువఁడో ‖ శ్రీకాళహస్తీశ్వరా. ౯౯

---

(95) అ. ౧. సేవింపగా. వా. మం. ౨. కోర్కులు. అ. ఆ. 3. చూచి. ఆ ౪. మా. అ. ఆ. ౫. దాగొఱంతవడునో. (96) మం. ౬. మొదటన్. వా. ౭. బుట్టి. అ. ౮. నిత్యంబు. ఆ. ౯. దానిన్న. (97) అ. ౧౦. లీలాజల్పిత.....వల్మీకాగ్రజిహ్మాంచిత (లీలాజల్పక .....జివ్వాశివవ్యాళ. ఆ.) ఆ. ౧౧. (ఘనదంష్ట్రాఖనదర్పా. అ. (98) ఆ. ౧౨. కంటకునిచే బాటించు. అ. ౧3. భాసః. అ. ౧౪. సంసవ్యానినియట్లు (ఉన్న న్వాని నీయట్లు. ఆ.) అ. ౧౫. మొందుచుంగడిసెదన్. (99) అ. ౧౬. పిన్నలును. అ. ౧౭. చెందగ. అ. ౧౮. నై. (నా. మం.) అ. ౧౯. వ్రాతంబుల్ విలపింప. అ. ౨౦. గొల్వడు మిమున్.

శా. జాతుల్సెప్పుట సేవసేయుట మృషల్ । సంధించు టన్యాయ్యవి
ఖ్యాతిం బొందుట కొండెకాఁడగుట హిం । సారంభకుండౌట మి
థ్యాతాత్పర్యము లాడు టన్నియుఁ బర । ద్రవ్యంబు నాశించి యీ
శ్రీ తా నెన్నియుగంబు లుండఁ గలదో । శ్రీకాళహస్తీశ్వరా.

మ. చెడుగుల్ గొందఱు కూడి చేయఁగఁ బను । ల్చేఁకట్లు దూఱంగఁ బా
ల్పడితిం గాని చరింపరాని నినునో । లంజాలుఁ బొమ్మంచుని
ల్వెడలం ద్రోచినఁ జూరుపట్టుకొని నే । వ్రేలాడుదుం గోర్కెఁ గో
రెడియర్థంబులు నాకు వే గలుగవో । శ్రీకాళహస్తీశ్వరా. ౧౦౧

మ. భసితోద్ధూళన ధూసరాంగులు ఫారో । జటా త్తమాంగు ల్తపో
వ్యసను ల్సాధితపంచవర్ణరసనుల్ । వైరాగ్యవంతు ల్నితాం
తసుఖస్వాంతులు సత్యభాషణ సము । ద్యద్రత్నరుద్రాక్షరా
జిసమేతు ల్తుద నెవ్వరైనఁ గొలుఁతున్ । శ్రీకాళహస్తీశ్వరా.

మ. జలజశ్రీగల మంచినీళ్లు గలవా । చట్రాతిలో, బాపురే
వెలివాడ న్మఱి బాపనిల్లు గలదా । వేసాలుగా నక్కటా
నలి నారెండుగుణంబు లెంచి మదిలో । నన్నేమి రోయంగ నీ
చెలువంబైనగుణంబు లెంచుకొనవే । శ్రీకాళహస్తీశ్వరా. ౧౦౩

మ. గడియల్ రెంటికొ మూటికో గడియకో । కాదేని నేఁ డెల్లియో
కడనేఁడాదికొ యెన్నఁడో యెఱుఁగరీ । కాయంబు లీభూమిపై
బడఁగానున్నవి; ధర్మమార్గ మొకటిం । బాటింప రీమానవుల్
చెడుగుల్ నీపదభక్తియుం దెలియరో । శ్రీకాళహస్తీశ్వరా.

---

(100) మం. ౧. ద్రవ్యానికాశించిచి........యుగమ్ము లుండగలడో.
(101) అ. ౨. సేయుపనులే చేపట్టెనిందూర. (సేయుపనులం జిక్కైన నిందూర. ఆ.) అ. ౩. గానధరింపలేవోయిక (గానిచలింపనీవెనను. ఆ.) అ. ౪. వ్రేలాడుదుం గాక (వ్రేలాడెదం గాక. ఆ.) అ. ౫. నింక వేరకలవా (నాకు వేరెకలడే. ఆ. వెక్కి గలవో. మం.) (102) ఆ. ౬. ధూధనభూసితాంగులును. ఆ. ౭. సుఖస్వాంతులు వీతభీతులు సముద్రద్రవ్య (సుఖస్వాంతులు...రా. వా. మం.) (103) ఆ. ౮. జల్ధారిలో. ఆ. ౯. నటనాయందు. ఆ. ౧౦. చూచేవు. (104) వా. మం. ౧౧. రెంటికో. అ. ౧౨. ఆ. నేడాడియొ యెప్పుడో యెఱుగ యీ (నేడాదికో యెప్పుడో యెఱుగ. మం.) అ. ౧౩. దా. అ. ౧౪. మెచ టన్ అ. ౧౫. మీ పదభక్తియున్ యెఱుగరో (నీపదపద్మముల్ దలచరో. ఆ.)

మ. క్షితిలో దొడ్డతురంగసామజములే । చిత్రమ్ము లాందోళికా
తతు లేలెక్క విలాసినీజనసువ । స్త్రవ్రాతభూషాకలా
పతనూజాదిక మేమిదుర్లభము నీ । పాదమ్ము లర్చించుచోఁ
జితపంకేరుహపాదపద్మయుగళా । శ్రీకాళహస్తీశ్వరా. ౧౦౫

మ. తమనేత్రద్యుతి దామెచూడ సుఖమై । తాదాత్మ్యము స్గార్వఁగా
విమలమ్ము ల్కమలాభము ల్జితలస । ద్విద్యుల్లతాలాసము
ల్సుమనోబాణ జయప్రదమ్ము లనుచు । న్జూచు న్జనం బూని హా
రిమృగాక్షీ నివహమ్ముఁ గన్నుగవలన్ । శ్రీకాళహస్తీశ్వరా. ౧౦౬

మ. సలిలమ్ము న్జుళుకప్రమాణ మొకపు । ష్పమ్ము న్భవస్మౌళి ౧ని
శ్చలభక్తి ప్రతిపత్తిచే నరుఁడు పూ । జల్సేయఁగా ధన్యుఁడౌ
౨నలగంగానదిఁ జంద్రఖండము ౩ను దా । ల్తింపుం దుదిన్ గాంచు ని
చెలువం ౪బెంతయు నీమహత్త్వ ౫మిదిగా । శ్రీకాళహస్తీశ్వరా.

మ. ౧పటువ ద్రజ్జుభుజంగవ ౨ద్రజత వి । భ్రాంతి స్ఫురచ్ఛుక్తివ
ద్ఘటవ చ్చంద్రశిలాజటాకుసుమరు । క్సాంగత్యవ త్తంచు ౧౦ వా
క్పటిమ ల్నేర్తురు చిత్సుఖం బనుభవిం । పన్లేక దుర్మేధసుల్
చిటు కన్నం ౧౧ దలపోయఁజూతు రధముల్ । శ్రీకాళహస్తీశ్వరా.

మ. నినునిందించిన దక్షు ౧మీఁపైఁ దెగవా । వాణీనాథు శాసింపవో
చనునా నీపదపద్మసేవకులఁ దు । చ్ఛం బాడు దుర్మార్గు ౧౩ నిన్
బెనుప న్నీకును నీదుభక్తతతికిన్ । భేదంబు గానంగ వ
చ్చెనో ౧౪ లేకుండిన నూరకుండఁగలవా । శ్రీకాళహస్తీశ్వరా. ౧౦౯

(107) ఆ. ఇ. ౧. నిశ్చలచిత్త ప్రతిభక్తిచే నరుఁడు. ఇ. ఆ. ౨. తలగంగా. నిలగంగా. వా. ఆ. 3. సదాదాల్చుం తుదిం (దాదాల్చుం మదిం. ఇ. దానందుం దుదిన్. మం. నిందుం...వా.) ఆ. ఇ. వా. ౪. బంతయు. ఆ. ౫. మదిగో. (మదిలో. ఇ.) (108) అ. ౬. వటుప్రవజ్జు. అ. ౭. మద్రజిత...స్ఫురద్భుక్తి (మద్రజిత...చ్ఛుక్తి. ఆ.) అ. ౮. వద్భట అ. ౯. గుత్సాంగోత్సవతంతుం (వాక్సాంగత్యవత్తంచు. ఆ.) అ. ౧౦. వాక్పట వావిత్తరుచిస్ఫుటం బనుభవింపం వేడుకై పౌరుషుల్ (వాక్పటవానేతర...దుర్మేదు షుల్. ఆ.) అ. ౧౧. తనెబారిపోదు రథముల్. (తలపోరజూతురకటా. ఆ. తలపోయ జూతు రథముల్. వా.) (109) మం. ౧౨. జెండవోకో. ఆ. ౧౩. లం.మం. ౧౪. కాకుండిన.

మ. కరిదైత్యుం బొరిగొన్నశూలము కర । గ్రస్తంబు గాదో రతీ
శ్వరుఁ[౧] ని ర్గాల్చిన ఫాలలోచన శిఖా । వర్గంబు చల్లారెనో
పరనిందాపరుల న్వధింప[౨] విదియున్ । భావ్యంబె వా రేమి చే
సిరి నీకు న్సరమోప[౩]కార మరయన్ । శ్రీకాళహస్తీశ్వరా. ౧౧౦

మ. దురము న్దుర్గము రాజభావము మఱిన్ । దొంగర్కము న్వైద్యమున్
నరనాథాశ్రయ మోహ[౪] జేరము మహా । మంత్రంబు సిద్ధించినన్
అరయ న్దొడ్డఫలంబు గల్గునదిగా । కా కార్యమే తప్పినన్
సిరియుంబోవును బ్రాణహానియు నగున్ । శ్రీకాళహస్తీశ్వరా.

మ. తనయుం గాంచి ధనంబువాడి [౫]దివిజ । స్థానంబు గట్టించి వి
ప్రున కుద్వాహముచేసి సత్కృతికిఁ బా । త్రుండై తటాకంబు నే
ర్పునఁ ద్రవ్వించి వనంబు వెట్టి మనఁనీ । పోలేఁడు నీసేవ చే
సినపుణ్యాత్ముఁడు పోవులోకమునకు । శ్రీకాళహస్తీశ్వరా. ౧౧౨

మ. క్షితినాథోత్తమ! సత్కవీశ్వరుఁడు వ । చ్చె న్మిమ్ముల0 జూడఁగా,
నతఁ డేపాటి కవిత్వ[౬]వైఖరియొ? సద్యఃకావ్యనిర్మాత, త
[౭]త్ప్రతిభ ల్మంచివా? తిట్టుపద్యములు చెప్పం డాతఁ[౮]డైతే మమీ
[౯]గ్రీతమే చూచెను బొమ్మటందు రధముల్ । శ్రీకాళహస్తీశ్వరా.

శా. నీకుం గానికవిత్వ మెవ్వరికి నే । నీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిం బిరుదంబు కంకణము[౧౦] ముం । జేఁ గట్టితిం బట్టితిన్
[౧౧]లోకుల్ మెచ్చ వ్రతంబు నాతనువుకీ । లున్ నేర్పులుం గావు [౧౨]ఛీ
ఛీ! కాలంబులరీతి [౧౩]దప్పెడుఁజుమీ । శ్రీకాళహస్తీశ్వరా. ౧౧౪

---

(110) ఇ. ౧. నిగాంచిననేత్రపావక. (విర్గాల్చిననేత్రపావక. ఆ.) ఆ. ౨. వది యుం భావ్యంబె...(వదియుంభాగ్యంబువీరేమి. ఇ.) ఇ. ఆ. ౩. కారముధరన్. (111) వా. ౪. జేరమును బెన్మంత్రంబు. (112) ఆ. ౫. పాతి. (113) అ. ౬. వైఖరికి నానా కావ్యనిర్మాణన । (వైఖరిని హృద్యఃకావ్య నిర్వాణనా. ఆ.) అ. ౭. ప్రతిభ న్వింటిమి (ప్రతిభల్ వింటిమి. ఆ.) అ. ఆ. ౮. డన్న. అ. ౯. కృతమే. (114) ఆ. ౧౦. గాచే తం దగంగట్టితిన్. అ. ౧౧. లోకంబెల్ల నెఱుంగ నావ్రతము జెల్లుంగాక (...వ్రతంబు నాతలపు కీలున్నటునుంగాదు. ఆ.) అ. ౧౨. ఛీఛీ. ౧౩. అ. దప్పదుసుమీ.

శా. నిచ్చల్ నిన్ను భజించి చిన్మయమహా । నిర్వాణపీఠంబుపై
రచ్చల్ సేయక యార్జవంబు[1] కుజన । వ్రాతంబుచేఁ గ్రాఁగి భూ
భృచ్చండాలురఁ గొల్చి వారు దనుఁ గో[2]పింపం బుధుం డార్తుఁడై
చిచ్చారం జె[3]ముడేల జల్లుకొనునో । శ్రీకాళహస్తీశ్వరా. ౧౧౫

శా. దంతంబుల్ పడనప్పుడే తనువునం । దారూఢి యున్నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె జరా । క్రాంతుండు గానప్పుడే
వింత ల్మేనఁ జరింపనప్పుడె కురు । ల్వెల్వెల్ల గానప్పుడే
చింతింపన్వలె నీపదాంబుజములన్ । శ్రీకాళహస్తీశ్వరా. ౧౧౬

శా. *ఊరూరన్ బవినీని[4]కాండ్లు కవులై । యొక్కొక్క[5]చోఁ గొండఱున్
కేరే మీరు[6]ను జాణలౌమ రనుచుం । గీతాలు బోధింపఁగా
సారాసార మెఱుంగలేక మిగులం । [7]జొక్కయ్యోగా పద్యకుల్
జేరం జోటీక నేది సత్కవులకున్ । శ్రీకాళహస్తీశ్వరా. ౧౧౭

శా. దొప్పెం జెంగిలి దెచ్చియిచ్చినను గం । డూషాంబుధారావళిన్
దొప్పందోఁగిన చెప్పుగాల తలపై । ద్రొక్కంగ నెత్తైనఁ గ
న్నప్పన్ బాత్రుని జేసి తింతటికి స । న్మానంబు దీపింపఁగా
చెప్ప న్నేరము నీవిహారమహిమల్ । శ్రీకాళహస్తీశ్వరా. ౧౧౮

మ. [8]అలయేకార్ణవవేళ నీవు వటప । త్రాకార నైయుండఁగా
చెలువం బొప్పఁగ మాధవుండు గలిగెన్ । జేరంగఁ జోటంచు[9] దా
నెలమిం దామరతంపరై బ్రతికినాఁ । డింతాకుపైనుండి[10]యే
సిలుగుల్ పొందక నీకతంబునఁ గదా । శ్రీకాళహస్తీశ్వరా. ౧౧౯

---

(115) ఆ. ౧. కుశిక. ఆ. ౨. ల. ఆ. 3. మరేలచల్లితనినో. (117) * ఈక్రిం దిపద్యములు. అ ప్రతిలో దొఱకినవి. ౪. ఆ. కాళ్లు. ౫. ఆ. కాపయ్యకున్. ౬. ఆ. సుజాణుజాణు యనుచుం. ౭. ఆ. జొక్కై చెడెన్ గబ్బముల్. (119) ౮. ఆ. చెలగింపొందుచు. ౯. ఆ. జేరెలమిం. ౧౦. ఆ. యీశలుగుండెండక.

శా. సామంతంబున వేదముల్జదువనీ । శాస్త్రంబు లీక్షింపనీ
నీమం బొప్పగ సల్పనీ గ్రహగతుల్ । నీమాయగానీ భవ
త్ప్రేమం బొందఁగఁ జేసి నీపదము లర్థిం గొల్వ లేకుండినన్
జీమంతైనను మోక్షలక్ష్మి గలదే । శ్రీకాళహస్తీశ్వరా. ౧౨౦

మ. ఒకచో నుండఁగనీక నెమ్మనమునం । దోహో జగంబెల్లఁ ద్రి
ప్పకుమీ గాసినిబొందితిన్ మఱి తృణంబైనన్ నినున్ గోర బో
ట్టనుఁ గాదే కొనిపోదు నీదు వెనువెంటన్ శివా సి నెట్లైన ని
ల్పి కడంకం సుఖియింతు నీకరుణచే । శ్రీకాళహస్తీశ్వరా. ౧౨౧

మ. మది నిన్నే మఱకుండువారలకు గామక్రోధముల్ ముక్తిసం
పద లీనోపుట తెల్లమయ్యె నవినాభావైకవిజ్ఞానసం
పదలైనం చిలుకాడ వీవనుచు సన్మార్గంబునం భక్తరా
జి దివారాత్రులు చెప్పఁగా విని మదిన్ । శ్రీకాళహస్తీశ్వరా.

మ. జననీగర్భము నిర్గమించి నను నీ । చర్యం బ్రవర్తింపు మం
చు నిరూపించి విధించినాఁడ వది యిచ్ఛేఁ దప్పద్రోయంగ నీ
ననువై యుండుదు గాన పుణ్యకలుషవ్యాపారముల్ విందొన
ర్చినవాఁడంచు ననుం గణింపదగునా । శ్రీకాళహస్తీశ్వరా. ౧౨౩

మ. అమృతాస్వాదనకేళి లోనఁగొని భాషానిష్ఠజిహ్వానట
ద్భ్రమణప్రౌఢిఁ దృణీకరించి కమలాపర్యంకవక్షస్స్థలీ
రమణీయస్థితి నిల్పి నీపదము లారాధింప నే భక్తి గో
రి మదీయాత్మ నిజంబులన్ గనఁగదే । శ్రీకాళహస్తీశ్వరా. ౧౨౪

మ. తనవిద్యాకులరూపసంపదలచే । తన్మత్తుఁడై మేనెఱుం
గని పాపాత్మకుఁడైన నొక్కపరి మీ । కళ్యాణనామంబు పే
ర్కొనినం జిత్రము మే నెఱుంగునట మీకుం నిత్యమున్ భక్తిగాం
చినవా రేపనిఁ జేసినం జెడరు వో । శ్రీకాళహస్తీశ్వరా. ౧౨౫

---

(121) ౧. ఆ. త్రిప్పకోవర్తింపఁగ గాసిబొందితి. ౨. ఆ. దాన. (122) ౩. ఆ. నది
నా...సమ్మదులై నంబియుఁ గోటకుంనడుచుతన్మార్గంబుసద్భక్త...రాత్రంబులు...మదిన్.

శా. చించున్ బంచశరవ్రజంబు మది వాంఛించున్ భవత్ప్రేమ వ
ర్జించున్ సంచితపాపసంచయము నిర్జించున్ మహామోహ మ
ర్థించున్ దుఃఖముల న్భవచ్చరణసీరేజంబు లర్చించు వా
రెంచున్ జిత్తకరండ మెన్నఁ డతఁడో । శ్రీకాళహస్తీశ్వరా. ౧౨౬

శా. కాంతాలోలకటాక్షబాణములు మొక్కల్ వోవు దారాసుత
భ్రాంతప్రేమసముద్ర మింకు ఘనమీనాంక ప్రతాపాంకుఁ డ
ల్లంతం గ్రుంకు భవత్పదాబ్జయుగళీధ్యానంబు చిత్తంబులోఁ
జింతింపంగల యుత్తమోత్తములకున్ । శ్రీకాళహస్తీశ్వరా. ౧౨౭

మ. అరయన్గా నల విష్ణుదాసులు శివున్ । నాకాశిలో శ్రీపతిన్
నెరయన్ సంస్తుతిసేయుచుండ్రి హర ము । న్నీపాదముల్ నమ్మి వే
యరవిందంబులఁ బూజచేసి మఱియా । తం డంత లేకున్న సు
స్థిరభక్తిన్ నయనాబ్జ మొక్కటిడఁడా । శ్రీకాళహస్తీశ్వరా. ౧౨౮

మ. గరకంఠా! మృడ యీశ రుద్ర యభవా । గౌరీశ గంగాధరా
*స్మరసంహార.................................శివా శంకరా
పరమేశా భవ నీలలోహిత హరా । ఫాలేక్షణా మిమ్ము సు
స్థిరభక్తిన్ నుతిసేయ గల్గవలదా । శ్రీకాళహస్తీశ్వరా. ౧౨౯

మ. క్షయమై చిత్తముపోక మోక్ష మొకటం । సాధింపగాఁ గూడ దిం
ద్రియసౌఖ్యప్రదవస్తువుల్ దొరకవాటిన్ జేయగాఁగల్గు స
త్క్రియలాగా నివి రెండు యీతెలుగులై । తేని న్నినుం సేవచే
సియు కోరంగల వస్తు వెయ్యది మదిన్ । శ్రీకాళహస్తీశ్వరా.

శా. కోరన్ మోక్షము కాలరాత్రి గెలువం । గోరం జముం ద్రోలగా
గోరన్ బద్మజకల్పముల్ బ్రతుకగాఁ । గోరం మహాల్పంబులన్
కారుణ్యంబునకున్ మదీయమగు సంకల్పంబు దీర్పంగదే
చేరన్ రాగ బరోపకార మగునో । శ్రీకాళహస్తీశ్వరా. ౧౩౧

---

(129) * ఈ క్రింది పద్యములు ఆ ప్రతిలో దొఱికినవి.

మ. తగి వా నిన్ను భజించు వారలు రమా। దర్పాంధుల న్వేఁడ నే
నఁగుపై నెక్కియు దిడ్డి దూరుదురె ధ।న్యుల్ దేహరక్షార్థమై
పొగలంజాలక బొగ్గులంబొడవునే । పుల్ గావె పెద్దయ్యు నోఁ
చి గులామై పరసేవ చేయుదునె తుదిన్ । శ్రీకాళహస్తీశ్వరా.

శా. వేదంబు ల్గనలేని నిన్ను నుతిగా। వింపంగ నే నెవ్వఁడన్
నాదివ్యాకృతి గద్యపద్యములు వ।ర్ణింపంగ నే బూనితిన్
వాదోక్తై భవదీయదివ్యచరితల్ । వ్రాయ న్నియోగించి నా
చేదోక్తై భవదుక్తి సేయఁగదవే । శ్రీకాళహస్తీశ్వరా. ౧౩౩

శా. ఆధివ్యాధులు దీపనాదులు కళ।త్రాపత్యముల్ చాలవా
బాధన్ బెట్టఁగ నన్నుదమ్ములను పా।పస్వాంతులం దోడుగా
నేధర్మం బని కల్గఁజేసితివి న। న్నీరీతిఁ బీడించు వా
రె ధీరుల్ నినుఁ గొల్వ కుండగలనా । శ్రీకాళహస్తీశ్వరా. ౧౩౪

శా. నాకీయర్థము నేల యిచ్చెదవు నా। కా లేదుగా యీవృథా
శోకంబంతయు దీరు నెంతట నతి।క్షుద్రక్షమానాథు లీ
తాకట్లుంబడ నోప వాటికతనం। ధాన్యంబులుం గ్రామముల్
..........బులు సాధుయూథమునకుం । శ్రీకాళహస్తీశ్వరా.

మ. హరి నేత్రాబ్జము మీపదాబ్జముల కేఁ।లర్పించె చక్రానకో
సురలం గావఁగ నీలరత్నముగతిన్ । శోభిల్లు కంఠంబునం
గరళం బానగ గర్తవంచు దెలిసెన్ । గండర్పు భావించి మా
సిరిశోకం బుడుపంగదే యనుచు నో। శ్రీకాళహస్తీశ్వరా. ౧౩౬

(182) ౧. బడినసిప్పుల్ గావు పెదయ్యు నోర్చి. ౨. సు. (ఆ. ప్రతిలో వేటో కతావున వ్రాయబడినది) (185) 3. నాయము నేల యిప్పు డనుమానం బేలగా.

మ. వనితల్ భూషణముల్ మదేభములు నాశ్వంబుల్ మణుల్ గల్గుటల్
ఘనమో? యిన్నియు గల్గకుంట ఘనమో? కామాంధులై రెంటిలో
ఘన మేదో తెలియంగనోప రధముల్ । కైవల్య మొందింప నే
ర్చినవైరాగ్యముకంటె లక్ష్మి ఘనమా? । శ్రీకాళహస్తీశ్వరా.

మ. అడుగన్ బద్మజకల్పముల్ బ్రదుక పద్మాధీశ్వరత్వంబు ని
న్నడుగన్ వాసవవైభవం బడుగ లోకైకాధిపత్యంబు నే
నడుగన్ నీచరణాంబుజాతయుగళీధ్యానంబు నాకిమ్ము వే
చెడుచింతల్ దిగద్రావి వైతు నిదిగో । శ్రీకాళహస్తీశ్వరా. ౧౩౮

మ. పరకాంతారతి లేదు లేదు భుజియింపంగాఁ బరాన్నంబులన్
బరవిత్తంబు హరింపలేదు జనులం । బాధింపగా లేదు భూ
ధరకాంతారనివాసులై విరతి నీ । తత్వంబు భావింపుచున్
జిరకాలంబు ధరింతు రట్లు మనుజుల్ । శ్రీకాళహస్తీశ్వరా. ౧౩౯

శా. విన్నాఁడ న్నిగమాగమాదికవచోవిన్యాసముల్ మేదినిన్
గన్నాఁడన్ బహుదేవతాప్రతతులం । గంగాదితీర్థాలఁ గై
కొన్నాఁడం కపటీజవంజవమహాకూపార మేపారఁగా
చిన్నంబంతయు దాటఁ గాన నకటా । శ్రీకాళహస్తీశ్వరా. ౧౪౦

మ. కడుపే బట్టగలేక లోకముల కాకంబట్ల నూరూరి వెం
బడి నింటింటఁ గడుంగడుం గృపణతం । భైక్ష్యం బపేక్షించి వేఁ
డెడి నిష్కారణదుఃఖవృత్తిఁ బడుచుం । డెందంబునం నిన్ను దూ
రెడు నన్నుం గరుణింపరాదగదె! యో । శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీ కాళహస్తీశ్వరశతకము

సంపూర్ణము.

---

# పీఠిక

—

శ్రీరామభక్తిపరములైన శతకములందు దాశరథిశతక మాంధ్రహృదయరంజకమైన శతకరత్నము. ఆంధ్రభాషామాధుర్యమును రామదాసభక్తిమాధుర్యమును భద్రగిరి శ్రీరామభక్తిమాధుర్యమును దాశరథీశతకమునందు సమ్మేళనము నొంది శతక మఖండమైన భక్తిరసానందమును శ్రీరామభక్తులకుఁ బ్రత్యక్షము కావించుచున్నది. దాశరథీ శతకవ్యాపన మీశతక మాంధ్రహృదయాదరమును బడసినవిధమును విశదము చేయుచున్నది. ఒకటి రెండు తరములకుఁ బూర్వముమరలను దాశరథీశతకమును రుక్మిణీకల్యాణమును బడులందు జదివించుట యాచారముగ నుండెడిది. అక్షరాస్యులైనను కాకపోయినను "శ్రీ రఘురామ చారుతులసీదళదామ" యని తమనోటిని పావనము చేయుట విద్యాభ్యాసమునకు లక్ష్యముగ నుండెడిది. ఆంగ్లవిద్యాప్రభావ మాంధ్రహృదయమును వ్యత్యస్తము చేసినది. రేట్సువర్గము కటాక్షమువలన బడులు విరసములైన "కాకి కుక్క" కథలను పాటలను గఱపుచున్నవి. సరసమైన "పరమదయానిధే పతితపావననామ హరే యటంచు" నను మధురాక్షరములను గఱపెడి బడులు మచ్చునకైనను గనఁబడకున్నవి. ఇంతటితో నీ యుపాఖ్యానమును జాలించి ప్రస్తుతాంశమును గూర్చి చర్చించుట కర్తవ్యము.

కర్తృత్వము:—ఈశతకమునందు గ్రంథకర్త తనకులగోత్రనామాదులను ౧౦౨, ౧౦౩ పద్యములందుఁ దెలియఁజేసెను:—

ఉ. అల్లనలింగమంత్రిసుతుఁ • డత్రిజగోత్రజుఁ డాదిశాఖ కం
చెర్లకులోద్భవుం డనఁ బ్ర • సిద్ధుఁడనై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచి • యించితి గోపకవీంద్రుఁడన్ జగ
ద్వల్లభ నీకు దాసుఁడను • దాశరథీ కరుణాపయోనిధీ.

కంచర్ల గోపన్న ప్రథమశాఖాబ్రాహ్మణుఁడు. ఆత్రేయసగోత్రజుఁడు. లింగన్న కామాంబల తనయుఁడు. రామానుజమతస్థుఁడు. భట్టరార్యశిష్యుఁడు. నిజామురాష్ట్రమునందుఁ గల నెలకొండపల్లెయందుఁ బుట్టినవాఁడు. అక్కన్న మాదన్నలకు మేనల్లుఁడను ప్రతీతియును గలదు.

రామదాసు నామమునఁ బ్రఖ్యాతుఁడైన గోపన్న చరిత్రము రామదాసుచరిత్రమునందు సవిస్తరముగఁ గలదు. గోపన్న బాల్యమునుండియు శ్రీరాముని గొలుచుచుండెను. కబీరదాసువలనఁ దారకమంత్రము నుపదేశము నొందెను. శ్రీరామకైంకర్యమునకుఁ దనసొత్తంతయు వినియోగించెను. బంధుమిత్రుల బలవంతమువలన అక్కన మాదన మంత్రులను జేరి భద్రాచలమునకుఁ దహసీలుదారు పదవిని బడసెను. తాలూకా సిస్తు దస్తులకు శ్రీ భద్రాద్రిరాముల కైంకర్యమునకు వినియోగించి పండ్రెండు సంవత్సరముల కారాగృహవాస దండనము ననుభవించెను. ఆ కాలమునందు రామదాసు చేసిన శ్రీరామసంకీర్తనము రామదాసుకీర్తనలుగ దేశమునం దంతటను వెలసినవి. శ్రీరాముఁడు తానీషాకు సొమ్మును జెల్లించి రామదాసును విడిపించెను. రామదాసు భద్రాచలరాముని సేవించుచుఁ బరమపదము నొందెను.

కాలము:—గోపన్న కాలనిర్ణయమును జేయుటకుఁ దగినయాధారములుఁ గనిపింపవు. తానీషాయుదంతమును అక్కన్న మాదన్నల బంధుత్వమును నమ్మినయెడల నీతఁడు ౧౬౩౦–౧౬౮౦ ప్రాంతములందు నివసించియుండును. అక్కడిశాసనములును రామదాసు ౧౬౩౦ ప్రాంతమునందు నివసించినటులు నిరూపించుచున్న వని మద్దాల గురుబ్రహ్మశర్మగారు శ్రీ వంగూరి సుబ్బారావుగారికి వ్రాసియుండిరి. పరిశోధకులు విషయాన్వేషణమును జేసి కాలనిర్ణయమును జేయవలసి యుందురు.

శైలి:—శైలి ధారాళమై మధురముగ నున్నది. భాష సంస్కృతాంధ్ర పదసంకలితమై సులభగ్రాహ్యముగ నున్నది. అంత్యప్రాసములు ముక్తపదప్రాసములు శబ్దాలంకారములు గలవు. సర్వేశ్వర, వృషాధిపశతకములందుఁ గల నిగమాగమశాస్త్ర వైదుష్య మీ శతకమునందుఁ గనఁబడదు. రామతారకశతకమునందుఁ గల వేదాంతభావములును గనిపింపవు. 'భక్తిరసప్రవాహము శతకమునం దంతటను గలదు. వాడుక ప్రయోగము లచ్చటచ్చట గన్పట్టుచున్నను బద్యములు రసవంతములై సలక్షణముగ నున్నవి. మూఁడవ పద్యమునందు "దుర్వ్యసనముఁ జెంది కావ్యము దురాత్ముల కిచ్చితి మోస మయ్యెను" యని వ్రాయుటవలన నితరకావ్యములను వ్రాసిన ట్లూహింపఁదగియున్నను నా కావ్యములు గనిపించుట లేదు. శతకమును సాంప్రదాయానుసారముగ దశకవిభాగముఁ జేసినటులు వర్ణనలు విభాగములు సూచించుచున్నను శతకమంతయుఁ గలిసి మిశ్రితమై యుండుటవలన కవిహృదయానురూపమైన విభజనము దుస్తరముగ నున్నవి. ఇందలి 39, 64, 84 పద్యములు శివానందలహరిలోని 14, 27, 7 శ్లోకములను, 100, 101 పద్యములు సర్వేశ్వరశతకమునందలి పద్యములకు బోలియున్నవి. ఇతర స్తవములను శతకములనుబోలిన పద్యము లనేకములు గలవు. శైలిని దెలుపుటకు కొన్ని పద్యము లుదాహరింపఁబడుచున్నవి:—

ఉ. రంగదరాతిభంగ ఖగ♦రాజతురంగ విపత్పరంపరో
త్తుంగ తమఃపతంగ పరి♦తోషితరంగ దయాంతరంగ స
త్సంగ ధరాత్మజాహృదయ♦సారసభృంగ నిశాచరాబ్జమా
తంగ శుభాంగ భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

చ. 'పరమదయానిధీ పతిత♦పావననామ హరీ' యటంచు సు
స్థిరమతులై సదా భజన♦సేయు మహాత్ముల పాదధూళి నా
శిరమునఁ దాల్తు మీ రటకుఁ ♦ జేరకుఁ డంచు యముండు కింకరో
త్కరముల కానఁ బెట్టునఁట ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

ఉ. చిక్కనిపాలపై మిసిమిఁ ♦ జెందిన మీఁగడ పంచదారతో
మెక్కినభంగి నీ విమల♦మేచకరూపసుధారసంబు నా
మక్కువ పళ్లెరంబున స♦మాహితదాస్యమ నేటి దోయిటన్
దక్కె నటంచు జుర్రెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

చ. వనకరి చిక్కె మైనసకు ♦ వాచవికిం జెడిపోయె మీను తా
వినికికిఁ జిక్కెఁ జిల్వ కను♦వేఁదుఱుఁ జెందెను లేళ్లు తావిలో
మనికి నశించె నాకుఁ దర♦మా యిరుమూఁటిని గెల్వ నైదుసా
ధనముల నీవె కావఁ దగు ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

ఉ. భూపకులప్రదీప మణి♦భూషణ కాంతికలాప భండనో
ద్దీపితదివ్యచాప జగ♦దీడ్యదురాప మహాప్రతాప సం
తాపితవైరిభూప విగ♦తప్రకటాఖిలపాప పుణ్యసం
స్థాపనరూప భద్రగిరి ♦ దాశరథీకరుణాపయోనిధీ.

## భా వా ర్థ ము

ఈ శతకమునకు మకుటము :— భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ.

భద్రాచలము సుప్రసిద్ధమైన శ్రీరామక్షేత్రము. శ్రీ సీతారామలక్ష్మణులు వనవాసమును భద్రగిరి ప్రాంతములందే చేసియుండ రనియు నాసికప్రాంతములందుఁ జేసి యుండ రనియును కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు నిర్ణయించిరి. ఈ నిర్ణయము వలన భద్రగిరి ప్రాచీనమైనక్షేత్రమని విశద మగుచున్నది. ఆంధ్రదేశమునందలి శివక్షేత్రములందు శ్రీగిరియును శ్రీరామక్షేత్రములందు భద్రగిరియును దుర్గమము లైన

సుప్రసిద్ధక్షేత్రములు. శ్రీగిరి భద్రగిరి క్షేత్రములు దుర్గమము లైన పర్వతారణ్యావృతము లై కృష్ణాగోదావరీతీరముల నలంకరించిన పుణ్యక్షేత్రములు. ఈ క్షేత్రయాత్రలు దురారాధ్యము లైనను మనోహరములై భక్తుల నాకర్షించుచున్నవి. శివరాత్రికి శ్రీశైలమునకును శ్రీరామనవమికి భద్రాద్రికిని వేనవేలుభక్తులు గుంపులు గుంపులుగ భగవన్నామస్మరణమును జేయుచు దుర్గమారణ్యములందుఁ బయనముచేయుట మనోహరముగ నుండును. యాత్రికులు గుంపులుగుంపులుగఁ బయనముచేయుచు మకాములందు వనభోజనములను జేయుచు గిరికాంతారముల నడుమను భజనలను జేయుచు శివరామకీర్తనలను బాడుచు యాత్రను జేయుట మనోహరముగ నుండును.

భక్తవత్సలుడైన భద్రగిరీశ్వరుని ప్రభావము దాశరథిశతకమునకు హృదయము. రామదాసు శ్రీరాముని త్రికరణశుద్ధిగను సేవించి దుఃఖమును జయించి సుఖమును బడసెను. గోపరాజు రామదాసైనవిధమును దాశరథీశతకము హృద్యముగను విశదము చేయుచున్నది. శ్రీరామభక్తి దుఃఖనివృత్తిని జేసి సుఖప్రాప్తిని గలుగజేయఁగలవిధమును రామదాసుచరిత్రము వ్యక్తము చేయుచున్నది. రామదాసనామము భాగవతభక్తులకుఁ బర్యాయపదముగను బరిణతి నొందినది.

శ్రీరామభక్తి వైష్ణవభక్తివికాసమునందు బాహ్యలక్షణచిహ్నముల కధికమైన ప్రాముఖ్యము నొసంగక జ్ఞానమార్గమున కధికమైన ప్రాముఖ్యము నొసంగుచున్నది. శ్రీరామానుజ యామునాచార్యు లుపదేశించిన శుద్ధవైష్ణవము పదునేడవ శతాబ్దియందు వీరవైష్ణవముగను బరిణమించినది. అంతరంగికభక్తి మాటుపడి బాహ్యలక్షణములు ప్రబలినవి. పంగనామములు తులసిపూసలు ప్రబలినవి. పదుమూఁడవశతాబ్దియం దుదయించిన భక్తియుగము పదునేడవ శతాబ్దిని బాహ్యచిహ్నములందు లీనమై నిజస్వరూపమును గోల్పోయినది. దాశరథీశతకమునందలి గోపన్నకృత మైన స్వీయవర్ణనమే ఈ విషయమును రుజువుచేయుచున్నది.

ఉ. పట్టితి భట్టరార్యగురు • పాదము లిమ్మెయి నూర్ధ్వపుండ్రముం
బెట్టితి మంత్రరాజ మొడిఁ • బెట్టితి నయ్యమకింకరాళికిం
గట్టితి బొమ్మ మీచరణ • కంజములందుఁ దలంపు పెట్టి పోఁ
దట్టితిఁ బాపపుంజముల • దాశరథీ! కరుణాపయోనిధీ.

ప్రజాదృష్టి బాహ్యలక్షణములందు లగ్నమైయున్నను గోపన్నదృష్టి శుద్ధమైన రామభక్తియందు లగ్నమైన విధమును దాశరథీశతకము విశదముచేయుచున్నది. ఆంధ్రదేశమునందు ద్రావిడదేశమునందు లేని యొకవిశేషము గనుపించుచున్నది. శ్రీరామభక్తి

దేశమునందు మూలమూలలను వ్యాపించియున్నది. శ్రీరామభజనలు రామమందిరములు గ్రామములకు జీవకళలుగ నున్నవి. ప్రజలు కులవిభేదము లేకను బ్రాహ్మణబ్రాహ్మణేతరులు కలిసి దీపారాధనను జేసి రామభజనను జేయుట, రామసంకీర్తనమును జేయుట పరిపాటిగ నున్నది. ముఖ్యముగను గ్రామోపద్రవసమయములందు ప్రజలు రామభక్తిపరవశులై భజనలను జేయునపుడు చూచినవారలకు ఆంధ్రదేశమునందు శ్రీరామభక్తి వ్యాప్తిని గాంచిన విధము విశదముగాగలదు.

ముప్పదేండ్లకు పూర్వము రామదండు మహాప్రవాహమువలె వెలసి దేశమును భక్తిరసమునందు ముంచినది. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు శ్రీరామకైంకర్యమునకును దేశకైంకర్యమునకును రామదండును స్థాపించుటకు ప్రయత్నములను జేయుచున్నారు. రామభజనలందు పాడెడికీర్తనలు విశేషముగను రామదాసుకీర్తనలుగ నుండును.

రాగము - నాధనామక్రియ, ఏకతాళము

కోదండరామ కోదండరామ - కోదండరామ కోదండరామ॥

నీదండ నాకు నీవెందుఁబోకు - వాదేల నీకు కలదుపరాకు॥ కో॥
శ్రీరామ మమ్ముఁ జేపట్టుకొమ్ము - ఆదుకోరమ్మ ఆరోగ్యమిమ్ము॥ కో॥
జయరఘువీర జగదేకశూర - భయదనివార భక్తమందార॥ కో॥
మణిమయభూష మంజులభాష - రణవిజయఘోష రమణీయవేష॥ కో॥
ఏలరావయ్య యేమంటినయ్య - పాలింపవయ్య ప్రార్థింతునయ్య॥ కో॥
తల్లివి నీవె తండ్రివి నీవె - దాతయు నీవె దైవము నీవె॥ కో॥ .........

రాగము - నాధనామక్రియ, ఆదితాళము.

ఏమిరా రామా - నావల్ల నేగమేమిరా రామా॥

ఏమిరామ యీలాగుకష్టము - నీమహిమో నాప్రారబ్ధమో॥ ఏ॥
కుండలిశయన వేదండరక్షకా - ఖండతేజ నా-యండనుండవే॥ ఏ॥
పంకజలోచన-శంకరనుత నా - సంకటమార్పవె-పొంకముతోను॥ ఏ॥
మందరధరనీ-సుందరపదముల - నిందిరేశ కనుఁ-గొందుఁజూపవే॥ ఏ॥
దినమొకయేడుగ-ఘనముగఁ గడపెడి - తన దీనినిమీఁదను-దయలేదగా॥ ఏ॥
సదయహృదయనీ-మృదుపదములు నా - హృదయకమలమున-వదలక నిల్పెద॥ ఏ॥
రామరామ భ-ద్రాచలసీతా - రామదాసుని-ప్రేమతోనేలరా॥ ఏమి॥

రాగము - కళ్యాణి, ఆదితాళము.

నను బ్రోవుమని చెప్పవే-సీతమ్మ-నను బ్రోవుమని చెప్పవే॥
నను బ్రోవుమని చెప్పవె-నారీశిరోమణి-జనకునికూఁతుర జననిజానకమ్మ॥ నను॥
ప్రక్కను జేరుక- చెక్కిలినొక్కుచుఁ- జక్కఁగమరుకేళిఁ- జొక్కియుండెడివేళ॥
లోకాంతరంగుఁడు-శ్రీకాంతనినుఁగూడి-యేకాంతమున నేక-శయ్యనున్న వేళ॥నను
అద్రిజవినుతుఁడు భద్రగిరీశుఁడు - నిద్రమేల్కొను వేళ నెలతరో బోధించి॥ నను॥

రాగము - శంకరాభరణము, చాపుతాళము.

కంటి నేఁడూ-మా రాములఁ-గనుఁగొంటి నేఁడు॥
కంటి నేఁడు భక్తగణములపాలిమా-పంటభద్రగిరి నంటియున్నవాని॥ కంటి॥
చెలువొప్పుచున్నట్టి సీతాసమేతుని-కొలువుదీరినమన కోదండరాముని॥ కంటి॥
కస్తూరితిలకము ఘననీలగాత్రము-కరుణారసము గురియు-కందోయిఁగలవాని॥ కంటి॥

ఈ భద్రాద్రిరామకీర్తనలు భక్తిజ్ఞానసమ్మిళితమైన యాంధ్రహృదయజిజ్ఞాసకు నిదర్శనములుగ నున్నవి. శ్రీరామభక్తిరసపూరితములైన శ్రీత్యాగరాజకీర్తనలును ఆంధ్రహృదయేశ్వరుడైన శ్రీరామచంద్రసంకీర్తనమును మనోహరముగఁ జేయుచు రామభక్తి వ్యాపనమును విశదము చేయుచున్నవి.

రాగము - సారంగ, ఆదితాళము.

"ప. ఏమిదోవబల్కుమా ఇకనునే నెందుపోదు శ్రీరామ (ఏమి)
అ. రామదాసువలెనైతే సీతా-భామ మందలించును నీతోతన (కేమి)
చ. దట్టిగట్టి కరమున శరచాపముబట్టి మూలబలమును రావణుతల
గొట్టి నిల్వనావేళ త్రిమూర్తులు కోరినుతింపగ
నట్టి వారికెదురు బల్కు రాజుకు పట్టమునగ నీకు నాదువైదము,
బుట్టు కారణం బేమిదెలిసె వర భోగశయన త్యాగరాజనుతతన (కేమి)"

దాశరథీశతకమునకు భావార్థము శ్రీరామదాస నామరూపముల మూలమునను ఆంధ్రహృదయమూర్తియైన శ్రీరామమూర్తికైకగ్యముగ నున్నది. శతక భావార్థమును దెలుపుట కీక్రిందపద్యము లుదాహృతములు.

ఉ. భూపలలామ రామ రఘుపుంగవ రామ త్రిలోకరాజ్యసం
స్థాపనరామ మోక్షఫలదాయక రామ మదీయపాపముల్
మాప గదయ్య రామ నినుఁ బ్రస్తుతి సేసెద నయ్య రామ సీ
తాపతి రామ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ.

'రక్తాక్షి' సం॥ }
వైశాఖ శు ౯ బుధవారము }

కా. నాగేశ్వర రావు.

శ్రీరస్తు

# దాశరథి శతకము

శ్రీ రఘురామ చారుతులసీదళదామ శమక్షమాది శృం
గారగుణాభిరామ త్రిజగన్నుతశౌర్యరమాలలామ దు
ర్వారకబంధ రాక్షస విరామ జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ. ౧

## ఆచార్యకవి కృతిప్రశంస

ఉ. ఆర్యుల కెల్ల మ్రొక్కి వినతాంగుఁడ నై రఘునాథ భట్టరా
చార్యుల కంజ లెత్తి కవిసత్తముల న్వినుతించి కార్యసా
కర్య మెలర్ప నొక్క శతకం బొనగూర్చి రచింతు నేఁడు తా
త్పర్యమునన్ గ్రహింపు మిది దాశరథీ కరుణాపయోనిధీ. ౨

ఉ. మసగొని రేఁగుబండ్లకును మౌక్తికము ల్వెలఁబోసినట్లు దు
ర్వ్యసనముఁ జెంది కావ్యము దురాత్ముల కిచ్చితి మోసమయ్యె నా
రసనకుఁ బూతవృత్తి సుకరంబుగఁ జేకురునట్లు వాక్సుధా
రసములు చిల్కఁ బద్యముఖరంగమునందు నటింపవయ్య సం
తసమును జెంది భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ. 3

ఉ. శ్రీరఘువంశతోయధికి శీతమయూఖుఁడ వైన నీ పవి
త్రోరుపదాబ్జము ల్వికసితోత్పలచంపకవృత్తమాధురీ
పూరితవాక్ప్రసూనములఁ బూజ లొనర్చెదఁ జిత్తగింపు మీ
తారకనామ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ. ౪

---

(2) ౧. అ. గ్రహింపుమది (వసింపు మిఁక. అ.) (3) ౨. అ. మోసపోయి.
(4) 3. అ. ఆ. మీ. ౪. అ. ల్విలసి. ౫. అ. మెన్నికొన.

ఉ. గురుతరమైన కావ్యరస । గుంఫన కబ్బురమంది ముష్కరుల్
సరసులమాడ్కి సంతసిలఁ । [1]జాలుదురోటు శశాంకచంద్రికాం
కురముల [2]నిందుకాంతమణి । కోటి స్రవించినభంగి వింధ్యభూ
ధరమున [3]జాలునే శిలలు । దాశరథీ కరుణాపయోనిధీ. ౫

ఉ. తరణికులేశ నానుడులఁ । దప్పును గల్గిన నీదునామ స
ద్విరచిత మైనకావ్యము ప । విత్రము గాదె వియన్నదీజలం
బరుగుచు [4]వంకమైన మలి । నాకృతిఁ బాఱినఁ దన్మహత్త్వముం
దరమె గణింప [5]నెవ్వరికి । దాశరథీ కరుణాపయోనిధీ. ౬

## శ్రీరామదివ్యవిభూతులు

ఉ. రామ విశాలవిక్రమప । రాజితభార్గవరామ సద్గుణ
స్తోమ పరాంగనావిముఖ । సువ్రతకామ వినీలనీరద
శ్యామ కకుత్స్థవంశకల । శాంబుధిసోమ సురారిదోర్బలో
ద్దామ విరామ భద్రగిరి । దాశరథీ కరుణాపయోనిధీ. ౭

ఉ. అగణితసత్యభాష శర । ణాగతపోష దయాలసజ్ఝురీ
విగతసమస్తదోష పృథి । వీసురతోష త్రిలోకపూత [6]కృ
ద్గగనధునీమరందపద । కంజవిశేష మణిప్రభాధగ
ద్ధగితవిభూష భద్రగిరి । దాశరథీ కరుణాపయోనిధీ. ౮

ఉ. రంగదరాతిభంగ ఖగ । రాజతురంగ విపత్పరంపరో
త్తుంగతమఃపతంగ పరి । తోషితరంగ దయాంతరంగ [7]స
త్సంగ ధరాత్మజాహృదయ । సారసభృంగ [8]నిశాచరాబ్జమా
తంగ శుభాంగ భద్రగిరి । దాశరథీ కరుణాపయోనిధీ. ౯

---

(5) ౧. అ. జాలరుకోటి (జాలరుగాదె. ఆ.) ౨. అ. నిందుకాంత...శ్రమించిన భంగి. (నబ్జకాంత...స్రవించిన భంగి. ఆ.) 3. అ. జాలునే. (6) ౪. ఆ. అ. వంకలైన. ౫. ఆ. నేరికిని. (భద్రగిరి. అ.) (8) ౬. అ. కుద్గగనదునీభవాది (హృద్గగనదునీభవాది. ఇ. కృద్గగనదునీభవాది.ఆ). (9) ౭. ఇ తత్సంగ. ౮. అ. నిశాచరాభ్య.

ఉ. [౧]శ్రీద సనందనాదిముని। సేవితపాద దిగంతకీర్తిసం
పాద సమస్తభూత [౨]పరి। పాలవినోద విషాదవల్లికా
చ్ఛేద ధరాధినాథకుల। సింధు [౩]సుధామయపాద నృత్తగీ
తాదివినోద భద్రగిరి। దాశరథీ కరుణాపయోనిధీ. ౧౦

ఉ. శ్రీరమణీయహార యత। సీకుసుమాభశరీర భక్తమం
దార వికారదూర పర। తత్త్వవిహార త్రిలోక[౪]చేతనో
ద్ధార దురంతపాతకవి। తానవిదూర ఖరాదిదైత్యకాం
తారకుఠార భద్రగిరి। దాశరథీ కరుణాపయోనిధీ. ౧౧

ఉ. దురితలతాలవిత్ర ఖర। దూషణ కాననవీతిహోత్ర భూ
భరణకళావిచిత్ర భవ। బంధవిమోచనసూత్ర చారువి
స్ఫురదరవిందనేత్ర ఘన। పుణ్యచరిత్ర వినీలభూరి[౫]కం
ధరసమగాత్ర భద్రగిరి। దాశరథీ కరుణాపయోనిధీ. ౧౨

ఉ. కనకవిశాలచేల భవ। కాననశాతకుఠారధార స
జ్జనపరిపాలశీల దివి। జస్తుత సద్గుణకాండ కాండ[౬]సం
జనితపరాక్రమక్రమవి। శారద శారదకందకుంద[౭]చం
దనఘనసారసారయశ। దాశరథీ కరుణాపయోనిధీ. ౧౩

ఉ. అజునకుఁ దండ్రివయ్యు సన। కాదులకుం [౮]బరతత్త్వమయ్యు స
ద్ద్విజమునికోటికెల్లఁ [౯]గుల। దేవతవయ్యు దినేశవంశభూ
భుజులకు మేటివయ్యుఁ బరి। పూర్ణుఁడవై వెలుఁగొందుపక్షిరా
డ్ధ్వజ [౧౦]నినుఁ బ్రస్తుతించెదను। దాశరథీ కరుణాపయోనిధీ. ౧౪

---

(10) ౧. అ. మోదిత వేదనాదమునిపూజిత. ౨. అ. ఇ. సంపాద...పరిపాల వినోద (సంపాదిత సుప్రసాద పరిపంథివిభేద.) ౩. ఆ. సుధారస పాదభక్తహృత్సాదర మోద...(సుధారస పాదభక్త నృత్యగీతాది వినోద. ఇ.) (11) ౪. ఆ. చేతనాధార. (12) ౫. అ. ఆ. ఇ. భూధర. (13) ౬. అ. ఇ. సజ్జనిత. ౭. ఇ. చందన ఘనసారకీర్తి యుత (చందన ఘనసారకీర్తిభర. అ. ఆ.) (14) ౮. అ. బరతత్త్వమయ్యు. ౯. అ. ఆ. బర దేవతవయ్యు. ౧౦. ఆ. అ. మిముఁ బ్రస్తుతింపఁ దగు.

ఉ. పండితరక్షకుం డఖిలపాపవిమోచనుఁ డబ్జసంభవా
ఖండలపూజితుండు దశకంఠవిలుంఠన చండకాండ కో
దండకళాప్రవీణుఁ డనుతావకకీర్తివధూటి కిత్తుఁ బూ
దండలు గాఁగ నాకవిత దాశరథీ కరుణాపయోనిధీ. ౧౬

ఉ. ముప్పునఁ గాలకింకరులు ముంగిట [1]వచ్చినవేళ రోగముల్
గొప్పరమైనచోఁ గఫము కుత్తుక నిండినవేళ [2]బాంధవుల్
గప్పినవేళ మీస్మరణ గల్గునొ గల్గదొ నాఁటి కిప్పుడే
తప్పక చేతు మీభజన దాశరథీ కరుణాపయోనిధీ. ౧౭

## శ్రీరామనామ సంకీర్తన ప్రభావము

చ. 'పరమదయానిధీ పతితపావననామ హరీ' యటంచు సు
స్థిరమతులై సదా భజనసేయు మహాత్ముల పాదధూళి నా
శిరమునఁ దాల్తు మీరటకుఁ జేరకుఁ డంచు [3]యముండు కింకరో
త్కరముల కానఁబెట్టునఁట దాశరథీ కరుణాపయోనిధీ. ౧౮

ఉ. [4]దారుణపాతకాబ్ధికి సదా బడబాగ్ని భవాకులార్తివి
స్తారదవానలార్చికి సుధారసవృష్టి దురంతదుర్మతా
చారభయంకరాటవికిఁ జండకఠోరకుఠారధార నీ
తారకనామ మెన్నుకొన దాశరథీ కరుణాపయోనిధీ. ౧౯

చ. హరునకు నవ్విభీషణు[5]న కద్రిజకుం దిరుమంత్రరాజమై
కరికి నహల్యకున్ ద్రుపదకన్యకు నార్తిహరించుచుట్టమై
పరఁగినయట్టి [6]నీపతితపావననామము నాదు[7]జిహ్వపై
త్వరగ వసింపఁ [8]జేయుము మిఁక దాశరథీ కరుణాపయోనిధీ. ౨౦

---

(16) ౧. అ. నిల్చిన. ౨. అ. చైత్యముల్. (17) 3. జముండు. (18) ౪. అ. ధారుణి. (19) ౫. అ. ని. ౬. అ. మీ. ౭. అ. జిహ్వాపై నిరం. ౮. అ. ఆ. జేయగదె.

ఉ. శ్రీరమ సీత గాఁగ నిజ। సేవకబృందము వీఁ వైష్ణవా
చారజనంబు గాఁగ వి। జాసది గాతమి గా వికుంఠము
న్నారయ భద్రశైలశిఖ। రాగ్రము ᴳగాఁగ వసించి చేతనో
ద్ధారకుఁ డైనవిష్ణుఁడవు। దాశరథీ కరుణాపయోనిధీ. ౨౦

ఉ. కంటి నదీతటంబుఁ బొడ। గంటిని భద్ర ᴵనగాధివాసముం
గంటి నిలాతనూజ నురు। కార్ముకమార్గణ శంఖచక్రముల్
గంటిని మిమ్ము లక్ష్మణుని। గంటిఁ గృతార్థుఁడ నైతి నోజగ
త్కంటకదైత్యనిర్దళన। దాశరథీ కరుణాపయోనిధీ. ౨౧

చ. హలికునకున్ హలాగ్రమున। నర్థము సేకుఱుభఁగి డప్పిచే
నలమటఁ జెందువానికి। సురాపగᴲలో జల మబ్బినట్లు దు
ర్మలినమనోవికారి నగు। మర్త్యుని ᴲన న్నుఁడఁగూర్చి నీపయిం
దలఁపు ఘటింపఁజేసితివి। దాశరథీ కరుణాపయోనిధీ. ౨౨

ఉ. కొంజక తర్కవాద మను। గుద్దలిచేఁ బరతత్త్వభూస్థలిన్
రంజిలఁ ద్రవ్వి కన్గొనని। రామనిధానము నేఁడు భక్తిసి
ద్ధాంజనమందు హస్తగత। మయ్యె భళీ యనఁగా మదీయహృ
త్కంజమునన్ వసింపు మిఁక। దాశరథీ కరుణాపయోనిధీ. ౨౩

ఉ. రాముఁడు ఘోరపాతక వి। రాముఁడు ᴷసద్గుణకల్పవల్లి కా
రాముఁడు షడ్వికార జయ। రాముఁడు సాధుజనావనవ్రతో
ద్దాముఁడు రాముఁడే పరమ। దైవము మాకని ᴸమీ యదుంగుఁ గెం
దామరలే భజించెదను। దాశరథీ కరుణాపయోనిధీ. ౨౪

---

(20) ౧. అ. గావసియించు చేతనాధారకమైన విష్ణుడవు (గానెలకొన్న చేతనో-
ద్ధారక మీవె కా హరివి. అ.) (21) ౨. అ. నఖాదిరాజమును. (22) ౩. అ. తోయము
లిచ్చి. ౪. ఆ. నన్నొనగూర్చి (నన్నునుగూర్చి. అ.) (24) ౫. అ. సజ్జన. ౬. ఆ.
నీదుపాద.

ఉ. చక్కెర [౧]మాని వేముఁ దినఁ జాలినకైవడి మానవాధముల్
పెక్కురు [౨]బక్కదైవముల వేమఱుఁ గొల్చెద రట్లు కాదయా
మ్రొక్కిన [౩]నీక మ్రొక్కవలె మోక్ష మొసంగిన [౪]నీవ యీవలెన్
దక్కినమాట లేమిటికి దాశరథీ కరుణాపయోనిధీ. ౨౫

ఉ. రా కలుషంబులెల్ల బయలం బడఁ ద్రోచిన మా కవాటమై
[౫]దీకొని ప్రోచు నిక్క మని ధీయుతు లెన్నఁ దదీయవర్ణముల్
గైకొని భక్తిచే నుడువఁ గానరు గాక విపత్పరంపరల్
దాకొనునే భవజ్జనుల దాశరథీ కరుణాపయోనిధీ. ౨౬

ఉ. రామ హరీ కకుత్స్థకుల రామ హరీ రఘురామ రామ శ్రీ
రామ హరీ యటంచు మది రంజల [౬]భేకగళంబులీల నీ
నామము సంస్మరించిన [౭]జనంబు భవం బెడఁ బాసి తత్పరం
ధామనివాసు లౌదు రఁట దాశరథీ కరుణాపయోనిధీ. ౨౭

ఉ. చక్కెరలప్పముల్ మిగుల జవ్వని కెంజిగురాకుమోవులున్
జొక్కపుజుంటి తేనియలు [౮]జొక్కులుచుం గనలేరు గాక నేఁ
డక్కట రామనామమధురామృత [౯]మానుటకంటె సౌఖ్యమా
తక్కిన మాధురీమహిమ ? దాశరథీ కరుణాపయోనిధీ. ౨౮

## శ్రీరామభక్తి ప్రభావము

ఉ. అండజవాహ నిన్ను హృదయంబున నమ్మినవారిపాపముల్
కొండలవంటి వైన వెసఁ గూలి నశింపక యున్నె సంతతా
ఖండలవైభవోన్నతులు గల్గక మానునె మోక్షలక్ష్మి కై
దండ యొసంగకున్నె [౧౦]తుద దాశరథీ కరుణాపయోనిధీ. ౨౯

---

(25) ౧. ఆ. వీడిచేదు (వెట్టివేము. అ.) ౨. ఆ. పెక్కు. (వంక. అ.) 3. ఆ. నీకె. ౪. అ. ఆ. నీవె. (26) ౫. అ. ఆ. ధీకొని. (27) ౬. అ. భేగగళంగు. ౭. అ. సదాజనం. (28) ౮. ఆ. జొక్కిలు చుక్కనలేరు (సొక్కిన చుక్కనలేరు. అ.) ౯. ఆ. మానిన (మానిని. అ.) (29) ౧౦. తుది.

ఉ. చిక్కనిపాలపై మిసిమిఁ జెందినమీఁగడ పంచదారతో
[౧]మెక్కినభంగి నీవిమల [౨]మేచకరూపసుధారసంబు నా
మక్కువపళ్లెరంబున సమాహితదాస్య మనేటిదోయిటన్
దక్కె నటంచు జుర్రెదను దాశరథీ కరుణాపయోనిధీ. 30

చ. సిరులిడ సీత, పీడ లెగఁ జిమ్ముటకున్ హనుమంతుఁ [౩]డార్తి సో
దరుఁడు సుమిత్రసూతి దురితంబులు [౪]మాన్పు రామనామముం
గరుణ దలిర్ప మానవులఁ గావఁగఁ బన్నిన వజ్రపంజరో
త్కరము గదా [౫]భవన్మహిమ దాశరథీ కరుణాపయోనిధీ. 31

చ. హలకులిశాంకుశధ్వజశరాసనశంఖరథాంగకల్పకో
జ్జ్వలజలజాతరేఖలను సాంకము లై కనుపట్టుచున్న మీ
కలితపదాంబుజద్వయము గౌతమపత్ని కొసంగినట్లు నా
తలఁపునఁ జేర్చి కావఁ గదె దాశరథీ కరుణాపయోనిధీ. 32

చ. జలనిధిలోనఁ దూఁటి కులశైలము మీఁటి ధరిత్రిఁ గొమ్మునం
దలవడ [౬]మాటి రక్కసుని యంగము గీటి బలీంద్రునిన్ రసా
తలమున నాటి పార్థివకదంబముఁ గూల్చినమేటి రామ నా
తలఁపున [౭]నాటి రాఁగదవె దాశరథీ కరుణాపయోనిధీ. 33

ఉ. భండనభీముఁ డార్తజనబాంధవుఁ డుజ్జ్వలబాణతూణకో
దండకళాప్రచండభుజతాండవ[౮]కీర్తికి రామమూర్తికిన్
రెండవసాటి [౯]దైవ మిఁక లేఁ డనుచున్ గడ [౧౦]గట్టి భేరికా
[౧౧]డాండడడాండ డాండ నినదంబు లజాండము నిండ మత్తవే
దండము నెక్కి చాటెదను దాశరథీ కరుణాపయోనిధీ. 34

---

(30) ౧. అ. మ్రుక్కినరీతి. ౨. ఆ. మేచకరూప సుధారసంబు. (31) ౩. ఆ. డార్తివోదరమ. (డార్తిబాధరము. అ) ౪. ఆ. మాన్పు. ౫. ఆ. భవత్కరుణ. (33) ౬. అ. ఆ. నాటి. ౭. అ. చేర్చిరావఁగదె. (34) ౮. ఆ. అ. వర్తికి. ౯. అ. ఆ. వేల్పులిక లేరనుచున్. ౧౦. అ. గొట్టి. ౧౧. ఆ. డాండ డడాండ డాండ.

చ. అవనిజకన్నుదోయి [1]తొగలందు వెలింగెడుసోమ! జానకీ
కువలయ [2]నేత్రగబ్బిచనుగొండల నుండుఘనంబ! మైథిలీ
నవనవయౌవనం బను[3]వసంబునకున్ మదదంతి వీవె కా
తవిలి భజింతు నెల్లపుడు దాశరథీ కరుణాపయోనిధీ. ౩౫

చ. ఖరకరవంశజా విను మఖండితభూతపిశాచ[4]ఢాకినీ
జ్వరపరితాపసర్ప[5]భయ వారక మైనభవత్పదాబ్జవి
స్ఫురదురువజ్రపంజరముఁ జొచ్చితి నీయెడ దీనమానవో
ద్ధరబిరుదాంక మేమఱకు దాశరథీ కరుణాపయోనిధీ. ౩౬

ఉ. జుట్టెద మీకథామృతము జుట్టెద మీపదకంజతోయమున్
జుట్టెద రామనామమున జొబ్బిలుచున్నసుధారసంబు నే
జుట్టెద జుఱ్ఱు [6]జుఱ్ఱని రుచుల్ గనువారిపదంబుఁ గూర్పవే
[7]తట్టులతోడిపొత్తిడక దాశరథీ కరుణాపయోనిధీ. ౩౭

ఉ. ఘోరకృతాంతవీరభటకోటికి గుండెదిగుల్ దరిద్రతా
కారపిశాచసంహరణ కార్యవినోది వికుంఠమందిర
ద్వారకవాటభేది నిజదాసజనావళి కెల్లప్రొద్దు నీ
తారకనామ మెన్నుకొన దాశరథీ కరుణాపయోనిధీ. ౩౮

భక్తరక్షణ దీక్ష

ఉ. విన్నప మాలకించు రఘువీర నహి ప్రతి లోకమందు నా
కన్న దురాత్ముఁడున్ బరమకారుణికోత్తమ వేల్పులందు నీ
కన్న మహాత్ముఁడుం బతితకల్మషదూరుఁడు లేఁడు గాన వి
ద్వన్నుత నీవె నాకు గతి దాశరథీ కరుణాపయోనిధీ. ౩౯

---

(౪౫) ౧. అ. తోవలందు మెలంగెడురాజు. ౨. అ. నేత్రి. ౩. అ. వసంబునఁ గ్రమ్మరుదంతి. (౪౬) ౪. ఆ. అ. ఢాకినీ. ౫. ఆ. భయవారణ......దుర (భయసంకటముల్ వెనువెంటరాఁగ మీస్మరణను. అ.) (౪౭) ౬. అ. ఆ. జుట్టిరుచుల్ గొనువారి పథంబు గూర్పవే. ౭. ఆ. ఆ. తట్టెలతోటి. (౪౮) ౮. అ. వసకార్యధుర్య మార్తాండకులేశ మానఘన.

ఉ. పెంపను దల్లివై కలుష। బృంద[౧]సమాగమ మొందకుండ [౨]ర
క్షింపను దండ్రివై [3]మెయి వ।సించు దశేంద్రియరోగముల్ నివా
రింపను[౪] వెజ్జువై కృప గుఱించి పరంబుఁ దిరంబుగాఁగ స
త్సంపద [౫]లీయ నీవె గతి। దాశరథీ కరుణాపయోనిధీ. ౪౦

ఉ. కుక్షి నజాండ[౬]పంక్తు లొన। గూర్చి చరాచరజంతుకోటి సం
రక్షణ సేయుతండ్రివి ప।రాత్పర సీతనయుండనైన నా
పక్షము నీవు గావలదె। పాపము లెన్ని [౭]యొనర్చినన్ జగ
ద్రక్షక కర్త[౮] వీవె కద। దాశరథీ కరుణాపయోనిధీ. ౪౧

ఉ. గద్దరియోగిహృత్కమల। గంధరసానుభవంబుఁ జెందు పె
న్నిద్దపుగండుఁదేఁటి, ధర।ణీసుత [౯]కౌఁగిలిపంజరంబునన్
ముద్దులుగుల్కు రాచిలుక। ముక్తినిధానమ రామ రాఁగదే
తద్దయు [౧౦]నేఁడు నాకడకు। దాశరథీ కరుణాపయోనిధీ. ౪౨

చ. కలియుగమర్త్యకోటి నినుఁ। గన్గొనరాని విధంబొ భక్తవ
త్సలత వహింపవో చటుల।సాంద్రవిపద్దశవార్ధిఁ గ్రుంకుచోఁ
బిలిచినఁ [౧౧]బల్క వింతమఱ।పే నరు లిట్లన రాదుగాక నీ
తలఁపున లేదె సీతచెఱ। దాశరథీ కరుణాపయోనిధీ. ౪౩

చ. జనవర మీ[౧౨]కథాళి విన। సైఁపక కర్ణములందు ఘంటికా
నినదవినోదముల్ సలుపు। [౧౩]నీచునకున్ వర మిచ్చినావు ని
న్ననయము నమ్మి కొల్చిన మ।హాత్ముల [౧౪]కేమి యొసంగెదో సనం
దననుత [౧౫]మాకొసంగు మది। దాశరథీ కరుణాపయోనిధీ. ౪౪

---

(40) ౧. ఆ. సమాజము నొందకుండ (సమాగమము బొందకుండ.అ.) ౨. అ. శి. 3. అ. కృపగురించి...జరించిన. ౪. ఆ. వెజ్జువై (వైద్యువై. అ.) ౫. ఆ. అ. లియ్య. (41) ౬. అ. పంక్తులను. ౭. ఆ. అ. దనర్చినన్. ౮. ఆ. అ. నీవె. (42) ౯. ఆ. కాగిటి (కంగిటు అ.) ౧౦. అ. కావనియ్యేడకు. (43) ౧౧. అ. కావ. (44) ౧౨. అ. కిథల్ వినగ. ౧౩. ఆ. నీచునకుంబర. ౧౪. అ. కేమిడవచ్చునో. ౧౫. అ. నాకొసంగు మది (మాకొసంగు మది. ఆ.)

## శ్రీరామలీలావిభవములు

ఉ. పాపము [౧]లొందువేళ రణ।పన్నగభూతభయజ్వరాదులం
దాపద నొందువేళ భర।తాగజ మిమ్ము భజించువారికిం
బ్రాపుగ నీవుఁ దమ్ముఁ డిరు।పక్కియలం జని [౨]తద్విపత్తిసం
తాపము మాన్పి [౩]కాతురఁట । దాశరథీ కరుణాపయోనిధీ. ౪౫

చ. అగణితజన్మకర్మదురి।తాంబుధిలో బహుదుఃఖవీచికల్
దెగిపడ నీఁద లేక జగ।తీధవ నీపదభక్తినావ చేఁ
దగిలి తరింపఁ గోరితిఁ బ।దంపడి నాదుభయంబు [౫]మాన్పవే
[౬]తెగ దని చిత్తమం దిడక । దాశరథీ కరుణాపయోనిధీ. ౪౬

ఉ. [౭]నే నొనరించుపాపము ల।నేకము లైనను నాదుజిహ్వకుం
[౮]బానక మయ్యె మీపరమ।పావననామము దొల్లి చిల్క రా
మా నను గావుమన్న తుది।మాటకు సద్గతిఁ జెందెఁ [౯]గావునన్
దాని ధరింపఁ గోరెదను । దాశరథీ కరుణాపయోనిధీ. ౪౭

చ. పరధనముల్ హరించి పర।భామల నంటి పరాన్న మబ్బినన్
[౧౦]మురిపెమె! కాని మీఁద నగు। మోసమెఱుంగదు మానసంబు గు
స్తిర [౧౧]మిడి కాలకింకరగ।దాహతిఁ బొల్పడ నీక [౧౨]నిమ్ము నే
తఱి దరిఁ జేర్చి [౧౩]కాచెదవొ । దాశరథీ కరుణాపయోనిధీ. ౪౮

ఉ. చేసితి ఘోరకృత్యములు । చేసితి భాగవతాపచారముల్
చేసితి నన్యదైవములఁ । జేరి భజించినవారిపొందు నేఁ
జేసిన నేరముల్ దలఁచి । చిక్కులఁ బెట్టకు మయ్య యయ్య! నీ
దాసుఁడ నయ్య భద్రగిరి। దాశరథీ కరుణాపయోనిధీ. ౪౯

---

(45) ౧. అ. నొందు. ౨. అ. తద్విపత్తు. ౩. ఆ. అ. కాతువటు. (46) ౪. అ. మీ. ౫. ఆ. దీర్పవే (దెల్పితే ఆ.) ౬. ఆ. అ. దగబిగి చిక్కులందిడక. (47) ౭. ఏ ......పాతకము. ౮. ఆ. దానకమయ్యె నీపరమతారక మంత్రముతోటి (తానకమయ్యె మీస్మరణ తారకమంత్రముతోటి. ఆ.) ౯. అ. ఆ. గావునం దానతరింప. (48) ౧౦. అ. మురిపము. ౧౧. అ. మిడి. ౧౨. ఆ. అ. నన్ను. ౧౩. అ. కావగదె.

చ. పరులధనంబుఁ జూచి పర భామలఁ జూచి హరింపఁ గోరు మ
ద్గురుతరమానసం [౧]బనెడు దొంగను బట్టి నిరూఢదాస్య[౨]వి
స్ఫురిత వివేకపాశములఁ జుట్టి భవచ్చరణం బనే మరు
త్తరువునఁ గట్టివేయఁగదె దాశరథీ కరుణాపయోనిధీ. ౫౦

చ. సలలితరామనామజపసార మెఱుంగను గాశికాపురీ
నిలయుఁడఁ గాను మీచరణనీరజరేణుమహాప్రభావముం
దెలియ నహల్యఁ గాను [౩]జగతీవర నీ దగుసత్యవాక్యముం
దలఁపఁగ రావణాసురుని తమ్ముఁడఁ గాను భవద్విలాసముల్
తలఁచి నుతింప నాతరమె దాశరథీ కరుణాపయోనిధీ. ౫౧

ఉ. పాతకులైన మీకృపకుఁ [౪]బాత్రుల కారె తలంచి చూడఁ జ
ట్రాతికిఁ గల్గెఁ బావన [౫]మరాతికి రాజ్యసుఖంబు [౬]గల్గె దు
ర్జాతికిఁ బుణ్యమబ్బెఁ గపిజాతి మహత్త్వము [౭]నొందెఁ గావునన్
[౮]దాతవి కెట్టివారలకు దాశరథీ కరుణాపయోనిధీ. ౫౨

ఉ. పాపకసాక్షిక వ్రజము మానవ నగణ్యము చిత్రగుప్తుఁ [౯]డే
మీఁదని [౧౦]వ్రాయునో శమనుఁ డేమి విధించునొ కాలకింకర
స్తోమ మొనర్చుటేమొ వినఁ జొప్పడ [౧౧]దంతకుమున్నె దీనచిం
తామణి [౧౨]యెట్లు గాచెదవొ దాశరథీ కరుణాపయోనిధీ. ౫౩

ఉ. దాసినచుట్టమా శబరి దాని [౧౩]దయామతి నేలినావు [౧౪]వసి
దాసునిదాసుఁడా గుహుఁడు తావకదాస్యమొసంగినావు నేఁ
జేసిన[౧౫]పాపమో వినుతి సేసినఁ గావవు కావుమయ్య నీ
దాసులలోన నే నొకఁడ దాశరథీ కరుణాపయోనిధీ. ౫౪

---

(50) ౧. ఆ. బనెడి ౨. అ విస్ఫురధర. (51) ౩. అ. ఆ. జగతీధవ. (52) ౪. ఆ. అ. పాత్రులు. ౫. అ. ము. ౬. అ. చెందె. ౭ అ. ఆ. జెందె. ౮. ఆ. అ. దాతవు. (53) ౯. అ. ఆ. లే. ౧౦. ఆ. అ. వ్రాసురో. ౧౧. ఆ. దంతకమున్నె. ౧౨. వెట్లు. ఆ. (54) ౧౩. అ. దయాంబుధి. ౧౪. అ. ఆ. మీ. ౧౫. ఆ. దోసమా......కావవయ్య (పుణ్యమా......కావవయ్య. అ.)

ఉ. దీక్ష వహించి నాకొలఁది । దీనుల నెందఱఁ [1]గాచితో జగ
ద్రక్షక తొల్లి యాద్రుపద। రాజతనూజ తలంచినంతనే
[3]సాక్షయ మైనవల్వ లిడి । తక్కట నా మొఱ [4]చిత్తగించి ప్ర
త్యక్షము గావ[5]దేమిటికి । దాశరథీ కరుణాపయోనిధీ. ౫౫

ఉ. నీలఘనాభమూర్తివగు । నిన్నుఁ గనుంగొనఁగోరి వేఁడినన్
జాలము సేసి డాఁగెదవు । సంస్తుతి కెక్కినరామనామ మే
మూలను దాఁచుకోఁ గలవు । ముక్తికిఁ బ్రాపది [6] పాపమూలకు
ద్దాలము గాదె మాయెడల । దాశరథీ కరుణాపయోనిధీ. ౫౬

చ. వలదు పరాకు భక్తజన। వత్సల నీచరితంబు వమ్ము [7]కా
వలదు పరాకు నీబిరుదు । వజ్రమువంటిది కావ కూరకో
వలదు పరాకు నాదురిత। వార్థికిఁ దెప్పవుగా మనంబులోఁ
దలఁతు[8]మె కా నిరంతరము । దాశరథీ కరుణాపయోనిధీ. ౫౭

ఉ. తప్పు లెఱుంగలేక దురి। తంబులు సేసితి నంటి [9]నీవు మా
యప్పవు గావు మంటి నిఁక । నన్యులకున్ నుదురంట నంటి నీ
కొప్పిద మైనదాసజను । లొప్పిన బంటుకు బంట నంటి నా
తప్పుల కెల్ల నీవె గతి । దాశరథీ కరుణాపయోనిధీ. ౫౮

చ. ఇతఁడు దురాత్ముఁ డంచు జను। లెన్నఁగ [11]నాఁడిఁగొంటి నేనెపో
పతితుఁడ నంటి [12]నో పరమ । పావన దాతవు నీవు గల్గ నే
నితరుల వేఁడ నంటి నిహ । మిచ్చిన నిమ్ము పరం బొసంగు [13]మీ
యతులిత రామనామమధు। రాక్షరపాళి నిరంతరంబు హృ
ద్గత మని [14]నమ్మి గొల్చెదను । దాశరథీ కరుణాపయోనిధీ. ౫౯

---

(55) ౧. అ. ఆ. గాచెదో. ౨. ఆ. నిన్ను. 3. అ. ఆ. యతఃయ. ౪. అ. యాల కించి. ౫. ఆ. వేమిటికి. (56) ౬. అ. మూలమయిన. (57) ౭. ఆ. వో. ౮. ఆ. నం. ౯. ఆ. సుమీ. (58) ౧౦. అ. ఆ. నీవె. (59) ౧౧ అ. ఆ. వీఱడి. ౧౨. అ. ఆ. తత్పతిత. ౧౩. అ. నీ. ౧౪. ఆ. నమ్మకొంటిగద (నమ్మియుంటి నిక.అ.)

ఉ. అంచితమైన నీదుకరుణామృతసారము నాదుపైని [1]బ్రో
క్షించినఁ జాలు దాన [2]నిరసించెద నాదురితంబు లెల్లఁ దూ
లించెద వైరివర్గ మెడలించెదఁ గోర్కుల [3]నీదుబంటనై
దంచెదఁ గాలకింకరుల దాశరథీ కరుణాపయోనిధీ. ౬౦

చ. జలనిధు లేడు నొక్కమొగిఁ జక్కికిఁ దెచ్చె శరంబు ఖాతి నిం
పలరఁగఁ జేసె నాతిగఁ బదాబ్జపరాగము [4]నీచరిత్రమున్
జలజభవాదినిర్జరులు సన్నుతిసేయఁగ [5]లేరు గావునం
దలఁప నగణ్య[6]మయ్య యిది దాశరథీ కరుణాపయోనిధీ. ౬౧

ఉ. కోఁతికి శక్యమా యసుర[7]కోటుల గెల్వను గెల్చెఁ బో నిజం
బాతని [8]మేన శీతకరుఁ డౌట దవానలుఁ డెట్టివింత మా
సీతపతి[9]వ్రతామహిమ సేవకు భాగ్యము [10]మీకటాక్షమున్
ధాతకు శక్యమా పొగడ దాశరథీ కరుణాపయోనిధీ. ౬౨

ఉ. భూపలలామ రామ రఘుపుంగవ రామ త్రిలోక[11]రాజ్యసం
స్థాపనరామ మోక్షఫలదాయక రామ మదీయపాపముల్
పాపఁగదయ్య రామ [12]నినుఁ బ్రస్తుతి [13]సేసెద నయ్య రామ సీ
తాపతి రామ [14]భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ. ౬౩

ఉ. నీసహజంబు సాత్త్వికము నీవిడి[15]పట్టు సుధాపయోధి ప
ద్మాసనుఁ [16]డాత్మజుండు కమలాలయ నీప్రియురాలు నీకు సిం
హాసన [17]మిద్ధరిత్రి గొడు గాకస మక్షులు చంద్రభాస్కరుల్
నీసుమతల్ప [18]మాదిఫణి నిన్ను సమస్తముఁ గొల్చునట్టినీ
[19]దాసులభాగ్య మెట్టిదొకో! దాశరథీ కరుణాపయోనిధీ. ౬౪

---

(60) ౧ అ. ఆ బ్రోక్షించితే జాలుగాని. ౨. అ. నిరసించవే. ౩. అ. నీకు. (61) ౪. ఆ. మీచరిత్రముల్. ౫ ఆ. జాలరేరికిన్. ౬ ఆ. మయ్యెనిది (62) ౭. ఆ.అ. కోట్లజయింప జయించె ౮ ఆ.........డౌనెదవానలు డట్టివింత (మేనుశీత కరుడా దనువానలు... అ.) ౯. ఆ. వ్రతామహిమొ......మె. (వ్రతాంగనలము. అ.) ౧౦ అ నీకటాక్షమో. (63) ౧౧ అ. లోక ౧౨. ఆ. మిము. ౧౩. అ. చేసితి. ౧౪. అ. రామజయ (64) ౧౫ ఆ. అ మట్టు. ౧౬ అ. డాత్మయుండు కమలాయుత. ౧౭. ఆ. మీధరిత్రి. ౧౮. ఆ మాలిమన నిన్ను భజించిన గల్గకుండునే. ౧౯. ఆ దా.. ...దన (దాసులకిచ్చె తార్థములు అ.)

చ. చరణము సోకినట్టిశిల । జవ్వనియై పగు [౧]దొక్కవింత సు
స్థిరముగ నీటిపై గిరులు । దేలిన దొక్కటి [౧]వింత గాని మీ
స్మరణ మొనర్చు మానవులు । సద్గతిఁ [౨]జెందిన దెంతవింత? యీ
[౩]ధరను ధరాత్మజారమణ । దాశరథీ కరుణాపయోనిధీ. ౬౫

ఉ. దైవము తల్లి దండ్రి తగు । దాత గురుండు సఖుండు నిన్నె కా
[౪]భావన సేయుచున్నతఱిఁ । బాపము లెల్ల మనోవికారదు
ర్భావితుఁ జేయుచున్నవి కృ । పామతి [౫]వై ననుఁ గావుమీ జగ
త్పావనమూర్తి భద్రగిరి । దాశరథీ కరుణాపయోనిధీ. ౬౬

ఉ. వాసవరాజ్యభోగసుఖ । వార్ధినిఁ దేలు ప్రభుత్వ [౬]మబ్బినన్
[౭]ఆసకు మేరలేదు [౮]కన । కాద్రిసమానధనంబుఁ గూర్చినన్
గాసును వెంట రాదు కని । కాసక చేసినపుణ్యపాపముల్
వీసరపోవ నీవు [౧౦]పది । [౧౧]వేలకుఁ జాలు [౧౨]భవంబు నొల్ల నీ
దాసునిగాఁగ నేలికొను । దాశరథీ కరుణాపయోనిధీ. ౬౭

ఉ. సూరిజనుల్ దయా[౧౩]పరులు । సూనృత[౧౪]వాదు లలుబ్ధమానవుల్
వీరపతివ్రతాంగనలు । విప్రులు గోవులు వేదముల్ మహీ
భారముఁ దాల్పఁగా జనులు । పావన మైన పరోప[౧౫]కారస
త్కార మెఱుంగలే రకట । దాశరథీ కరుణాపయోనిధీ. ౬౮

## దశావతార స్తవము

ఉ. వారిచరావతారమున । వారిధిలోఁ జొరఁబాఱి క్రోధవి
స్తారగుఁడైన యానిగమ । తస్కరవీరనిశాచ[౧౬]రేంద్రునిం
[౧౭]జేరి వధించి వేదముల । చిక్కెడలించి విరించికిన్ మహో
దారత నిచ్చితీవె కద । దాశరథీ కరుణాపయోనిధీ ౬౯

(65) ౧ ఆ వింతగాక మీ (వింతగాగమీ అ) ౨ ఆ. జెందుట లెంతవింతయా ౩. ఆ. తరణికులేశ భద్రగిరి. (66) ౪ అ. భావము. ౫ అ. వాటిని (67) ౬. ఆ. మబ్బినా (ముల్ సిరుల్ అ) ౭. అ. నాశకు ౮. [అ. ప్రతిలోలేదు] ౯ ఆ. నా. ౧౦. అ లేదు. ౧౧ ఆ వేలిక. ౧౨. అ. ణంబులోన మీదాచనివాడు భద్రగిరి. (68) ౧౩. అ. ఆ మతులు. ౧౪. అ. వాదులు లుబ్ధలుత్తముల్. ౧౫. అ కాంముల్ సత్కార మెఱుంగు మానవుఁడు. (69) ౧౬. అ. రింద్రు. ౧౭. అ. జేరి.

చ. కర మనురక్తి మంథరముఁ। గవ్వముగా నహి[౧]రాజుఁ ద్రాఁడుగా
దొరఁకొని దేవదానవులు। దుగ్ధపయోధి మథించు[౨]చున్నచో
ధరణి [౩]చలింప లోకములు। తల్లడ మందఁగఁ గూర్మమై ధరా
ధరము ధరించి తీవె కద। దాశరథీ కరుణాపయోనిధీ. ౨౦

ఉ. ధారుణిఁ జాపఁ జుట్టినవి।ధంబునఁ [౪]గైకొని హేమనేత్రుఁ [౫]డ
వ్వారిధిలోన డాఁగినను। వాని వధించి వరాహ[౬]మూర్తి వై
ధారుణిఁ దొంటికైవడిని। దక్షిణశృంగమునన్ ధరించి వి
స్తార [౭]మొనర్చి తీవె కద। దాశరథీ కరుణాపయోనిధీ. ౨౧

చ. పెటపెట నుక్కు[౮]గంబమున। భీకర[౯]దంతనఖాంకుర[౧౦]ప్రభా
పటలముఁ గప్ప నుప్పతిలి। భండనవీథి నృసింహ[౧౧]భీకర
స్ఫుటపటుశక్తి హేమకశిపున్ [౧౨]విదళించి సురారిపట్టి నం
తటఁ గృపఁ జూచి తీవె కద। దాశరథీ కరుణాపయోనిధీ. ౨౨

చ. పదయుగళంబు భూగగన।భాగము[౧౩]లన్ వెస నూని విక్ర[౧౪]మా
స్పద మగు నబ్బలీంద్రు నొక।పాదము[౧౫]నం దల క్రింద నొత్తి మే
లౌదవ జగత్త్రయంబుఁ బురు।హూతున[౧౬]కీను వటుండ వైన చి
త్సదమలమూర్తి వీవె కద। దాశరథీ కరుణాపయోనిధీ. ౨౩

చ. ఇరువదియొక్కమాఱు ధర।ణీశుల నెల్ల వధించి, [౧౭]తత్కళే
బరరుధిరప్రవాహమునఁ। బైతృకతర్పణ మొప్పఁ జేసి, భూ
సురవరకోటికిన్ ముదము। [౧౮]సొప్పడ భార్గవరామమూర్తివై
ధరణి నొసంగి తీవె కద। దాశరథీ కరుణాపయోనిధీ. ౨౪

---

(70) ౧. ఆ. అ. నాకత్రాఁడు. ౨. ఆ. నప్పుడా. ౩. అ. చరింపఁ గోరితిని. (చలించిలోకములు. ఆ.) (71) ౪. అ. నెత్తుకు. ౫. అ. డావారిధి. ౬. అ. రూపవై. ౭. ఆ. నం దొనర్చి. (72) ౮. అ. కంభమున. ౯. అ. ఆ. దంష్ట్ర. ౧౦. ఇ. చ్ఛటాపటలము గ్రక్కు నుప్పతిల. ౧౧. అ. ఆ. లీలవి. ౧౨ ఆ. వధియించి. (73) ౧౩. అ. నందున. ౧౪. అ. ఆ. మాస్పదుఁడగు. ౧౫. ఆ. చే నిలక్రింద (నొత్తినందలమీఁద నెత్తి. అ.) ౧౬. ఆ. కీవెవటుండవయ్యుఁ ద (కిచ్చివటుండవై భవ) అ. యొసంగితీవె. (74) ౧౭. అ. తత్కళేబరరుధిరప్రవాహమున పైతృకతర్పణ మొప్పఁ జేసితా...ధరణి ౧౮.ఆ.చొప్పడ.

చ. దురమున[1] దాటకం దునిమి । ధూర్జటివిల్ దునుమాడి సీతనుం
బరిణయ[2]మంది తండ్రి పనుపన్ ఘనకాననభూమి కేఁగి దు
స్తరపటుచండకాండకులిశాహతి రావణకుంభ[3]కర్ణ భూ
ధరములఁ గూల్చి తీవె కద । దాశరథీ కరుణాపయోనిధీ. ౭౫

చ. అనుపమయాదవాన్వయసుధాబ్ధిసుధానిధి కృష్ణమూర్తి నీ
కనుజుఁడు[4]గా జనించి [5]కుజనావళి నెల్ల నణంచి రోహిణీ
తనయుఁ డనంగ బాహుబలదర్పమునన్ బలరామమూర్తివై
తనరిన వేల్పు వీవె కద । దాశరథీ కరుణాపయోనిధీ ౭౬

చ. సురలు నుతింప[6]గాఁ ద్రిపురసుందరులన్ వరియింప బుద్ధరూ
పరయఁగఁ దాల్చి [7]తీవ్ర త్రిపురాసురకోటి [8][9]దహించునప్పు డా
హరునకుఁ దోడుగా [10]శరశరాసన బాణముఖోగ్రసాధనో
త్కర [11]మొనరించి తీవె కద । దాశరథీ కరుణాపయోనిధీ. ౭౭

ఉ. సంకర[12]వర్గమై దురితసంకుల మైన జగంబుఁ జూచి స
ర్వాంకషలీల నుత్తమతురంగము నెక్కి[13]కరాసిఁ బూని వీ
రాంకవిలాస మొప్పఁ గలికాకృతి సజ్జనకోటికిన్ [14]నిరా
తంక మొనర్తు వీవె కద । దాశరథీ కరుణాపయోనిధీ. ౭౮

## మో క్ష సా ధ న ము

చ. మానమున నూహాపోహములు । మర్వకమున్నె కఫాదిరోగముల్
దనువున నంటి [15]మేనిబిగి । దప్పకమున్నె [16]మనోంబు మోక్షసా
ధన మొనరింపఁగావలయుఁ । దత్త్వవిచారము మానియుండుటల్
తనువులకున్ విరోధ మగు । దాశరథీ కరుణాపయోనిధీ. ౭౯

---

(75) ౧. అ. మొండి. ౨. ఆ. అ. పనిఁ బంచిన తద్వన. 3. అ. కర్ణులంధరణిని. (76) ౪. ఆ. కర. ౫. అ. కుజనాధిప. (77) ౬. అ. తంత్ర. ౭. ఆ. అ. ళం గికురించి. ౮. అ. యందు (తీవె. ఆ.) ౯. అ. వధించి ౧౦. ఆ. అ. రథరథాంగ శరాసనబాణ. ౧౧. ఆ. మొనగూర్చి. (ముళొనర్చి. అ.) (78) ౧౨. ఆ. అ వర్ణమై. ౧3. అ. కరాలి. ౧౪. ఆ. నిరాతంక మొనర్చితీవె (నిరాటంక మొనర్చితీవె. అ.) (79) ౧౫. ఆ. మేనుబిగి. ౧౬. ఆ. వివేకహీనమై కనవినరాక తన్మయము గప్పక మున్నె నమండు ముక్తిసాధన మొనరింపఁగా వలదే.

చ. ముదమున కాటపట్టు భవ। మోహమదద్విరదాంకుశంబు సం
పదలకొటారు [1]కోరికుల। పంట పరంబున కాది [2]వైరుల
న్నదన జయించు త్రోవ విప। దబ్ధికి నావ గదా సదా భవ
త్పదమలనామసంస్మరణ । దాశరథీ కరుణాపయోనిధీ. ౮౦

చ. దురిత[3]లతానుసారిభవ। దుఃఖకదంబము రామనామభీ
కర[4]తర హేతిచేఁ దెగి వ। కావక లై చనకుండ [5]నేర్చునే
తరికొని మండు[6]చుండు శిఖ । దార్కొనినన్ శలభాదికీటకో
త్కరము విలీన మై చనదె । దాశరథీ కరుణాపయోనిధీ. ౮౧

చ. హరిపదభక్తి[7]నింద్రియజ। యాన్వితుఁ డుత్తముఁ డింద్రియంబుల
[8]న్మరుగక నిల్పనోపినను । మధ్యముఁ డింద్రియపారవశ్యుఁ డై
పరఁగినచో నికృష్టుఁ డని । పల్కఁగ దుర్మతి నైన నన్ను నా
దరమున నెట్లు కాచెదవొ । దాశరథీ కరుణాపయోనిధీ. ౮౨

చ. వనకరి చిక్కె మైనసకు । వాచవికిం జెడిపోయె మీను తా
[9]వినికికిఁ జిక్కెఁ జిల్వ కను। వేదుఱుఁ [10]జెందెను లేళ్లు తావిలో
మనికి నశించె నాకుఁ దర। మా యిరుమూఁటిని గెల్వ నైదుసా
ధనముల నీవె కావఁ [11]దగు । దాశరథీ కరుణాపయోనిధీ. ౮౩

చ. కరములు మీకు మ్రొక్కులిడఁ। గన్నులు మిమ్ము[12]నె చూడ జిహ్వ మీ
స్మరణఁ [13]దనర్ప వీనులు భ। వత్కథలన్ వినుచుండ నాస మీ
యఱుతను బెట్టు పూసరుల । కాసగొనం బరమార్థసాధనో
త్కర [14]మది చేయవే కృపను । దాశరథీ కరుణాపయోనిధీ. ౮౪

---

(80) ౧. ఆ. అ. కోరికల. ౨. అ. వైరులం గదన. (81) ౩. ఆ. అ. గతానుసార. ౪. ఆ. అ. కర. ౫. అ. చేర్చు. ౬. ఆ. చండ (చున్న. అ.) (82) ౭. ఆ. కింద్రియ. ౮. ఆ. మరుగక నిల్వ. (83) ౯. ఆ. వినక వెచిక్కె. ౧౦. ఆ. జెందె నుసిల్ల. ౧౧. ఆ. నగు. (84) ౧౨. ఆ. గనంగ. ౧౩. ఆ. దలిర్ప. ౧౪. ఆ. మతి.

చ. చిరతరభక్తి నొక్కతులసీదళ మర్పణసేయువాఁడు ఖే
చరగరుడోరగప్రముఖసంఘములో వెలుఁగున్ సదా భవ
త్స్ఫురదరవిందపాదములఁ బూజ లొనర్చినవారి కెల్లఁ ద
త్పర మఱచేతిధాత్రి గద దాశరథీ కరుణాపయోనిధీ. ౮౬

ఉ. భానుఁడు తూర్పునందుఁ గనుపట్టినఁ బావకచంద్రతేజముల్
హీనతఁ జెందినట్లు జగదేకవిరాజిత మైన నీసద
ధ్యానము సేయుచున్నఁ బరదైవ మరీచు లడంగకుండునే
దానవగర్వనిర్దళన దాశరథీ కరుణాపయోనిధీ. ౮౭

ఉ. నీమహనీయతత్వరసనిర్ణయబోధకథామృతాబ్ధిలోఁ
దాముఁ ను గ్రుంకులాడక వృథా తనుకష్టముఁ జెంది మానవుం
డీమహిలోకతీర్థముల నెల్ల మునింగిన దుర్వికారహృ
త్తామసపంకముల్ విడునె దాశరథీ కరుణాపయోనిధీ. ౮౮

ఉ. కాంచనవస్తుసంకలితకల్మష మగ్నిపుటంబు వెట్టి వా
రించినరీతి నాత్మ నిగిడించిన దుష్కరదుర్మలత్రయం
బంచితభక్తియోగదహనార్చిఁ దగుల్పక పాయునే కన
త్కాంచనకుండలాభరణ దాశరథీ కరుణాపయోనిధీ. ౮౯

ఉ. నీసతి పెక్కుకల్మి లిడ నేర్పరి లోక మకల్మషంబుగా
నీసుత సేయు పావనము నిర్మితకార్యధురీణదక్షుఁడై
నీసుతుఁ డిచ్చువాయువులు నిన్ను భజించినఁ గల్గ కుండునే
దాసుల కీప్సితార్థములు దాశరథీ కరుణాపయోనిధీ. ౯౦

(86) ౧. అ. విమము జెందిన కైవడి విలీనము గాక భవత్పదాంబుజ. ౨. అ. మీపద. 3. అ. సేయుచుండు ౪. మరిచ లెఱుంగ నేర్చునే. (87) ౫. ఆ. నియ్యా. ౬. ఆ. లీడక ౭. ఆ. లోనతీర్థముల నెంత. (88) ౮. అ. నాత్మనుగుటించిన. ౯. ఆ. పూర్ణభక్తి. (89) ౧౦. నీసతి కల్మి లియ్యఁగడు (నీసతి బెట్ట కట్టడని. అ.) ౧౧. ఆ. అ. నాయువు లు. ౧౨. అ. కిచ్చె.

ఉ. వారిజపత్ర[౧]మం దిడిన । వారివిధంబున వర్తనీయమం
దారయ రొంపిలోనఁ దను । వంటని కుమ్మరపుర్వురీతి సం
సారమునన్ మెలంగుచు వి । చారగుఁడై పరమొందుఁగాదె స
త్కార మెఱింగి మానవుఁడు । దాశరథీ కరుణాపయోనిధీ. ౯౦

## వైరాగ్యమార్గము

ఉ. ఎక్కడి తల్లిదండ్రిసుతు । లెక్కడివారు [౨]కళత్రబాంధవం
బెక్కడి జీవుఁ డెట్టి తను । [౩]వెత్తును బుట్టును బోవు నున్న [౪]వాఁ
డొక్కఁడె పాపపుణ్యఫల । మొందిన నొక్కఁడె, కానరాఁడు వే
ఱొక్కఁడు వెంటనంటి, భవ । [౫]మొల్లనయా కృపఁజూడవయ్య నీ
తక్కరి[౬]మాయలం దిడక । దాశరథీ కరుణాపయోనిధీ. ౯౧

చ. దొరసినకాయముల్ ముదిమి । [౭]తోఁచినఁజూచి, ప్రభుత్వము ల్సిరుల్
మెఱుపులుగాఁగఁ జూచి, మఱి । మేదినిలోఁ దమ[౮]తోడివారు ముం
దరుగుటఁ జూచిచూచి, తెగు । నాయువెఱుంగక మోహపాశము
ల్దఱుఁగనివారి [౯]కేమిగతి । దాశరథీ కరుణాపయోనిధీ. ౯౨

చ. సిరిగలనాఁడు మైమఱచి । చిక్కిననాఁడు తలంచి పుణ్యముల్
పొరిఁబొరిఁ జేయనైతి నని । పొక్కినఁ గల్గునె? గాలి చిచ్చుపైఁ
గెరలిన వేళఁ దప్పిగొని । [౧౦]కీడ్పడు వేళ జలంబుఁ గోరి త
త్తరమునఁ ద్రవ్వినం [౧౧]గలదె । దాశరథీ కరుణాపయోనిధీ. ౯౩

ఉ. జీవన[౧౨]మింకఁ బంకమునఁ । జిక్కి నమీను [౧౩]చలింప కెంతయుం
దావున నిల్చి జీవనమె । తద్దయుఁ గోరువిధంబు చొప్పడం
దావలమైనఁ [౧౪]గాని గుఱి । దప్పనివాఁడు తరించువాఁడయా
తావక[౧౫]భక్తియోగమున । దాశరథీ కరుణాపయోనిధీ. ౯౪

(90) ౧. ఆ. ముం దిడిన. (91) ౨. అ. కళా ప్రబంధము. 3. వెత్తుచు బోవుచు నున్న (వెత్తగ చచ్చుచు బోవుచున్న. ఆ. ౪. ఆ. తానొక్కఁడె పుణ్యపాపఫల కానరాడులే. (మొందును నీకృపజూడవయ్య) అ. ౫. ఆ. మొల్లమయ. ౬. అ. మాయలోనిడక. (92) ౭. ఆ. తోఁటి. ౮. తారు. ౯. కేదిగతి (93) ౧౦. ఆ. క్రుస్సినవేళ. ౧౧. ఆ. గలవె. (94) ౧౨. ఆ. అ. మింకి. ౧౩. ఆ. మేనుపయోధరాంబుధారావహమైనదిం జెలగునట్లు భవంబున గ్రుంగి పాపముల్. ౧౪. ఆ. చో దురితతాపపయోధి దరించు (మర్త్య దురుతాపమోది జరించు దరించు అ. ౧౫. అ. ఆ. దాస్యపోతమున)

చ. సరసునిమానసంబు ¹సుర । సజ్జు డెలుంగుసు ముష్కరాధముం
డెఱిఁగి గ్రహించువాఁడె కొల । నే స్వనివాసము గాఁగ దర్దురం
బరయఁగ నేర్చు ²నెట్లు విక । చాబ్జమరందరసైకసౌరభో
త్కరము మిళింద మొందు క్రియ । దాశరథీ కరుణాపయోనిధీ. ౯౫

ఉ. నోఁచినతల్లిదండ్రికిఁ ద । నూభవుఁ డొక్కఁడె చాలు ³మేటి చే
చాఁచనివాఁడు వేఁడొకఁడు । ⁴చాఁచిన లే దన కిచ్చువాఁడు నో
రాఁచి ⁵నిజంబుకానిపలు । కాడనివాఁడు రణంబులోన ⁶మేన్
దాఁచనివాఁడు భద్రగిరి । దాశరథీ కరుణాపయోనిధీ. ౯౬

ఉ. శ్రీయుత జానకీరమణ । చిన్మయరూప ⁷రమేశ రామ నా
రాయణ ⁸పాహి పాహి యని । ప్రస్తుతిఁ జేసితి నామనంబు ⁹నం
బాయక కిల్బిష ¹⁰వ్రజ వి । పాటన మందఁగఁ జేసి సత్కళా
¹¹దాయి ఫలంబు నా కియవె । దాశరథీ కరుణాపయోనిధీ. ౯౭

ఉ. ఎంతటిపుణ్యమో శబరి । యెంగిలిఁ ¹²గొంటివి వింత గాదె నీ
మంతన మెట్టిదో యుడుత । ¹³మైని కరాగ్రనఖాంకురంబు ¹⁴లన్
సంతస ¹⁵మందఁ జేసితివి । సత్కులజన్మము లేమి లెక్క ¹⁶వే
దాంతము గాదె నీమహిమ । దాశరథీ కరుణాపయోనిధీ. ౯౮

ఉ. బొంకనివాఁడె యోగ్యుఁ డరి । బృందము లెత్తినచోటఁ జివ్వకున్
జంకనివాఁడె జోదు రభ । సంబున నర్థి కరంబు సాఁచినం
గొంకనివాఁడె దాత ¹⁷మిముఁ । గొల్చి భజించినవాఁడె పో నిగా
తంకమనస్కుఁ డెన్నఁగను । దాశరథీ కరుణాపయోనిధీ. ౯౯

---

(95) ౧. ఆ. సరసజ్ఞుఁ డెలుంగక. ౨. ఆ. కెట్లు వికచాంబుజగంధ. (96) 3. ఆ. నెందు చెయ్. ౪. ఆ. సాచిన (చాచితె. అ. ౫. ఆ. అ. నిజంబె. ౬. ఆ. మెయి మై. అ.) (97) ౭. ఆ. పరేశ. ౮. అ. (కావుకావుమని. ౯. అ. లో. ౧౦. అ. వ్రజ ము పాటము నందగజేసి సత్కృపా) వ్రజము బావన మొందగ సత్కృపా. ఆ. ౧౧. ఆ. అ. దాయఫలంబు నాకిడవె (98) ౧౨. ఆ. దింటివి వెన్నవంటి (గొంటివి వెన్నవంటి. అ. ౧3. ఆ. మైన) సేని. ఆ. ౧౪. ఆ. నం. ౧౫. ఆ. మొంద. ౧౬. ఆ. నీదాంతదయార సంబె గుటి (నీదాంతదయారసంబుగను) అ. (99) ౧౭. ఆ. వీరు దనిశంబును. ౧౮. ఆ. నిను.

## భక్తిఫలము

చ. భ్రమరము కీటకంబుఁ గొని । పాల్పడుఝుంకరణోపకారియై
భ్రమరముగా ¹నొనర్చునని । పల్కుటఁ జేసి భవాదిదుఃఖసం
²తమస మెడల్చి భక్తిసహి।తంబుగ జీవుని విశ్వరూపత
త్త్వమున ³ధరించు టేమఱుదు । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౦౦

చ. తరువులు పూచి కాయ లగుఁ । దత్కుసుమంబులు పూజగా భవ
చ్చరణము సోఁకి దాసులకు । ⁴సారము లౌ ధనధాన్యరాసు లై
కరిభటఘోటకాంబరని।కాయము లై విరజానదీసము
త్తరణ మొనర్చుఁ జిత్ర మిది । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౦౧

## కులగోత్ర మతాదులు

ఉ. పట్టితి భట్టరార్యగురు।పాదము ⁵లిమ్మెయి నూర్ధ్వపుండ్ర ⁶ముం
బెట్టితి మంత్రరాజ ⁷మొడిఁ । బెట్టితి నయ్యమకింకరాళికిం
గట్టితి బొమ్మ మీచరణ।కంజములందుఁ దలంపు వెట్టి పోఁ
దట్టితిఁ బాపపుంజముల । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౦౨

ఉ. అల్లనలింగమంత్రిసుతుఁ । ⁸డత్రిజగోత్రజుఁ డాది⁹శాఖ కం
చెర్లకులోద్భవుం డనఁ బ్ర।సిద్ధుఁడ నై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచి।యించితి గోపకవీంద్రుఁడన్ జగ
ద్వల్లభ నీకు దాసుఁడను । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౦౩

ఉ. *ఖేలన భక్తలోల మణి।కీలిత కాంచనకుండలప్రభా
జాల యశోవిశాల ధృత।సారభసాంద్ర పటీరచారు¹⁰జం
భాల విశిష్టధర్మపరి।¹¹పాలనశీల వినీలనిర్జితో
త్తాలతమాల భద్రగిరి । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౦౪

---

(100) ౧. దనర్చుట. ౨. ఆ. తమ మెడలించి భక్తిసహితం బగుజీవుని నీస్వరూప (......జనితంబుగ, అ.) 3. అ. భజించు టేమఱుమ. (101) ౪ ఆ. సారములై. (102) ౫. అ. లన్నియు. ౬. అ. ఆ. ముల్. ౭. అ. ముడి. (103) ౮. ఆ డాత్రేయ. ౯. ఆ. శాఖ కంచెర్ల. (104) ౧౦. అ. జంపాల. ౧౧. అ. పాల వినీలశరీరనిర్జితాత్పాల.

ఉ. లాలితగానలోల పద । లాలితకావ్యరసానుకూల ప్ర
క్షాళితభూజనోత్కలుష । [1]కర్దమజాల విపక్షమూలకు
ద్దాల దయాలవాల [2]భయ । తాపనివారకశీల సజ్జనో
త్పాలనశీల భద్రగిరి । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౦౫

ఉ. భూపకులప్రదీప మహి । భూషణ కాంతికలాప భండనో
ద్దీపితదివ్యచాప జగ । దీడ్యదురాప మహాప్రతాప సం
తాపితవైరిభూప విగ । తప్రకటాఖిలపాప [3]పుణ్యసం
స్థాపనరూప భద్రగిరి । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౦౬

ఉ. పాండువిలాసహాస పరి । పాలితపద్మభవాండజాండపిం
డాండసమూహ వాహచర । ణాంచితరాజకిరీటకోటిదో
ర్దండకఠోరవీర నిజ [4]దాసజనావనకార్యధుర్య మా
ర్తాండ[5]కులీన మానఘన । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౦౭

ఉ. రాముఁడు మాకు [6]వేల్పు రఘు । రామునిభక్తి [7]మనోరథంబు శ్రీ
రాముని సుప్రసాదము ని । రంతరభాగ్య మటంచు [8]నీఘన
శ్యామలకోమలారుణప । దాంబుజముల్ నెఱనమ్మినాఁడ ను
ద్భ్రమభవాదిరోగముల । భీతి [9]హరింపఁగదయ్య బ్రహ్మరు
ద్రామరపూజితాంఘ్రి [10]యుగ । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౦౮

చ. కలిగి భుజింపలేక పడ । గట్టిననోరు బహుప్రయాసమై
యలరిన విద్యచొప్పు సభ । నాడనినోరు పరోపకారముల్
పలుకనినోరు మి మ్మెపుడుఁ । బ్రస్తుతిసేయనినోరు రెంటికిం
దలఁగిన పాడుబొంద గద । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౦౯

(105) ౧. అ. కర్దల. మ. ౨. అ. భవ. (106) 3. ఆ. ధర్మ. (107) ౪. అ. వాస. ౫. అ. కులేశ. (108) ౬. ఆ. వెజ్జు. ౭. అ. మహాహవధంబు. ౮. అ. మీ. ౯. అ. హరింపుమయ్య. ౧౦. అ. యమ.

చ. జననివయోవిలాసముల । సౌష్ఠవ మెల్ల నశింపఁబుట్టున
త్తనయులఁ జెప్పనేల తత్స । దాయల నర్థులఁ దల్లిదండ్రులం
గనికర మొప్పఁ జూచి ఘన । కార్యధురంధరు డైనవాఁడె పో
తనయుఁడు వంశవర్ధనుఁడు । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౧౦

చ. నెనరునఁ బల్కు నాకవిత । నేరుపు చాలని చాలకుండనీ
ఘనుఁ డని మెచ్చనీ పరులు । గా దననీ భవమోహపాశముల్
పెనఁగొననీ మహాత్మ మిముఁ । బేర్కొని ప్రస్తుతిసేయుచున్న నా
తనరినభూషణంబు లివి । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౧౧

ఉ. తారకమైన మీ యడుగు । దమ్ములు నెమ్మది నమ్మి సంపదన్
గోరనివారు లేమియెడఁ । గుందనివారు భవాంబురాశిలో
దూరనివారు కర్మగతిఁ । దూలనివారు పరంబు మెట్టుగా
తారు మెలంగువారు గద । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౧౨

ఉ. *మోదితవేదనాథ ముని । పూజితపాద దిగంతకీర్తిసం
పాదితసుప్రసాద పరి । పంథివిభేద విషాదవల్లికా
చ్ఛేద ధరాధినాథ కుల । సింధుసుధామయపాద నృత్యగీ
తాదివినోద భద్రగిరి । దాశరథీ కరుణాపయోనిధీ. ౧౧౩

---

(110) ౧. అ. తగుదాత గురుండు సఖుండు వివేకాభారము నంతటొప్పె పరిభావములెల్ల మనోవికార దుర్భాయతు చేయుచున్నవి. కృపామతి వాటిని కావుమీ జగత్పావనమూర్తి భద్రగిరి (ఛందోనియమములు తప్పినవి) పాదములు వేఱొకపద్యము నుండి గ్రహింపఁబడినవి. * వైపద్యములు (౧౪-౯-౬౫) ఆ ప్రతిలో దొరకినవి
* (౧౧-౧-౯) అ. ప్రతిలో దొరకినవి.

ఉ. భూరిసుధాబ్ధిరాట్తనయ భూసుతగా నిజసేవకుల్ మహా
చారజనాలి గాఁగ విరజానది గౌతమిగా వికుంఠమున్
నారయ భద్రశైలశిఖరాగ్రముగా నెలకొన్న చేతనో
ద్ధారకమైన విష్ణుఁడవు దాశరథీ కరుణాపయోనిధీ. ౧౧౪

## దా శ ర థి శ త క ము

సంపూర్ణము.

---

పాఠభేదములు:—ఈ శతకము నచ్చుకూర్చుటకు ముందు మద్రాసు దొరతనమువారి ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమునందలి 14-1-65, 13-1-18, 11-1-9 నంబరుల తాళపత్ర గ్రంథములతో పాఠభేదములు సరిచూచితిమి. తాళపత్ర గ్రంథము లొసంగినందులకు మద్రాసు దొరతనమువారికి కృతజ్ఞులము. ఇందు 14-1-65 నంబరు గల ప్రతికి ఆ. ప్రతియనియు, 13-1-18 నంబరు ప్రతికి అ. ప్రతియనియు, 13-1-9 ప్రతికి ఇ. ప్రతియనియు గుర్తులుంచితిమి. ఆ. ప్రతిలో రెండుపద్యములును, అ. ప్రతిలో కొన్ని పద్యములును ఇదివఱకు ప్రచురింపనివి దొరకినవని చదువరులకు విన్నవించుచున్నాము.

# పీఠిక

శ్రీరంగశాయిశతకము శ్రీవైష్ణవభక్తి భరితములైన శతకములందు విశేషప్రచారముగల శతకము. శతకకర్తయొక్క కులగోత్ర నామములనుగాని కాలమునుగాని నిర్ణయించుట కేవిధమైన యాధారములును శతకమునందు గనుపడవు. శతకమునందు స్థానేశ్వరస్తుతిగాని కవిస్తుతిగాని కవిచేసియుండలేదు. కాని శతకమునకుగల ప్రచారమును, నితరాధారములును శతకము 1600-1700 కాలమునకు జెందినటులు ద్యోతకము చేయుచున్నవి. శ్రీమద్భాగవత శ్రీకృష్ణకర్ణామృత నారాయణశతకాదులందలి పద్యభావముల పోకడ లిందుంటంజేసి వాని తరువాతిదని నిర్ణయమగుచున్నది. శ్రీవైష్ణవము వీరవైష్ణవముగను మారినకాలమునకు శతకకర్త చెందియున్నటు లీక్రిందిపద్యము తెలుపుచున్నది.

చ. తిరముగ శంఖచక్రములు♦దిర్మణియున్ దిరుచూర్ణమున్ హరి
స్మరణము పుణ్యభాగవత♦మానితభక్తియు నిత్యకృత్యమై
పరగఁగఁ బూర్ణగోష్ఠియును♦బాగుగఁ గల్గఁగఁజేయు నా జగ
ద్భరితుఁడు రంగశాయి మన♦పాలఁగలండు విచారమేటికిన్.      ౯3

కవి పుణ్యనదులను పేర్కొనునపుడు మలాపహారిణిని పేర్కొనుట వలన నాప్రాంత నివాసి యని యూహింపదగియున్నది. మలాపహారిణి యని గుడివాడతాలూకాయం దొకకాలువ గలదు. శతకకర్తయొక్క యూరు పేరు కాలము తెలియకపోయినను శతకమున కాంధ్రవాఙ్మయమునందు స్థిరప్రతిష్ఠ గలవిధమును శతక ప్రచారము విశదము చేయుచున్నది.

శైలి:—రంగశాయిశతక శైలి సంస్కృతాంధ్రపదమిశ్రమమై ధారాళమై పండితపామరజనులకు పఠనార్హమై యున్నది. కొన్ని పద్యములు ఆంధ్రపదమయము లైనవియును కొన్ని సంస్కృతపదమయము లైనవియు నున్నను నుభయభాషా పదసంయోగమును సామాన్యముగ శతకమునందు గనబడుచున్నది.

చ. కలువలసేలు డాలు తెఱ♦గంటిదొరన్ భరియించుమేలు దా
సుల వెఱఁబాపుకేలు బలు♦సోముఁశుమూఁకలఁ దోలువాలు పొం
దళుకులసాలు చొక్కపుపె♦దం బెడవాయని యాలు గల్గు స
త్ఫలదుఁడు రంగశాయి మన♦పాలఁగలండు విచారమేటికిన్. ౬౮

శతకమునందు శబ్దాలంకారములును అంత్యప్రాసలును ముక్తపదగ్రస్తరచనలును సామాన్యముగ గనుపడుచున్నను శైలి ధారాళముగ నున్నది. శ్లేషపదప్రయోగమునందు కవికిగల యభిరుచిని శతకములోని పద్యములు దెలుపుచున్నది.

ఉ. ఆకినల్లుఁడై పిదప♦నల్లునికిం దగఁ దానె యల్లుఁడై
యాలికిఁ దండ్రియై♦మనుమరాలికిఁ బెండ్లికుమారుఁడై సదా
యాలిమఱంది చెల్లెలికి♦నై పతి లోకముఁబ్రోచునట్టి గో
పాలుఁడు రంగశాయి మన♦పాలఁగలండు విచారమేటికిన్. ౧౦౧

చ. నరనరభీమభీమహరి♦నందన నందన రాజరాజరాట్
శరశరజన్మజన్మ ఘన♦సామజ సామజ గర్భగర్భ హా
సరస సరస్సరోజ ఘన♦సారస సార సుకీర్తిమండలా
భరణుఁడు రంగశాయి మన♦పాలగలండు విచారమేటికిన్. ౯౧

ఉ. నల్లనిమేనిచాయయును♦నల్లనికంఠము గల్గు నల్లుఁడున్
నల్లనికల్వరేకులను నవ్వు♦కనుంగవఁజూచు భార్యయున్
నల్లని చేలదేవరఘు♦నంబుగఁ దోడయియున్న దైత్యహృ
ద్భల్లుఁడు రంగశాయి మన♦పాలఁగలండు విచారమేటికిన్. ౫౮

చ. హరినివహంబుభాతి ◆ విశదాండజమండలి లీల దేవతా
కరిగతి నుగ్రశైలములఁ◆కైవడి పన్నగరాజుచంద ము
ద్ధరతర తారకాపతి వి◆సంబునఁ గీర్తిఁ జెలంగు సర్వభూ
భరణుఁడు రంగశాయి మన◆పాలఁగలండు విచారమేటికిన్. ౯౯

కవి చేసినవర్ణనలనే తిరిగితిరిగి చేసినవిధమును రామావతార వర్ణనలు విశదము చేయుచున్నవి.

ఉ. హాళిని దాటకం దునిమి◆యాగము గాచి యహల్యఁ బ్రోచి సీ
తాలలన న్వరించి రణ◆దర్పిత రావణ కుంభకర్ణ పై
త్యాలిని ద్రుంచి రాజ్యము◆నయంబుగ నేలిన రామచంద్ర భూ
పాలుఁడు రంగశాయి మన◆పాలఁగలండు విచారమేటికిన్. ౧౦౦

పైపద్యములోని భావములనె ౬౮, ౮౭ పద్యములు తిరిగి వర్ణించుచున్నవి. శైలికొంతవరకు శబ్దాలంకారభూయిష్ఠమై క్లిష్టముగనున్నను రసవంతమై ధారాళమై సరళముగనున్నది. మకుటమునందు యతిస్థానమున పా వర్ణముండుటవలన, నాల్గవపాదారంభమునం దాపవర్ణ సవర్ణమయిన హల్లును నంతస్థమైన స్వరమును జేర్చుటయందుగల క్లేశమును పద్యపాదములు విశదము చేయుచున్నవి.

## భావార్థము

రంగశాయి శతకమునకు మకుటము:—

"......రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికిన్"

శ్రీరంగక్షేత్రాధీశుడు శ్రీరంగనాయకుడు భక్తరక్షణభారమును వహించుచుండగను భయములేదని మకుటమునందు కవి తనకును భక్తులకును నభయమును చాటుచున్నాడు.

శ్రీరామానుజాచార్యులవారి నివాసమును వారిశిష్యుల నివాసమును శ్రీరంగక్షేత్రమునకు దక్షిణదేశమునందలి క్షేత్రములందు

ప్రఖ్యాతిని గలుగజేసినవి. శైవులైన చోళరాజులు వైష్ణవమతమును స్వీకరించి శ్రీరంగాదిక్షేత్రములను మహావైభవసమన్వితముచేసి వైష్ణవ భక్తుల నాకర్షించిన విధమును దివ్యమైన దేవాలయప్రాకారములును నిత్యకైంకర్యములును కల్యాణమహోత్సవములును నేటికిని విశదము చేయుచున్నవి. శ్రీమద్రామానుజకృతమైన శ్రీరంగాష్టకము శ్రీ రంగమాహాత్మ్యమును దెలుపుచున్నది:

శ్లో. సప్తప్రాకారమధ్యే సరసిజముకుళోద్భాసమానే విమానే,
కావేరీమధ్యదేశే ఫణిపతిశయనే శేషపర్యంకభాగే;
నిద్రాముద్రాభిరామం కటినికటశిరఃపార్శ్వవిన్యస్తహస్తం,
పద్మాధాత్రీకరాభ్యాం పరిచితచరణం రంగనాథం భజేఽహమ్.

వటపత్రశాయియై యవ్యక్తముగనున్న నారాయణుడు శ్రీరంగ శాయియై వ్యక్తమై భక్తుల మనోభీష్టములను సఫలము చేయుచున్నాడు. శ్రీరంగేశుడు పూలరంగడును కస్తూరిరంగడునునై భక్తులను రక్షించినవిధమును శ్రీరంగక్షేత్రమాహాత్మ్యము విశదముచేయుచున్నది. శ్రీరంగక్షేత్రము కావేరి కొలరూనుల నడుమను వెలయుచున్న సుక్షేత్రము. శ్రీ వైకుంఠఏకాదశికి నానాప్రాంతముల నుండియును లక్షలకొలది యాత్రికులు శ్రీరంగేశుని సేవించుట కేతెంచి స్వామిని సందర్శించి కైంకర్యమును జేయుచుందురు. శ్రీరంగనాయకులు భక్తుల యభీష్టముల నొసంగెడి విధమును కవి యిందు వర్ణించెను.

ఉ. రంగనికేతనాంతర ని◆రంతరశేష సుఖోపవిష్టుఁడై
యంగనతో సిరంగపుర◆మం దొగినిల్వఁగఁ గోరి స్వర్ణ ర
త్నాంగద ముఖ్యభూషణము ◆ లార్యులకున్ గృపసేయు భృత్య భీ
భంగుఁడు రంగశాయి మన◆పాలఁగిలందు విచారమేటికిన్. ౫౩

ఉ. అంగభవాదిదేవతల◆కన్నను జక్కనివాఁడు సర్వదా
ముంగిటి పెన్నిధానము న◆మోయని మ్రొక్కెడువారిఁ గాచు శ్రీ

రంగపురీశ్వరుండు రవి॰రాజవిలోచనుఁ డుల్ల సత్కృపా
పాంగుడు రంగశాయి మన॰పాలఁగలండు విచారమేటికిన్. ౭

శ్రీరంగేశుడు నిజభక్తులను బ్రోచిన పురాణగాథ లనేకములు గలవు. ఆగాథలం దొకటి ౧౬-వ పద్యమునందు వర్ణింపబడినది.

చ. వలపులఁజిక్కి లోనయిన॰వాఁ డొక వారవధూటి కోరఁ గో
నెలఁ గల పైఁడిగిన్నెఁ గొని॰వేడుక నిచ్చిన వారి నిద్దఱన్
దలవరు లాఁగిపట్టుకొన॰ధర్మసభన్ దగ నేగి సాక్షిగాఁ
బలికిన రంగశాయి మన॰పాలఁ గలండు విచారమేటికిన్. ౧౬

శ్రీ మహావిష్ణువు భిన్నావతారములందు భక్తులను సంరక్షించిన విధమునను శ్రీరంగస్వామియును తనను రక్షించుటకు దనపాల గలడని కవి భక్తిభరితమైన చిత్తప్రవృత్తితో శతకమును రచియించిన విధమును పద్యములు పరిస్ఫుటము చేయుచున్నవి. శతకమునందు దశావతారాదివర్ణనలు నారాయణశతకమునందువలె నున్నను నారాయణ శతకమునందువలె విభాగములు విస్పష్టముగను గనుపడవు. శ్రీ రంగశాయి శతకమునందు సర్వేశ్వరాదిశతకములందువలె తత్త్వ విచారముగాని నీతిధర్మనిర్ణయములుగాని కనుపడవు. శతకమునందు జ్ఞానమార్గముకంటెను భక్తిమార్గమునకు ప్రముఖతగలదు. ఈమార్గావలంబనము విశిష్టాద్వైతసిద్ధాంతమున కనురూపముగ నున్నది.

శతకకర్త శ్రీరామానుజాచార్యులు ప్రతిపాదించిన విశిష్టాద్వైతసిద్ధాంతమునే శతకమునందు సువ్యక్తము చేసెను. భాగవతోత్తములు భగవత్ప్రసాదముననె తరింపగలరను సిద్ధాంతమును పురాణేతిహాసములందలి సుప్రసిద్ధగాథల సాధనమునను కవిహృదయరంజకముగను వర్ణించి భక్తిశతకములందు శ్రీరంగశాయిశతకమునకు స్థిర ప్రతిష్ఠను గల్పించిన విధమును శతకప్రచారము చాటుచున్నది. కవి

శ్రీమన్నారాయణుని భక్తిపూర్వకముగను భజించి ధన్యులైన విధమునను శ్రీరంగేశుడు పాఠకులను ధన్యులను జేయుటకు దోడ్పడుగాత!

చ. తనువు చరంబు పుత్ర వసు◆దార ధనాదుల నమ్మరాదు సె
   మ్మనమున నంతకుండు ◆ దయమాలినవాఁ డిదె మేలెఱింగి భూ
   జనవరులార మీహృదయ◆సారసమధ్యమునందు నిల్పుఁడీ
   పనివడి రంగశాయి మన◆పాలఁగలండు విచారమేటికిన్. ౧౪

చ. క్షితిని ననేకమార్గములఁ◆జెందక మర్త్యుఁ డెఱింగి నీవె నా
   గతియని పాదపంకజయు◆గంబును జిత్తములోన నిల్పి సం
   తతమును నాశ్రయింప నతి◆ధన్యునిగా నొనరించు నా రమా
   పతియగు రంగశాయి మన◆పాలఁగలండు విచారమేటికిన్. ౧౫

క్రోధన ఆషాఢ బ. ౨
బుధవారము, మదరాసు.

కాశీనాథుని నాగేశ్వరరావు

శ్రీ ర స్తు

—

# రంగశాయిశతకము

శ్రీ మహిళావరుండు సరసీరుహసంభవ ముఖ్యదేవతా
స్తోమనుతప్రభావుఁడు విశుద్ధయశుండు కృపాకటాక్ష వీ
క్షామృత భక్తరక్షణుఁడు హారవిభూషణ భూషితాంగ శో
భామణి రంగశాయి మనఁబాలఁగలండు విచార[1]మేటికిన్. ౧

ఉ. శ్రీలలనాకుచస్థల పరిస్ఫుట కుంకుమగంధసార జం
బాల విశాలవక్షుఁడు కృపాలలితాక్షుఁడు భక్తవత్సలుం
డోలి సమస్తభాగ్య మహిమోన్నతుఁ డంచితపుణ్యమూర్తి గో
పాలుఁడు రంగశాయి మనఁబాలఁగలండు విచారమేటికిన్. ౨

ఉ. శ్రీయువతీ కళత్రుఁడు నృసింహ కిశోరకమూర్తి యాది నా
రాయణుఁ డాదిపూరుషుఁ డనంతుఁ డనంత కళావతంసుఁ డా
త్రేయుఁ డజేయుఁ డాశ్రితవిధేయుఁడు భక్తజనాంగణాంబులం
బాయని రంగశాయి మనఁబాలఁగలండు విచారమేటికిన్. 3

ఉ. శ్రీమహిళామణీ విమల చిత్తచకోరకసోముఁ డంబుద
శ్యాముఁడు మోక్షధాముఁ డురుసంగర భీముఁడు కుంజరావనో
ద్దాముఁడు కోటిసూర్య నిభధాముఁడు భక్త హృదంతరస్ఫుర
ద్భామణి రంగశాయి మనఁబాలఁగలండు విచారమేటికిన్. ౪

---

౧. మేటికే.

ఉ. శ్రీరమణుండు దేవకుల। శేఖరుఁ డాశ్రిత పారిజాత మం
భోరుహ పత్రనేత్రుఁడు వి।భుండు సమస్తజగత్కుటుంబి వం
దారునిలింపధేనువు స।నాతనుఁ డాదిమమూర్తి లోకసం
భారుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౫

ఉ. ముంగిటివేల్పు లోకములఁ। బ్రోచినప్రోడ ఘృణాంతరంగుఁడున్
రంగదభంగ సాగరత।రంగములం బవళించురాజు కా
ళింగమదాపహారి కడ।లిం జనియించిన సాధ్వినాథుఁ డా
బంగరు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౬

ఉ. అంగభవాదిదేవతల। కన్నను జక్కనివాఁడు సర్వదా
ముంగిటి పెన్నిధానము న।మోయని మ్రొక్కెడువారిఁ గాచు శ్రీ
రంగపురీశ్వరుండు రవి।రాజ విలోచనుఁ డుల్ల సత్కృపా
పాంగుడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౭

చ. యతుల తపఃఫలంబు విబు।ధావళికెల్లను రక్ష గోపికా
సతులకు నోముపంట భవ।సాగరపోతము దివ్యవిగ్రహుం
డతుల మహానుభావుఁడు స।హస్రఫణాహిపశాయి భూరమా
పతియగు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౮

చ. కలువలరాజు తమ్ముల వి।కాసముచేసిన వేల్పు కన్నులుం
జెలువ వజీరుపానుపు వి।చిత్ర సువర్ణదుకూలము న్మహో
జ్జ్వలతర కుండలంబులును। బాగుగ దాల్చినదేవుఁ డుజ్జ్వల
ద్బలుఁడగు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౯

ఉ. కొంగుననున్న మానికము। కోరికలిచ్చు సురద్రుమంబు సా
రంగనుతాంఘ్రిపంకజుఁడు। రాజస తామస సాత్త్వికాది మూ
ర్త్యంగములన్ ధరించి జగ।మంతయుఁ బ్రోచుఘనుండు సత్కృపా
పాంగుడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౧౦

ఉ. క్రొన్నెలవంక నామమును । గొప్పగు కౌస్తుభ దివ్యరత్నముల్
వెన్నెలగాయు నెమ్మొగము । విప్పగు కన్నుల మందహాసమున్
జెన్నగుచుండు మౌని సుర। సేవ్యపదాబ్జుఁడు భోగభాగ్య సం
పన్నుఁడు రంగశాయి మన। పాలఁగలండు విచారమేటికిన్. ౧౧

ఉ. దానవనాథసంతతి సు। దర్శనధారను నుగ్గునుగ్గుగాఁ
బూనికఁ జేసినట్టి సుర। పుంగవుఁ డింద్రవనంబులోని సం
తానముసంక్రితోఁటగను । నాఁటినధీరుఁడు మానిహృత్తమో
భానుడు రంగశాయి మన। పాలఁగలండు విచారమేటికిన్. ౧౨

చ. గరుడుఁడు వాహనంబు శితి। కంఠుఁడు నెచ్చెలికాఁడు భూ రమా
సరసిజలోచనల్ సతులు । సారసగర్భుఁడు మన్మథుండు సు
స్థిరతనయుల్ చెలంగ నత। సీకుసుమాభశరీరశోభతోఁ
బరగెడు రంగశాయి మన। పాలఁగలండు విచారమేటికిన్. ౧౩

ఉ. మౌళిమయూరపింఛమును । మన్మథకోటి విలాసరూపమున్
బాలరసాలపల్లవము । భాతిఁ జెలంగెడి మోవి వేణువున్
దాల తమాల కాననవి। తానవిహారము గల్గియున్న గో
పాలుఁడు రంగశాయి మన। పాలఁగలండు విచారమేటికిన్. ౧౪

చ. క్షితిని ననేకమార్గములఁ । జెందక మర్త్యుఁ డెఱింగి నీవె నా
గతియని పాదపంకజయు। గంబును జిత్తములోన నిల్పి సం
తతమును నాశ్రయింప నతి । ధన్యునిగా నొనరించు నా రమా
పతియగు రంగశాయి । మనపాలఁగలండు విచారమేటికిన్. ౧౫

ఉ. భీతయు వీతవస్త్రయును । భిన్నవచస్విని యైన ద్రౌపదిన్
జేతులుమోడ్చి మ్రొక్కఁగను । శీఘ్రము మానధనంబు నిల్పుచున్
భ్రాతయుఁ దల్లిదండ్రియును । దైవము తానయి యెట్టుగాచె నా
భాతిగ రంగశాయి మన। పాలఁగలండు విచారమేటికిన్. ౧౬

ఉ. వేలుపుఱేఁడువచ్చి వన।వీథులదూడలఁ బిన్నపాపలం
మేలుగ నున్నఁజూచి బలి।మిన్ హరియించిన గాంచి దూడలుం
బాలుఁడునై నటించిన కృ।పాళుఁడు వల్లవ తల్లజుండు గో
పాలుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౧౭

ఉ. ఆలమునందు నిల్చి నర।కాసురు రూపఱఁజేసి గోపికా
స్త్రీలఁ బదారువేలను వ।రించి మహోన్నతిఁగాంచి యార్జిత
శ్రీలను భాగ్యసంపదఁ గు।చేలునకుం గృపసేసినట్టి గో
పాలుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౧౮

ఉ. నీలపయోదసన్నిభ వి।నిర్మలమూర్తిని దాల్చి దైత్యులం
దోలి యణంచి సాధుల మ।నోరథముల్ తనివార నిచ్చి హే
రాళపుఁగీర్తి దిక్కులఁ । దిరంబుగ నిల్పిన రామనామ భూ
పాలుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౧౯

ఉ. గంగఁ బదంబునం గూఁ బొస।గం గనినట్టి మహానుభావుఁ డ
య్యంగజు నెగ్గు లెన్నఁదగు। నంచితరూపమువాఁడు లోనఁ జే
గంగనుపట్టువాఁడు పరఁ।గన్ విలసిల్లుఘనుండు సత్కృపా
పాంగుడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౦

చ. ఇరవుగ మత్స్య కచ్ఛప కిటీంద్ర నృసింహ వటు త్రిరామ భా
సుర వర బుద్ధ కల్కి ఘన। శోభనరూపములందు నిల్చి సు
స్థిరముగ భక్తకోటుల న।శేషముఁ బ్రోచిన యట్టి కౌస్తుభా
భరణుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౧

చ. శరచరరూపధారియయి। సాగర ముద్ధతిఁజొచ్చి సోమకా
సురుని వధించి వేదములు। చోద్యమెలర్పఁగఁ దెచ్చి శారదా
వరునకు నిచ్చి ముజ్జగము।వారలఁ బ్రోచిన యట్టి కౌస్తుభా
భరణుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౨

చ. ఉరవడి దేవదైత్యులు ప।యోనిధిఁ ద్రచ్చఁగ మందరాచలం
బరిదిగఁగ్రుంగ దానిఁ గమ।ఠాకృతి మీఁదికి నెత్తి కూర్మితో
నరయఁగ దేవపంక్తి కమృ।తాన్నముఁ బెట్టిన యట్టి కౌస్తుభా
భరణుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౩

చ. ధరణిని జుట్టి చంకనిడి । దాఁగినయట్టి హిరణ్యనేత్రునిం
గిరివరమూర్తియై వెదకి । గీటడఁగించి ధరిత్రిఁ గొమ్మునన్
బరగధరించి తొంటిక్రియఁ । బట్టుగ నిల్పిన యట్టి దిట్ట భూ
భరణుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౪

ఉ. పొంగుచు నాహిరణ్యకశి।పున్ నఖపంక్తిని జీటి వాని సూ
నుం గరుణించి కాచిన ఘ।నుండు ప్రశాంతుడు శ్రీనృసింహమూ
ర్త్యంగుఁడు భక్తకోటిఁ గృప।నారసి ప్రోచు ఘనుండు సత్కృపా
పాంగుడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౫

ఉ. గోలతనంబునం బలిని । గోరిన యట్టి పదత్రయంబు నా
పాలికి ముజ్జగంబులని । ప్రస్తుతిసేయుచు వచ్చి చయ్యనన్
మేలుగ దారఁబట్టి బలి।మెట్టిన దిట్టగునట్టి పొట్టి యా
బాలుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౬

చ. పరువడిఁ గార్తవీర్య । పరిపంథినృపాలు సహస్రబాహువుల్
తిరముగఁ ద్రుంచి క్షత్రియులఁ । దీవ్రత నిర్వదియొక్కమారు వే
సరక వధించి రాముఁడన । సంస్తుతికెక్కిన బాహుశాలి స
ద్వరదుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౭

ఉ. హాళిని దాటకం దునిమి । యాగముగాచి యహల్యఁ బ్రోచి సీ
తాలలన న్వరించి రణ।దర్పిత రావణ కుంభకర్ణ దై
త్యాలిని ద్రుంచి రాజ్యము న।యంబుగ నేలిన రామచంద్ర భూ
పాలుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౮

చ. చలమున రాసభాసురుని । జంపి ప్రలంబుని నొంచి మర్కటున్
ఖలుఁ బొరియించి శత్రునృప । గర్వమణంచి దురాత్ము రుక్మినిన్
నలినలిచేసి నాఁగటను । నాగపురిన్ బెకలించినట్టి స
త్ఫలదుఁడు రంగశాయి మన । పాలఁగలండు విచారమేటికిన్. ౨౯

ఉ. వృద్ధమునీంద్రవేషమును । వేసుక దండకమండలంబు చే
బుద్ధయుగానఁ బూని పుర । బోణుల మెల్లనఁ జేరి వారి స
ద్బుద్ధులు సాగఁబుచ్చిన ప్ర । బుద్ధుడు యోగిజనౌఘమానసో
ద్బుద్ధుఁడు రంగశాయి మన । పాలఁగలండు విచారమేటికిన్. ౩౦

చ. అరయుచు లోకముల్ కలియు । గాంతమునందు సమస్తపాతకో
త్కరనరులన్ ఖురాగ్రముల । ఖండితదేహులఁ జేసి డాసి భీ
కరగతిఁ గల్కిరూపముఁ ద । గన్ ధరియించి కలిప్రహారుఁడై
పరగెడు రంగశాయి మన । పాలఁగలండు విచారమేటికిన్. ౩౧

ఉ. కంధిసుకన్యకాహృదయ । కంజదివాకరుఁ డార్తలోకసం
బంధి వదాన్యశేఖరుఁ డ । పారకృపాపరిపూర్ణనేత్రుఁ డున్
సింధురరాజరక్షణుఁ డ । శేషగుణాఢ్యుఁడు దైత్యవైరి మ
ద్బంధుఁడు రంగశాయి మన । పాలఁగలండు విచారమేటికిన్. ౩౨

ఉ. ధీరుఁడు కౌస్తుభాది వర । దివ్యవిభూషణ శంఖచక్ర శృం
గారుఁడు కుంభకర్ణ దశ । కంఠ విరాధ ముఖాసురేంద్ర సం
హారుఁడు నిత్యశోభనవి । హారుఁడు దుగ్ధపయోధిజా మహీ
భారుఁడు రంగశాయి మన । పాలఁగలండు విచారమేటికిన్. ౩౩

ఉ. వ్యాస శుకాంబరీష సన । కార్జును లాది మునీంద్రసంఘముల్
వాసవ వీతిహోత్ర యమ । వాయువు లాదిగఁ గల్గు దేవతల్
భాసురరీతి నెవ్వని ప్ర । భావము లెంచెద రట్టి చిన్మయో
ద్భాసుఁడు రంగశాయి మన । పాలఁగలండు విచారమేటికిన్. ౩౪

ఉ. రాక్షసవైరి హాటకధ।రాధర ధీరుఁ డనేకకోటి హా
ర్యక్ష సమానవిక్రమస।మన్వితుఁ డక్షయ చారుమూర్తి కం
జాక్షుఁడు వంద్యమాన। గుణహారుఁడు నారద ముఖ్య భక్త స
త్పక్షుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౩౫

ఉ. శ్రీలుఁడు దివ్య హేమ మయ।చేలుఁడు పుణ్యఫలప్రదాన దృ
గ్జాలుఁడు నందబాలుఁడు సు।సాంద్ర మునీంద్ర ఫణీంద్రరాడ్వచో
హేలుఁడు సత్కృపాలుఁడు సు।రేశ్వరభక్తవిలోలుఁ డాదిగో
పాలుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౩౬

చ. ధరణి రథంబు భాస్కర సు।ధాకరు లందు రథాంగముల్ చతు
ర్వరనిగమంబు లశ్వములు। వారిజసంభవు డందు సూతుఁడున్
సురగిరి విల్లు శేషఫణి। సొంపగునారి మహేశుఁడందు వే
మరు నధికారిగాఁగ శర।మార్గమునన్ పురముల్ జయించు నా
పరముఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౩౭

ఉ. కేశవుఁ డార్తరక్షకుఁడు। కృష్ణుఁడు జిష్ణుఁడు కోటిసూర్యసం
కాశుఁ డజేయుఁ డుత్తముఁ డ।గణ్యుఁడు వారిజనేత్రుఁ డాది ల
క్ష్మీశుఁడు కీర్తిహారుఁడు ము।నీంద్ర సమంచితదృక్చకోర శో
భాశశి రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౩౮

ఉ. మానిసి దిండుల న్వెదకి। మాపినయట్టి వజీరు చిల్వ మ
న్నీని వెదండపాన్పునను। నిద్దురబోయెడు సామి దేవతా
మానుల నార్తులన్ దయను। మంచినవేలుపు జెట్టి సత్ప్రభా
భానుడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౩౯

చ. కలుములబోటి రాణి చలి।గాడ్పులదిండియె దండిపాన్పు వే
ల్పులదొర తోడు బమ్మయునుఁ। బూవిలుతుండు నసుంగుఁగుఱ్ఱలై
చెలఁగు మహానుభావుఁడు ప్ర।సిద్ధచరిత్రుఁడు భక్తలోక స
త్ఫలదుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౪౦

ఉ. తజ్జ్ఞ మనోజ్ఞషట్పదము । దాసులపాలిటి వేల్పుటావు స
ర్వజ్ఞుఁడు సంతతప్రమద । వర్ణితనిర్మలదివ్యనామ భా
వజ్ఞుఁడు నారదాది మునివంద్య । మహామహిమానుభావనా
ప్రాజ్ఞుఁడు రంగశాయి మన। పాలఁగలండు విచారమేటికిన్. ౪౧

ఉ. వెన్నుఁడు శౌర్యధైర్య పటు। విక్రమవక్రమహోగ్రపీడనా
పన్ననిఁ దగ్గజేంద్రుఁ బ్రతి। భామతిఁ బ్రోచిన దుష్టదైత్య వి
చ్ఛిన్నుఁడు వాక్ప్రసిద్ధఘన । శేషవిశేషనుత ప్రభావసం
పన్నుఁడు రంగశాయి మన। పాలఁగలండు విచారమేటికిన్. ౪౨

చ. బిసరుహసంభవాండము గ। భీర మహత్త్వ విశేషవైఖరిన్
విసువక సృష్టిచేసి మఱి । వేడ్కఁ బ్రవర్ధిలజేయు వేళలం
దసదృశ జన్మపోషణల । యత్రిగుణప్రవణప్రవర్తనా
భ్యసనుఁడు రంగశాయి మన। పాలఁగలండు విచారమేటికిన్. ౪3

చ. కలికియొయారి పాల్కడలి । గాంచిన యొప్పులకుప్ప చంద్రునె
చ్చెలియలు ముద్దుగుల్కు పెను। చిల్కలతేర్గలమారుఁ గన్న య
వ్వెలఁదుక పేరురంబుపయి । వేడ్క ఘటిల్ల వసించు నమ్మహా
బలుఁడగు రంగశాయి మన। పాలఁగలండు విచారమేటికిన్. ౪౪

ఉ. కిన్నర సిద్ధకింపురుష । ఖేచర సాధ్య పిశాచ గుహ్యకుల్
పన్నగ యక్షరాక్షస సు। పర్వ మునీశ్వరు లష్టదిక్పతుల్
సన్నుతిఁ జేయనేర రన। జాలిన లీల జరించు రక్షితా
పన్నుఁడు రంగశాయి మన। పాలఁగలండు విచారమేటికిన్. ౪౫

ఉ. చైత్రుఁడు నైజభక్త జన। జాల మహీజ మహావనాళికిన్
మిత్రుఁడు ధర్మజాది ధర। ణీధవముఖ్యులకెల్ల నెయ్యపుం
బుత్త్రుఁడు దేవకీ పరమ। పుణ్యసతీమణి కయ్యజార్చకున్
శాత్రుఁడు రంగశాయి మన। పాలఁగలండు విచారమేటికిన్. ౪౬

ఉ. అంగజుఁ గన్నతండ్రి కల।శాంబుధి నిద్దురఁ జొక్కు సామి సా
రంగధరార్చితుం డఖిల।రాక్షసలోక లయాంతకుండు శ్రీ
రంగవిభుండు దాసజన। రక్షణుఁ డక్షయమూర్తి సత్కృపా
పాంగుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౮౭

ఉ. చంగ దనేకదివ్య శర।జాలుఁ డుదారకృపాంబురాశి సా
రంగమదాభిషిక్తుఁ డభి।రాముఁడు భక్తఫలప్రదాయి శ్రీ
రంగపురీశ్వరుండు కరి।రాజును బ్రోచిన వేల్పు సత్కృపా
పాంగుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౮౮

ఉ. వారణదారుణారి మద।వారణకారణుఁ డుగ్రదైత్య సం
హారణ భద్రసద్వన వి।హారధురీణుఁడు శిష్టభక్త ని
స్తారణుఁ డెన్నడున్ స్మరణ। ధారణయోగ్యుఁడు భవ్యకీర్తి సం
భారుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౮౯

చ. ఘనుఁడు ఘనోపమానన వ।కాళిమ వర్ణుఁడు మానసీయ గో
ధనుఁడు ధనాధినాధ సఖ।దార సదా జపితుండు మౌనిరా
డ్వినుతగుణాకరుండు కర। విశ్రుతచక్ర పయోజనిత్యశో
భనుఁడగు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౯౦

ఉ. గోప్యముగా నిశాటభట। కోటులు కాపుగ నుండ నగ్ని సా
మీప్యమునన్ వసించిన స।మిద్ధరసాతల హోమనైష్ఠికున్
జప్యపరున్ పులస్త్యభవు। సర్వమనోరథ భగ్నుఁ జేయు స
త్ప్రాప్యుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౯౧

ఉ. రంగనికేతనాంతర ని।రంతర శేష సుఖోపవిష్టుఁడై
యంగనతో సిరంగపుర।మందాగి నిల్వఁగఁ గోరి స్వర్ణ ర
త్నాంగద ముఖ్యభూషణము।లార్యులకున్ గృపసేయు భృత్య భీ
భంగుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౯౨

చ. శ్రుతిచతురార్థవేద్యుఁడు య॥శోధనుఁడాదిమశేషశాయి భా
రతిదయితాభినందితుఁడు ॥ రావణభీషణకోపవాక్యకం
పితకపురస్సమాగత వి॥భీషణభీహరణుండు సత్యవా
క్ప్రతిభుఁడు రంగశాయి మన॥పాలఁగలండు విచారమేటికిన్. ౧౩

ఉ. బంగరుకొండ చాపముగఁ ॥ బట్టినయోధకుఁ గూర్మిమామయై
బంగరుకంటి రక్కసుని॥బట్టి వధించిన మేటిశూరుఁడై
బంగరుచేలఁగట్టుకొని ॥ బంగరు బొజ్జనుగన్న సంతతా
భంగుడు రంగశాయి మన॥పాలఁగలండు విచారమేటికిన్. ౧౪

చ. అబలల వేలసంఖ్యల మ॥హామహిమ స్వరియించి ద్వారకన్
సొబగున నున్నకాలమునఁ ॥ జొక్కపుటింతి నొకర్తుఁగోరు స
ద్విబుధ మునీంద్రమానసము ॥ వెల్వెలఁబాఱఁగఁజేసె నెవ్వఁడా
ప్రబలుఁడు రంగశాయి మన॥పాలఁగలండు విచారమేటికిన్. ౧౫

ఉ. ఆద్రుహిణేందుశేఖరుల ॥ కైన నగోచరుఁ డద్రిజాంగసా
భద్రగజేంద్ర రక్షణ కృ॥పాలుఁడు పాదసదాభివందనా
క్షుద్రభవ ప్రహార్త గుణ ॥ శోభితుఁ డాదిమతత్వబోధహృ
ద్భద్రుఁడు రంగశాయి మన॥పాలఁ గలండు విచారమేటికిన్. ౧౬

ఉ. ఆనళినోద్భవామర భ॥యంకర నిత్యవిహార దుష్టలం
కానగరీ నిశాటపటు ॥ గర్వవిమోచనుఁ డాగమార్థసం
తాన వనైకలోలుఁడు బు॥ధ ప్రకరస్తుతుఁ డాత్మదీప్తి చి
ద్భానుఁడు రంగశాయి మన॥పాలఁగలండు విచారమేటికిన్. ౧౭

ఉ. నల్లని మేనిచాయయును ॥ నల్లనికేఁతము గల్గు నల్లుఁడున్
నల్లని కల్వ రేకులను ॥ నవ్వు కనుంగవఁజూచు భార్యయున్
నల్లని చేలదేవరఘు॥నంబుగఁ దోడయియున్న దైత్యహృ
ద్భల్లుఁడు రంగశాయి మన॥పాలఁగలండు విచారమేటికిన్. ౧౮

చ. చదువుల ప్రోడఁగన్న యలచక్కనితండ్రి కృపాంబురాశి క్షు-
ద్రదనుజ సంహారుండు వెలిదామరక్రొవ్విరి యందు గండుతు
మ్మెదక్రియ క్షీరవారినిధిమీఁద వసించిన వేల్పు శ్రీశుభ
ప్రదుఁడగు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౫౯

చ. అమరఁగఁ గాశికాపురి ప్రయాగ సిరంగము కాంచి చక్రతీ
ర్థము తులసీవనంబు మధురానగరేంద్రము శేషశైల వ
ర్యము పురుషోత్తమంబు మొదలైన శుభస్థలులందు వైభవం
బమరెడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౬౦

ఉ. దీప్తిననేక భాస్కరుల తేజమునంది ప్రసిద్ధ మంత్ర భూ
గుప్త విలాసవైఖరి నకుంఠిత లీల మెలంగుచుండి యా
సప్తమహర్షులం గరుణ సంశ్రితపక్షతఁ బ్రోచు భావుక
ప్రాప్తుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౬౧

చ. శమనసహోదరీ సలిల చారువిహార వినోద కేళికా
ప్రమదుఁడు కాళియోరగ కృపాపరిరక్షణశీలుఁ డల్లెడన్
మమతనువీడు నాది వరమానివహృదంబుజ పుష్పమాలకున్
భ్రమరము రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౬౨

ఉ. కామసుధేనువు న్విమల కల్పమహీరుహపంచకంబుఁ జిం
తామణియు న్నిరూఢిఁ బ్రమదంబున నెంతయు నీప్సితార్థముల్
వేమఱు నిచ్చున ట్లొసఁగి వేగమె భక్తులఁ దృప్తిదీర్చు శో
భామణి రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౬౩

చ. ఘనతరసూర్యవంశమునఁ గల్గి ముదంబునఁ దండ్రి పంపునన్
మునిపతిఁ గాంచి యాఘను ననుజ్ఞను దాటకఁ ద్రుంచి యాగ మిం
పొనరఁగ నుద్ధరించి విభవోన్నతి శంభునివిల్లు ద్రుంచి యా
జనకతనూభవన్ గనువిచక్షణలీల వరించి మించు శో
భనమతి రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౬౪

ఉ. కోరితదీయ నామ మొనఁగూర్చి జపించెడువారికెల్ల భా
గీరథి వేణి స్వర్ణముఖి కృష్ణ సముద్రము తుంగభద్ర కా
వేరి మలాపహారిణియు వేత్రవతీనది పెన్న గౌతమీ
తీరములందు స్నానములు దీర్చిన పుణ్యఫలంబు లిచ్చు భూ
భారుఁడు రంగశాయి మనఁబాలఁగలండు విచారమేటికిన్. ౯౫

ఉ. బంధుకథానుసింధుర కబంధసటత్పరిపంథిరాట్ప్రజా
త్కంధర సుందరాది గణితప్రతిమాన సమానసంధి సం
బంధ కథప్రబంధగతి పాంథరమావను డాపదంధహృ
ద్బంధుఁడు రంగశాయి మనఁబాలఁగలండు విచారమేటికిన్. ౯౬

ఉ. దక్షుఁడు ధేనుకాకబక దానవశిక్షుఁడు సర్వయోగపా
ధ్యక్షుఁడు దుగ్ధవారిధి సుతాయుతవక్షుఁడు ద్రౌపదీసతీ
రక్షుఁడు నీరజాక్షుఁడు సురప్రవరాది సమస్తదేవతా
పక్షుఁడు రంగశాయి మనఁబాలఁగలండు విచారమేటికిన్. ౯౭

ఉ. వీరుఁడు మేరుధీరుఁడు వివేకవిచారుఁడు కోటిమన్మథా
కారుఁడు కీర్తిహారుఁ డవికారుఁడు శూరుఁడు దేవలోకసం
చారుఁడు పాపభూరుహ నిశాతకుఠారుఁడు పద్మజాండసం
భారుఁడు రంగశాయి మనఁబాలఁగలండు విచారమేటికిన్. ౯౮

ఉ. సంగరరంగనిర్దళిత శత్రుశుభాభ్రపతంగుఁ డంగనా
స్వాంగుఁడు వాహనీకృతవిహంగుఁడు ధర్మగుణానుషంగుఁ డు
త్తుంగ దయాంతరంగుఁడు చతుర్ముఖ గర్వవిపాటనక్రియా
భంగుఁడు రంగశాయి మనఁబాలఁగలండు విచారమేటికిన్. ౯౯

ఉ. ఆయత చక్రనిర్జిత నిశాటనికాయుఁడు నీలనీరద
చ్ఛాయుఁడు దివ్యకాయుఁడు విశాలపయోజ భవాండభాండధా
రేయుఁడు నిత్యశోభన చరిత్రవిధేయుఁడు భక్తరక్షణో
పాయుఁడు రంగశాయి మనఁబాలఁగలండు విచారమేటికిన్. ౧౦౦

చ. శరనిధి కన్యకామణి కు।చద్వయ చందనగంధ లేప వి
స్తరణుఁడు నారదాది ముని।సత్తమ హృజ్జలజాత నిత్యసం
చరణుఁడు భక్తపాలన వి।శాల దయాచరణుండు కౌస్తుభా
భరణుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౦

ఉ. మానితవాక్యసూనుఁడు స।మంచితదానుఁడు రాజవంశ్య స
న్మానుఁడు ధీనిదానుఁ డస।మానుఁడు భాగవతోత్తమాంతర
ధ్యానుఁడు స్వర్ణవస్త్రపరి।ధానుఁడు నేత్రిత పూర్ణశీతరు
గ్భానుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౧

ఉ. రుద్ర సదృక్సుధీజన మ।రుద్ద్రుమఁడు సత్కరుణాసముద్రుఁడున్
క్షుద్రనిశాచర ప్రకర। కుంజరరుద్రుఁడు దీనరక్షణో
న్నిద్రుఁడు జంభజిత్ప్రముఖ। నిర్జరభద్రుఁడు సుందరీమనో
భద్రుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౩

ఉ. కాళియభోగి మస్తకని।కాయసముజ్జ్వల తాండవక్రియా
లోలుఁడు హవ్యవాహన వి।లోచన శాపవిచాలుఁ డంబుభృ
న్నీలుఁడు శాంతధర్మగుణ। నిర్మలశీలుఁడు నందబాలగో
పాలుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౪

ఉ. రంగదనంత భోగిపతి। రమ్యశయానుఁడు భక్తిసారసా
రంగ కులాగ్రగణ్యుఁ డతి।రక్షణశీలుఁడు కీర్తిశాలి శ్రీ
రంగపురీనివాసుఁడు త।రంగిత సత్కరుణుండు నీరదా
భాంగుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౫

ఉ. వెన్నుఁ డపాంగవీక్షణ న।వీనదయామృతపూరతోషితా
పన్నుఁడు ఖిన్నభక్త పరి।పాలనలోల కథానిగంతరో
త్పన్నుఁ డతిప్రపన్న జన।తావినుతాఖిల సద్గుణౌఘసం
పన్నుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౨౬

ఉ. పుణ్యుఁ డగణ్య పుణ్య మునిపుంజ నికుంజ కుటీర రక్షితా
రణ్యుఁ డరాతి రాక్షస నిరంతర బాధిత వాసవాది కా
రుణ్యుఁడు రావణాభిధవిరోధి శిరోధి సముప్రమృష్ట కా
ర్పణ్యుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౭౭

చ. కలువలనేలు డాలు తెఱగంటిదొరన్ భరియించు మేలు దా
సుల వెఱఁబాపు కేలు బలుసోఁకుడుమూఁకలఁ దోలువాలు పొం
దళుకులసాలు చొక్కపుటెదం బెడవాయని యాలు గల్గు స
త్ఫలదుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౭౮

చ. సిరి వెదచల్లుచూపు మదిఁ జిక్కఁగ దూరెడు రూపు మార్తురం
బరపెడు తూపు పాఁప దొరపైఁ బవళించిన వీఁపు సజ్జనో
త్కరముల యింటికాపు త్రిజగంబుల మోపును గల్గు కౌస్తుభా
భరణుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౭౯

చ. కనుఁగొనలేనిసాటు వెనుగాల జనించిన నీరు భక్తులన్
వెనుకొని ప్రోచుతీరు తొలివేలుపు మూఁకలపోరు పాపము
న్ననరునఁ దన్ను పేరు సిరినెయ్యముఁ బాయని పేరు గల్గు శో
భనమతి రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౮౦

ఉ. వేలుపుఱేనిఁ గన్న యరవిందము పొక్కిటఁ జెన్నుమీఱఁగా
శ్రీలలనా ధరాసతులు చేరి పదాంబుజ యుగ్మమొత్తఁ జే
జే లిరువంకల న్వినుతిసేయఁగ నుండెడువిష్ణుమూర్తి గో
పాలుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౮౧

చ. ఇన శశి భౌమ సౌమ్య విబుధేజ్య సురాహితమంత్రి సౌరులున్
నలిగొని రాహు కేతువులు నల్వయిఁ జిల్వలతాల్పు పాకశా
సన సనకాదులున్ నిజవశంవదులై పనిదీర్ప నిత్యశో
భనమతి రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౮౨

ఉ. సింధురరక్షణుండు । దనుఁ జిత్తములోనఁ దలంచువారికిన్
బంధుర కామితార్థము ల।పారముగా నొనఁగూర్చుదాత యా
సైంధవపద్మగర్భ దివిష।ద్గణసన్నుతమూర్తి భక్తస
ద్బంధుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౮౩

చ. తనువు చరంబు పుత్త్ర వసు।దార ధనాదుల నమ్మరాదు నె
మ్మనమున నంతకుండు । దయమాలినవాఁ డిదె మేలెఱింగి భూ
జనవరులార మీహృదయ।సారసమధ్యమునందు నిల్పుఁడీ
పనివడి రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౮౪

చ. గరుడునిఁగన్న సర్పముల । కైవడి భానుమహోదయంబునన్
బరువులువెట్టు చీకటుల।భాతిని నెవ్విభు నామధేయముల్
స్మరణయొనర్పఁ బాయుఁ । గలుషంబులు నవ్విభుఁ డుల్లసత్కృపా
పరుఁడగు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౮౫

చ. వలపులఁజిక్కి లోనయిన। వాఁడొక వారవధూటి కోరఁ గో
వెలఁగల పైఁడిగిన్నెఁ గొని । వేడుక నిచ్చిన వారి నిద్దఱన్
దలవరు లాఁగిపట్టుకొన । ధర్మసభన్ దగ నేఁగి సాక్షిగాఁ
బలికిన రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౮౬

చ. శరనిధిదాఁటి రావణు ని।శాటుల నాజిని ద్రుంచి మౌని శే
ఖరులకు నిర్భయంబొసఁగి । గౌతమభార్య శిలావతారమై
పరగిన దివ్యరూపవతి । బాగుగఁ జేసిన దక్షుఁడుం దయా
పరుఁడగు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౮౭

ఉ. వెన్నెలపుల్గు పారణపు । వేలుపు ముఖ్యులకెల్ల ముఖ్యుఁడై
యున్న కుమారునిన్ మణిమ।యూఖ సహస్ర విభూషణంబులన్
గన్నియ లిద్దఱుం గనక । కల్పితవస్త్రముఁ బూనియున్న సం
పన్నుఁడు రంగశాయి మన।పాలఁగలండు విచారమేటికిన్. ౮౮

చ. హరినివహాంబుధాతి । విశదాండజమండలి లీల దేవతా
కరిగతి నుగ్రశైలములకై వడి పన్నగరాజుచంద ము
ద్ధరతర తారకాపతి విధంబునఁ గీర్తిఁ జెలంగు సర్వభూ
భరణుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౮౯

చ. మదనుఁడు పద్మగర్భుఁడు కుమారులుగాఁ గమలాధరాసతుల్
సుదతులుగా ఖగేశ్వరుఁడు । సొంపగువారువమై చెలంగఁగా
గదయును శంఖచక్రములు । కంజముహస్తములందుఁ గల్గు సం
పదగల రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౯౦

చ. నరనరభీమభీమ హరి । నందన నందన రాజరాజరాట్
శరశర జన్మ జన్మ ఘన । సామజ సామజ గర్భ గర్భ హా
సరస సరస్సరోజ ఘనసారస సార సుకీర్తిమండలా
భరణుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౯౧

ఉ. సంగరరంగ నిర్దళిత । శాత్రవుఁడార్తజనైకరక్షణా
సంగుఁడు భక్తలోక జలజాతపతంగుఁడు పద్మనాభుఁ డు
త్తుంగదయాంతరంగుఁడు చతుర్ముఖగర్వ విపాటనక్రియా
భంగుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౯౨

చ. తిరముగ శంఖచక్రములు । దిగ్మణియున్ దిరుచూర్ణమున్ హరి
స్మరణము పుణ్యభాగవత । మానితభక్తియు నిత్యకృత్యమై
పరగఁగఁ బూర్ణగోష్ఠియును । బాగుగఁ గల్గఁగఁజేయు నా జగ
ద్భరితుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౯౩

చ. చారు తరోరుబాహుయుగ । సంభృత శంఖసుచక్రశోభనా
కారుఁడు నిత్యసత్య నరకల్పక కల్పుఁడు సర్వ దాస మం
దారుఁడు శత్రు దైత్యకులదర్పవిదారుఁ డపాస్తభూమి దు
ర్భరుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౯౪

ఉ. కన్నులపండుగై మృదువు గల్గిన మంచి మనోరథాన్నముల్
జున్నులు పాయసాన్నములు జొక్కపు బాలమృతంపుభక్ష్యముల్
వెన్నెలవంటి మేల్ పెరుగు వేడుక దాసులకిచ్చు నిత్యసం
పన్నుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౯౫

చ. ఉభయకవేరజాంబువుల నొయ్యనఁ దోఁగుచుఁ జూరమంజుకుం
జభరితసైకతస్థలులఁ జాలవిహారముఁ జేసి పుష్పసా
రభములు గ్రోలి క్రోలి సుచిరంబుగ వేడుకలందు శ్రీశుభ
ప్రభువల రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౯౬

చ. కొలుచును జాలఁబాడియును గోకలు మేల్ గలయాలు రూకలున్
వెలివలువల్ తటాకములు వెల్లువలున్ మడిమాన్యభూములున్
గలుగఁగఁ జేసి భక్తుల కఖండిత భాగ్యములిచ్చు మన్మనః
ఘనుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౯౭

చ. చతురవివేకభక్తి నతిసంభ్రమమొప్పఁగ నోరునొవ్వనీ
శతకము నిత్యముల జదువ సామజఘోటక ధేనుధాన్యముల్
సుతులను ముక్తియుం గలుగు శుభదసారపు శ్రీఘటించు శ్రీ
పతియగు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౯౮

ఉ. సింగపుమోమువాఁడు తులసీదళదామమువాఁడు కామినీ
రంగదురంబువాఁడు వలరాయని గాంచినవాఁడు భక్తికు
ప్పొంగెడువాఁడు దానవుల పొంకమడంచినవాఁడు వీఁడె మా
బంగరు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౯౯

చ. కరిపతిఁ గావఁడో దశముఖానుజు లంకకు రాజుఁ జేయఁడో
పరమదయాసమేతుఁడయి ప్రాణములియ్యఁడొ నాఁడహల్యకున్
మఱచక నీవె దిక్కనిన మానిని ద్రౌపదిఁ బ్రోవఁడో దయా
పరుఁడగు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. ౧౦౦

ఉ. ఆలికి నల్లుఁడై పిదప । నల్లునికిం దగఁదానె యల్లుఁడై
యాలికిఁ దండ్రియై మనుమ । రాలికిఁ బెండ్లికుమారుఁడై సదా
యాలి మఱంది చెల్లెలికి । నై పతి లోకముఁ బ్రోచునట్టి గో
పాలుఁడు రంగశాయి మన । పాలఁగలండు విచారమేటికిన్. ౧౦౧

రంగశాయిశతకము

సంపూర్ణము

---

ఆంధ్రపత్రికా కార్యాలయము, చెన్నపురి.

# పీ ఠి క

శ్రీ రామతారకశతక మాంధ్రహృదయేశ్వరు డైన శ్రీరామమూర్తిని సంకీర్తనము చేసెడి శతకములందు మనోహరమైన శతకము. శతకకర్తయొక్క కులగోత్రనామాదులను నిర్ణయించుటకు దగిన యాధారములు గనుపట్టవు. శతకమునందలి ౨౩-వ పద్యమునందు "యేపుణ్యవశమున నీజన్మమెత్తితో, విప్రదేహం బిప్డు విమలచరిత"యనియును,౮౨-వ పద్యమునందు "మంత్రి కార్యానులోచన నాచరించు" ననియు నుండుటం జేసి కవి నియోగిబ్రాహ్మణు డని యూహింప దగియున్నది. కవి కొంతపాండిత్యము గలిగి లౌకికవ్యవహారలంపటుఁడై వార్ధక్యమువఱకును జీవించినటులును వార్ధక్యమునందు భక్తినిరతుడైనటులును పద్యములు తెలియజేయుచున్నవి. కవి లోకానుభవముగల శ్రీరామభక్తు డని పద్యములందలి జాతీయములును లోకోక్తులును విశదము చేయుచున్నవి. భాషనుబట్టి కవి యుత్తరాంధ్రభాగమునందు నివసించినటు లూహింపదగియున్నది. భావములు, భాష త్యాగరాజకీర్తనలను సంస్మరింపజేయుచుండును. కవి శతకమును వార్ధక్యమున భక్తిపరిపక్వదశ యందు రచియించినటులు పద్యములు తెలుపుచున్నవి.

కాలము:—శతకమునం దంతటను త్యాగరాజకీర్తనలందలి భావములు భాష గనుపట్టుచున్నవి. 'మధుశర్కరాక్షీర దధిఘృతంబుల కంటె రామనామామృతరసము తీపి' 'కౌసల్యాసుతరామ' మొదలగు పద్యములందలి భావములు త్యాగరాజానంతరము శతకకర్త శతకమును రచించినటు లూహింపదగియున్నది. త్యాగరాజస్వామి క్రీ. శ. 1687

సంవత్సరమున జన్మించి క్రీ. శ. 1767 ప్రాంతమునందు శ్రీరామసాన్ని ధ్యమును జేరెను. శతకము 1800 ప్రాంతములందు రచింపబడియుండును.

శైలి:—శైలి తేటతెలుగుమాటలతో నిండి సులభముగను శ్రావ్యముగను రసవంతముగను నున్నది. వ్యాకరణబద్ధమైన వాడుక భాషసామాన్యముగ వాడబడినది. వాడుక ప్రయోగములు చాల గలవు. "చదువువారికి ఇంపుగా నుండు" నని కవియె వ్రాసియున్నాడు. పద్యములు తెలుగుబాసకు సహజమైన మృదుమధురమంజులధ్వనులతో నడుచుచు, వీనులకు విందును గొలుపుచు, చిత్తమున కానందమును గలుగజేయుచున్నవి. మధురమైన రామతారకమూర్తిని త్రికరణశుద్ధిగ నాశ్రయించిన భక్తునకు వాగాడంబరము సాధ్యము గాదు. క్లిష్టమైన ప్రాసనియమములు పదజాలములు దీర్ఘసమాసములు భక్తిరసప్రసరణమునకు ప్రతిబంధకములు. బరువైన సీసములు రసబిందువులవలె గంతులువైచుచు పరువిడుచున్నవి. అప్రయత్నముగ భావములును భాషయును బయల్వెడలుచు హృదయానందమును గలుగజేయుచున్నవి.

శతకమునందలి లోకోక్తులు శైలి కలంకారములుగ నున్నవి. "కోటివిద్యలు నవియెల్ల కూటికొఱకు", "కోన భేదించి యెలుకను గొనగ వలెనె", "చౌషష్టివిద్యలు చదివిచెప్పగవచ్చు", "కోటికి పడగెత్తి గొల్లపుచ్చగవచ్చు" "భయముతోనైనను భక్తినైన" "నీరుగట్టినమాట నిలిచినట్లు", "గొడ్డుగోవులపాలు కోసరినట్లు", "అంధునిచేతికి నద్దంబు నిచ్చిన" "కుంటివాని కెక్క గుఱ్ఱంబునిచ్చిన", "కుక్కనక్కలుకూడి కూయవింత" "దీనుల కల్పుల దిక్కువింత"; శతకమునందు గల యిట్టి లోకోక్తులు పద్యములను రసవంతములుగ చేయుచున్నవి. శైలి తెలుగుపదములతో నిండి సామాన్యులకు నయితము శతకార్థము సులభగ్రాహ్యముగ చేయుచున్నది. శైలికి పరమార్థమైనరసోదయము శతకమునందంతటను

ప్రత్యక్ష మగుచు శతకము శ్రీరామభక్తిరసావేశమును గలుగజేయు చున్నది. శైలిని దెలుపుటకు కొన్ని పద్యము లుదాహరింపబడుచున్నవి.

సీ. నాపాలిదైవమ ♦ నామనంబున నిన్నుఁ, దలఁచి సేవించెదఁ ♦ దండ్రివనుచు
నామూలధన మని ♦ నమ్మి యుప్పొంగుచు, దండ మర్పించెద ♦ దాత వనుచు
నాతోడు నీవని ♦ నవ్వుచుఁ జేరుచు, రంజిల్లుచుండెద ♦ రాజ వనుచు
నాకును గురుఁడవై ♦ నాతప్పు లెన్నక, కాచి రక్షింపఁగఁ ♦ గర్త వనుచు
పెంచి పోషించి కాపాడ ♦ పెద్దవనుచు, పుత్రవాత్సల్య తండ్రికి ♦ పుట్టినట్లు
కృపకుఁ బాత్రునిగాఁ జేసి♦కొనుము దేవ, రామతారక దశరథ♦రాజతనయ. ౧౯

సీ. ఓ రాఘవా యని ♦ ఒకసారి దలఁచిన, దుఃఖదోషము లన్ని ♦ దొలఁగిపోవు
ఒనర రెండవసారి ♦ యో రాఘవా యన్న, బహుభోగభాగ్యసం♦పదలు గల్గు
చెలఁగి మూఁడవసారి ♦ శ్రీరాఘవా యన్న, ముక్తుఁడై వైకుంఠ♦మున వసించు
రమణ నాల్గవసారి ♦ రామచంద్రా యన్న, నవనిబుద్ధుఁడ ♦ వయ్య నీవు
అల్పసంతోషసులభుఁడ ♦ వగుదువయ్య, యెలమి యాజీవపర్యంత ♦ మరయ మిమ్ముఁ
దలఁచువారికి నాపద ♦ ల్దొలఁగుచుండు, రామతారక దశరథ♦రాజతనయ. ౪౧

సీ. చిన్నిముద్దులయన్న ♦ చిన్నారిపొన్నారి, సురభూజమా రార ♦ సుందరాంగ
నన్నుఁగన్నయ్య నీ ♦ కెన్న నన్యుఁడఁగాను, నవ్వులు సేయకు ♦ నాగశయన
దిక్కుమాలిననన్ను ♦ దేవర ప్రోవుమీ, చక్కని నాపాలి♦చక్రపాణి
అక్కటితో నన్ను ♦ నాదరింపుము వేగ, నిక్కంబు నీవాఁడ నీలవర్ణ
యనుచు వేఁడితి రక్షింపు ♦ మరసి నన్ను, నెంచలేదని నీమది ♦ నెంచవలదు
కరుణఁజూడుము నామీఁద ♦ కామజనక, రామతారక దశరథ♦రాజతనయ. ౫౩

సీ. తెలిసితెలియఁగలేరొ ♦ తెలివినే యెల్లరో, మాయలఁబడి లోక♦మమతతోడ
రామభూపాలుని ♦ రమ్యాక్షరంబులు, నేవేళనైనను ♦ నెప్పుడైన
పనిసేయువేళైన ♦ పనిలేనివేళైనఁ, జనువేళనైనను ♦ జదువునైన
భయమునొందైనను ♦ భ్రమతోడనైనను, గలుగక యంధుల ♦ కలిమినైన
పరమకల్యాణ పరిపూర్ణ ♦ భద్రమూర్తి, వెన్నదొంగను గోపాల♦విభుని ఘనుని
బుద్ధిఁ దలఁచిన ఘనులకుఁ ♦ బుణ్యపదవి, రామతారక దశరథ♦రాజతనయ. ౬౬

సీ. అంధునిచేతికి ♦ నద్దంబు నిచ్చినఁ, జూచునా తనమోము♦సుందరంబు
కుంటివానికి నెక్క ♦ గుఱ్ఱంబు నిచ్చిన, నెక్కునా తనశక్తి ♦ నెన్నఁడైన
షండునకు యౌవన♦సతి గల్గనేనియుఁ, గామంబు దీర్చునా ♦ కాంతకు దీర

అల్పున కొక వేళ ◆ నర్థంబు గలిగిన, దెలివితో నిచ్చునా ◆ తెగువతోడ
తన్నుఁ దెలిసికొనక ◆ తనశక్తి యెఱుఁగక, ధరణిసంపద లన్నియు తనవటన్న
లేదు లాభంబు తన కొక ◆ లేశ మైన, రామతారక దశరథ◆రాజతనయ. ౯౦

సీ. మూఢుఁడు మూర్ఖుఁడు ◆ ముచ్చటాడఁగవింత, దీనుల కల్పుల◆దిక్కు వింత
కోతి కోణంగులు ◆ గూడియుండఁగ వింత, కుక్కనక్కలఁ గూడి ◆ కూయ వింత
కోపితోఁ గుటిలుండు ◆ కూర్మిఁజేయుట వింత, కపటఘాతకు లెపుడు ◆ కలయవింత
మంత్రులతో మంత్రి ◆ మచ్చరించుట వింత, కీడు మే లెఱుఁగని ◆ కీర్తి వింత
యెంతవారికి లబ్ధంబు ◆ లంతగాక, అన్న కావఁగ నేర్తురె ◆ యధము లెల్ల
కల్గు సుజ్ఞానిసంగతి ◆ ఘనత యశము, రామతారక దశరథ◆రాజతనయ. ౧౯

భావార్థము

శ్రీ రామతారకశతకమునకు మకుటము:—

"రామతారక దశరథరాజతనయ!"

ఆంధ్రభాషయందలి భక్తిశతకములయందు శ్రీరామభక్తిపరము లైన శతకము లధికముగ గలవు. భక్తిజ్ఞానవైరాగ్యభావములు సమరసభావమును బొందిన ఆంధ్రహృదయమునకు సీతావల్లభుడు ప్రియదేవత. ఆంధ్రహృదయేశ్వరుడైన శ్రీరామచంద్రుని రామతారక శతకమునందు కవి సంకీర్తనముచేసి కృతార్థతను గాంచెను. మానవులను సంసారపాశములనుండి రక్షించి విముక్తులను జేయుటకు రామతారక మంత్రము పరమసాధనముగ నున్నది. తారకమంత్రములందు వాల్మీకి రామదాసాదులను తరింపజేసిన శ్రీరామతారకమంత్రము తెలుగుదేశమునందు ప్రజాసామాన్యమునందు విశేషవ్యాపనమును గాంచిన మంత్రరాజము. శతకకర్త ముక్తిప్రదాయకుడైన శ్రీరాముని త్రికరణశుద్ధిగను గొలిచి కృతార్థుడైనవిధమును శతకము విశదము చేయుచున్నది. "అపరాధి నపరాధి నపరాధి ననిమ్రొక్కి, యాశ్రయించితి మిమ్ము నప్రమేయ", "పాతకుడ నన్ను రక్షించు పరమపురుష", "యింతకాలంబునను నిన్ను నెఱుగలేక, వృద్ధిబొందితి...విశదముగను",

"దిక్కుమాలిన నన్ను దేవర ప్రోవ్వమి", "ద్రోహిశరణంటి నను గావు దొడ్డఘనత ", " అగణితంబైన కలుషంబు లణగజేసి నిర్మలాత్మునిగా జేయు నిగమవేద్య " ఇత్యాదిభావములు కవిహృదయమునందు గలిగిన గాఢమైన భక్తిని దెలుపుచున్నవి. కవి సామాన్యమానవులవలె జీవితమును విషయవాసనలతో గడపి వార్ధక్యదశయందు శ్రీరామభక్తి పరిపక్వమైనపుడు భక్తిపరవశుడై శతకమును రచియించినట్లు శతకార్థము విశదము చేయుచున్నది. కవికి జీవయాత్రకు ఫలమైన భక్తిజ్ఞాన వైరాగ్యములును మోక్షకాంక్షయును గలిగి శ్రీరాము నాశ్రయించి తరించినవిధమును శతకము విశదము చేయుచున్నది.

రామతారకశతకమునకు భక్తి హృదయమైనను జ్ఞానవైరాగ్య బోధలు సందర్భానుసారముగ శతకమునందు జేర్పబడినవి. కవికిగల జ్ఞానప్రతిపత్తి నీక్రిందిపద్యములు విశదము చేయుచున్నవి.

సీ. హరి రామ నీవు నా ♦ యంతరంగమునందు, సాక్షివై యుండుట ♦ సత్యమైన
పావనం బాయెను ♦ పాంచభౌతిక మెల్ల, కాయంబు జలములఁ ♦ గడుగనేల
మమకార ముడిగిన ♦ మానును కర్మముల్, వేధించి వేల్పుల ♦ వేఁడనేల
విత్తు క్షీణం బైన ♦ వీడును గర్భంబు, మోహంబు లుడిగిన ♦ మోక్ష మిదియె
నిష్ఠ యీరీతి నిజముగా ♦ నిలుపనలయు, మనసు దృఢమైనఁ జాలదా ♦ మాయ గెల్వ
భ్రాంతు లుడిగిన బ్రహ్మంబు ♦ బట్టబయలు, రామతారక దశరథ♦రాజతనయ. ౭

సీ. దేహంబు విడిచెడు ♦ దినము తా నెఱుఁగఁడు, కర్మంబు వచ్చుట ♦ గానలేఁడు
మూఁడవస్థలలోన ♦ మునిఁగి తేలఁగలేఁడు, ఆగ్గురుశత్రుల ♦ నాఁపలేఁడు
మగువలురములందు ♦ మమత మానఁగలేఁడు, వాఁడు వీఁ డనుపల్కు ♦ వదలలేఁడు
అభిమానరహితుఁడై ♦ యాశ లుడుగలేఁడు, యించుకహరిమాయ♦ నెఱుఁగలేఁడు
కన్నులందును బ్రహ్మంబుఁ ♦ గనఁగలేక, బుద్ధిహీనులకడ కేగి ♦ పొందుచేసి
యుదరభరణంబు గానక ♦ యుర్విలోన, రామతారక దశరథ♦రాజతనయ. ౨౬

భక్తిసాక్షాత్కారమునకు మనోనిగ్రహము మూల మని కవి తెలిపినభావములు భక్తుల కాదరణీయములు.

సీ. నీతి యెఱుంగవు ♦ నిందకు నోడవు, చంచలం బెప్పుడు ♦ చెడ్డగుణము
వాయువేగముకంటె ♦ వడిగలవాఁడవై, షా ఱెవ చెప్పుడు ♦ పశుమతనము
పేరు వేత్రొక్కటి ♦ పిలుచుట యొక్కటి, చేరువకర్మంబు ♦ చెప్పలేవు
పుత్రమిత్రాదులే ♦ పుణ్యలోకం బని, సద్గతి యెఱుఁగవు ♦ జముఁడ వసుచు
మనసు ఈరీతి వర్తించు ♦ మందమతిని, నడచి నరకంబు కేగుట ♦ నయమె నీకు
ముందు తెలియక విహరించి ♦ మోసపోక, రామతారక దశరథ♦రాజతనయ. ౨౭

సీ. పంకజాక్షునిపూజ ♦ పలుమాఱు సేయక, పరదైవములపూజ ♦ పాడి యగునె
విష్ణుసంకీర్తన ♦ లీవినుల వినకయే, పరుల మెచ్చుట నీకు ♦ బ్రాంతి యగునె
శేషశయనునిఁ జాలఁ ♦ జెలఁగి కీర్తింపక, పరులఁగీర్తించుట ♦ భవ్య మగునె
నారాయణస్మరణ ♦ నమ్మకయుండక, పరదైవములస్మరణ ♦ పాటి యగునె
మనస! నీకెంత బుద్ధియు ♦ మఱియులేదు, తలఁపవే రామమంత్రంబు ♦ తలఁపులోన
తలఁచితే మోక్ష మిచ్చును ♦ తథ్యమరయ, రామతారక దశరథ♦రాజతనయ. ౭౮

కవి విశిష్టాద్వైతమతాచార్యులు ప్రతిపాదించెడి శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధురభావములను శ్రీరామమూర్తిని సంభావించి సేవించిన విధమును పద్యములు విశదము చేయుచున్నవి.

సీ. నాముద్దులయ్యను ♦ నాదేవదేవుని, నాపిన్నయన్నను ♦ నామురారి
నారత్నమును పట్టి ♦ నాబంగరయ్యను, నానిధానము రాము ♦ నాదవిష్ణు
నాహార్మిశౌరిని ♦ నాబ్రహ్మతేంద్రిని, నారఘురాముని ♦ నాదుహరుని
నామనోనాథుని ♦ నానోముఫల మైన, నాజానకీధవు ♦ నామహాత్ము
వెదకి కీర్తించి హర్షించి ♦ వేడుకొనిన, నఖిలసంపద లిప్పుడు ♦ నమరినట్లు
తప్పత్రోవలఁ బోయిన ♦ ధన్యుఁ డగునె, రామతారక దశరథ♦రాజతనయ. ౫౦

శ్రీ త్యాగరాజకృతులవలె రామతారకశతకమును రామనామప్రభావమును హృద్గతము చేసి శ్రీరామభక్తులను తరింపజేయుటకు మనోహరముగ నున్నది. ఆంధ్రదేశమునందు చాటువులుగ వ్యాపకమునందున్న పద్యములు ప్రజలకు శతకముపట్ల గల యాదరమును విశదముచేయుచున్నవి.

సీ. ఓపి యోపకయైన ♦ యొక్కసారైనను, వెఱచి వెఱపక యైన ♦ వేడ్క నైన
హా రామ హా కృష్ణ ♦ హా యచ్యుతా యని, భయముతో నైనను ♦ భక్తి నైన
ప్రేమతోఁ బుత్రుల ♦ పేరుపెట్టుకయైన, వనతటాకము లుంచి ♦ వాంఛ నైన
భువిలోనఁ గీర్తికిఁ ♦ బురము గట్టైనను, చిలుకను బెంచైనఁ ♦ జెలిమి నైన
నీదునామంబుఁ బలుకుట ♦ నిఖిలసుఖము, గలిగి వర్ధిల్లుపురుషుండు ♦ ఘనతె మెఱయ
జన్మకర్మంబు లతనికిఁ ♦ జెప్పనేల, రామతారక దశరథ♦రాజతనయ. ౯

సీ. ఆవేళ యమునిచే ♦ నాయాసపడలేక, వెఱచి యిప్పుడె మిమ్ము ♦ వేఁడుకొంటి
అపరాధి నపరాధి ♦ నపరాధి నని మ్రొక్కి, యాశ్రయించితి మిమ్ము ♦ నప్రమేయ
శరణన్నమాత్రాన ♦ శంక లన్నియు మాని, భయనివారణ మాయె ♦ భజనచేత
నింతసులభుఁడ వని ♦ యెఱిఁగిన నిన్నాళ్లు, యేమటియుందునా ♦ యెఱుఁగనైతి
తెలిసె మీకృప నాకును ♦ తేటపడెను, మర్మ మెఱిఁగితి నీకీర్తి♦మహిమ వింటి
గట్టు దాటితి నీవు నా♦గతి యటంటి, రామతారక దశరథ♦రాజతనయ. ౧౧

క్రోధన సం. శ్రావణశుద్ధ సప్తమీ
బుధవారము, చెన్నపురి.

కా. నాగేశ్వర రావు.

---

పాఠభేదములు:—ఈ శతకము నైదారుప్రతులతో సరిచూచి పాఠభేదములను జేర్చితిమి. అందు ‘అ. ఆ. ఇ.’ అను సంకేతములు గలప్రతులు చెన్నపురియందలి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున వరుసగా 13-8-19, 10-11-22, 13-8-20 నెంబరులు గలవి. ‘వా’ అను ప్రతి వావిళ్లవారిచే ముద్రితమైనది. తక్కినవి ఇతర ముద్రిత ప్రతులు. ‘ఆ’ ప్రతిలో ౧౧ పద్యములు, ‘ఇ’ ప్రతిలో 3 పద్యములు క్రొత్తవి దొరకినవి. వానిని గ్రంథాంతమున జేర్చితిమి.

శ్రీ ర స్తు

—

# శ్రీ రా మ తా ర క శ త క ము

శ్రీ రామనామమే • శృంగారవర్ణన, సకల౧శాస్త్రవివేక•సాధనంబు
శ్రీరామనామమే • శృంగారచారిత్ర, సకల౨దానవిశేష•సంగ్రహంబు
శ్రీరామనామమే • శృంగారధ్యానంబు, సకల*౩తీర్థాచార•సత్ఫలంబు
శ్రీరామనామమే • శృంగారచింతన, సకలమంత్ర రహస్య•సమ్మతంబు
అనుచు బ్రహ్మాదిసుర లెల్ల • ననుదినంబు, భక్తితో రామమంత్రంబు • పఠనఁజేసి
మ్రొక్కి సేవించి చెందిరి • మోక్షపదవి, రామతారక దశరథ•రాజతనయ. ౧

సీ. శ్రీరామ నాయొక్క • జిహ్వపై శనీనామ, కాక్షరబీజము • లమర వ్రాసి
౪వాణి నాపలుకుల • వసియింపఁగాఁ జేసి, †శత్రు నుచ్చాటన • ౫సలుపఁబూని
౬యుక్తియు బుద్ధియు • నూహ ౭దాసున కిచ్చి, భక్తితో మీ౮పాద•భజనమందు
౧౦నాసక్తిఁ బుట్టించి • యమృతసారం బెల్ల, తారకశతకంబు • త్వరితముగను
పలుకు పలికించు వేవేగ • పరమపురుష, ఇంపుగాఁ జదువువారికి • నిహము పరము
దాత వై యిచ్చి రక్షించు • ధన్యచరిత, రామతారక దశరథ•రాజతనయ. ౨

సీ. ‡నరులార సేయుఁడీ • నారాయణస్మరణ, మ్రొక్కి ౧౧సేవింపుఁడీ • మోక్షకారి
జనులార ౧౨తలఁపుఁడీ • జయరామనామంబు, ౧౩కామ్యార్థములకెల్లఁ • గల్పవల్లి
ప్రజలార చేయుఁడి • పంకజాక్షునిపూజ, సాయుజ్యపద౧౪వికి • సౌఖ్యకారి
మానవబుధులార • మఱవక ౧౫తలఁపుఁడీ, పరమాత్మశబ్దంబు • పాపహారి
పెక్కుమార్గంబుల౧౬ను బోక • ప్రేమ౧౭చేత, భక్తితో రామమంత్రంబు • పఠనఁజేసి
మ్రొక్కి సేవించి ౧౮చెందుఁడీ • మోక్షపదవి, రామతారక దశరథ•రాజతనయ. 3

---

(1) ౧. దాన. ౨. శాస్త్రవివేకసాధనంబు. 3. తీర్థాచరణ. * తీర్థావృత. (2) ౪. మీ. గీ. వాని. † శత్రుసంహారంబు. ౫. సేవ. ౬. యుపమయు. ౭. దాసుల. ౮. నామ. ౧౦. ప్రీతియుఁ బుట్టించి ప్రేమసారంబైన. (3) ‡ నరులార సేయుఁడీ నారాయణ జపంబు. ౧౧. సేవించిన అచ్చుపాఠము. ౧౨. చేయుఁడి. ౧౩. కార్యార్థముల. ౧౪. విచ్చు. ౧౫. పలుకుఁడీ (సేయుఁడీ) ౧౬. కు. ౧౭. తోను. ౧౮. చెందిరి.

సీ. తలఁపుఁడీ జనులార ♦ తారకనామంబు, గోవింద౧నామంబు ♦ కొల్లగొనఁడి
కృష్ణనామం బెప్డు ♦ గీర్తనల్సేయుఁడీ, మాధవనామంబు ♦ మఱవకండి
హరినామకీర్తన ♦ లందందు సేయుఁడీ, శ్రీవాసుదేవస్మరణ ♦ వదలకండి
౨విష్ణుసంకీర్తన ♦ ల్విడువక చేయుఁడీ, నరసింహనామంబు ♦ నమ్మికొండి
కలియుగంబున జనులార ♦ కష్టపడక, నామకీర్తనపరులౌట ♦ నయము సుమ్మి
పునః జన్మంబు* మఱి లేదు ♦ పుడమియందు, రామతారక దశరథ♦రాజతనయ. ౪

సీ. ఓపి యోపకయైన ♦ యొక్క౪సారైనను, వెఱచి వెఱవకయైన ♦ వేడ్కనైన
హా రామ హా కృష్ణ ♦ హా యచ్యుతా యని, భయముతోనైనను ♦ భక్తినైన
ప్రేమతోఁ బుత్రుల ♦ పేరు౫పెట్టుకనైన, వనతటాకము లుంచి ♦ వాంఛనైన
౬భువిలోనఁ గీర్తికిఁ ♦ బురము గట్టైనను, చిలుకను బెంచైనఁ ♦ జెలిమినైన
నీదునామంబుఁ ౭బలుకుట♦నిఖిలసుఖము, గలిగి వర్ధిల్లు పురుషుండు ♦ ఘనత౮మెఱయ
జన్మకర్మంబు లతనికిఁ ♦ జెప్పనేల, రామతారక దశరథ♦రాజతనయ. ౫

సీ. నీనామమే కదా ♦ నిఖిలశాస్త్రము లెల్లఁ, బరలోకప్రాప్తికి ♦ సాధనంబు
నీనామమే కదా ♦ నిఖిలజీవులకెల్ల, నఖిలవైభవముల ♦ ౯కాలయంబు
నీనామమే కదా ♦ నిర్మలాత్ములఁ జేయ, ౧౦నజ్ఞానజీవుల ♦ కౌషధంబు
నీనామమే కదా ♦ నిశ్చలభక్తుల, కార్యసిద్ధికి ౧౧నాది♦కారణంబు
౧౨తునుము ఛేదించు దారిద్ర్య♦దుఃఖ మెల్ల, వాసి కెక్కించు సంసార♦వార్ధి గడపి
శాశ్వతంబైన పదవిచ్చు ♦ జగతియందు, రామతారక దశరథ♦రాజతనయ. ౬

సీ. హరి రామ నీవు నా ♦ యంతరంగమునందు, సాక్షివై యుండుట ♦ సత్యమైన
పావనం బాయెను ♦ పాంచభౌతిక మెల్ల, కాయంబు జలములఁ ♦ గడుగనేల
మమకార ముడిగిన ♦ మానును ౧౩కర్మముల్ †వేధించి వేల్పుల ♦ వేడనేల
చిత్తు౧౪క్షీణం బైన ♦ వీడును గర్మంబు, మోహంబు లుడిగిన ♦ మోక్ష ౧౫మిదియె
నిష్ఠ యీరీతి నిజముగా♦౧౬నిలుపవలయు, మనసు దృఢమైనఁ జాలదా ♦ మాయ గెల్వ
భ్రాంతు లుడిగిన బ్రహ్మంబు ♦ బట్టబయలు, రామతారక దశరథ♦రాజతనయ. ౭

---

(4) ౧. నామమే కొల్లగొనుఁడు. ౨. విష్ణుసంకీర్తన విడువకండి. 3. నారాయణా యని నమ్మి సేవింపుఁడీ. * మఱల జన్మంబుగాంచరు మహిని మీరు. (5) ౪. మాటైనను. ౫. పెట్టైనను. ౬. భూమిలో. ౭. దలఁచుట నిఖిలపదని. ౮. మెఱసి. (6) ౯. కాస్పదంబు. ౧౦. జ్ఞానజీవులకెల్ల ♦ నౌషధంబు. ౧౧. హేతు. ౧౨. తుదను వేధించి. (7) ౧౩. గర్మంబు, వేధించువేల్పుల ♦ వగవ. † వేధించు వేల్పు వెఱవనేల. ౧౪. క్షీణించితె విడుచునా? ౧౫. మనను. ౧౬. నిలిచెనేని.

సీ. కామితార్థము ౧లిచ్చు • కామధేనువు గల్గ, వెలఁబెట్టి గోవుల • వెదక నేల
౨*పావనం బైనట్టి • పరుసవేదియు గల్గ, కంచు నెంకులమీఁద • కాంక్షయేల
కల్యాణ మొసఁగెడి • కల్పవృక్షము గల్గ, వనపుష్పఫలముల • వాంఛ యేల
అమరుల ౩కబ్బని • యమృతంబు సేవింప, మధురసంబులమీఁది • ౪మమత యేల
తారతమ్యంబు లీరీతిఁ • ౫దథ్యమనుచు, భజనఁజేతురు మిమ్మును • బ్రహ్మవిదులు
స్తుతులు సేయుదు రెప్పుడు • సురలు గూడి, రామతారక దశరథ • రాజతనయ. ౮

సీ. భూపతి వై పుట్టి • పృథివి నేలఁగవచ్చు, శత్రుసంహారంబు • సేయవచ్చు
చౌషష్టివిద్యలు • చదివి చెప్పఁగవచ్చు, బహుమంత్రసిద్ధులఁ • బడయవచ్చు
కోటికి పడగెత్తి • గొల్ల౬పుచ్చఁగవచ్చు, సకల౭మంత్రంబులు • చదువవచ్చు
గంగాదినదులకు • గ్రక్కునఁ బోవచ్చు, నుత్తమాశ్రమముల • నుండవచ్చు
మగుడ జన్మంబు రాకుండ • మాయ గెలుచు, విద్య సాధించి శత్రుల • విటచికట్టి
యరసి బ్రహ్మంబు గనుఁ౯గొను • టరుదుగాక, రామతారక దశరథ • రాజతనయ. ౯

సీ. సతమని దేహంబు • సంతసిల్లఁగ నేల, నిలుచునా యిది వట్టి • నీరుబుగ్గ
కాయంబు నిలువదు • కడు బ్రహ్మకైనను, ప్రాణంబు నిలుచునా • భ్రాంతి గాక
విభవంబుఁ జూడకు౧ • ౧౦విషయబంధన మది, సంపద లెప్పుడు • సతము గాదు
పరులు నావా రని • ౧౧పాటింపఁ జెల్లదు, వెళ్లంగఁ దనవారు • వెంట రారు
అనుచుఁ దలపోసి బుధు లెల్ల • నాశ లుడిగి, మోహజాలంబులోఁ బడి • మోసపోక
నిన్ను సేవించుచుందురు • నీరజాక్ష, రామతారక దశరథ • రాజతనయ. ౧౦

సీ. ఆవేళ యముఁడిచే • ౧౨నాయాసపడలేక, ౧౩వెఱచి యిప్పుడె మిమ్ము • వేఁడుకొంటి
అపరాధి నపరాధి • నపరాధి నని మ్రొక్కి, యాశ్రయించితి మిమ్ము • నప్రమేయ
శరణన్నమాత్రాన • శంక లన్నియు మాని, భయనివారణ మాయె • భజనచేత
నింతసులభుఁడ వని • యెఱిఁగిన నిన్నాళ్లు, యేమఱియుందునా • యెఱుఁగనైతి
తెలిసె మీకృప నాకును • తేటపడెను, మర్మ మెఱిఁగితి౧౪ నీకీర్తి • మహిమ వింటి
౧౫గట్టు దాఁటితి నీవు నా • గతి యటంటి, రామతారక దశరథ • రాజతనయ. ౧౧

---

(౮) ౧. నిచ్చు. ౨. మరణంబు లేకుండ • మందు గలిగుండఁగా, సభ్యులై యము నికి • జడియనేల. * ఈపాఠమే అక్షరవ్యత్యాసముతో. 3. కబ్బె మీ యమృతంబు సేవింప. ౪. మమరు. ౫. తత్త్వ. (౯) ౬. బెట్టఁగ. ౭. వ్రతంబులు సలుపవచ్చు. ౮. మాళ్వము నెక్కి నఃఅక. ౯. గొంటబ్బె. (10) ౧ విశ్వంబులోపల. ౧౦. విస్మయం బందకు. ౧౧. పాటించి చూడకు. (11) ౧౨. నాపద. ౧౩. జడిసి యిప్పుడు మిమ్ముఁ • దలఁచు. ౧౪. మీ. ౧౫. గండి.

సీ. ౧*వరుస దప్పక ధర్మ♦వర్తన ల్వర్తించి, వేదాంత౨మర్మము ♦ ల్వెదకిచూచి
౩శిష్టశీలురయొక్క ♦ శుశ్రూషణముఁ జేసి, ౪సత్యప్రసాదంబు ♦ సంగ్రహించి
౫సాంప్రదాయిక గురు♦స్వాముల నర్చించి, హరిఁ జేరుమార్గంబు ♦ ౬లడిగి యడిగి
౭వారిచేఁ బడసిన ♦ వరమంత్రరాజంబు, పరచిత్తుఁడను గాక ♦ పఠనఁజేసి
౮మఱచి యేదియుఁ గోరక ♦ మానసంబు, ౯హరికి నర్పించినట్టియా♦యధిక పుణ్య
మరసి రక్షించు టది౧౦యెల్ల ♦ నంతె గాక, రామతారక దశరథ♦రాజతనయ. ౧౨

సీ. హరినామకీర్తన ♦ లానాఁడె చేసిన, ౧౧ఆవేదనత్రయ ♦ మంటకుండు
నీక్షించి మదిలోన ♦ నినకులోత్తమ౧౨ యన్న, నీషణత్రయము న ♦ న్నిద్వకుండు
దశరథాత్మజుఁగూర్చి ♦ ధ్యానంబుఁ జేసిన, దారిద్ర్యదోషము ♦ ౧౩ల్దగులకుండు
జానకీపతిమంత్ర ♦ ౧౪జపము గావించిన, జన్మకర్మంబులు ♦ జెందకుండు
భక్తి౧౫ ఫలమును బక్వమై ♦ పండుఁగాక, అమితకాలంబు నిన్నాళ్లు ♦ హారణ మాయె
౧౬పాతకుఁడ నన్ను రక్షింపు ♦ పరమపురుష, రామతారక దశరథ♦రాజతనయ. ౧౩

సీ. మటిమటి జిహ్వకు ♦ మాధుర్యమైయుండు, మనసు మీస్మరణకు ♦ మరగియుండు
వీనులు మీకథ♦౧౭ల్వీన వేడ్కలయియుండు, చూడ్కులు మీరూపు♦ చూచుచుండు
బుద్ధి మీతత్త్వంబు♦౧౮పొందఁ గోరుచునుండు, పూజింప హస్తము♦ల్పొంగుచుండు
కామ్యంబు ౧౯మోక్షంబు ♦ కాంక్షఁజేయుచునుండు, భక్తి యీరీతిని♦ బ్రబలుచుండు
నితరనామంబు ౨౦పలుకుట ♦ యింపుగాదు, ౨౧సతతమును నీదునామంబు ♦ సంస్తుతింప
హర్ష మానంద మగుచుండు ♦ ననుదినంబు, రామతారక దశరథ♦రాజతనయ. ౧౪

సీ. నీప్రభావంబులు ♦ నిగమంబులేకాని, పలికి వర్తింప నా ♦ బ్రహ్మవశమె
నీనామ౨౨మధురుచి ♦ ౨౩నీలకంఠుఁడుగాని, వేయికన్నులు గల♦ వేల్పువశమె
నీపాద౨౪నఖముచే ♦ నిర్భిన్న మయినట్టి, బ్రహ్మాండకటుక ౨౫మె♦వ్వరికి వశమె
నీకీర్తిఁ గొనియాడ ♦ నిశ్చల మైనట్టి, నారదాదులు గాని ♦ నరులవశమె
౨౬యెన్నఁగూడని తారల ♦ నెన్నవచ్చు, ౨౭జలధికణముల గణుతించి ♦ చెప్పవచ్చు
౨౮పరమతారకమంత్రంబు ♦ పలుక వశమె, రామతారక దశరథ♦రాజతనయ. ౧౫

---

(12) ౧. వరము. * పరము. ౨. మార్గము. ౩. విష్ణు. ౪. సర్వత్రదానంబు, అచ్చుపాఠము. ౫. సార్ద్రదయా, అచ్చుపాఠము. ౬. లడుగనైతి. ౭. వారి కృపవల్లను బడసిన మంత్రంబు పరిశుద్ధులైనది. ౮. కామ్య మేమియుఁ గోరక కర్మమెల్ల. ౯. ...సమర్పించినట్టి యా యలఘుమతికి. ౧౦. యెంతయంకె. (13) ౧౧. వేదనత్రయము నాఁడంట. ౧౨. ముగంటె. ౧౩. ల్డోలఁగియుండు. ౧౪. ధ్యానంబుఁజేసిన. ౧౫. పుష్పంబు. ౧౬. పండు నాచేతి కిప్పుడు ప్రాప్తమాయె. (14) ౧౭. ల్విస్తరింపుచు నుండు. ౧౮. బోధ. ౧౯. మోక్షమై...గోరుచు. ౨౦. పలికితే హితవు. ౨౧. సతత మెప్పుడు మీనామ స్మరణచేశ. (15) ౨౨. మంత్రంబు. ౨౩. నిత్యత్వమే కాని. ౨౪. నఖమహిమ. ౨౫. ము పరుల. ౨౬. యిన్ని తారలు యని లెక్క. ౨౭. జలమువారాశి యింతని. ౨౮. కాక ఫల మక్షరద్వయి.

సీ. నిన్నాశ్రయించితి ♦ నీవాడనని యంటి, పాహి మాం కోదండ♦పాణి యంటి
[౧]రఘుకులదీపక ♦ రక్షించుమని యంటి, కరు[౨]ణాసముద్ర నన్ ♦ గావుమంటి
[౩]దేవ యన్యులమధ్య ♦ దిక్కు నీవని యంటి, దుష్కృతకర్మముల్ ♦ ద్రుంచుమంటి
అఖిలలోకారాధ్య ♦ యభయమిమ్మని యంటి, నీప్సితార్థము లెప్పు ♦ డియ్యుమంటి
అడుగ నెంతైన నితరుల ♦ నమరవంద్య, పదుల యాచింప నా కేల ♦ పరమపురుష
దాతలకు నెల్ల దాత[౪]వౌ ♦ దైవరాయ, రామతారక దశరథ♦రాజతనయ. ౧౬

సీ. ఎచ్చోట హరికథ ♦ లచ్చోట సిద్ధించు, గంగాదితీర్థముల్ ♦ గన్నఫలము
ఎచ్చోట సత్యంబు ♦ లచ్చోట నిత్యంబు, లక్ష్మీసరస్వతు ♦ లమరియుండ్రు
ఎచ్చోట ధర్మంబు ♦ లచ్చోట దైవంబు, జయము లెల్లప్పుడుఁ ♦ [౫]జెందుచుండు
ఎచ్చోట భక్తుడు ♦ నచ్చోట హరి యుండు, [౬]నిధిఫలం బక్కడ ♦ నిండియుండు
నీదుభక్తు[౭]ని గుణములు ♦ నిర్ణయింప, ఫలము భాగ్యము నింతని ♦ ప్రస్తుతింప
వశమె యెవ్వరికైనను ♦ వసుధలోన, రామతారక దశరథ♦రాజతనయ. ౧౭

సీ. పదివేలగోవులు ♦ ప్రతిదినంబొసఁగిన, పంచభక్ష్యాన్నము ♦ల్వరఁగ నిడిన
గ్రహణకాలములందు ♦ గజదాన మొసఁగిన, నశ్వదానంబులు ♦ నమితమైన
[౮]పెక్కుయాగంబులు ♦ ప్రేమతో చేసిన, నితరధర్మంబులు ♦ నెన్నియైన
[౯]తుల్యమగునట్టి మీ నామ♦తుల్యమునకు, హస్తిమశకాంతరము[౧౦]పాటి ♦ యౌనుగాక
యింతఫల మని వర్ణింప ♦ నెవ్వఁడోపు, రామతారక దశరథ♦రాజతనయ. ౧౮

సీ. నాపాలిదైవమ ♦ నామనంబున నిన్నుఁ, దలఁచి [౧౧]సేవించెద ♦ దండ్రి వనుచు
నామూలధన మని ♦ నమ్మి యుప్పొంగుచు, దండ మర్పించెద ♦ దాత వనుచు
నాతోడు [౧౨]నీవని ♦ నవ్వుచుఁ గేరుచు, రంజిల్లుచుండెద ♦ రాజ వనుచు
[౧౩]నాకును గురుఁడవై ♦ నాతప్పు లెన్నక, కాచి రక్షింపఁగఁ ♦ గర్త వనుచు
పెంచి పోషించి కాపాడ ♦ పెద్ద[౧౪]వనుచు, పుత్రవాత్సల్య తండ్రికి ♦ పుట్టినట్లు
కృపకుఁ బాత్రునిగా [౧౫]జేసి♦కొనుము దేవ, రామతారక దశరథ♦రాజతనయ. ౧౯

---

(16) ౧. రఘుపతి రాఘవ. ౨. సాగరమమ్ము. 3. దైవమునీవని. ౪. వై.
(17) ౫. జెందియుండుట. ౬. నీదుఫలం బిచ్చు నింటనుండు. ౭. ల. (18) ౮. ఆహార మొర్జించి యవనిఁ జరించిన నిరతంబు తీరనివాసి యైన. ౯. తుల్యమగు రామమంత్రంబు తుల్యమగును. ౧౦. సాటియానో కాదో. (19) ౧౧. వర్తించెద. ౧౨ నీడని... ౧౩. నాకు గురుండవై నాతప్పు లన్నియు. ౧౪. వగుచు. ౧౫. జేయు కువలయేశ.

సీ. బహుజన్మ[౧]ములనెత్తి ♦ బాధనొందఁగనేల, పరమపూరుషుఁ గొల్చి ♦ బ్రదుకవలయు
[౨]విషయవాసనలచే ♦ విసిగి వగవఁగనేల, శ్రీనివాసునిపూజ ♦ సేయవలయు
విషయభోగంబుల ♦ విఱ్ఱవీఁగఁగనేల, విష్ణు[3]చరిత్రంబు ♦ వినఁగవలయు
అస్మదాదులకొఱకు ♦ నన్నృతమాడఁగనేల, హరినామకీర్తన ♦ [౪] లనఁగవలయు
తనువు [౫]తథ్యంబుగాదని ♦ తత్త్వవిదులు, [౬] సంతత[౭]ధ్యానులై *యాత్మ ♦ సంస్మరించి
నిన్ను సేవింపుచుందురు ♦ నీరజాక్ష, రామతారక దశరథ♦రాజతనయ. ౨౦

సీ. ఈప్సితార్థము లిచ్చి ♦ యిహమందు [౮]రక్షించి, పరమందు మీసేవ ♦♦ ప్రాప్తిఁ జేసి
అగణితంబైన [౯]నీ ♦ †యాశ్రయస్థులలోన, గణుతించి గ్రక్కున ♦ గారవించి
భక్తు[౧౦]నింపైఁ గృప ♦ పరిపూర్ణముగ నుంచి, నిజముగా దాసుల ♦ నిర్వహించి
ప్రియము[౧౧]తోఁబిలిచితే♦ప్రేమతోఁబొడసూపి,యభయహస్తములిచ్చి♦యాద[౧౨]రింపు
మొరల యాచింప సేవింప ♦ [౧౩]నోపలేక, వెదకి గనుఁగొంటి నాపాలి♦వేల్పుఁ వంటి
మగుడ ౭న్మంబులేకుండ ♦ [౧౪]మందుగోరి, రామతారక దశరథ♦రాజతనయ. ౨౧

సీ. మూఢుల రక్షించి ♦ మోక్షమిచ్చుట కీర్తి, ద్రోహులఁ గాచుట ♦ దొడ్డకీర్తి
[౧౫]పాపకర్మలకెల్ల ♦ పగ మిచ్చుట సుకీర్తి, ఆత్మసంరక్షణ ♦ మమితకీర్తి
నీవాడననియంటె ♦ నిర్వహించుట కీర్తి, ప్రేమ దీనులఁ [౧౬]బ్రోవ ♦ పెద్దకీర్తి
సామాన్యజీవుల ♦ [౧౭]సంతరించుట కీర్తి, [౧౮]మునుల రక్షించుట ♦ ఘనసుకీర్తి
బద్ధులైనట్టి సంసార ♦ పామరులకు, [౧౯]నరసి సాయుజ్యపద మిచ్చు ♦ టుతెగాక
యనుచు సేవింతు [౨౦]నీరీతి ♦ ననుదినంబు, రామతారక దశరథ♦రాజతనయ. ౨౨

సీ. జంతుజాలములందు ♦ జన్మించి కొన్నాళ్లు, [౨౧]క్రిమికీటకములందు ♦ క్రీడసల్పి
[౨౨]మానవదేహంబు ♦ మఱిమఱి యెత్తుచు, నన్నివర్ణంబుల ♦ నరసిచూచి
యేపుణ్యవశమున ♦ [౨౩]నీజన్మ మెత్తితో, విప్రదేహం బిపుడు ♦ విమలచరిత
ఈజన్మమందైన ♦ నిప్పుడే నీసేవ, మానక చేసెద ♦ మానినంద్య
వేదశాస్త్రంబు లన్నియు ♦ వెదకిచూచి, తప్పుగాకుండ నడువ నా♦తరము గాదు
శరణుఁజొచ్చితి నిఁక నాకు ♦ శంకలేల, రామతారక దశరథ♦రాజతనయ. ౨౩

---

(20) ౧. ఫలమెత్తి. ౨. శేషవాసనలచేఁ జిక్కి. 3. కథ వీనుల. ౪. బాడ, అచ్చు పాఠము ౫. నిత్యంబు. ౬. అఖిలవిభవంబు లెల్లను నల్పముగను. * మిమ్ము. ౭. ధ్యానమున మిమ్ము సన్నుతింప. (21) ౮. రక్షింప పరఁగంగ మీసేవఁ♦ప్రాప్తికొఱకు. ౯. మీ. †/యాశ్రయవంతుల. ౧౦. కృపఁజూచి♦ పరిపూర్ణ మెఱిఁగించి. ౧౧ తోడుతఁబిల్చి. ౧౨. రించి. ౧౩. నోర్వ. ౧౪. మాయదెలిసి. (22) ౧౫ కర్మపాపులకెల్ల బలమిచ్చు టది కీర్తి. ౧౬. యెడ పేరు. ౧౭. సంగ్రహించుట. ౧౮. ఘనుల రక్షించుట ఘనతగాదు. ఘనత. ౧౯. సరస. ౨౦. రీ. (28) ౨౧. నితరజన్మంబులు నెత్తియెత్తి. ౨౨. పక్షిమృగములయందు పలుమాఱు జన్మించి నితరజన్మంబుల నెత్తియెత్తి. ౨౩. యెత్తితినో కాని.

సీ. దశరథాత్మజ నీకు • దండంబు దండంబు, వైదేహీపతి నీకు • వందనంబు
కౌసల్యసుత నీకుఁ • గలుగుఁ గల్యాణంబు, జానకీపతి నీకు • జయము జయము
అమరవందిత నీకు • నాయు౧రారోగ్యము, ౨దశరథసుత నీకు • శరణు శరణు
నీలమేఘశ్యామ • నీకు౨సాష్టాంగంబు, సురరాజపూజిత • శుభము శుభము
అనుచు వర్ణించి భజియించి • యాత్మఁ3దలఁచి, నిలిచి సన్మార్గవంతుఁడై • నిన్నెఱుంగు
నతనిఁ గనుఁగొన్న ఫల మెన్న • నావశంబె, రామతారక దశరథ • రాజతనయ. ౨౪

సీ. భానువంశమునందుఁ • బ్రభుఁడవై జన్మించి, యఖిలవిద్యల నెల్ల • నభ్యసించి
తాటక మర్దించి • తపసియాగముఁ గాచి, శిలను శాపము మాన్పి • స్త్రీని జేసి
శివుని చాపము ద్రుంచి • సీతను బెండ్లాడి, పరశురాముని త్రాణ • భంగపఱచి
తండ్రివాక్యమునకై • తమ్మునితోఁ గూడి, వైదేహితోడను • వనము కరిగి
ఖరదూషణాదుల • ఖండించి రాక్షస, మారీచమృగమును • మడియఁజేసి
* లంకకు రాజైన • రావణాసురుఁ డంత, సతిఁ గొనిపోవంగ • సంభ్రమించి
సుగ్రీవుఁ గనుఁగొని • సుముఖివై యప్పుడు, వాలిని వధియించి • వరుసతోడ
రాజ్య మాతని కిచ్చి • రాజును జేపట్టి, కిష్కింధ నేలించి • కీర్తి వడసి
వాయుసుతుచేత జానకి • వార్త దెలిసి, తర్లి సేతువు బంధించి • త్వరగ దాఁటి
రావణానుజు కభయంబు • రయము నొసఁగి, ఘోరరణమందు రావణుఁ • గూలనేసి
యతనితమ్ముని రాజుగా • నమరఁజేసి, సతినిఁ జేకొని సుర లెల్ల • సన్నుతింప
రాజ్య మేలి యయోధ్యకు • రాజ వైన, రామతారక దశరథ • రాజతనయ. ౨౫

సీ. దేహంబు విడిచెడు • దినము తా నెఱుఁగఁడు, ౪కర్మంబు వచ్చుట • గానలేఁడు
మూఁడవస్థలలోన • మునిఁగి తేలఁగలేఁడు, ఆర్గురు శత్రుల • నణఁపలేఁడు
మగువ ౫† లురములందు • మమతమానఁగలేఁడు, వాఁడు వీఁడనుపల్కు • వదలలేఁడు
అభిమాన౬రహితుఁడై • యాశ లుడుగఁగలేఁడు, యించుక హరిమాయ • యెఱుఁగలేఁడు
౭కన్నులందును బ్రహ్మంబు • గనఁగలేక, బుద్ధిహీనులకడ కేగి • పొందుచేసి
యుదరభరణంబు ౮గానక • నుర్విలోన, రామతారక దశరథ • రాజతనయ. ౨౬

---

(24) ౧ రారోగ్యంబు శరచాపధర. ౨. నమస్కారము. 3. యందు. * రాక్షస రాజైన. (26) ౪. మనసునకపటంబు మానలేఁడు. ౫. † రతులందు. రక్తములందు పలుమాఱు జన్మించి వారు వీరను. ౬. త్యాగియై ఆత్మయందైనను. ౭. నరుఁడు బ్రహ్మంబు తానని నటనఁజేసి బుద్ధిహీనులకెల్లను బోధచేసి. ౮. కొఱకైన.

సీ. ౧నీతి యెఱుంగవు ♦ నిందకు నోడవు, చంచలం బెప్పుడు ♦ చెడ్డగుణము
వాయువేగముకంటె ♦ వడిగలవాఁడవై, పాఱెద వెప్పుడు ౨పడుచుతనము
పేరు వేఱొక్కటి ♦ పిలుచుట యొక్కటి, ౩చేయువకర్మంబు ♦ చెప్పలేవు
౪పుత్రమిత్రాదులే ♦ పుణ్యలోకం బని, సద్గతి యెఱుఁగవు ♦ జడుఁడ వగుచు
మనసు ఈరీతి ౫వర్తించు ♦ మందమతిని, నడచి ౬నరకంబు కేగుట ♦ నయమె నీకు
ముందు ౭తెలియక విహరించి ♦ మోసపోక, రామతారక దశరథ♦రాజతనయ. ౨౭

సీ. యమునిచే బాధల ♦ ౮నెట్లోర్వవచ్చును, నగ్ని౯కంభమునను ♦ నంటఁగట్టి
పాపంబు నానోట ♦ పల్కించి యొప్పించు, చిత్రగుప్తునిఁ బిల్చి ♦ చెప్పు౧౦మనుచు
తప్పక వారు నా ♦ తప్పులన్నియుఁ జెప్ప, నుగ్రుఁడై దూతల ♦ కొప్పగించు
బాధించువేళ ౧౧నా♦బ్రతు కేలాగో యని, యేడ్వంగ నెవ్వరు ♦ వెంటరారు
తెలిసి ౧౨వర్తించి యిపుడైన ♦ తెలివి గలిగి, యనుదినంబును శ్రీరాము♦నాశ్రయించి
౧౩మ్రొక్కి సేవించి కనుఁగొంటి ♦ మోక్షపదవి, రామతారక దశరథ♦రాజతనయ.

సీ. మతిమతీ నాయొక్క ♦ మర్మకర్మంబులు, ప్రఖ్యాతిచేసెద ♦ పాపహరణ
ధర్మ౧౪శీలుం డైన ♦ ధన్వంత్రి దొరకితే, దేహరోగంబెల్లఁ ♦ దెలిపినట్లు
గురుశిష్యుఁ డైనట్టి ♦ గురువును గనుఁగొని, ముక్తిమార్గమునకై ♦ మ్రొక్కినట్లు
రక్షింపఁదలఁచిన ♦ ౧౫రాజులఁ గనుఁగొని, యార్తుఁడై యన్నంబు ♦ నడిగినట్లు
విన్నవించెద నీవార్త ♦ విమలచరిత, అగణితం బైనకలుషంబు ♦ లణఁగఁజేసి
నిర్మలాత్మునిగాఁ ౧౬జేయు ♦ నిగమవేద్య, రామతారక దశరథ♦రాజతనయ. ౨౯

సీ. ఎన్నిజన్మంబుల ♦ నెత్తుదు నేనని, తప్పక పలుకు ౧౭నా ♦ తపసి యొకఁడు
౧౮శత్రుమిత్రులనైన ♦ సమముగాఁ జూచుచు, శ్రీహరిన్ నమ్మిన ♦ సిద్ధుఁ డొకఁడు
సకలేంద్రియంబుల ♦ సాధకంబునఁబట్టి, ముక్తుఁడైయుండు౧౯ నా♦మునియునొకఁడు
బ్రహ్మ యీరీతివాఁ డని ♦ పలుకవచ్చుఁ, ౨౦గాని యితరులు నేర్తురె ♦ కనుఁగొనంగ
సకలవేదాంతములఁ గల్గు ♦ సార మిదియ, రామతారక దశరథ♦రాజతనయ. 30

---

(27) ౧. నీతిగుణు తెలుఁగవు. ౨. పదమునందు. 3. వేఱుకరంబుల చెప్పలేఁడు. ౪. పెట్టినవి త్తేది ♦ పేరు తానెఱుఁగఁడు, వేఱొక్కఫల మద్గు♦వెఱ్ఱితనము. ౫. వర్తించి ౬. నగరంబు. ౭. యెఱుఁగక. (28) ౮. నెట్లు లోర్చెద వీవు. ౯. స్తంభాలకు. ౧౦. డనిన. ౧౧. యీబ్రతుకు కెట్లోకాని యడ్డమెవ్వరు మాకు అచట రారు. ౧౨. వర్తించునెడనైన. ౧౩. నిర్మలాత్మఁడ నైయుందు నిమ్మతోడ. (29) ౧౪. శీలు. ౧౫. రాజునునార్థుఁడై యర్థంబు. ౧౬. జేయ నిగమవినుత. (30) ౧౭. నుఁ. ౧౮. పాదత్రయంబున పరవశుండునుగాక జాగ్రతగానుండు జపిత యొకఁడు. ౧౯. ను. ౨౦. గాక.

సీ. జపము దేవార్చనం • ౧జెందనిజన్మంబు, తామసంబునం జేయు • తపసితపము
పతిభక్తి లేనట్టి • పణంతుల వ్రతములు, యజమాను గూర్పని • యాగములును
గురుభక్తి లేనట్టి • ౨గూఢమంత్రంబులు, విత్తమార్జించెడి • వేదములును
౩కాసుల కాసించు కన్యదానంబులు, ధనము వాటునగొన్న • ధర్మములును
యెంచిచూచిన నివియెల్ల • నేమిఫలము, ఫలము దెలియంగనేరక • పాటిందప్పి
నడచి ౪నరకంబు కేగుట • నయముగాదు, రామతారక దశరథ•రాజతనయ. ౩౧

సీ. అఖిలాండకోటి బ్రహ్మాండనాయక! నీవు, ముచికుందునకు మోక్ష • మొసంగినావు
అకుచేలునిచేతి • యడుకులు భక్షించి, ౫నెడలేని సంపద • లిచ్చినావు
శరణాగతత్రాణ! • శబరితెచ్చినపండ్లు, నంచితంబుగ నారగించినావు
వేదవేదాంగ! యా • విదురునియన్నంబు, కోరి వేడుకతోను • గుడిచినావు
జానకీనాథ! మీదాస•జనులయిండ్ల, తులసిదళమైన మీ జిహ్వ • తృప్తిం బొందు
నచ్యుతానంత గోవింద • హరిముకుంద, రామతారక దశరథ•రాజతనయ. ౩౨

సీ. ఆశ్రమధర్మమం • దాస నొందిన౬వాడు, సత్యవ్రతం బెప్డు • సలుపువాడు
శ్రీరాము నర్చించి • సిరియుం గోరిన౭వాడు, మమకారబుద్ధియు • మాను౮వాడు
లబ్ధపదార్థంబు • ౧౦లాభంబు లనువాడు, పరులకు హితవుగాం • బలుకువాడు
౧౧యోగసంసారికి • యోగిగాంగలవాడు, సాత్త్వికాంశమునందు • సముఖంజేయు
౧౨నిట్టివల్లభు గుణముల • నెంచవలయుం, గాక ౧౩కడుభక్తి వేషంబు • గణనంజేయ
వలదు సంసారబద్ధుల • వాంఛగాక, రామతారక దశరథ•రాజతనయ. ౩౩

సీ. విష్ణుప్రసంగముల్ • ౧౪వేడ్కతో వినువాడు, పులకాంకురంబులు • పొడమువాడు
౧౫హరిం గానంగా మది • నాస కల్గినవాడు, సకలోపచారము • ల్సలుపువాడు
అతని కర్పించి తా • ననుభవించెడివాడు, ౧౬నుతుని కైవడి నర్థిం • జూచువాడు
౧౭సాధుల మాన్యుల • సౌఖ్యపెట్టెడివాడు, ఎదలోన శ్రీరాము • నెంచువాడు
పుణ్యపురుషుండుభక్తుండుం•బూజితుండు, ధర్మమార్గుండు ౧౮ధన్యుండుం•ధార్మికుండు
కలండు వేయింట నొక్కండు • కడమ లేడు, రామతారక దశరథ•రాజతనయ. ౩౪

---

(31) ౧. జెంద నిర్జప్యంబు, తామసంబునం జేయు • తపసివనము. ౨ గుహ్య మంత్రంబులు. ౩ కాసు లార్జించేటి • కన్యకాదానంబు. ౪. యరుదెంతురెల్లను నరకమునకు. (32) ౫. యెడ తెగని. ౬ఇంపైన. (33) ౬. వాడు. ౭. సత్యవాక్యం... అచ్చుపాతము. ౮. వారు. ౯. వాయ. ౧౦. లాభ మనెడివాడు. ౧౧. అతిథివచ్చినంజూచి•హర్ష మొందెడి వాడు-చిత్తమెప్పుడు హరిం•జేర్చువాడు. ౧౨. యోగి సంసారికి గుణంబెంచ. ౧౩. డాంబిక. ౧౪. గోర. (34) ౧౫. వీనుల. ౧౬. .హరిలాంఛనంబుల హస్తముల్ గలవాడు. ౧౭. సుమతునికైవడి. ౧౮. సాధుసమాజసౌఖ్య మొందెడువాడు. ౧౯. ధన్యుండౌ.

సీ. తల్లిదండ్రులఁ గన్న ♦ తాతముత్తాతలు, తరలిపోయినవార్త ♦ తాను దెలిసి
[౧]జీవించు పెక్కండ్రు ♦ జీవకోట్లను జూచి, జననమరణాదుల♦జాడ లెఱిఁగి
సర్వకాలము నిల్చి ♦ [౨]శాంతతనుండు నా, విభవంబు రాజుల ♦ వింతఁ జూచి
[౩]సారంబు లేనట్టి ♦ సంసారవేదన, మనమునఁ జొరనీక ♦ మట్టుపఱచి
కనియుఁ గానంగఁజాలరు ♦ కర్మవశులు, అస్థిరంబెల్ల * స్థిరమందు ♦ [౪]కరవనిజనులు
[౫]సన్నుతింపరు మిమ్మును ♦ సంతతంబు, రామతారక దశరథ♦రాజతనయ. 3౫

సీ. ఈషణత్రయముల ♦ నీక్షించి మదిలోన, మేలు లేదని [౬]విడ్చు ♦ మేటి యొకఁడు
[౭]సద్గుణంబులు తనకు ♦ సామాన్య మని యెంచి, స్వస్థుఁడైయుండెడు ♦ సాధువొకఁడు
అష్టభోగంబుల ♦ నాభాసమని యెంచి, తుచ్ఛంబుగాఁ జూచు ♦ [౮]చాతుర్యుఁడొకఁడు
విషయంబులనుబట్టి ♦ [౯]విరియింపఁజాలక, నూటిదప్పక చూచు ♦ సుముఖుఁ డొకఁడు
వనము పురమని కోరక ♦ [౧౦]వాన యనక, యెండ మంచు లటంచును ♦ నెఱుఁగలేక
యుండు నీరీతి యవధూత ♦ లుర్విలోన, రామతారక దశరథ♦రాజతనయ. 3౬

సీ. జన్మమెత్తినఫలము ♦ జగదీశ్వరునియొక్క, [౧౧]బలు రమ్యగుణకథల్ ♦ పలుకనైతి
బుద్ధిగల్గిన ఫలము ♦ బుధులచెంతను జేరి, హరిఁ జేరుమార్గంబు ♦ లడుగనైతి
కాయంబు గలఫలము ♦ కర్మసంసారినై, నీయందుఁ జిత్తంబు ♦ నిల్పనైతి
బహువత్సరంబులు ♦ బ్రతికిన బ్రతుకును, సకలతీర్థాటన ♦ సల్పనైతి
బాల్యకౌమారయౌవన♦భ్రాంతిచేత, వ్యర్థ[౧౨]మాయెను గాలంబు ♦ వేదవేద్య!
ద్రోహి [౧౩]శరణంటి ననుఁ గావు♦ దొడ్డఘనత, రామతారక దశరథ♦రాజతనయ. 3౭

సీ. సంభ్రమించినఫలము ♦ సంసారరహితుఁడై, భజియించి నిశ్చల♦భక్తుఁ డగుట
భక్తివాత్సల్యంబు ♦ భావంబులో నెఱిఁగి, యటుమీద సంతాన ♦ మమరఁజేయు
సంతానమార్గంబు ♦ సత మని పాటించి, సారెకు సారెకు ♦ సరవి నిడక
ప్రారబ్ధభవములు ♦ ప్రబలిన నెఱనమ్మి, యమృతస్వరూపుఁడై ♦ యలరుచుండు
పడక చదువులమీఁది పం♦డరులకెల్ల, కోటివిద్యలు నవియెల్ల ♦ కూటికొఱకు
కోన భేదించి యెలుకను ♦ గొనఁగవలెనె, రామతారక దశరథ♦రాజతనయ. 3౮

---

(3౫) ౧. జీవించి పెక్కండ్లు జీవకోట్లుండునా. ౨. సంపదనుండుజా. 3. సారము లేనట్టి పాపపుసంసార యాపదలను తాను. *అస్థిరంబెల్ల స్థిరమన కవనిబుధులు. ౪. యల్ప మతులు. ౫. సంతతధ్యానమున మిమ్ము సంస్మరించి. (3౬) ౬. వీడు. ౭. షడ్గుణంబులు. ౮. శూరు. ౯. విషయసంబంధుఁడై. ౧౦. వానికెరక. ౧౧. భవ్యంపుగుణకథల్. (3౭) ౧౨. ముడిపితి. ౧3. శరణన్నఁ గాచుట దొడ్డతనము.

సీ. మధు శర్కర క్షీర ♦ దధి ఘృతంబులకంటె, రామనామామృత♦రసము ౧తీపి
పనస సద్ద్రాక్షాది♦ఫలరసంబులకంటె, రామనామామృత♦రసము తీపి
మకరందఖర్జూర♦మాధుర్యములకంటె, రామనామామృత♦రసము తీపి
నవసుధాపరమాన్న♦నవనీతములకంటె, రామనామామృత♦రసము తీపి
రామనామంబునకు నేది ♦ రాదు సాటి, రామనామంబు సేవించి ♦ (?) నారదుండు
బ్రహ్మఋషియయ్యె నిహమందుఁ ♦ బదవినొందె, రామతారక దశరథ♦రాజతనయ.

సీ. శ్రీమంతుఁడగు రామ♦చంద్రునిఁ ౨దలఁచిన, సఱచేలమోక్షంబు ♦ నందినట్లు
జయరామనామంబు ♦ జపముగావించిన, ౩జీవాత్మయును ముక్తి ♦ జెందినట్లు
కాకుత్థ్సతిలకునిఁ ♦ గన్నులఁ జూచిన, ౪బహుపేదలకు ధనం ♦ బబ్బినట్లు
శ్రీరామచంద్రుని ♦ సేవింపఁగలిగిన, సప్తభోగంబులు ♦ సమరినట్లు
కరుణగలయట్టిసద్గురుఁ ♦ ౫గనినయట్లు, జీవనదులందు స్నానంబుఁ ♦ జేసినట్లు
కుటిలములు లేక జ్ఞానంబు ♦ కుదిరినట్లు, రామతారక దశరథ♦రాజతనయ. ౪౦

సీ. ౬ఓరాఘవా యని ♦ ఒకసారి దలఁచిన, దుఃఖదోషము లన్ని ♦ దొలఁగిపోవు
ఒనర రెండవసారి ♦ ౭యోరాఘవా యన్న, బహుభోగభాగ్య సం♦పదలు గల్గు
చెలఁగి మూఁడవసారి ♦ శ్రీరాఘవా యన్న, ముక్తుఁడై వైకుంఠ♦మున వసించు
రమణ నాల్గవసారి ♦ రామచంద్రా యన్న, నతనిబుణస్థుఁడ ♦ వయ్య నీవు
అల్పసంతోషసులభుఁడ ♦ వగుదువయ్యా, యెలమి యాజీవపర్యంత ♦ మరయ మిమ్ముఁ
౯దలఁచువారికి నాపద ♦ ల్దొలఁగుచుండు, రామతారక దశరథ♦రాజతనయ. ౪౧

సీ. కీడు మే ౧౦లవి రెండు ♦ క్రిందటి ౧౧భవమున, సంగ్రహించినయట్టి♦సంచితంబు
ననుభ౧౨వించుచు నప్పు ♦ డాత్మతథ్యము లేక, మేనెల్ల తమ దని ♦ మెచ్చుకొనును
కీడువచ్చినవేళ ♦ ౧౩క్రియ కోర్వఁజాలక, పాపంబు దలఁతురు ♦ ౧౪భ్రాంతిచేత
౧౫నట్టిపాపంబు తా ♦ ననుభవింపుచునుండు, పాయని సంసార♦పాశములను
బద్ధులయియుండ్రు దుర్జను ♦ ల్పొందలగుచు, ౧౬పాపఫలములు భావనా♦భ్రాంతిజములు
వలన దితరులవలె నట్టి♦వాంఛ గోర, రామతారక దశరథ♦రాజతనయ. ౪౨

---

(39) ౧. కదళికామకరంద ఖర్జూరములకంటె. (*తీపి=తీపు. అని ఇతరప్రతులలో నున్నది.) (40) ౨. ని. ౩. జీవాత్మునకు. ౪. అరి. ౫. గలిగినట్లు. (41) ౬. రామ హరి యని. ౭. రామయని. ౮. భద్రస్నముఖ్యమై. ౯. భజియించువారికి మేలిమగును, పరఁగ నాపద లన్నియుఁ దొలఁగుటరుదె. (42) ౧౦. లను. ౧౧. జన్మంబు. ౧౨. వించక నరుఁడాత్మన. ౧౩ క్రిమి. ౧౪. ప్రజలమీఁద. ౧౫. శత్రుఁడై నిందలఁ జెందియుఁ దలపోసి బాధింపఁజొత్తురే భ్రాంతిచేత, పూర్వజన్మంబు చేసిన పుణ్యమైన. ౧౬. ప్రాప్త ఫలమైనఁ బాయదు ప్రాప్తిగాక.

సీ. కర్మశేషమువల్లఁ • గలుగు జన్మంబును, జన్మహేతువువల్ల • ౧జెడు నతండు
మూఢుఁడై యుండరి • ముచ్చట దెలియక, బద్ధులై యుందురు • ౨భ్రాంతితోడ
౩తనువె సంసారంబు • తథ్యం బని తలంచి, హరినామ౪భజనమం • దార్తి లేక
౫అనుదినంబును నరు • లాసక్తులైనట్టి, పుత్రమిత్రాదులే • ౬పుణ్యమనుచు
పరుల యాచించి పీడించి • పాపమొంది, పుట్టు నీరీతి కాలంబు • ౭పుడమిలోన
మిమ్ముఁ జింతింపఁ జేయరు • మీపదంబు, రామ తారక దశరథ • రాజతనయ. ౪౩

సీ. రామరామాయని • రంజిల్ల నావంతు, నిజముగా రక్షింప • నీదువంతు
అపరాధి నని పల్కి • యాచింప నావంతు, నిజముగా రక్షింప • నీదువంతు
నీపాదపద్మంబు • ౮నెఱనమ్మ నావంతు, నిజముగా రక్షింప • నీదువంతు
౯శరణు శరణని పల్కి • చరియింప నావంతు, నిజముగా రక్షింప • నీదువంతు
నేను పంతంబు దప్పక • నిన్నుఁ గొలుతు, నీవు పంతంబు దప్పక • నిర్వహింపు
పంత మిది నీకు నాకును • బరమపురుష, రామ తారక దశరథ • రాజతనయ. ౪౪

సీ. కోటిగోవులమంద • గోదాన మొసఁగిన, ౧౦సరిరావు మీనామ • సంస్మరణకు
కాశీప్రయాగగం • గాదితీర్థంబులు, సరిరావు మీనామ • సంస్మరణకు
బహుయజ్ఞములు సేసి • ప్రస్తుతికెక్కిన, సరిరావు మీనామ • సంస్మరణకు
౧౧వేదశాస్త్రంబులు • వెదకిచూచినఁగాని, సరిరావు మీనామ • సంస్మరణకు
౧౨అరయ నిను నెన్నవశమె • బ్రహ్మాదులకును, బుధజనస్తోత్రసద్గుణ • పుణ్య౧౩చరిత
యఖిలసురవంద్యదివ్యపా • దారవింద, రామ తారక దశరథ • రాజతనయ.

సీ. అల్పులమాటల • కాసింపఁగానేల, * పండు బూరువుఁజూచి • భ్రమసినట్లు
నీచులమాటల • నిశ్చయింపఁగనేల, నీరు గట్టిన మాట • నిలిచినట్లు
గుణవి౧౪హీనునిమాట • గుఱిసేయఁగానేల, గొడ్డుగోవులపాలు • § కోసరినట్లు
కపటఘాతుకుమాట • కాంతసేయఁగనేల, కలలోను ౧౫మేలు దా • గన్నయట్లు
పామరులమాట నెంతైనఁ • బాటిజేసి, యడుగఁగోరెడి వారిదే • ౧౬యల్పబుద్ధి
నీతిమంతుల కివి యెల్ల • నిశ్చయములు, రామ తారక దశరథ • రాజతనయ. ౪౬

---

(43) ౧. జేయువాఁడు. ౨. భ్రాంతులగుచు. ౩. తనువు...తథ్యంబుతలపోసి. ౪. కీర్తన యాస్తిలేక. ౫. అంతయునార్జించి • యనుభవింపఁగలేక-యాసక్తులై నరు • లను దినంబు. ౬. పుత్రదారాదిదాక్షిణ్య • పుణ్య మనుచు. ౭. భూమిలోన. (44) ౮. నిరతము సేవింప. ౯. శరణుశరణనిపల్కి సేవింపనావంతు. (45) ౧౦. గోవులమందల కోటిదాన మొసఁగిన. (వ్రాతప్రతులన్నిటిలోను అంత్యపాదమున "సరిరాదు మీపాదసేవ కొకటి" అని యున్నది) ౧౧. పుణ్యస్థలంబులు పొలుపారఁ జేసిన. ౧౨. యెంచ నెవ్వరిశక్యంబు వసుధలోన. ౧౩. పురుష. (46) ౧౪. హీనుల...సేయనేటికి. ౧౫. మేను అచ్చుపారము. ౧౬. అపర.
* ఫలము బూరుగ. § గోరినట్లు.

సీ. శ్రీరామనామంబు ♦ చిత్తాబ్జమున నిల్పి, *[౧]వామలోచనభవ్డు ♦ వాసికెక్కె—
కాకుత్థ్సతిలకుని ♦ కరుణారసంబునఁ, గల్పాంతరస్థితిఁ ♦ గపి వహించె
[౨]ఖరవైరి పదరేణు♦కణములు సోఁకిన, కలుషము [౩]ల్వాసెను ♦ కాంత కపుడు
పులుఁగులాయఁడు రఘు♦పుంగవు నుతియించి, నిర్వాణపదమంది ♦ నిలిచె [౪]వేడ్క—
హాటకాంబరు లక్ష్మీశు ♦ నాత్మఁ దలఁచి, కూర్మి నరులార మోక్షంబు ♦ కొల్లగొనుఁడి
రామనామామృతమునకు ♦ [౫]రాదు సాటి, రామతారక దశరథ♦రాజతనయ. ౪౭

సీ. సకలభూత[౬]వ్రాత♦సంఘవిధ్వంసంబు, రామతారకమంత్ర♦రాజ మరయ
సకలరక్షోవీర♦జాలనిర్మూలంబు, రామతారకమంత్ర♦రాజ మరయ
సకల[౭]తీర్థామ్నాయ♦సారసంగ్రహవేది, రామతారకమంత్ర♦రాజ మరయ
సకల[౮]మాలిన్యంబు ♦ సమసినట్లుగఁ జేయు, రామతారకమంత్ర♦రాజ మరయ
సకలమునిజనచిత్తాబ్జ♦సారభృంగ, మైన శ్రీరామనామంబు ♦ ననుదినంబు
స్మరణసేయుఁడి జనులార ♦ సత్ఫలంబు, రామతారక దశరథ♦రాజతనయ. ౪౮

సీ. గాధినందను యజ్ఞ♦కార్యంబు సమకూర్ప, ప్రకటితం బగు తపః♦ప్రాభవంబు
వాసవతనయుని ♦ వసుధపైఁ [౯]బడవైచి, వర్ణన కెక్కిన ♦ వైభవంబు
రావణుఁ డాదిగా ♦ రాక్షసావళినెల్ల, నాశ మొనర్చిన♦నైపుణంబు
పాండవాదులకును ♦ బార్థివుఁడై యుండి, పారమార్థిక మైన ♦ పరమపురుషుఁ
డిట్టికార్ముకదీక్షాధు♦రీణుఁడయిన, భూమిజాధిప మిమ్మను ♦ బుద్ధియందుఁ
దలఁచి కైవల్య మందిరి ♦ తత్త్వవిదులు, రామతారక దశరథ♦రాజతనయ. ౪౯

సీ. నాముద్దులయ్యను ♦ నాదేవదేవుని, నాపిన్నయన్నను ♦ నామురారి
నారత్న[౧౦]ముమునుపట్టి ♦ నాబంగరయ్యను, నానిధానము [౧౧]రాము ♦ నావిష్ణు
నాకూర్మిశౌరిని ♦ నాబ్రహ్మతండ్రిని, నారఘురాముని ♦ [౧౨]నాదుహరుని
నామనోనాథుని ♦ [౧౩]నానోముఫల మైన, నాజానకీ[౧౪]ధవు ♦ నామహాత్ము
వెదకి కీర్తించి [౧౫]హర్షించి ♦ వేఁడుకొనిన, నఖిల [౧౬]సంపదలిప్పుడు ♦ నమరినట్లు
తప్పు[౧౭]త్రోవలఁ బోయిన ♦ ధన్యుఁడగును, రామతారక దశరథ♦రాజతనయ. ౫౦

---

(47) ౧. వారిలోచనధవుఁడువార్త. * ఫాలలోచనుఁ డిల ప్రణుతికెక్కె. ౨. మురవైరిపదములకములుసోఁకినగాని. 3. ల్మానె గౌతమసతికిని. ౪. వెనుక. ౫. కేదినయము అచ్చుపాఠము. (48) ౬. పిశాచ. ౭. ...పురాణాదిసన్నుతతత్త్వంబు. ౮. వేదార్థాది సారసంగ్రహవేది. (49) ౯. బవళించి. (50) ౧౦ ములపట్టి. ౧౧. నామురారి. ౧౨. నాదువిభుని. ౧3. నానందనందను. ౧౪. పతి. ౧౫. ప్రార్థించి. ౧౬. సౌభాగ్యసంపద గలుగుఁగాక. ౧౭. పోకడఁ బోకుఁడి ధన్యులార.

సీ. శ్రీజానకీనాథ ♦ శ్రీరామగోవింద, వాసుదేవ ముకుంద ♦ వారిజాక్ష
శ్రీరంగనాయక ♦ శ్రీవేంకటేశ్వర, ప్రద్యుమ్న యనిరుద్ధ ♦ పంకజాక్ష
శ్రీరుక్మిణీశ్వర ♦ ౨శ్రీహృషీకేశ యో, నారాయణాచ్యుత ♦ నారసింహ
శ్రీరమావల్లభ ♦ శ్రీజగన్నాయక, శ్రీధర భూధర ♦ శ్రీనివాస
రామ జయరామ రఘురామ ♦ రామరామ, ౩యనుచుఁ దలఁచెదనీనామ♦మాత్మయందు
కష్టములఁ దీర్చి రక్షించి ♦ గారవించు, రామతారక దశరథ♦రాజతనయ. ౫౧

సీ. ౪కడవాఁడనా నీవు ♦ కన్నులఁ జూడవో!, నీబంటుబంటను ♦ నీరజాక్ష
౫ద్దవాఁడని నన్ను ♦ సరకుసేయవదేమొ, పతితపావనబిరుద ♦ పద్మనాభ!
౬వీఁడెవ్వఁ డని నన్ను ♦ విడనాడెదో యేమొ, కరుణాసముద్ర ౭యో ♦ కమలనయన
౮వేఁబు సేసియు నన్ను ♦ వెలితిగాఁ జూడకు, గోపాలభూపాల ♦ గోపవేష
ఆదిదేవ పరంధామ ♦ యవ్యయాత్మ, శ్రీరమానాథ శ్రితపోష ♦ శ్రీనివాస
కాచి రక్షింపు ౯మిఁక నన్నుఁ ♦ గామజనక, రామతారక దశరథ♦రాజతనయ. ౫౨

సీ. చిన్నిముద్దులయన్న ♦ చిన్నారిపొన్నారి, ౧౦సురభూజమా రార ♦ సుందరాంగ
నన్నుఁగన్నయ్య నీ ♦ కెన్న నన్యుఁడఁగాను, ౧౧నవ్వులుసేయకు ♦ నాగశయన
దిక్కుమాలిననన్ను ♦ దేవర ౧౨ప్రోవుమీ, చక్కనినాపాలి♦చక్రపాణి
అక్కఱతో నన్ను ♦ నాదరింపుము వేగ, నిక్కంబు నీవాఁడ ♦ నీలవర్ణ
యనుచు ౧౩వేఁడితి రక్షింపు ♦ మరసి నన్ను, ౧౪నెంచలేదని నీమది ♦ నెంచవలదు
కరుణ౧౫జూడుము నామీఁద ♦ కామజనక, రామతారక దశరథ♦రాజతనయ. ౫౩

సీ. ఎంతని వేడుదు ♦ నెంతని దూఱుదు, నెంతని ౧౬భాషింతు ♦ నేమి సేతు
నెంతని చింతింతు ♦ నెంతని భావింతు, నెంతని సేవింతు ♦ ౧౭పంత మేల
నింతింతన ౧౮వశమె ♦ యిందిరారమణ నీ, సచ్చిదానంద౧౯సౌం♦దర్యమహిమ
చెప్పను జూడను ♦ జెవుల వినంగను, ౨౦శక్య మెవ్వరికి నా♦స్వామి నీదు
వేషభావలు వర్ణింప ♦ వేయినోళ్ల, శేషునకునైన ౨౧వశ మౌనె ♦ శ్రీనివాస
౨౨గాన మనుజుండ వర్ణింపఁ ♦ గలనటయ్య, రామతారక దశరథ♦రాజతనయ. ౫౪

---

(51) ౧. సుజ్ఞాన. ౨. శ్రీకృష్ణ. 3. నామములు దలఁచి నిన్ను నేనమ్మినాను। కాచిరక్షించునన్నుఁ గరుణతోడ. (52) ౪. కల్లలాడని నన్ను. ౫. వాడఁదలఁపకు. ౬. కాకుత్స్థతిలక. ౭ తేరగాఁ డని నన్ను తేరగాఁజూడకు. ౮. మనోనాథముఁబ్రోవు. ౯. దిక్కు నీకన్న నెవరు. (53) ౧౦. బ్రహ్మలభోజరాంబాలకృష్ణ. ౧౧. నన్. ౧౨. వై బ్రోవు. ౧౩. నుండెద...నీవునన్ను. ౧౪. యెంతలేదని మనసులో వింతలేక. ౧౫. దయ యుంచవేమిరా కన్నతండ్రి. (54) ౧౬. భూషింతు. ౧౭. యేమనందు. ౧౮. రాదు యింత చింతిలరాదు. ౧౯. సౌభాగ్య. ౨౦. శక్యంబుగాదు. ౨౧. తీరదు శ్రీవిహార. ౨౨. మానవుఁడ నిన్ను నుతిసేయఁ బూనఁగలనె.

సీ. మాయలవాఁడ నీ♦మాయలన్నియుఁ జూడ, జలధులన్నియు మాయ ♦ జనులు మాయ
౧సూర్యుండు నీమాయ ♦ చుక్కలు నీమాయ, యింద్రుండు నీమాయ ♦ చంద్రు మాయ
౩*అరయ నగ్నియును మే♦ఘంబును నీమాయ, యుడుములు నీమాయ ♦ మెఱుపు మాయ
౪వర్షధారలు మాయ ♦ వానకాలము మాయ, చలికాలమును మాయ ♦ చలియు మాయ
యిట్టిమాయలు గట్టిగా ♦ నిలను నిలిపి, జనులకెల్లను ౫గర్వము ♦ ల్గలుగఁజేసి
జగతి నడుపుదు వీరీతి ♦ శాశ్వతముగ, రామతారక దశరథ♦రాజతనయ. 55

సీ. ౬నీచమీనంబవై ♦ నీచవృత్తిని జొచ్చి, సోమకుఁ జంపిన ♦ శుభగ ౭రామ
తలలేనివాఁడవై ♦ తగఁ గొండ మోసిన, పతితపావన ౮బిరుద ♦ పద్మనాభ
౯మిట్టరోమంబుల ♦ మేదిని ౧౦మూతితో, ద్రొబ్బుచు విహరించు ♦ దుష్టహరణ
సగము సింగం బయి ♦ జగదపకారిని, నుదరంబు ౧౧భేదించు ♦ నరగళయన
తిరిపెంపువాఁడవై ♦ మురియుచు ౧౨గొడ్డంటు, ౧౩తిరుగుచు హాలివై ♦ తివురుగొల్ల
౧౪తనువు గైకొని వ్రతములు ♦ దలఁగఁజేసి, గుఱ్ఱ మెక్కిన శతకోటి ♦ కోటిమదన
మోహనాంగ ద౧౫యానిధి ♦ ముద్దులయ్య!, రామతారక దశరథ♦రాజతనయ. 56

సీ. కేశవదేవుని ♦ కీర్తనానలముచే, కలుషాటవుల నెల్లఁ ♦ గాల్పవచ్చు
వాసుదేవస్మరణ ♦ ౧౬వాడచే సంసార, వార్ధి దాఁటగవచ్చు ♦ ౧౭వసుధలోన
శ్రీరామ౧౮దేవుని ♦ చింతనఁ జేసి యా, భవసంఘముల భంగ♦పఱుపవచ్చు
పద్మనాభస్తోత్ర♦భవ్య మొగొడ్డంటు, దురిత౧౯వనాటులఁ ♦ ద్రుంపవచ్చుఁ
గాన ౨౦సుగుణమతులు మిమ్మును ♦ గానలేక, వెట్టిత్రోవలఁ ౨౧బోదురు ♦ వెఱపులేక
తెలిసి సేవించువారికి ♦ దివ్యపదవి, రామతారక దశరథ♦రాజతనయ. 57

సీ. మహిలోనఁ బొట్టకై ౨౨మానహీనుని వెంట, వెఱవక తిరుగుచు ♦ వెఱ్ఱిపట్టి
నటువలె రాతుని ♦ యంటినకైవడి; గ్రహము పట్టినరీతి ♦ కలువమతిని
నడుగఁబోయిన వార ♦ లదలించి పొమ్మన్న ౨౩గద్దించి తల వంచి ♦ కండ్ల నీరు
గ్రుక్కుచు మదిలోన ♦ ౨౪సొక్కుచు నటుమీఁద, నినుఁ జేరి కొందఱు ♦ నిజముగాను
దీనజన౨౫మందిరాంగణ ♦ దేవభూజ, వెనుక కడతేరఁ జూతురు ♦ వేడ్కతోడ
నట్టినిన్నును సేవింతు ♦ నహరహంబు, రామతారక దశరథ♦రాజతనయ. 58

(55) ౧. సూర్యదేవుఁడు...లన్నియు. ౨. మాయ చంద్రుండు మాయ. 3. * మెఱయ నగ్నియు మాయ మేఘంబులును మాయ. మేరువన్నియు మాయ మేఘంబులును మాయ...మాయమట్పతులు మాయ. ౪. పరధారలు అచ్చుపా. ౫ భంగము లణఁగఁజేసి. (56) ౬ నీరధిలోఁ జొచ్చి నీచరాతుసుఁడైన. ౭. రూపు. ౮. మూర్తి. ౯. మింటను మబ్బులు. ౧౦ మూర్తిలో కనకాతుఁ ద్రుంచిన కంస. ౧౧. చించినయుదధి. ౧౨. శతకోటి మదనదేహ. ౧౩. తిరుగుచు నాలికై. ౧౪. తనము. ౧౫ యాంబుధి. (57) ౧౬. తరణిచే (వాడ)...కడలి. ౧౭. కష్ట మనక. ౧౮. చంద్రుని చింతగావించితే పాపమేఘంబు భంజింపవచ్చు. ౧౯. మనియెడి వనము. ౨౦. జనులార మీ రతనిఁ గాన కెపుడు. ౨౧. బోకుఁడి విమలబుద్ధితోడ సేవించభీష్టముల్ ♦సిద్ధమగును. (58) ౨౨. మానవహీనుని వెంటఁ దిరుగుదురు. ౨౩. గడగడవణఁకుచు. ౨౪. స్రుక్కుచు నప్పుడు. ౨౫. ముదిరాంగణ దివ్య భోజ నన్నుఁ గడతేరఁ జూడవే యాదిపురుష. పరఁగ రక్షింపు నన్నును బాపహరణ.

సీ. *చెడిపోక నామాట • చిత్తమందుంచుఁడీ, దేవాధిపునిమహా•దేవు జపము
నియమంబుతోనైన • ౧భయముతోనైనను, శాంతంబుతోనైన • సరస సయిన
౨భక్తితోనైనను • శక్తితోనైనను, యుక్తితోనైనను • ౩నుల్లమందు
రాకపోకలనైన • రమ్యంబుగానైన, నాటపాటలనైన • సలసిరైన
౪సాక్కియైనను మఱవక • సొంపుగాను, గొప్పగోష్ఠుల గుమిగూడి • కొఱఁతలేక
జేసి కైవల్యమొందుఁడీ • సిద్ధముగను, రామతారక దశరథ•రాజతనయ. ౫౯

సీ. ఎందుల కేగిన • ౫నేపనిఁ జేసిన, చలమునసైనను • చదువునైన
బంగారుపనినైన • శృంగారములనైన, ౬సుద్దులనైనను • ముద్దునైన
౭యాత్రల నైనను • రాత్రులనైనను, నుపవాసములనైన • ౮ను క్తినైన
జపములనైనను • తపములనైనను, ౯గలుగదు మీదివ్య•ఘనపదంబు
భక్తిచే నిన్నుఁ దలఁచిన • భాగ్యవంతు, ౧౦లిందు నందును వేడుక•తోడ నిన్ను
ప్రబలుఁడుగాన నన్నుఁగావు • పంకజాక్షు, రామతారక దశరథ•రాజతనయ. ౬౦

సీ. రావణుఁ జంపిన • రామభూపాలుని, సేవింపుఁడీ మీరు • సిద్ధులార
౧౧సేతుబంధనరాము • ౧౨శీలమెంచరు మీరు, ౧౩తలఁప రదేటికో • ధన్యులార
ఘనజటాయువు కిచ్చె • ౧౪గాంభీర్యపద మని, విని యెఱుంగరదేమి • విమతులార
వక్రబాణంబున • వాలిని బడవేసి, సుగ్రీవుఁ బ్రోచెను • సుజనులార
యిట్టి త్రైలోక్యధాముని • ౧౫నింకనైన, తలఁప రది యేమి పాపమో • ధన్యులార
౧౬భూమిజానాథుఁ డొసఁగును • పుణ్యపదము, రామతారక దశరథ•రాజతనయ. ౬౧

సీ. పద్మనాభునిమీఁద • పాటలుపాడుఁడీ, భవబంధనులు ౧౭పాయు • భద్రమగును
కమలామనోనాథుఁ • గన్నులఁజూడుఁడీ, నేత్రములగ్గలఫలము • నెగడియుండు
శ్రీగదాధరుసేవఁ • జేయుఁ డెల్లప్పుడు, ౧౮రోగముల్ దొలఁగి ని•రోగి యగును
కోదండరాముని • ౧౯కోరిభజింపుఁడీ, శత్రునాశన మగు • సమ్మతముగ
నిట్టి లీలావతారుని • ౨౦నీకు హరిని, బలునితమ్ముని గోపాల•బాలవిభునిఁ
బరఁగ నుతియించి సంపూర్ణ•పదవి గనుఁడీ, రామతారక దశరథ•రాజతనయ. ౬౨

---

(59) * ఈ పద్యము వావిళ్ల ప్రతిలో 61 వదిగా నున్నది. ౧. నిష్ఠతోనైనను; నేర్పుతోనైనను భయముతోనైనను భక్తినైన. ౨. శక్తితోనైనను శాంతంబుతోనైన. 3. సరసమైన. ౪. స్రుక్కియైనను తగుసోలుకుంటనైన రమ్యముగ మీరు మదిలోన రామభజన. (60) ౫. నేమిచేసిననైన సుద్దులతోనైన సందడైన. ౬. చలమునసైనను చదువునైన. ౭. యాతల. ౮. వుప్పెడైన. ౯. కలుగును. ౧౦. యెల్లకాలము స్వర్గమందుండ రెలమిఁ గాన మ్రొక్కెద నన్నుఁగావు శానలోల. (61) ౧౧. సింధు. ౧౨. నేలమెచ్చరో. ౧3. తలపుఁడీ శ్రీరాముఁ దపసులార. ౧౪ గంభీరపదమని యిఁకనైనఁ దెలియుఁడి వేల్పులార. ౧౫. యెన్నడైన. ౧౬. యింకనైనను తలపోయుఁ డిష్టమగును. (62) ౧౭. దొలఁగు భద్రముగను. ౧౮. రోగంబులెల్ల నిరోగమగును. ౧౯. కొల్వుఁడి యేవేళ. ౨౦. నినదులేశ.

సీ. [౧]పారెడిపారెడి ♦ బావమర్దికి బండి, దోలువెన్నుని వెన్న♦దొంగవాని
గొల్ల[౨]ముగ్ధల చిన్న♦గుబ్బెతలను గూడి, విహరించు [౩]గోపికా♦వినుతు కృష్ణు
అడవినెంగిలి మేఁత ♦ లావంతపోకుండ, [౪]యెత్తిమ్రింగినయట్టి ♦ యేఁపుకాని
[౫]తనవంటివారల ♦ [౬]తగుబాలురను గూడి, పామును [౭]మర్దించు ♦ భవ్యచరితు
[౮]దేవు నాశ్రితధేనువు ♦ దేవదేవు, జగములన్నియుఁ బుట్టించు ♦ సంహరించు
పోసఁగ రక్షించువాని నా♦బుద్ధిఁ దలఁతు, రామతారక దశరథ♦రాజతనయ. ౬౩

సీ. కౌసల్యసుతు రాము ♦ కరుణాసముద్రుని, గంగానదీపాద♦కమలయుగళు
[౯]ఖండేందుధరచాప♦ఖండను జగదేక,మండను బ్రహ్మాది ♦ మౌనివంద్యు
తాటకాంతకు రాము ♦ దైత్యసంహారుని, మునియాగ[౧౦]రక్షకు ♦ మోహనాంగు
పరశురామునిగర్వ♦[౧౧]భంజను[౧౨]లోకాంత, రంజను రఘురాము ♦ రమ్యమౌళి
[౧౩]నెప్పుడు సేవింతుఁ గీర్తింతు ♦ నెలమితోడ, [౧౪]బుద్ధిగలిగిన నీదగు ♦ పుణ్యపదవిఁ
గని ప్రమోదింపవలయును ♦ [౧౫]గట్టపడక, రామతారక దశరథ♦రాజతనయ. ౬౪

సీ. ఏల సేవింపరో ♦ యేల భావింపరో, శ్రీరామనామంబు ♦ చిత్తమందు
మాటలాడుచునైన ♦ మఱచి[౧౬]యున్నైనను, ఎఱుకనైన దినంబు ♦ నెఱుఁగలేరు
[౧౭]దివమునందైనను ♦ తిరిరి * రాత్రులనైన, సంధ్యవేళలనైన ♦ సందడైన
[౧౮]భ్రమచేతనైనను ♦ భయమునొందైనను, [౧౯]నోపకనైనను ♦ నోపిరైన
[౨౦]సకలలోకాధినాథుని ♦ సర్వసాక్షి, నాదిదేవుని చిన్మయా♦నందమూర్తి
బుద్ధిఁ దలఁచిన దురితము ♦ లొప్పవు టరుదె, రామతారక దశరథ♦రాజతనయ. ౬౫

సీ. తెలిసితెలియఁగ[౨౧]లేరో ♦ తెలివి నేయుల్లరో, మాయలఁ[౨౨]బడి లోక♦మమతతోడ
రామభూపాలుని ♦ రమ్యాక్షరంబులు, నేవేళనైనను ♦ నెప్పుడైన
పనిసేయు[౨౩]వేళైన ♦ పనిలేనివేళైనఁ, జనువేళనైనను ♦ [౨౪]చదువునైన
[౨౫]భయమునొందైనను ♦ భ్రమతోడనైనను, గలుగక యందుల ♦ కలిమినైన
[౨౬]పరమకల్యాణ పరిపూర్ణ ♦ భద్రమూర్తి, వెన్నదొంగను గోపాల♦విభుని ఘనుని
బుద్ధిఁ దలఁచిన ఘనులకుఁ ♦ బుణ్యపదవి, రామతారక దశరథ♦రాజతనయ. ౬౬

---

(63) ౧. పారేటిపారేటి♦బావమఱఁదికిబండి-దోలినవెన్నలతిండికాని. ౨. మగువల సిగ్గు. 3 బ్రహ్మాధి. ౪. పట్టిమ్రింగినయట్టి పద్మనాభు. ౫. తనసాటి. ౬. తగ కాపులను మ్రింగ. ౭. మ్రింగినపాముపొన్ను బ్రహ్మసురము. ౮. ... నాజానుబాహు. (64) ౯. కఱకంఠకార్ముక ఖండేందు. ౧౦. నిర్వాహ. ౧౧. దర్ప. ౧౨. లోకైకరంజను రఘురాము రాజ. ౧౩. నెంచు. ౧౪. బుద్ధులగుఁ గాక యెపుడు సద్విమలపదము. ౧౫. గరుణతోడ. (65) ౧౬. నెన్నండైన నెప్పుడైనను తిర్గియెరిగినైన. ౧౭. దివములయందైన తిరిగి. * నాతులనైన. ౧౮. పండుచోనైనను భక్తితోనైనను. ౧౯ నోపలేకైనను. ౨౦. పరమకల్యాణ పరిపూర్ణ♦భద్రమూర్తి । వెన్నదొంగను గోపాల♦విభుని ఘనుని, బుద్ధిఁ దలపోసి యెప్పుడు ♦ పోసఁగఁ దలఁతు. (66) ౨౧. నేటి. ౨౨. బడఁబోవ మట్లు గాను. ౨౩. వేళను పనితీరువేళను. ౨౪. చనుచు. ౨౫. భ్రమచేతనైనను ♦ భ్రమవిడిచియైనను - కలగనియైనను ♦ కలకయైన. ౨౬. సకలలోకాధినాథుని ♦ సర్వసాక్షి । ఆదిదేవుని చిన్మయా ♦ నందమూర్తి, తెలియుఘనులకు మోక్షంబు ♦ దక్కుఁగాక.(......దగ్గిరవును)

 

సీ. పరకాంతలను గూడి • భంగంబునొందక, పరధనంబులఁ గోరి • పట్టువడక
౧పరులను వేడక • పరిహాస మెంచక, పరుల నిందింపక • భయములేక
పరులయిండ్లను జేరి • పాపముల్సేయక, పర౨దారలను బట్టి • భ్రమలఁబడక
సిరుల కాశింపక • పరులవెంటనె పోక, పరసేవ సేయక • ౩పట్టుగాను
మన్మథునిఁ గన్నవానిని • మాయకాని, శంఖచక్రాబ్జములవాని • శౌరి నెప్డు
వర్ణనలుచేసి పల్కుఁడీ • వందనముగ, రామతారక దశరథ • రాజతనయ. ౬౭

సీ. మీనమై ౪జలధిలో • మేనును తడియక, వేదముల్ దెచ్చిన • వేల్పువాని
తాఁబేటి౫రూపున • తగ మందరాద్రిని, వీఁపున నిల్పిన • ౬విభవశాలి
పందిరూపంబున • పరిపంథిఁ బరిమార్చి, కోఱమీఁదను నిల్పు • గోత్రధరుని
౭మెకములసామిరై • మేటిదైత్యుని బట్టి, చించి చెండాడిన • సింహమూర్తి
పొట్టితనమున బలిదైత్యు • భూమిఁ ద్రొక్క, రామ రఘురామ బలరామ • బౌద్ధకలి
౮రీతులను వినుతిసేయుఁడీ • రీతిగాను, రామతారక దశరథ • రాజతనయ. ౬౮

సీ. రుక్మిణీనాథుని • రూపవర్ణనఁ జేసి, సత్యభామాలోలు • శౌరిఁ గనుఁడి
జాంబవతీ౯వన • సంచారు వేఁడుఁడీ, సూర్య౧౦సంశేఖుని • సుభగమూర్తి
మిత్రవిందావిభు • మేల్మిఁ గీర్తింపుఁడీ, భద్ర౧౧పుత్రానాథు • పాడఁ డెలమి
శ్రీశు ౧౨ధాత్రీశుని • చెలు వుగ్గడింపుఁడీ, లక్షణాపతి జగ • ద్రక్షణాఢ్యు
నట్టిశృంగార౧౪వంతుని • నట్టిఘనుని, ౧౫నట్టివీరుని దలఁచిన • నెవ్వఁడైన
జగతిఁ గైవల్యపదవిని • జెందవచ్చు, రామతారక దశరథ • రాజతనయ. ౬౯

సీ. ౧౬అంధునిచేతికి • నద్దంబు నిచ్చినఁ, జూచునా తనమోము • సుందరంబు
కుంటివానికి నెక్క • గుఱ్ఱంబు ౧౭నిచ్చిన, నెక్కునా తనశక్తి • నెన్నఁడైన
పండుకు యౌవన • సతి గల్గెనేనియు, గామంబు దీర్చునా • కాంత ౧౮దీర
అల్పున కొకవేళ • నర్థంబు గలిగినఁ, ౧౯దెలివితో నిచ్చునా • తెగువతోడ
తన్నుఁ౨౦దెలిసికొనక • తనశక్తి యెఱుఁగక, ధరణిసంపద లన్ని • తనవటన్న
లేదు లాభంబు తన కొక • లేశమైన, రామతారక దశరథ • రాజతనయ. ౭౦

(67) ౧. పరబుద్ధివిని వేడ్క పరిహాససేయక. ౨. దానములఁ బట్టి భ్రమల చెడక. 3. భ్రష్టుగాక. (68) ౪. జలము. ౫. రూపమై. ౬. విజయ. ౭. మొనసి నఖములచేత మేదిని దైత్యునిపొట్ట చించినసర. ౮. రీతుల. (69) ౯. తోను అచ్చుపారము. ౧౦. మనః.౧౧. భూవల్లభ శుభగవినుత. ౧౨. పతీప్రియు. ౧౩. దంతాధీశుచెలు వుగ్గ. ౧౪. ఘను దండి ఘనుఁడువాఁడు. ౧౫. నిట్టివానిని దలపోసి • యెవ్వరైన, జేసికైవల్యమందుఁడి • సిద్ధముగను. (70) ౧౬. అంధునకుఁ జూడ నద్దంబు గలిగిన. ౧౭. గలిగిన.....యెంతయైన. ౧౮. చేత. ౧౯. విడుచునా తనబుద్ధి యెంతయైన. ౨౦. తెలియలేక తన నేర్పు నేరక త్యాగంబు సేయను తెలివిలేక.....యొకయింత.

సీ. శ్రీరామ జయరామ ♦ సింధుబంధనరామ, కారుణ్య[1]సింధు గం♦భీరరామ
వారిజోదరరామ ♦ వైకుంఠపతిరామ, [2]దీననాయక దేవ♦దేవ రామ
కౌసల్యసుతరామ ♦ కాకుత్థ్సకులరామ, కంసమర్దన శుభా♦కార రామ
[3]మాధవశ్రీరామ ♦ మానవేశ్వరరామ, యాదిత్యకులజ స♦ర్వాత్మరామ
కర్మభంజన లోకలో♦కాభిరామ, నిర్మలాత్మక యయోధ్యా♦నిలయరామ
నీవె గతి మమ్ము రక్షింపు ♦ నిగమవినుత, రామతారక దశరథ♦రాజతనయ. ౭౧

సీ. ఎన్ని జన్మంబులు ♦ నెత్తితినో[4]కాని, మాధవుఁ దలఁపక ♦ మందమతిని
[5]వెతలఁ బొందితిఁ గాని ♦ యవనిమీఁదను నిప్డు, కాకుత్థ్సుఁ గానక ♦ గర్వమతిని
కాయంబులన్నియు ♦ మాయంబు[6]లాయెఁబో, గోపాలునతి లేక ♦ [7]గూలుక్షితిని
ఎందఱు తలితండ్రు ♦ [8]లేమైరి యిప్పుడు, రాఘవుఁ దలఁపక ♦ రట్టుపడిరి
ఇంకనైనను రఘురాము ♦ నిపుడు మదిని, బుద్ధిలో నన్యమార్గంబుఁ ♦ బొడమనీక
యనుదినంబును శ్రీరాము ♦ నాత్మఁ దలఁతు, రామతారక దశరథ♦రాజతనయ. ౭౨

సీ. ఓర్పు గనుఁగొనఁ గలసి ♦ యొరసిచూచెదవేమొ, పట్టవలసినకొమ్మఁ ♦ బట్టినాను
వదలవలెనని బహు♦వాదాలు చేసితే, మేల్కొని గట్టిగా ♦ మెడలువాఁడ
ఆలాగు గాదని ♦ యాయాసపెట్టితే, ముకు[9]ళితహస్తుఁడై ♦ మ్రొక్కువాఁడ
[10]మోడితోఁ గైకోక ♦ మోసపుచ్చెదనంటె, పాదారవిందము ♦ లప్పట్టువాఁడ
తల్లివయినను నీవె నా♦తండ్రి[11]వైన, [12]నీవె మ్రొక్కెద నిన్ను నా♦దైవ మనుచు
పాహి[13]మాం రామ యని మాఱు ♦ పలుకువాఁడ, రామతారక దశరథ♦రాజతనయ.

సీ. వాసుదేవునిపూజ ♦ వదలక చేసితే, వైభవంబులు గల్గు ♦ వసుధలోన
[14]నిన్ను నెప్పుడుఁ గొల్చి ♦ యెలమి సేవించితే, సంపద లెప్పుడు ♦ చాలఁ గల్గు
నారాయణస్మరణ ♦ నమ్మికయుండితే, భుక్తియు ముక్తియు ♦ పొసఁగ నిచ్చు
విష్ణుసంకీర్తన ♦ విడువక చేసితే, దారిద్ర్యదుఃఖము ♦ [15]తొలఁగిపోను
నరులకెల్లను హరిసేవ ♦ నయముసుమ్మి, అఖిలసంపదలును [16]గల ♦ వాశ్రితులకు
సకల[17]దురితము లెల్లను ♦ సమసిపోవు, రామతారక దశరథ♦రాజతనయ. ౭౪

---

(71) ౧. శరధి. ౨. ధీరనాయకదైత్య. ౩. దూపభూర్జర. (72) ౪. యని తప్పక దలఁపక ♦ తపసిమొక్కఁడు. ౫. వ్యథల. ౬. లాయెనో. ౭. గూలి. ౮. తెలుఁగలేనైతిని (73) ౯. లించి కరములు. ౧౦. మ్రొక్కిన. ౧౧. వనుచు. ౧౨. దాతవైనను నీవె నాదాత వనుచు. ౧౩. పాహి. (74) ౧౪. గోవిందు నెప్పుడు గొలిచి. ౧౫. దగలకుండు. ౧౬. గలుగునా. ౧౭. వైభవ మెల్లను ♦ సతతముగను.

సీ. పంకజాననజనక ♦ బ్రహ్మాండనాయక, పంకజలోచన ♦ పరమపురుష
శంకర౧నందిత ♦ సంకర్షణాహారీ, పంకజాక్షవిలోల ♦ ౨పద్మనయన
లక్ష్మీశ యోగీశ ♦ లక్ష్మణాగ్రజ రామ, ధాత్రీశ ౩లోకేశ ♦ ధర్మహృదయ
సకలలోకాతీత ♦ సర్వగుణాకతీత, యకలంక౫కోటిసూ♦ర్యప్రకాశ
సకలజీవదయాపర ♦ సార్వభౌమ, క్షీరసాగరశయన ర♦క్షింపనయ్య
నిన్నునే నమ్మి౬యున్నాను ♦ నీరజాక్ష, రామతారక దశరథ♦రాజతనయ. ౭౫

సీ. నీలమేఘశ్యామ ♦ నిగమగోచర రామ, ఫాలలోచనవినుత ♦ పరమపురుష
దశరథనందన ♦ తాటకమర్దన, యిందీవరేక్షణ ♦ యినకులేశ
యయోధ్యాపురవాస ♦ యాశ్రితజనరక్ష, కల్యాణ౭గుణభరణ ♦ కంసహరణ
విధిశివరక్షక ♦ విష్ణుస్వరూపక, బుధజనపాలక ♦ పుణ్యపురుష
జానకీనాథ౮ మీరను ♦ జయము జయము, సకలబ్రహ్మాండనాయక ♦ శరణుశరణు
౯కాచి రక్షించు నన్నిఁక ♦ కామజనక, రామతారక దశరథ♦రాజతనయ. ౭౬

సీ. రామనామామృత♦రసము త్రావేకదా, మన్నజామిళుఁడు ♦ ముక్తుఁడగుట
రామనామామృత♦రసము త్రావేకదా, ౧౦మునిపత్ని శాపవి♦ముక్త యగుట
రామనామామృత♦రసము త్రావేకదా, ౧౧కపివీరుఁడును బల♦కలితుఁడగుట
౧౨రామనామామృత♦రసము త్రావేకదా, యపనర్గ మబ్బె ఖ♦ట్వాంగునకును
౧౩తనరి శ్రీరామనామామృ♦తంపుసేవ, ౧౪ముక్తిమార్గంబు కలుగును ♦ మాధులకును
రామనామామృతంబున ♦ రాజిలుదురు, రామతారక దశరథ♦రాజతనయ. ౭౭

సీ. పంకజాక్షునిపూజ ♦ పలుమాఱు సేయక, ౧౫పరుల నిందించుట ♦ పాడి యగునె
విష్ణుసంకీర్తన ♦ వీనుల వినకయే, పరుల ౧౬మెచ్చుట నీకు ♦ బ్రాంతి యగునె
శేషశయను నిఁ జాలఁ ♦ జెలఁగి కీర్తింపక, పరులఁ౧౭గీర్తించుట ♦ భవ్య మగునె
నారాయణస్మరణ ♦ నమ్మికయుండక, పర౧౮దేవతలభజన ♦ పాటి యగునె
౧౯మనస నీ కెంత బుద్ధియు♦మతియు లేదు, రామమంత్రంబు తలఁపవె♦ తలఁపులోన
తలఁచితే మోక్ష మిచ్చును ♦ తథ్య మరయ, రామతారక దశరథ♦రాజతనయ. ౭౮

---

(75) ౧. సన్నుత. ౨. భక్తలోల. 3. యోగీశ. ౪. శీల. ౫. కోటిసూర్య. ౬. యున్నాఁడ నీలవర్ణ. (76) ౭. మునివంద్య. ౮. యిప్పుడు. ౯. కరుణ. (77) ౧౦. కలికి చిలుకను బెంచ గలిగె ముక్తి. ౧౧. కాశిలో వాసంబు గడపుహరుఁడు. ౧౨. రామపాదాంబుజరజము సోఁకేగదా శిలయైనయాహల్య చెలువ యయ్యె. ౧3. రామనామామృతంబున రక్షసేయు. ౧౪ రామనామంబె అమృతంబు రసికులకును. (78) ౧౫ పరదైవములపూజ 'పాడి. ౧౬. మెచ్చుట. ౧౭. నిందించుట పాటియగునె. ౧౮. దైవములస్మరణ. ౧౯. చెలఁగి శ్రీరామనామంబు♦జిహ్వాయందుఁ, బుణ్యపరులైనపరుముద్ర♦ పొందఁగలరు తలఁచువారికి మోక్షంబు.

సీ. సాకేత[౧]పురిరామ ♦ శరణుఁజొచ్చితి నిన్ను, రక్షింపవే నన్ను ♦ రామచంద్ర
దయతోడఁ బ్రోవవే ♦ దశరథాత్మజ నన్ను, కరుణతోఁ [౨]బ్రోవవే ♦ కమలనయన
కౌసల్యసుత నన్ను ♦ [౩]కాచి రక్షింపవే, మన్నింపవే నన్ను ♦ మదనజనక
జానకీపతి చాల ♦ [౪]సత్కృపతో నాకు, విజయంబు లియ్యవే ♦ వేదవేద్య
పరమపద[౫]రామ ♦ గోవింద [౬]పద్మనాభ, భక్తవత్సల లోకేశ ♦ [౭]పరమపురుష
ధర్మచరి[౮]తార్థ సంజవి♦దార శూర, రామతారక దశరథ♦రాజతనయ. ౭౯

సీ. నేత్రము ల్గల్గియు ♦ నెమ్మితో మీచూపు, [౯]సుస్థిరత్వంబునఁ ♦ జూడనైతి
[౧౦]జిహ్వగల్గియు నోట ♦ శ్రీహరి[౧౧]నామము, ల్తాల్మితోడుత నెపుడు ♦ తలఁపనైతి
శిర మిది గలిగియు ♦ క్షితిమీఁదసాష్టాంగ,ముగఁ జక్కఁగా సాఁగి ♦ మ్రొక్కనైతి
కర్ణముల్ గల్గియు ♦ ఘనమైనమీకథ, [౧౨]ల్వివరింపనైతిని ♦ విశదముగను
[౧౩]హస్తముల్ గల్గి మిమ్ము నే ♦ యనుదినంబు, శాంత[౧౪]మొనరంగఁబూజలు ♦ సలుపనైతి
చరణములు గల్గి [౧౫]మీసేవఁ ♦ జలుపనైతి, రామతారక దశరథ♦రాజతనయ. ౮౦

సీ. నాసాపుటము గల్గి ♦ ననుదినంబు తులసి, దళవాసనలచేతఁ ♦ దనియనైతి
సంసార[౧౬]మను ♦ మహాసాగరంబున మున్గి, శ్రీరామ[౧౭]భజనఁ ♦ జేయనైతి
బాల్యంబునను [౧౮]జోర♦బాధాదులను జెంది, నీదగుభక్తిని ♦ నిలుపనైతి
యౌవనంబునఁ గామ్య♦[౧౯]మానసమైనొంది, [౨౦]కూహకంబున బుద్ధి ♦ కుదవనైతి
నెంత[౨౧]పాపియుఁగాక ♦ నే నెన్నఁడైన, దేవుఁ డని నీవె దిక్కని ♦ తెలియనైతిఁ
[౨౨]గాన దుష్కృత మెంచక ♦ కావు నన్ను, రామతారక దశరథ♦రాజతనయ. ౮౧

సీ. శ్రీరామ వినుము నే ♦ క్షితిని జన్మించిన, విధము నెవ్వరితోను ♦ విన్నవింతు
తల్లిదండ్రులు [౨౩]నాత్మ ♦ తనయులు బావలు, నన్నదమ్ములు దేహ♦సుతులు సఖులు
అక్కచెల్లెండ్రును ♦ నార్యులు [౨౪]నాప్తులు, నితరబంధువు లెల్ల ♦ నిష్టసఖులు
పరులు [౨౫]నావారని ♦ పాటించి యెప్పుడు, జనలోకమున నెల్ల ♦ సత్య మనుచు
భార్యరతికేళి సంబంధ♦భరిత [౨౬]మమర, రాజ్యకష్టాభిమానుండు ♦ రాజసమున
మంత్రి [౨౭]కార్యానులోచన ♦ నాచరించు, రామతారక దశరథ♦రాజతనయ. ౮౨

---

(79) ౧. పురధామ. ౨. కావవే. ౩. కాపాడిపోషించు. ౪. జయము కృపసేయవే. ౫. నాథ. ౬. పరమపురుష. ౭. పద్మనాభ. ౮. తార్థ దనుజవిదారిశూర. (80) ౯. స్థిరతరంబుగ నెప్డుఁ జేయనైతి. ౧౦. జన్మ. ౧౧. యనుచు. ౧౨. విహరించి బుద్ధులఁ దనఁగనైతి. ౧౩. అన్నిగల్గియు మిముఁ జాల. ౧౪. మొనరించి. ౧౫. సేవలు. (81) ౧౬. సాగరసంభవంబునఁ దగిలి. ౧౭. నొచ్చగ సేరనైతి. ౧౮. బాధకత్వమ్ము బొందితినీయందు ౧౯. మానందమునబొందె. ౨౦. కూహకంబున బుద్ధికుదురనైతి. ౨౧. పాపినొగాని. ౨౨. నాదుదుష్కృతమెన్నక నన్నుఁగావు. (28) ౨౩. నాప్తతతులు దైవము గురువు పుత్రులు పౌత్రులు మిత్రచయము. ౨౪. దాప్తులు. ౨౫. మేలోరామ పాటింపఁ డిప్పుడు జనులలోకంబున. ౨౬. సమతి. ౨౭. కార్యావలోకన.

సీ. ఇలను బుట్టినవార ◆ లెంతేసి[౧]ఘనులైరి, వీరితో నెటువలె ◆ విన్నవింతు
[౨]తల్లియుఁ దండ్రియు ◆ దాతవు భ్రాతవు, ప్రభుఁడవు గురుఁడవు ◆ బాంధవుఁడవు
నీవు [౩]చక్కఁగవినుము ◆ నింక నెవ్వరితోడఁ, బల్కఁదు నెటువలెఁ ◆ బరమపురుష
[౪]ఆత్మరక్షక నిన్నె ◆ యాశ్రయించితి దేవ, కాచి [౫]రక్షింపుమీ ◆ కమలనయన
నీదులాభంబు గోరిన ◆ నెన్నఁడైనఁ, గోర్కె లెల్లను నాకు చే◆కూరుచుండు
దీనరక్షక నా కిఁక ◆ దిక్కు నీవె, రామతారక దశరథ◆రాజతనయ. ౮౩

సీ. తోఁచి తోఁచక [౬]నేను ◆ తొడరి మీచింతన, సలుపక సంసార◆[౭]జలధి మునిఁగి
నడచి నడవక తృష్ణ ◆ నాహారవాంఛలు, పదపడి మోహా[౮]సం◆భ్రాంతిఁ జెంది
తెలిసి తెలియక కర్మ◆దేహవాసన జెంది, [౯]తరిగోరి మిమ్మును ◆ దలఁపనైతి
మఱచి మఱవక నిత్య◆మార్గంబులను మిమ్ముఁ దలఁపక యింద్రియ◆తతులఁ బడితి
నిట్టిపాపాత్ముఁ[౧౦]డను నన్ను ◆ నెలమి నెపుడు, కాచి రక్షింపు[౧౧] మ◆న్నింపు ఘనత మీఱ
[౧౨]కృపను బాత్రునిగాఁ జూడు ◆ కువలయేశ, రామతారక దశరథ◆రాజతనయ. ౮౪

సీ. జనని గర్భమ్మున ◆ జన్మించినది [౧౩]మొదల్, బాల్యరూపంబునఁ ◆ బ్రబలుచుంటి
నటుమీఁద [౧౪]గౌమారస్రా◆యంబునఁ గొన్నాళ్లు, తల్లిదండ్రుల ప్రేమఁ◆దనరి[౧౫]యుంటి
[౧౬]యౌవనప్రాయాన ◆ యువతీరతిక్రీడ, నింద్రియంబుల ప్రేమ ◆ నెపుడు దగిలి
ముసలి[౧౭]తనంబున◆మునుఁగుచు[౧౮]కొన్నాళ్లు, కార్పణ్యముల[౧౯]చేతఁ ◆ గష్టపడుచు
[౨౦]నింత కాలంబునను నిన్ను ◆ నెఱుఁగలేక, [౨౧]వృద్ధిఁ బొందితిఁ బ్రకృతిచే◆వశదముగను
కరుణఁ జూడుము ◆ నన్నిఁక [౨౨]కర్మియనక, రామతారక దశరథ◆రాజతనయ. ౮౫

సీ. శ్రీరామ [౨౩]నాదుపైఁ ◆ జిత్తంబు రాదాయె, నాతలితండ్రని ◆ నమ్మికొంటి
దశరథాత్మజ నీకు ◆ దయ[౨౪]యైన లేదాయె, [౨౫]నాయిలువేల్పని ◆ నమ్మికొంటి
[౨౬]సత్యసంధా నీదు◆వచన మింత లేదాయె, నాప్రాణవిభుఁడని ◆ నమ్మికొంటి
భక్తవత్సల నీకు ◆ [౨౭]భావంబు లేదాయె, నామూలధన మని ◆ నమ్మికొంటి
దూఱ[౨౮]వలె నిన్ను నేరీతి ◆ దురితహరణ, నింద లేకుండ చేపట్టి ◆ నిర్వహింపు
[౨౯]పరుల నిందింప నా కేల ◆ పరమపురుష, రామతారక దశరథ◆రాజతనయ. ౮౬

---

(౮౩) ౧ ఘనులైరి యెవరి. ౨. తల్లివి తండ్రివి దాతవు. ౩. తప్పక యింక నెవ్వరితో నేను. ౪. ఆర్త. ౫. రక్షింపుము కరుణఁజూడు నేనులాభంబుగోరెద నీమనంబు కోర్కెలొనరించు నాకును కువలయేశ. (౮౪) ౬. నైన. ౭. జారశ్రీల. ౮. సంప్రాప్తిబొంది. ౯. తతిగొను మీరూపు. ౧౦. దని నన్ను నెఱుక. ౧౧. పోషింపు కమలనయన. ౧౨. యరసి సాయుజ్య మిత్తువు యంబుజాక్ష. (౮౫) ౧౩. శల్యరూపంబున ప్రబలుచుండు. ౧౪. కౌమార మాసక్తిచే నొంది. ౧౫. యుండు. ౧౬ యౌవనంబున సతుల యెలమిక్రీడను దగిలి. ౧౭. యై భ్రమలచే. ౧౮. నుండితి. ౧౯. చాల. ౨౦. నిట్టి కాలంబులందున యెఱుకలేక. ౨౧. వృథ. ౨౨. కర్మఁడనక. (౮౬) ౨౩. నామీఁదమీకృపరాదాయె. ౨౪. యింత. ౨౫. నాయిష్టదైవమని. ౨౬. సత్యసంకల్ప నీసవరణ లేదాయె నామూలధనమని. ౨౭. భారమే.....నాప్రాణనాథుడని. ౨౮. పర నేను నిన్ను. ౨౯. దూఱను.

సీ. మాధవుఁడు మూర్ఖుఁడు ♦ ముచ్చటాడఁగ వింత, దీనుల కల్పుల ♦ దక్కు వింత
కోతి[౧]కోణంగులు ♦ గూడియుండఁగ వింత, కుక్కనక్కలఁ గూడి ♦ కూయు వింత
కోపితోఁ గుటిలుండు ♦ కూర్మిఁ జేయుట వింత, కపటఘాతకు [౨]లెపుడు ♦ కలయు వింత
[౩]మంత్రులతో మంత్రి ♦ [౪]నుచ్చరించుట వింత, కీడు మే లెఱుఁగని ♦ కీర్తి వింత
[౫]యెంతవారికి లబ్ధంబు ♦ లంత గాక, అన్న కావఁగ నేర్తురె ♦ యధము లెల్ల
[౬]కల్గు సుజ్ఞానిసంగతి ♦ ఘనతయశము, రామతారక దశరథ ♦ రాజతనయ. ౮౭

సీ. శ్రీరామ నీవు నా ♦ చిత్తమందే నిల్చి, రక్షింపవయ్య [౭]నా ♦ న్నతియముగ
నన్ను రక్షింపను నాథు ♦ లెవ్వరు లేరు, నాస్వామి నీ వని ♦ నమ్మినాను
తల్లి వైనను నీవె ♦ తండ్రివైనను నీవె, వేదాంత[౮]వేద్య ని ♦ [౯]న్వేఁడినాను
అయోధ్యవాసా ఘ ♦ [౧౦]నంతస్వరూపక, యీవేళ నీవు న ♦ న్నేలుకొనుము
నన్ను [౧౧]రక్షింతు వని నిన్ను ♦ నమ్మినాను, [౧౨]నమ్మరాదుర యెవ్వరి ♦ నెమ్మితోడ
నీకుఁ [౧౩]బ్రియుఁడను మ్రొక్కితి ♦ నీరజాక్ష, రామతారక దశరథ ♦ రాజతనయ.

సీ. దీనదయాకర ♦ దీనరక్షణ నీవు, కావవే నన్నిపు ♦ డు కమలనయన
పరమాత్మ పరమాత్మ ♦ పలుకు బొంకింపకు, [౧౪]పనులకు నీ ♦ పాదపద్మసేవ
కమలేశ [౧౫]కమలాక్ష ♦ కరుణతో రక్షింపు, వరము లియ్యవె నాకు ♦ వరద యీశ
లక్ష్మీశ లక్ష్మీశ ♦ [౧౬]లలిమీఱఁగను నాత్మఁ, దలఁచి రక్షింపవే ♦ ధర్మచరిత
పద్మలోచన[౧౭] భగవంత ♦ పారిజాత, [౧౮]స్వామి రక్షింపు మిఁక నన్ను ♦ సార్వభౌమ
నిన్ను నెప్పుడు సేవింతు ♦ నీలవర్ణ, రామతారక దశరథ ♦ రాజతనయ. ౮౯

సీ. నినుఁ గొనియాడితి ♦ నీకృపఁ గనుఁగొంటి, నిజముగ రక్షింప ♦ నీవె యంటి
నీప్రాపు గలదని ♦ నీదులోకంబులఁ, గొని[౧౯]యాడ నేవేళఁ ♦ గోరియుంటి
బ్రహ్మంబు నీ వని ♦ పలుమాఱు నిన్ను నేఁ, బ్రస్తుతి సేయుదుఁ ♦ బరమపురుష
దాసుఁడ నని యంటి ♦ దయకుఁ బాత్రుడ నంటి, నీకు సేవకుఁ [౨౦]డను ♦ నేర్పు గంటి
తల్లి దండ్రియు [౨౧]నీవని తలఁచియుంటి, నేను నీవా డనైయుంటి ♦ నిన్నుఁ గొలుతు
కాచి [౨౨]రక్షింపు మిఁకనన్ను ♦ కరుణతోడ, రామతారక దశరథ ♦ రాజతనయ. ౯౦

---

(87) ౧. కోడంగులు. (కోరంగులు) ౨. డెప్పు. ౩. మంత్రితో మంత్రిముచ్చ. ౪. ముచ్చ - వేఱొకప్రతి. ౫. అనుభవింపక నేర్తురె యధములింత । శరణుఁబొందితి నీక నాకు శంక యేమి. ౬. కల్ల. (88) ౭. మందున. ౮. నేనమ్మినాను. ౯. వేద్యుఁడని నమ్మకొంటి. ౧౦. అనంతవేద్యాయ యేవేళ నన్నను నేలుకొమ్మ. ౧౧. వయ్య నిన్ను నే నమ్మినాను. ౧౨. నమ్మ నెవ్వరి నాస్వామి నీవె కాని. ౧౩. మ్రొక్కెద రక్షింపు. (89) ౧౪. పలుకుట మీ. ౧౫. కమలేశ. ౧౬. లవిమార నాయాత్మ నిల్పి. ౧౭ భవనుత. ౧౮. సాఁగి మ్రొక్కెద రక్షింపు. (90) ౧౯. యాడి యొకవేళ గోరియుంటి. ౨౦. నై. ౨౧. తలఁచుకొంటి. ౨౨. రక్షింపవయ్య నన్.

సీ. ఆనాఁడె తెలియక ♦ ౧నాయాసమందితి, నెన్నఁడు మీసేవ ♦ నెఱుఁగనైతి
ము క్తి౨రయే మొద లని ♦ మూలంబు తెలిసితే, నీపాదకమలంబు ♦ ౩నెమ్మిఁ గొ ల్తు
నింత సులభుఁడ వని ♦ ౪యిన్నాళ్లు ఎఱిఁగితే, యానాఁడె మిమ్ము నే ♦ నాశ్రయింతు
కర్మంబు లెడఁబాపి ♦ కరుణతోడుత నన్ను, నరసి రక్షింపుమీ ♦ యాదిపురుష
౬తలఁపులోఁ జాల నమ్మితి ♦ తండ్రివనుచు, పుత్రవత్సల నామీఁదఁ ♦ బొందుమీఱి
నిలిపి రక్షించు ౭మిఁక నన్ను ♦ నీరజాక్ష, రామతారక దశరథ♦రాజతనయ. ౯౧

సీ. ౮హా రామ హా కృష్ణ ♦ అచ్యుతాయనికోరి, కొల్చెదఁ౯మిమ్ము నేఁ ♦ గోర్కెలలర
ఈవేళ నావేళ ♦ నేవేళనైనను, ప్రాపు దా పని ౧౦యేసు ♦ ప్రస్తుతింతు
నారాయణస్మరణ ♦ నాపది నెప్పుడు, కట్టిగ౧౧వేసుకయుండు ♦ కరుణతోడ
వామన శ్రీధర ♦ వసుధ౧౨పాలక, నన్నుఁ, గాచి రక్షింపుమీ ♦ ౧౩ఘనతమీఱ
౧౪నాకు నిష్టుఁడ వని నిన్ను ♦ నమ్మికొంటి, ౧౫నీవు కాపాడకున్న నిం♦ కెవరు దిక్కు
నీకుఁ బ్రియుడను మ్రొక్కెద ♦ నీరజాక్ష, రామతారక దశరథ♦రాజతనయ. ౯౨

సీ. రామకీర్తన లెపుడు ♦ ౧౬లాలించి వినువాఁడు, వైకుంఠపురమును ♦ వదలకుండు
౧౭కృష్ణనామం బెప్డుఁ ♦ గీర్తించి వినువాఁడు, మధ్యమపురమందు ♦ మఱియునుండు
మధు౧౮సూదనాయని ♦ మఱవక తలఁచితే, మర్మకర్మం౧౯బులు ♦ మాయమౌను
గోవిందనామంబు ♦ కోరి ౨౦గానముఁ జేయ, దోషపాపంబులు ♦ తొలఁగిపోను
౨౧అచ్యుతానంద గోవింద♦హరిముకుంద, పదవి నాకిమ్ము౨౨నిన్ను నేఁ ♦ బాయకుండు
పద్మలోచన నాతండ్రి ♦ పరమపురుష, రామతారక దశరథ♦రాజతనయ. ౯౩

సీ. ౨౩నీభక్తు లగువారి ♦ నిఖిలలోకంబుల, నిజముగాఁ బ్రోతువు ♦ నీలవర్ణ
నీకీర్తి పొందుగా ♦ నీకు సేవలు సేయు, పరమపుణ్యులకెల్ల ♦ భవ్యపదము
మనసున నీకీర్తి ♦ గొనియాడుచున్నట్టి, మనుజుల కొదవు నీ♦మందిరంబు
భక్తులైడె యీరీతి ♦ భజన సేయఁగ నీవు, నుప్పొంగియిచ్చెద ♦ వొప్పుతోడ
నిట్టిసేవలు గొని నీవు ♦ నిహపరములు, నాదరంబున నా కిమ్ము ♦ యాదిపురుష
గట్టిగా నీవు నన్నుఁ జే♦పట్టవయ్య, రామతారక దశరథ♦రాజతనయ. ౯౪

(91) ౧. నాపదల్ పొందితి యొకనాఁడు మీసేవఁజేయనైతి. ౨ కి. ౩. నిల్చుకొందు. ౪. యిసుమంతయెఱిగితే యావేళమిమ్ము నేనలుముకొందు. ౫. పుణ్యంబుచేకూర్చి. ౬. తలఁచి తలఁచుచునుందు తండ్రివినీవని కలిసి కలిసి పాదకమలయందు. ౭ మీ. (92) ౮. హాకృష్ణ హారామహాయచ్యుతా. ౯. నిప్పుడు. ౧౦. యెపుడు. ౧౧. వసుధయందు. ౧౨. పోషక. ౧౩. కరుణఁజూడు. ౧౪. యిష్టదైవమునీవని. ౧౫. నమ్మనెవ్వరి నిఁకను నాస్వామినీవె, యితరులనుగోరియాచింప నేలనాకు. (93) ౧౬. రంజిల్లజేసినఅయోధ్యపురమెపుడందియుండు. ౧౭, శ్రీహరినామంబు చింతనజేసి తేస్థిరతరంబుగముక్తి జెందియుండు. ౧౮. సూదనుని నామమంత్రంబు. ౧౯. బెపుడు. ౨౦. ధ్యానముసేయ. ౨౧. సచ్చిదానంద. ౨౨. నీపాదభజనయందు. (94) ౨౩. నీభక్తులందఱు నీకులోకంబులు నిజమువారందుల నిలువరయ్యా, నీకీర్తి కొనియాడి నీదుసేవలుచేసి పరమపదవికి నేగిపద్మనయన, భువిలోనకీర్తికి పుణ్యాత్ములెవ్వరు మ్రొక్కి సేవింతురు మోదమలర। భక్తులందఱునిన్ను భజనసేయఁగనీవు। యుప్పొంగుచున్నావు హృదయములోల । యిట్టిసేవలు నాకిచ్చి యిహము పరము । అట్లు చను లల్పమతులను ఆది పురుష । గట్టిగ [illegible] రామతారక దశరథ♦రాజతనయ.

సీ. యోగమార్గంబున ♦ నెగసెద నంటినా౧, యోగవాగాలు నా♦యొద్ద లేవు
గగనమార్గంబునఁ ♦ గదలెద-౨నంటినా, కవచభూషణ మేది ♦ కమలనయన
౩ఆత్మమార్గంబున ♦ నరసెద నంటినా౪, యాత్మనమ్మిన బంధు ♦ వరయ లేదు
౫నభ్రమార్గంబున ♦ నరిగెదనంటినా, అభ్రవాహనములు ♦ నరయ లేవు
౬నీదుదయకొంత ♦ నాయందె నిలిచియున్న, నఖిలలోకంబులెల్ల ♦ నా కల్ప మిపుడు
కుతుకమున నన్నుఁ బ్రోవుము ♦ కువలయేశ, రామతారక దశరథ♦రాజతనయ. ౯౫

సీ. ౭చిరకాలమున నేను ♦ స్థిర మని యుంటి నా, జన్మకర్మంబులఁ ♦ ౮జెప్ప నేల
శ్రీకృష్ణ౯నామంబు ♦ స్థిరమని యుంటినా, భయనివారణ ౧౦మహాను ♦ పరమపురుష
హృషీ౧౧కేశ మిమ్ము నా ♦ హృదయంబులోనిల్పఁ, గరుణతోఁ గాతువు ♦ కమలనయన
మురహార నీకు నే ♦ ముకుళితహస్తుఁడై, మ్రొక్కి౧౨-సేవింపంగ ♦ మోక్షపదవి
౧౩సన్నుతించెద నిన్నుఁ గౌ♦సల్యతనయ, చిత్తగింపుము నాయన్న ♦ శ్రీనివాస
శరణుఁ జొచ్చితి నిన్నికే ♦ శరణుశరణు, రామతారక దశరథ♦రాజతనయ. ౯౬

సీ. కైవల్య౧౪పదములే ♦ ఘనమని యుంటినా, కైవల్యపదము నిన్ ♦ గన్నచోటు
బ్రహ్మ౧౫లోకంబాది ♦ పదమనియుంటినా, బ్రహ్మాదులు న్నిన్నె ♦ ప్రస్తుతింత్రు
ఇంద్రలోకమె నాకు ♦ నిష్టంబటంటినా, అష్టదిక్పతులు మి ♦ మ్మాశ్రయింత్రు
పదవి పదవులుగావు ♦ పరమాత్మ నీ౧౬-పాద, కమలపదవియె పదము౧౭ ♦ కంసహరణ
ఇట్టిపదవులు ౧౮నా కేల ♦ యినకులేశ, ౧౯కష్టపెట్టక యేవేళ ♦ కరుణఁ జూడు
నిష్ఠతో నన్నుఁ గావుము ♦ నీలవర్ణ, రామతారక దశరథ♦రాజతనయ. ౯౭

సీ. కమలనాభుఁడ నిన్ను ♦ కన్నులఁ జూచితే, సంభవించెడి-౨౦ఫలము ♦ స్వామినాథ
జలజలోచన ౨౧నిన్ను ♦ శరణని వేడితే, చేపట్టి రక్షింపు ♦ శేషశయన
౨౨నారాయణ ముకుంద ♦ నగహారి నిన్ను నే, నెప్పుడు సేవింతు ♦ నీలవర్ణ
ఇటకు రావయ్య నాతండ్రి ♦ యినకులేశ, తడవుసేయక నన్నేలు ♦ ధర్మనిపుణ
౨౩నిలువ కిఁక వేగ రావయ్య ♦ నీరజాక్ష, రామతారక దశరథ♦రాజతనయ. ౯౮

---

(95) ౧. యోగంబువగలు నాయెదుటలేవు—అని అచ్చుపా. (వాగ్యాలు) ౨. నంటి. ౩. అంత్రమార్గంబుననరసెద. ౪. నమ్మినబంధువు లమరలేరు. ౫. అభ్రమధ్యంబున. ౬. సకలలోకంబులెల్ల నీకుక్షిలోన కుచితమేలయ్య నాతండ్రి కువలయేశ । భక్తికరుణించిప్రోవు మిాబంటుగాను. (96) ౭. సిరకాలమిాసేవ. ౮. జెందఁబోవు. ౯. మిానామ. ౧౦. మాయె. ౧౧. కేశ నినామ. ౧౨. సేవించితె. ౧౩. కరుణఁజూడుము కైవల్యబలవిదారి. (97) ౧౪. మెంతైన. ౧౫. లోకంబని యెక్కుడని యందునా బ్రహ్మయు నిన్నాశ్రయించి తిరుగు । నింద్రలోకం బది యెక్కుడనియందునా యింద్రాదులెంచటో యేలినారు. ౧౬. మిా. ౧౭. మాకు. ౧౮. మా. ౧౯. గట్టిగా నీదుకృపయుంచె పట్టరెవరు. (98) ౨౦. వించును. ౨౧. నేడు చాలినంతను నిన్ను, గొనియాడ నేఁజాలఁ గోరినాను. ౨౨ పరమాత్మ పరంధామ...... వైకుంఠ శ్రీహరి వాసుదేవ నారాయణ...నామనంబు ।నిన్ను నిల్పి యెప్పుడు సేవింతు నీరజాక్ష. ౨౩ నిలిచి నిలువక వచ్చెను.

 

సీ. ధర్మంబు దలఁచిన ♦ దనకును జయమిచ్చు, కర్మంబు దలఁచిన ♦ గాదు జయము
శాంతంబునుంచిన ♦ శాశ్వతపదమొందు, శత్రుత్వమున చాల ♦ చేటు నొందు
కుటిలత్వమునను దుష్కృతమొందుమనుజుండు, కుటిలత్వమే చేటు ♦ కువలయేశ
బద్ధులైనటువంటి ♦ బంధులఁ గూడితే, తనవెంట నొకరైనఁ ♦ దరలిరారు
ఇట్టివారలు నా కేల ♦ యినకులేశ, నీదుకృప నాకు ♦ గట్టిగాఁ గలుగఁజేసి
పరమపద మిచ్చి నన్నుఁ జేపట్టవయ్య, రామతారక దశరథరాజతనయ. ౯౯

సీ. ఆవేళ యమునిచే ♦ నాయాసపడలేక, నీవేళనే మిమ్ము ♦ నెలవుతోడ
నా తలిదండ్రివి ♦ నమ్మి నీపాదము, లిప్పట్టి సేవించెద ♦ పద్మనాభ
శ్రీరామ శ్రీరామ ♦ శ్రీరామ యని మిమ్ము, స్మరణఁ జేసెదనయ్య ♦ చక్రపాణి
కోదండ కోదండ ♦ కోదండరామ నిన్, గొలిచి సేవించెద ♦ కోర్కె దీర
పద్మసంభవముఖనుత ♦ పరమపురుష, నన్నుఁ గాచియు రక్షింపు ♦ నయముతోడ
కరుణతోడుత నను జూడు ♦ కమలనయన, రామతారక దశరథరాజతనయ.

## 10-11-22 ప్రతిలో దొరకిన పద్యములు

సీ. పెక్కుమార్గంబులు ♦ ప్రేమతోఁ దెలిసిన, సార మెఱుఁగుఫలము ♦ సంభవించు
సంభవించినఫలము ♦ సంసారి జ్ఞాని యై, సకలశాస్త్రంబులు ♦ సంగ్రహించు
సంగ్రహించినఫలము ♦ సతతము శ్రీహరి, భజియించి నిశ్చలభక్తుఁ డగును
భక్తుఁడై వైరాగ్యభావంబు గుఱుతెర్గి, యంతట ధ్యానంబు ♦ నమరియుండు
నంత చదువుచు ఫల మది ♦ నరులకెల్ల, కోటివిద్యలు తనయొక్క ♦ కూటికొఱకె
కొండ భేదించి యెలుకను ♦ గోరవలదు, రామతారక దశరథరాజతనయ. ౧

సీ. అనుదినంబును రాముఁ ♦ నాశ్రయింపవలయు, నప్రమేయుం డతం ♦ డచ్యుతుండు
మదిని నెల్లప్పుడు ♦ మహిత సేయఁగవలయు, మధుసూదనుఁ డతఁడు ♦ మాధవుండు
వదలక భక్తిచే ♦ వని......యును, చక్రరక్షకుఁ డతఁడు ♦ చక్రధరుఁడు
సంతతానందుఁడై ♦ సత్యవర్తనతోడ, జరుగుచునుండు నిశ్చలముతోడ
నవతరించెను భువి నతం ♦ డాదిమూర్తి, ప్రస్తుతింపంగవలయును ♦ పద్మనయన
యనుచు మన్నించి రప్పుడు ♦ యమితముగను, రామతారక దశరథరాజతనయ. ౨

సీ. పదివేలప్రభువులు ♦ పాటిదప్పినవార, లుండంగ ఫల మేమి ♦ యుర్విలోన
గుణములు వర్ణించు ♦ గూఢంబు దెలుపని, గురుఁడు శిష్యునకును ♦ గుఱు తదేమి
తనగతికొఱకును ♦ తాపమందఁ డదేమి, భజన సేయని దేమి ♦ ఫలము గల్గు
కాంతు దీరనివానిఁ ♦ గడు నాశ్రయించిన, కలుగునా లాభంబు ♦ కాసురైన
బుధులు సన్మార్గవర్తులై ♦ పొందుఁ దలఁచి, భజనఁ జేతురు మిమ్మును ♦ బ్రహ్మవిదులు
స్తుతులు సేయుదు రెప్పుడు ♦ సురలు గూడి, రామతారక దశరథరాజతనయ. 3

---

(100) ౧. మిమ్ముల వేడుకొంటి. ౨. పట్టవచ్చెద నిపుడు పద్మనయన. 3. సేను చెన్ను మీఱ. ౪. రాముని గొలిచెద మీ సేవ కోర్కెలలర. ౫. భవనుత మాతండ్రి. ౬. రక్షింపుమీ. ౭. కాపాడు.

సీ. ప్రతివ. . .బున ♦ ప్రఖ్యాతి విలసిల్లె, ప్రతి, లేక వెలసెను ♦ భానుపగిది
మేటిరాజులను మీ♦సాటి యెవ్వరు లేరు, శత్రుమృగరాజు సిం♦హంబుపగిది
భయము వారించుచు ♦ భక్తులఁ గాతువు, కంటిని రెప్పయు ♦ గాచుపగిది
మదిని దలఁచుచు నొకఁడు ♦ మార్గంబు జనువాని, తోడనె వత్తువు ♦ నీడగాను
దినదినంబును మీనామ ♦ దివ్యజపము, శక్తివంచనఁ జేయక ♦ సలుపువాని
భాగ్య మింతని వర్ణింప ♦ బ్రహ్మవశమె, రామతారక దశరథ♦రాజతనయ. ౪

సీ. దినదినంతనకీర్తి ♦ దిక్కుల విలసిల్లె, వనపుష్పవృక్షముల్ ♦ వాడు దేర
సంతాన మెఱుఁగని ♦ సతులు గొడ్రాండ్రెల్లఁ, గనిరి సత్పురుషులఁ ♦ గాంతు దీర
వత్సలగుణుఁ డని ♦ వరుసతో గోవుల, కుడుఁవనిచ్చినఁ బాలు ♦ గురియఁ దొడఁగె
ప్రతివత్సరంబున ♦ పండని సస్యముల్, కోసినప్పుడె పంట ♦ కొదవలేక
యినకులేశ్వర మహిమఁ దా ♦ నెంచఁ దరమె, బుధజనస్తోత్ర ♦ సద్గుణ పుణ్యతీర్థ
అఖిలసురవంద్య దివ్యపా♦దారవింద, రామతారక దశరథ♦రాజతనయ. ౫

సీ. పంచేంద్రియములచేఁ ♦ బట్టువడితిని గాని, పరమాత్మ యని నోటఁ ♦ బలుకనైతి
తాపత్రయములచేఁ ♦ దగిలియుండితిఁ గాని, దశరథరాముని ♦ దలఁపనైతి
కామక్రోధములచే ♦ గాసిఁ జెందితిఁ గాని, శ్రీరామచింత నేఁ ♦ జేయనైతి
ఆలుబిడ్డలపొందు ♦ నరసియుండితిఁ గాని, అచ్యుత శ్రీకృష్ణ ♦ యనఁగనైతి
పాపకర్ముఁడ నైతినిఁ ♦ బరమపురుష, కృపఁ బాత్రుని గాఁ జేయు ♦ కువలయేశ
అరసి సాయుజ్య మిత్తు వో ♦ యంబుజాక్ష, రామతారక దశరథ♦రాజతనయ. ౬

సీ. తల్లిగర్భమునందుఁ ♦ దల్లడింపుచుఁ బుట్టి, శిశువునై మీస్మరణ ♦ చేయనైతి
వరుసతో యౌవన♦వైభవంబులచేత, సిరిఁ గోరి మీసేవ ♦ చేయనైతి
సమరంగ కామార♦యాపదవేళను, తలఁపనైతిని మిమ్ము ♦ ధర్మనిపుణ
అంత్యకాలమునందు ♦ నరసి మృత్యువుచేత, బాధపడుచును మిమ్ముఁ ♦ బలుకనేమొ
మిమ్ము స్తుతిసేయనైతిని ♦ మీదుమహిమ, యెఱుఁగనైతిని కావవే ♦ యెలమితోడ
బ్రహ్మగోచర వేదాంత ♦ పరమపురుష, రామతారక దశరథ♦రాజతనయ ౭

సీ. పంక్తిరథాంగణా ♦ పాథోధిమీనంబు, సీతాంగనామనో♦సిద్ధితంబు
సుగ్రీవనేత్రాది ♦ శుభగుని. . .జంబు, హనుమచ్చకోరరా♦మామృతంబు
కవిబృందకేళింద్ర ♦ ఘనవైరివాహంబు, రఘుకృతపుణ్యస♦ద్రాభజితంబు
జాంబవాంగదముఖ్య♦శైశవప్రాయంబు, బహుయుగఫల మిది ♦ భాస్వదంబు
ఇట్టి కార్ముక దీక్షాధు♦రీణుఁడైన, భూమిలోపల నెవ్వఁడు ♦ బుద్ధియందుఁ
దలఁచి కైవల్య మందుఁడీ ♦ ధన్యులార, రామతారక దశరథ♦రాజతనయ. ౮

సీ. పద్మలోచనుసేవ ♦ భక్తితోఁ గొలువక, పరమపాతకులపొందుఁ ♦ బడఁగనేల
శేషాచలాధీశు ♦ సేవించి మెలఁగక, దుష్టసంగతి సేయఁ ♦ దొడఁగనేల
మాధవరాయని ♦ మనసు నర్పించక, పరదైవములస్మరణ ♦ పాటి యగునె
నారాయణుని మదిని ♦ నమ్మికయుండిన, యితరదైవంబుల ♦ నెంచనేల
మనసు నీ కింతబుద్ధియు ♦ మతియు లేదు, రామతారకమంత్రంబు ♦ తలఁపలేదు
తలఁచిన మోక్షమిచ్చును ♦ తలఁపలేదు, రామతారక దశరథ♦రాజతనయ. ౧౦

సీ. జపహోమనిత్యాగ్ని♦తపములు చేసిన, సరిరావు మీనామ♦స్మరణమునకు
అశ్వమేధంబులు ♦ అమితంబు చేసిన, సరిరావు మీనామ♦స్మరణమునకు
ఉపవాసవ్రతములు ♦ యుడుగక చేసిన, సరిరావు మీనామ♦స్మరణమునకు
కాశీప్రయాగాది ♦ ఘనతీర్థయాత్రలు, సరిరావు మీనామ♦స్మరణమునకు
అడవిఁ దిరుగుచు నాకులఁ♦నలముఁ దినుట, సరియు రావు మీనామ సం♦స్మరణమునకు
యెన్ని చేసిన నందుల ♦ నేమిఫలము, రామతారక దశరథ♦రాజతనయ. ౧౧

## 13-8-20 ప్రతిలో దొరకిన పద్యములు

సీ. పురుషోత్తమా యని ♦ స్మరణసేయఁగ మేలు, కలుగు భాగ్యంబులు ♦ ఘనతరముగ
......(అధోక్షజ) యని ఆ♦పన్నరక్షకుఁ డని, పట్టితి మీపాద♦పద్మములను
దశరథాత్మజ రామ ♦ తండ్రివి నీ వని, తలఁచుచుందును నేను ♦ ధరణిమీఁద
భక్తసులభుఁడ వని ♦ పలుమారు నీకీర్తి, పలుకుదు నేవేళ ♦ పరమపురుష
భజనసేయుదు నెప్పుడు ♦ పద్మనయన, నన్నుఁ గృపఁజూడు నాతండ్రి ♦ నీవె గతివి
స్థిరముగా సేవ నా కిచ్చి ♦ సిరు లొసంగు, రామతారక దశరథ♦రాజతనయ. ౧౨

సీ. జానకీపతి నిన్ను ♦ జపముచేసిన మేలు, శ్రీదేవిఁ దలఁచిన ♦ సిరు లొసంగు
సూర్యవంశమె కలుగు ♦ సుగుణత్వమే కల్గు, నీకు నెప్పుడు గొల్వ ♦ నిహము పరము
దశరథేశ్వరుఁ గొల్చి ♦ తలఁచిన మే లగు, ...దేవునిఁ గొల్వ ♦ సిరులు గలుగు
పురుషోత్తముని లెస్స ♦ పూజచేసిన మేలు, తారకనామంబు ♦ తలఁపఁ బ్రియము
మోద మలరంగ వైకుంఠ♦మోక్షపదవి, దొరకు నెప్పుడు వారికి ♦ దొడ్డపదవి
............................రామతారక దశరథ♦రాజతనయ. ౧౩

సీ. శ్రీధర భూధర ♦ శృంగారనామంబు, మాధవపురవాస ♦ వరద యీశ
హృషికేశ యచ్యుత ♦ హృదయములోకేశ్వర, వాసుదేవస్మరణ ♦ వదలకుండ
పద్మనాభా యని ♦ భావించి మదిలోన, ప్రకటింపవే నన్ను ♦ పద్మనయన
దామోదరా నన్ను ♦ దరిఁజూపి కాపాడి, ముక్తిమార్గమునకు ♦ మూలధనము
మకరకుండలధారి నీ ♦ మఱుఁగు పొందు, కనకపీతాంబరాధర ♦ కరుణచేత
పరమపావన మీపాద♦పద్మయుగళ, రామతారక దశరథ♦రాజతనయ. ౧౪

రా మ తా ర క శ త క ము

సం పూ ర్ణ ము.

# పీ ఠి క

శ్రీరామచంద్ర శతకము భక్తిశతకములందు ప్రౌఢమైన శతకము. భావములు, భాష, నిర్మాణవిధానము, కావ్యరచనా విధానమునుబోలి కవీశ్వరుని నిర్మాణదక్షతను విశదము చేయుచున్నది. సుకవిస్తోత్రము, కుకవినిరసనము, కులవంశాదివివరణము, శతకవిభాగము, రచనావిధానము కావ్యనిర్మాణసరణిని ద్యోతకము చేయుచున్నవి. రామచంద్ర శతకకర్త పైడిపాటి వేంకటనృసింహము. ఆరువేల నియోగిబ్రాహ్మణుడు. లక్ష్మీపతికవికిని వేంకమాంబకును జ్యేష్ఠపుత్త్రుడు. శఠమర్షణ గోత్రజుడు. యజుర్వేదశాఖీయుడు. నెల్లూరుమండలమునందలి పైడిపాడు కరణముల వంశీకుడు. కవి రచియించిన నృసింహవిలాసమునందును, మన్నారుకృష్ణశతకమునందును, రామచంద్రశతకమునందును కుల గోత్ర వంశాదులను వివరముగను దెలియజేసెను.

> మ. సుగుణాత్ముం డయి పైడిపాటి కులచక్షుండై మనుప్రోక్తి నా
> దుగురుండై శఠమర్షణాఖ్యమునిగోత్రుండై యజుర్వేదినాఁ
> దగు లక్ష్మీపతి సత్కవీంద్రునకుఁ బుత్త్రిజ్యేష్ఠుఁడన్ నావశం
> బగున ట్లెన్నితి నిన్ను వేంకటనృసింహాఖ్యుండ నీవాఁడ భ
> ద్రగిరీంద్రస్థిత, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

కాలము:— వేంకటనృసింహకవి మేనల్లుడు అయ్యలరాజు నారాయణకవి 1800 ప్రాంత ముందు నివసించినటులు కవులచరిత్రమునందుగలదు. కావున ఈ నృసింహకవికాలము 1750 ప్రాంతమై యుండును.

శైలి:— శైలి ధారాళమైనను ప్రబంధశైలినిబోలి నారికేళపాకమున నున్నది. కవి "మాణిక్యవజ్రతతింగూర్చిన హారపంక్తి గతి గీర్వా

సాంధ్రశబ్దంబులన్ శతకగ్రంథమొనర్చి నీ కొసఁగెదన్." అని వ్రాసినను గీర్వాణశబ్దము లధికముగను గలవు. కావ్యోన్నతి దశకమునందు కవి తన కావ్యప్రశంసను బాగుగ జేసినవిధము నీపద్యములు తెలుపుచున్నవి.

మ. సకల శ్రీశతకంబనేరథమునన్ శార్దూలమత్తేభనా
మకవిక్రీడిత వాజులం బెనఁచి సత్యాక్షసంస్కృతాంధ్రోక్తి కా
ర్ముక బాణంబుల నర్థసూతు నుపమారుక్మ ధ్వజంబున్ సము
త్సుకతం బూన్చితి దాని నెక్కి యట మత్పుణ్యేతరోత్కంఠ కం
టకులం ద్రుంపుచు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. దివ్యత్వాత్మజము పర్ణపుష్పఫలపంక్తిం బొల్చిన ట్లొప్పు భ
వ్య వ్యాహార రసోపమాన పదశయ్యాశుద్ధిసిద్ధించు త
త్కావ్యం బెవ్వరు విన్న నౌనని శిరఃకంపంబు గావింపరే
క్రవ్యాదాంతక, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

రామచంద్రశతకము భద్రాద్రి రామతారక శతకము వలెను, రామతారకశతకము వలెను భక్తిరసావేశమును వ్యక్తము చేయక పాండిత్యమును వ్యక్తము చేయుచున్నది. శతకములను లాక్షణికులు కావ్యములనుగ పరిగణింపక పోయినను ఈ శతకమును కావ్యముగ నిర్ణయించిన విధము శతకమునందు గల కావ్యోన్నతి దశకము విశదము చేయుచున్నది. కవి శతకరచనయందును విభజనయందును నిర్మాణకౌశలమును విశదము చేసెను.

మ. స్తుతి, కావ్యోన్నతి, దాససంగతి, మనోదుర్వృత్తి, సంసార ప
ద్ధతి, మాయాకృతి, తత్త్వసంతతి, యభేదఖ్యాతి దీనావన
స్థితి, సర్వేశదశావతార నుతి, కించిన్నీతి, నా నొప్పు న
ద్భుతరీతిం గృతి రుద్రసంఖ్య దశకంబుల్ సమ్మతిం దానినా
యత కారుణ్యత నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శైలి శబ్దాలంకారములను నర్థాలంకారములను సార్థోక్తులను గలిగి పండితహృదయమును దెలుపుచున్నది. సందర్భానుసారము

గను కవిప్రయోగించిన "మర్కటకిశోరన్యాయము, మార్జాలలీలా కిశోరన్యాయము, గర్భగతముక్తా శుక్తిచందము" మొదలగుప్రయోగ ములు పాండిత్యమును లోకానుభవమును విశదము చేయుచున్నవి. శైలి క్లిష్టమైనను భావశుద్ధిగలిగి పాఠకులచిత్తము నాకర్షించుచు విష యావబోధన కనుకూలముగనున్నది. దీనత్రాణదశకమునం దుపమా లంకారమును, అవతారదశకమునందు ఉత్ప్రేక్షాలంకారమును, నీతిదశ కమునం దంత్యప్రాసమును వాడినవిధము కవిపాండిత్యమును విశదము చేయుచున్నది. శైలి కఠినమైనను ధారాళమై యలంకారశోభితమై శ్రీరామభక్తిని వ్యక్తముచేయుట కనుకూలముగ నున్నది.

## భావార్థము

మకుటము:—నన్నుఁగైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శ్రీ భద్రాచలవాసియైన శ్రీ రామచంద్రుని ఈ భక్తి జ్ఞాన వైరాగ్యభావములతో నారాధించి పురుషార్థమును బడసినవిధమును శతకము విశదము చేయుచున్నది. దాసవృత్తి దశకారంభమునందు కవి తనసంగతి నిటులు శ్రీరామచంద్రునకు విన్నవించుచున్నాడు:—

శా. శ్రీవిశ్వేశ్వర, యాత్మవార్తలు ధరిత్రీభర్తకుఁ బంది తాఁ
గైవారం బొనరించి తెల్పుగతి లోకస్వామివౌ నీ కిఁకన్
నావృత్తాంతము విన్నవింతుఁ జెవినిండం జిత్తగింపం దగున్
దైవగ్రామణి, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మానవులు ధర్మార్థకామరూపంబులైన పురుషార్థత్రితయంబె కోరి చేసెడి దుష్కార్యము లీదశకమునందు బాగుగ వర్ణింపఁబడినవి. మానవులు ధనార్థులై చేసెడి యవినయకార్యము లీపద్యమునందు వర్ణింపబడినవి.

మ. ప్రతివీథిన్ శునకంబులై ఖరిఁ బ్రతిగ్రామంబుఁ గాకాకృతిం
బ్రతిగేహంబు బిడాలముంబలె విదిర్పం జొచ్చి వర్తింపుచున్
బ్రతిమర్త్యాధమునిం బిశాచముఁబలెన్ బాధింప విత్తార్థ మ
ప్రతిమప్కర్మ్ముని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

కవి తన ఐహికాముష్మిక దాసవృత్తిని నీక్రిందిపద్యమున వర్ణించుచున్నాడు.

శా. శాంతస్వాంతము గల్గి యింగితమతిన్ సత్సంగతిం గోరి యే
కాంతగ్రంథముఁ జూడనోపక నిహవ్యాపార విద్యాపరి
శ్రాంతిన్ మూఢుఁడనైతి మర్కటకిశోర న్యాయతన్ నిన్ జగ
త్కాంతు న్వేడని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మనోవృత్తిదశకమునందు సంసారబంధకారణమునకు మూలమైన సంకల్పప్రభావమును బాగుగ వర్ణించెను.

శా. శ్రీనాథా, సకలేంద్రియంబులు మనోవృత్తిం బ్రబోధంబులై
దానిం గూడనినాఁ డభోగములగున్ ధారాధరంబుల్ జగ
త్ప్రాణాధీనము లైనరీతి నది తోల్తన్ సర్వసంకల్పమూ
లానుష్ఠానము నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

సంసారదశకమునందు సంసారమహార్ణవమును దాటగల సాధనములను బాగుగ వర్ణించి మోక్షసాధనమును విశదము చేసెను.

శా. సారాంభోనిధిఁ బోల్ప నీడగునె సంసారం బసారం బనా
ధారం బైనను దుస్తరత్వము నపోతత్వంబు వాటించి ము
న్నారోపించిరొ వీని కాద్యు లుపమేయత్వోప మానత్వముల్
ధారాళం బని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మాయాదశకమునందును, తత్త్వదశకమునందును, వేదాంతసిద్ధాంతములను, యోగమార్గములను సంక్షేపముగను వర్ణించి మోక్షమార్గమును విస్పష్టము చేసెను.

మ విమలాత్ముండగు రాజయోగివరుఁ డన్వేషించు భ్రూమధ్యభా
గమునన్ లోన మనస్కముద్రను జిదాకాశంబునం దైక్యమొం
ద మనస్తత్త్వముఁ జేర్చి వెన్నెలబయల్ దర్శించు నద్వైతుఁడై
యమనస్కం బిది నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

తత్త్వదశకమునందు మోక్షసాధనములైన తారకయోగము, హఠయోగము, సాంఖ్యయోగము, రాజయోగము, కర్మయోగము, జ్ఞానయోగము మొదలగు యోగలక్షణములను సంక్షేపముగను వివరించి కవి తనమోక్షాభిలాషను విశదముచేసెను. అభేదదశకమునందద్వైతసిద్ధి సాధనమును కైవల్యాకాంక్షను విశదముచేసెను.

శా. బ్రహ్మైవాహ మటంచుఁ దెల్పు నిగమగ్రంథాంశవాక్యంబులన్
బ్రహ్మజ్ఞు ల్మదిఁ విశ్వసించి శమమొప్పం దామె నీవంచుఁ జి
ద్బ్రహ్మానందముఁ బొందుచుండుదు రభేదత్వప్రసిద్ధంబుగా
బ్రహ్మేంద్రార్చిత, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

దీనత్రాణదశకమునందును, అవతారదశకమునందును, నీతిదశకమునందును సాధుసంపన్నులను శ్రీమన్నారాయణుడు రక్షించెడి విధమును నీతిప్రవర్తనవిధానమును బాగుగవర్ణించి శ్రీరామభక్తులకు సంతరణ సాధనమును విశదము చేసెను. ఈ మూడుదశకములును అభేదదశకమునకుపూర్వముంచినవిర్మాణవిధానము బాగుండియుండును. శ్రీరామచంద్రశతకకర్త వేంకటనృసింహకవి, శతకమునందు మానవజీవితమునకు పరమావధియైన మోక్షమును సాధించుటకు మానవులకుగల సాధనసంపత్తిని వ్యక్తముచేసి విద్యాప్రయోజనమును సఫలముచేసెను కవి మానవులు సహజమైన సంసారయాతన ననుభవించినను వినమ్రహృదయముతో మానవస్వత్వమైన బ్రహ్మత్వమును బడయుటకు బొందిన హృదయవేదనను శతకము విశదము చేయుచున్నది.

మ. ప్రతివీథిన్ శునకంబులై ఖరిఁ బ్రతిగ్రామంబుఁ గాకాకృతిం
బ్రతిగేహంబు బిడాలముంబలె విదర్పం జొచ్చి వర్తింపుమన్
బ్రతిమర్త్యాగమునిం బిశాచముఁబలెన్ బాధింతు విత్తార్థ మ
ప్రతిదుష్కర్ముని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. దేహప్రావరణంబుచేత సదసద్భేదంబుచే జీవసం
దోహంబున్ నిను వేఱుగాఁ దలఁతు రెండున్ భేసవాచప్రియుల్
వ్యాహారార్థము లర్థభేదములఁ జేయన్ శక్యమే ముక్తుఁడన్
సోఽహంబన్నను నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

రామచంద్రశతకమునందు వేంకటనరసింహాకవి విశదము చేసిన భావార్థమును పాఠకులు గ్రహించి కావ్యప్రయోజనమును సార్థకము చేసికృతార్థు లగుదురు గాత !

క్రోధన శ్రావణ శుద్ధ పంచమి
శుక్రవారము, చెన్నపురి.

కా. నాగేశ్వరరావు

శ్రీ ర స్తు

—

# రామచంద్ర శతకము

## స్తుతిదశకము

శ్రీ సీతాహృదయాబ్జభాస్కర దరారిప్రస్ఫురద్బాణబా
ణాసోపేత లసచ్చతుష్కర శరీరాశ్లిష్టగోదాఘరో
చ్ఛ్వాసప్రోల్లలదంబుశీకర నిజస్థానైకభద్రాద్రియు
గ్దాసశ్రీకర నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. నాకత్మాఘణిలోకమండన యహీనస్వర్ణశైలోపమా
నైకస్థాణుశరాసఖండన ప్లవంగేశాధిపత్యోదితో
ద్రేకాఖండలపుత్రదండన శరశ్రేణీజితారాతిసే
నాకృద్ఖండన నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. సదసద్వస్తువివేకకారణ దశాస్యక్రవ్యభుగ్ధోశ్శిరః
కదళీకాననమత్తవారణ నగాకారస్ఫురత్కుంభక
ర్ణదురంతాభ్రమహాసమీరణ గతగ్రావారి జిత్సాధ్వస
ప్రదమాయారణ నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. స్ఫురదష్టాపదదివ్యభూషణ మహాంభోభంగసందోహదు
స్తరగంభీరపయోధిశోషణ నిరస్తస్థూలదేహోజ్జ్వల
త్ఖరమారీచవిరాధదూషణ వివేకశ్రీకసుశ్లోకసా
దరసంభాషణ నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. అతిపాపౌఘసమీరతక్షక ఖరేంద్రారాతిపుత్రాతిశా
యతనూకాననసర్వభక్షక సదీక్షారూఢమౌనిక్రతు
ప్రతికూలామరవైరిశిక్షక మహాపంకేజగర్భాండసం
తతిసంరక్షక నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ఘోరాఘార్జనమర్త్యపావన బహుక్షుద్రాసురానీకసం
హారార్థాశ్రితదండకావన ప్రసూనాస్త్రక్రియాసంభృతో
దారైకాత్మకళత్రయావన రహస్తత్త్వోపదేశక్రమా
ధారార్యావన నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. వీతాజ్ఞానజనప్రపూజిత చతుర్వేదేతిహాసాగమ
శ్రౌతగ్రంథపికైకకూజిత పయోరాకేందునీహారతా
రాతుల్యోరుయశోవిరాజిత మునీంద్రస్వాంతనీరేరుహ
వ్రాతభ్రాజిత నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. వనజాతాయతచారులోచన మహావాల్మీకిదేవర్షి వా
గనుయోగోత్తరకావ్యసూచన మహోద్యన్మౌనియోషాభ్రవా
హనసంయోగజశాపమోచన స్వదేహన్యస్తకర్పూరచం
దన గోరోచన నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. అజభూపాలసుతాగ్రనందన సమస్తామర్త్యమౌనిద్విజ
వ్రజచేతఃపరితాపచందన చతుర్వారాట్పరీతావనీ
స్థజనాధీశకృతాభివందన హితార్థస్తూయమానేశప
ద్మజసంక్రందన నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. అమరాపజ్జలదప్రభంజన మహోగ్రారణ్యసంవాససం
యమివిద్వేషసురారిభంజన ప్రపంచాదృశ్యవేదాంతవే
ద్యమహావస్తునిదర్శనాంజన స్థిరధ్యానానుసంధానభ
క్తమనోరంజన నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

## శార్దూలవృత్తదశకము

శా. శ్రీవైదేహసుతాదరీ స్ఫురదరీ చింతాస్రవంతీతరీ
కైవల్యాగ్ర్యపురీ భవద్విరదశిక్షాకేసరీ భూమిభృ
జ్జావాల్మీకిలసద్వచోమృతఝరీ శౌరీ దరీ పోషిత
గ్రావారీ దయ నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ !

శా. రామా పాపవిరామ సూర్యకులపారావారరాకాసుధా
ధామా భక్తహృదబ్జధామ భువనాంతర్యామివౌ నిన్ను నీ
సామాన్యోక్తుల నెన్న సర్వపదవాచ్యత్వంబు నీదౌట నే
నామోదించితి నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ !

మ. సతతానేకముఖప్రవాహతటినీసంజాతహేతుక్రమో
న్నతధాత్రీధరపంక్తితుల్యులగు నానాలోకభాషాకృతి
ప్రతిభోత్పత్తినిదానసత్కవుల నేఁ బ్రార్థింతుఁ వారెల్ల భా
రతిసారూప్యులు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ఘనమేధాంజనసత్కవిం బలె కృతిత్రామసౌఖ్యదార్థార్థముం
గనలే రంధ్రపరంపరాకుకవు లర్కప్రాంశుసంతానముఁ
గని హర్షింపఁగఁ జక్రవాకముల వీక్షన్ ఘూకముల్ చాలునే
దనుజౌఘాంతక, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. క్షితి నేకాదశసంఖ్యచే దశకముల్ చెన్నొందు మాణిక్యవ
జ్రతతింగూర్చిన హారపంక్తిగతి గీర్వాణాంధ్రశబ్దంబులన్
శతకగ్రంథ మొనర్చి నీ కొసఁగెదన్ సర్వేశ యస్మత్కవి
త్వతపస్సిద్ధికి నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. అమలాంభోమయమైన గంగకును నీడై యాద్యభాషాకృతుల్
యమునాముఖ్యనదీయుతాపగకు జోడై యష్టభాషామయాం
ధ్రమహోద్యత్కృతులొప్పఁదత్కృతుల తాత్పర్యామృతంబాత్మఁ బా
నము గావించెడి నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా,హరీ!

మ. అతిపాపౌఘసమీరతక్షక ఖరేంద్రారాతిపుత్రాతికా
యతనూకాననసర్వభక్షక సదీశారాధమానిక్రతు
ప్రతికూలామరవైరిశిక్షక మహాపంకేజగర్భాండసం
తతిసంరక్షక నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ఘోరాఘార్జనమర్త్యపావన బహుక్షుద్రాసురానీకసం
హారార్థాశ్రితదండకావన ప్రసూనాస్త్రక్రియాసంభృతో
దారైకాత్మకళత్రయావన రహస్తత్త్వోపదేశక్రమా
ధారార్యావన నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. వీతాజ్ఞానజనప్రపూజిత చతుర్వేదేతిహాసాగమ
శ్రౌతగ్రంథపికైకకూజిత పయోరాకేందునీహారతా
రాతుల్యోరుయశోవిరాజిత మునీంద్రస్వాంతనీరేరుహ
వ్రాతభ్రాజిత నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. వనజాతాయతచారులోచన మహావాల్మీకిదేవర్షి వా
గనుయోగోత్తరకావ్యసూచన మహోద్యన్మౌనియోషాభ్రవా
హనసంయోగజశాపమోచన స్వదేహన్యస్తకర్పూరచం
దన గోరోచన నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. అజభూపాలసుతాగ్రనందన సమస్తామర్త్యమానిద్విజ
వ్రజచేతఃపరితాపచందన చతుర్వారాట్పరీతావనీ
స్థజనాధీశకృతాభివందన హితార్థస్తూయమానేశప
ద్మజసంక్రందన నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. అమరాపజ్జలదప్రభంజన మహోగ్రారణ్యసంవాసనసం
యమివిద్వేషసురారిభంజన ప్రపంచాదృశ్యవేదాంతవే
ద్యమహావస్తునిదర్శనాంజన స్థిరధ్యానానుసంధానభ
క్తమనోరంజన నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

## కావ్యోత్పత్తిదశకము

శా. శ్రీవైదేహసుతాదరీ స్ఫురదరీ చింతాస్రవంతీతరీ
కైవల్యాగ్ర్యపురీ భవద్విరదశిక్షాకేసరీ భూమిభృ
జ్జావాల్మీకిలసద్వచోమృతఝరీ శౌరీ దరీ పోషిత
గ్రావారీ దయ నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. రామా పాపవిరామ సూర్యకులపారావారరాకాసుధా
ధామా భక్తహృదబ్జధామ భువనాంతర్యామివౌ నిన్ను నీ
సామాన్యోక్తుల నెన్న సర్వపదవాచ్యత్వంబు నీదౌట నే
నామోదించితి నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. సతతానేకముఖప్రవాహతటినీసంజాతహేతుక్రమో
న్నతధాత్రీధరపంక్తితుల్యులగు నానాలోకభాషాకృతి
ప్రతిభోత్పత్తినిదానసత్కవుల నేఁ బ్రార్థింతుఁ వారెల్ల భా
రతిసారూప్యులు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ఘనమేధాంజనసత్కవిం బలె కృతిత్సౌమ్యసౌఖ్యదార్థార్థముం
గనలే రంధపరంపరాకుకవు లర్కప్రాంశుసంతానముఁ
గని హర్షింపఁగఁ జక్రవాకముల వీఁకన్ ఘూకముల్ చాలునే
దనుజౌఘాంతక, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. క్షితి నేకాదశసంఖ్యచే దశకముల్ చెన్నొంద మాణిక్యవ
జ్రతతింగూర్చిన హారపంక్తిగతి గీర్వాణాంధ్రశబ్దంబులన్
శతకగ్రంథ మొనర్చి నీ కొసఁగెదన్ సర్వేశ యస్మత్కవి
త్వతపస్సిద్ధికి నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. అమలాంభోమయమైన గంగకును నీడై యాద్యభాషాకృతుల్
యమునాముఖ్యనదీయుతాపగకు జోడై యష్టభాషామయాం
ధ్రమహోద్యత్కృతులొప్పఁ దత్కృతులతాత్పర్యామృతంబాత్మఁ బా
నము గావించెడి నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా,హరీ!

మ. సకలశ్రీశతకంబనేరథమునన్ శార్దూలమత్తేభనా
మకవిక్రీడితవాజులం బెనఁచి సమ్యక్సంస్కృతాంధ్రోక్తికా
ర్ముకబాణంబుల నర్థసూతు నుపమారుక్మధ్వజంబున్ సము
త్సుకతం బూన్చితి దాని నెక్కి యట మత్పుణ్యేతరోత్కంఠకం
టకులం ద్రుంపుచు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. పలురీతిన్ నినుఁ బల్కు కావ్యము గ్రహింపంజూడుమా తప్పు లిం
దుల లెక్కింపకుమా కృపన్ శబరి మాధుర్యార్థమై తొల్తనే
ఫలముల్ దాఁ జవిగాంచి మీ కొసఁగినన్ భక్షింపవే యెంగిలిం
దలపం జూచితె నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. శంకాతంకవిమోచనాష్టవిధభాషాశబ్దసంసిద్ధి సా
లంకారైకకృతుల్ సుధారుచులఁ గొల్పంజాలులీలన్ గతా
లంకారాంధ్రకృతుల్ రుచింపవన నేలా నీరనే సాక్షి సా
హంకారుం గృప నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. దివ్యత్సూక్ష్మజము పర్ణపుష్పఫలపంక్తిం బొల్చిన ట్లొప్పు భ
వ్యవ్యాహారరసోపమాన పదశయ్యాశుద్ధిసిద్ధించు త
త్కావ్యం బెవ్వరు విన్న నౌనని శిరఃకంపంబు గావింపరే
క్రవ్యాదాంతక, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

## దాసవృత్తదశకము

శా. శ్రీవిశ్వేశ్వర, యాత్మవార్తలు ధరిత్రీభర్తకున్ వంది తాఁ
గైవారం బొనరించి తెల్పుగతి లోకస్వామివౌ నీ కికన్
నావృత్తాంతము విన్నవింతుఁ జెవినిండం జిత్తగింపం దగున్
శైవగ్రామణి, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. జననీదుర్భరగర్భనారకనివాసక్లేశతం బుట్టి పు
ట్టిననాఁ డాదిగ జంత్రపుంబ్రతిమమాడ్కిన్ బాల్యకౌమారయౌ
వనవార్ధక్యములందుఁ గాలవశతన్ వర్తింపుచున్నాఁడ నేఁ
డనుకంపామతి నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. జననం బాదిగ సంసృతిన్ బడి దురాశాపాశబద్ధుండనై
నినుఁ గీర్తింపఁగనైతి నిప్పుడయినన్ నీనామమావృత్తి కొ
ప్పిననాజిహ్వను నిల్పు పావక మయఃపిండంబునం దుండదా
ధనముక్తిప్రద, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. ఆవాసాంగణభూమిఁ దాఁ గతుకుకై యాస్థన్ దివారాత్రులెం
తో వాపోవెడి సారమేయముగతిన్ దుర్వ్యాప్తి దారాదిర
క్షావృత్తిం బడి ప్రల్లదింతు నెపుడున్ సంపన్నులం గొల్చి సీ
తావామాధిప, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. తలఁపన్ జాగ్రదవస్థ సర్వమును నే దారాదిరక్షార్థమై
బలిమిన్ వ్యర్థము చేయఁజొచ్చితి పశుప్రాయుండనై ధర్మముల్
పలుకంగా వినుచున్ క్షణంబయిన నే భావింపలేనైతి నో
నలినప్రేక్షణ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. చిరకాలంబు మహోపలంబుగతి నే జీవించువానిన్ బలెన్
బురుషార్థత్రితయంబె కోరి జడతన్ మోక్షం బపేక్షింప క
స్థిరదారాదికపోషణార్థము పరాధీనుండనైతిన్ సమా
దరచేతోగతి నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ప్రతివీథిన్ శునకంబువైఖరిఁ బ్రతిగ్రామంబుఁ గాకాకృతిం
బ్రతిగేహంబు బిడాలముంబలె విదిర్పం జొచ్చి వర్తింపుచున్
బ్రతిమర్త్యాధమునిం బిశాచముఁబలెన్ బాధింతు విత్తార్థ మ
ప్రతిదుష్కర్ముని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. శాంతస్వాంతము గల్గి యింగితమతిన్ సత్సంగతిం గోరి యే
కాంతగ్రంథముఁ జూడనోపక నిహవ్యాపారవిద్యాపరి
శ్రాంతిన్ మూఢుఁడ నైతి మర్కటకిశోరన్యాయతన్ నిన్ జగ
త్కాంతు న్వేడని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. అన్యస్త్రీద్రవిణాన్నకాంక్ష బహుపుణ్యాపాయ మీదేశకా
లాన్యోన్యవ్యతిరేకతం బరవశవ్యాసంగతన్ నాకు సా
మాన్యవ్యక్తి ఘటించెనేని కరుణన్ మార్జాలలీలాకిశో
రన్యాయంబున నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. అతిథిబ్రాహ్మణదేవతాపితృసపర్యాదూరుఁ బాపాత్ము సం
తతవేదోదితకర్మహీనుఁ గృపణున్ నన్నెట్లు రక్షింతువో
పతితప్రాకృతపావనాఖ్యకుఁ దలంపన్ హానిఁ బ్రాపించునీ
క్షితిఁ నిల్లైన నటంచు నీవు కరుణం జేపట్టితే నేమొ దు
ర్మతినై ప్రేలెడు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

## మనోవృత్తి దశకము

శా. శ్రీనాథా, సకలేంద్రియంబులు మనోవృత్తిం బ్రబోధంబులై
దానిం గూడనినాఁ డబోధములగున్ ధారాధరంబుల్ జగ
త్ప్రాణాధీనములైనరీతి నది తోల్తన్ సర్వసంకల్పమూ
లానుష్ఠానము నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. తనుసర్వేంద్రియనాయకంబగు మనస్తత్త్వంబు నిత్యప్రవ
ర్తనతన్ సర్వగుఁడైన గాడ్పుగతి మిథ్యావృత్తి వర్తించు న
ర్ధనిమేషంబును నిల్వ దొక్కెడ భవత్పాదారవిందద్వయా
ర్చన మెట్లబ్బెడు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. ఆకాశంబునఁ దోఁచు శబ్దగుణ మట్లైనన్ మదిం దన్నభో
నీకాశంబనఁ గూడదయ్యెఁ దెలియన్ నిశ్శబ్దతావాప్తిఁ దృ
ష్ణాకామోద్భవహేతుచిత్త మఖిలజ్ఞానేంద్రియాతీత మో
రాకాబ్జానన, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. ఆశాసంజనితానిలం బభిముఖాశావాప్తిఁ దానొందుచో
లేశంబైన గతించు కాలము తటిల్లేఖాగతిన్ జిత్త మీ
దేశం బంత తలంచుమాత్రనె ప్రవర్తించున్ మహాసూక్ష్మమై
దాశార్హాన్వయ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. సంకల్పంబులు బంధకారణము లాసంకల్పవర్జంబు ని
శ్శంకాకల్పితమోక్షమూల మిరుపక్షంబుల్ చరన్ హేతు వే
ణాంకుం డైనగతిన్ మనంబు జనకంబై యొప్పు నా రెంటి కా
తంకస్వాంతుని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. గిరులం గూడి రహించు స్వేచ్ఛ బయలం గ్రీడించు నెందేఁ బయో
ధర మంతర్హితమైన వైఖరిని జిత్తం బింద్రియోపేతమై
తిరుగున్ మేల్కన నొంటి స్వప్నమున వర్తించున్ సుషుప్తిన్ ధను
ర్ధర, శూన్యం బది నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. దేవా, ప్రత్యహ మీషణత్రితయవృద్ధిం గోరి భ్రాంతిన్ భవ
త్సేవాశూన్యము నొందె చిత్తము విటస్త్రీజారభోగాశచే
జీవేశవ్రతశూన్య మైనకరణిం జేతోవశాభావక
ర్మావేశుండను నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ధర నేయాకృతిఁ దాల్చునో యపుడు తద్భాషాప్రసంగైకచా
తురి వర్తించిన వేషధారిగతిఁ జేతోవృత్తి యొక్కొక్కవే
ళ రజస్సత్త్వతమోగుణత్రయము లీలం గూడి తత్తద్గుణో
త్కరబోధ్యంబగు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. పగలున్ రేయును లేక యెప్పు డవినాభావైకసంబంధమై
నగుపాక్రాంతతమంబు వైఖరిని శూన్యజ్ఞానిచిత్తంబు మె
చ్చుగ నేకాలము లౌక్యచింత నొనరించున్ సంసృతివ్యాప్తికిం
దగులంబా నది నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. చనుచోఁ గుమ్మరపుర్వు మేన లవలేశంబంతయుం బంకమం
టనిచందంబున జ్ఞానిచిత్త మఘదార్ఢ్యంబైన యాసంసృతిన్
వనటం గూరుచు మీఁదెఱింగి తదఘవ్రాతంబుఁ దానొంద దా
త్మనె చింతించును నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

## సంసారదశకము

శా. శ్రీనారాయణ, యీషణప్రకృతివారిం గామభంగాళిఁదృ
ష్ణానిద్రాదికజంతుపంక్తిఁ దగు నీసంసారవారాశి దు
ర్మానాజ్ఞానతఁ గూలి జాలి దరిఁజేరన్ నేరనైతిన్ సమా
ధానప్రేమత నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. జడధిం జొచ్చిన తుంగభంగతటినీసందోహనీరంబుకై
వడి నిస్సారము దుర్విచారము మృషావాక్పూరసంసారమం
దడఁగున్ వైదికలౌకికక్రియల నేనార్జించువిత్తం బికన్
దడయం జూడక నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. పారం బెంతటఁ గానరాక నడుమన్ భంగక్రియ ల్గల్గి దు
ర్వారంబై జడతాభివృద్ధిగతసత్త్వంబై భృశంబైన సం
సారాంభోనిధిఁ జిక్కినాఁడ వెడలన్ శక్యంబె వేవే భవ
త్కారుణ్యంబున నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. అంతర్దాహకబాడబాగ్నిగల యయ్యంభోధిచందంబునన్
గాంతాదీషణవృద్ధిఁ దోఁచెడి మహాకామాదివర్గంబుచే
సంతప్తంబగు భంగసంతతిని సంసారంబు యుష్మత్పదా
క్రాంతస్వాంతుని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ఘనఝంఝాపవనప్రకంపితతరింగాండప్రకాండాబ్ధిఁ దా
ర్కొని లోనం గుదియించురీతి జడధీకుక్షింభరాయాసమ
ర్త్యుని సంసారము దుష్టకష్టజనితార్తుం జేయు నోహో జనా
ర్దన, కారుణ్యమునన్ గనుంగొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. బహుకామోర్ములు క్రోధబాడబము లోభక్షారమున్ మోహ దు
స్సహనిమ్నంబు మదాంబువాహినులు మాత్సర్యోరుసత్త్వంబు లి
మ్మహి సంసారపయోధిఁ దార్కొనఁ దరింపన్ శక్యమే దుష్టని
గ్రహ, శిష్టావన, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ద్రుహిణాహః ప్రళయంబునందు నిఖిలోరుద్వీపము ల్వార్ధివి
గ్రహవృత్తిన్ గబళించురీతి నిహసంస్కారాజ్ఞులం గాలస
న్నిహితంబైనఁ గలంచి ముంచు కర మీనిస్సారసంసార మో
యహిభృద్వందిత, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. అమితాయాస మతృప్తిజీవన మతివ్యాయామకల్లోల మ
ల్పమనోగమ్య మగోచరప్రచుర మీపంకాంకితాతంకదు
ర్దమసంసారము సాగరోపమ మయో! దానిం దరింపంగ శ
క్యమె మూర్ఖాళికి నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. ఆశోపేత మబద్ధమార్గ మవిధేయంబైన సంసార మీ
యాశాంతంబున బద్ధసంగతి విధేయత్వంబునం బొల్చు వా
రాశిన్ మీఱి ద్విజాళినైన దరిజేరం బోవఁగానీ దనం
తాశాబద్ధుని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. సారాంభోనిధిఁ బోల్ప నీడగునె సంసారం బసారంబ నా!
ధారం బైనను దుస్తరత్వము నపోతత్వంబు వాటించి ము
న్నారోపించిరొ వీని కార్యు లుపమేయత్వోపమానత్వముల్
ధారాళం బని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

## మాయాదశకము

శా. శ్రీసర్వేశ, స్వయంప్రకాశి వగుచున్ జెన్నొందు నీసచ్చిదా
భాసం గప్పినమాయ నీకు శబలబ్రహ్మత్వజీవత్వముల్
దా సంధిల్లఁగఁ జేసి గర్భగతముక్తాశుక్తిచందంబునన్
భాసిల్లుంగద నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. తనప్రాగ్భావముఁ బ్రాగభావమును నిత్యభ్రాంత చింతాదరి
ద్రుని చాపల్యమనోరథంబుకరణిన్ రూపించుచున్ విశ్వమో
హనమూర్తిం దనచాతురీమహిమ మాయాశక్తివర్తించు నో
యనిరుద్ధాహ్వయ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. అవనీముఖ్యసమ స్తతత్త్వసమవాయత్వాకృతిఀ నీదుమా
య వివాదస్మృతి నొప్పతంతుసమవాయత్వాంబరంబుం బలెం
భువనంబుల్ దనమూ ర్తిగాఁ బెనుపుచుఀ బోకార్పుచుం బొల్చు దా
నవగర్వాపహ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. తనయంత త్త్వము దెల్పుచుం బ్రకృతిచిత్రంబౌ ననాదిత్వముం
దనకుం నైజగుణంబుగా నిరుపమానప్రౌఢి యుష్మద్దశా
ననఘోరాహవముంబలెం దెలుపుచుండఀ దానిచాతుర్య మే
మని యెన్నందగు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. సగుణావిద్య రజోగుణాశ్రయమునఀ సర్గత్వముఀ శుద్ధస
త్త్వగుణఖ్యాతిని బోషణత్వముఁ దమోధాటిఀ లయత్వంబుఁ బూ
ని గతిం గాలవిభేదతం ద్రివిధమై నిష్ఠాక్రియారంభనం
ధ్యగతిఀ వర్తిలు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. మధ్యావస్థయకార్యకార్యముల నమ్మం జేయు నిద్రఀ సుహృ
న్మిథ్యావిద్య తదాకృతిఀ భువనముల్ నిర్మించి మాయింపుచుఀ
సాధ్యాభావత శాశ్వతంబని ప్రపంచంబెల్ల నమ్మించు నా
త్మధ్యానప్రియ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. లయకాలార్ణవపుమేనులందుఁ జిరకాలభ్రాంతిఁ బుట్టించి మో
హయుతస్వాంతులఁ జేసె మాయ 'మమమాయా దుర్మతీనాం దుర
త్యయ' యంచుఀ నరుతోడ నీవనిన గీతావాక్యమే సాక్షి నీ
దయకుం బ్రాప్తుఁడ నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. ప్రారబ్ధానుభవాంతతం బ్రకృతి సర్వప్రాణిదేహాంతముఀ
దా రూపించె రవిప్రభాంతమె దినాంతంబైన రీతిం దదా
కారప్రాకృతదేహదుర్మతు లెఱుంగఀ నేర్తురే తచ్ఛమ
త్కారప్రౌఢిమ నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. ఇష్టాశ్చర్యములన్ సృజించి సభికుల్ వీక్షింప మాయించు నా
స్రష్టృత్వవ్యసనేంద్రజాలికరణిన్ సంకల్పమాత్రన్ జగ
త్స్రష్టస్థితిత్యవసానముల్ బ్రకృతిం దాఁజెల్లించుచుండున్ మనో
దష్టక్రోధుని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. కలిమిన్ లేమిని నెండమావులగతిం గాయంబులన్ బుద్బుదం
బులరీతిన్ క్షణభంగురంబు లనుచున్ బోధించు విద్వన్మహా
త్ములసూక్తుల్ వినువారినైన నపుడే మోహింపఁగాఁ జేయు మా
య లఘుస్వాంతుని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

## తత్త్వదశకము

శా. శ్రీదామోదరపద్మజాండసహజక్రీడామహాతత్త్వముల్
వేదండావయవంబు లద్దములలో లీనంబులై తోఁచుమ .
ర్యాదన్ సూక్ష్మములై సమస్తమును బిండాండంబులం దుండుఁ గాఁ
దా దీనావన, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ప్రకటంబై తగు ప్రాణముల్ విషయకర్మజ్ఞానముల్ నాల్గు పం
చకముల్ చిత్తచతుష్టయంబు కృతిగా సంధిల్లుచే మాయ త
త్ప్రకృతిన్ దోఁచిన నిన్ను జీవుఁ డనుచుం దత్సాక్షివౌ నిన్ను వే
ఱొక షడ్వింశతితత్త్వవాచ్యుఁడని యార్యుల్ బుద్ధి లెక్కింతు రెం
తకు సాంఖ్యం బిది నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ఘనసిద్ధాననమందు యోగి గురువాక్యప్రాప్తి లక్ష్యత్రయం
బునఁ దన్నుం గను మండలత్రితయధామముం బిమ్మటన్ శాంభవిం
గనుచున్ ఖేచరిముద్రఁ బూని పరసౌఖ్యప్రాప్తుఁడౌ తారకం.
బనుతత్త్వం బిది నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. విమలాత్ముండగు రాజయోగివరుఁ డన్వేషించుభ్రూమిమధ్యభా
గమునన్ లోన మనస్కముద్రను జిదాకాశంబునం దైక్యమొం
ద మనస్తత్త్వముఁ జేర్చి వెన్నెలబయల్ దర్శించు నద్వైతుఁడై
యమనస్కం బిది నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. తలక్రిందై విషమానుచర్య విగతతత్త్వస్వాంతునిం జేయఁ గుం
డలి నభ్యాసితకుంభకుం డటు త్రికూటస్థాన మెక్కింప రే
వెలుఁగుల్ రాహువు పట్టి నట్లొడిసి తీవిం ద్రావు ధీదృక్కళా
తల పీయూషము నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. మును దర్శింప వశంబుగాని తనమోముల్ దర్పణోపాధి గ
న్గొనిన ట్లాత్మ గురూపదేశమున యోగుల్ గాంతు రేకాంతద
ర్శనయోగైక్యసమాధిచేఁ దనరి యప్రత్యక్షమైయున్న యా
త్మను గారుణ్యమునన్ననుల్ గొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. మహి గంగాయమునాసరస్వతుల సంబంధంబునం దత్సరో
లహరిం బొల్చు త్రివేణిఁ గ్రుంకఁ జన నేలా యిడ్యాపింగళా
సహితంబైన సుషుమ్నలోని మననస్నానం బపేతా తమో
రహితంబైనది నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. పిక మాదిన్ బలిభుజ్నివాసగతమై పెంపొంది వే వేసవిన్
స్వకులశ్రేణిని గూడినట్లు పరతత్త్వజ్ఞాని సంసారవా
హకుఁడో నాఁ దగి కర్మపాకసమయంబైనం బరంబందు నా
త్మకళానామక! నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. నిజగేహంబున గల్గుపాయసము దుర్నీతిన్ విసర్జించి య
న్యజనాన్నంబు భుజింపఁగోరుగతి నాత్మారామునిన్ నిర్వికా
రు జగన్నాథుఁ బరేశు నిన్నుఁ బ్రతిమారూపంబులన్ లక్ష్యదూ
రజనుల్ గొల్తురు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. తొలుతన్ నాల్గిటి నాలుఁ జేర్పఁ బదినొండుల్ వానిఁబండ్రెంటిలోఁ
గలుపన్ షోడశసంఖ్యఁ జేరునవి వేరన్ రెంటితోఁ గూర్చి ని
శ్చల భద్రాసనమందు షణ్ముఖశిరశ్శ్వభ్రచ్యుతప్రాణుఁడై
జలముల్ పాలనుగూడినట్లు హతసంస్కారుండు నిన్నొందు నో
దళసంజ్ఞాత్మక, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

## అభేదదశకము

శా. శ్రీరామా విను, మంబరంబు ఘటకుక్షిన్ భిన్నమై తోఁచిన
ట్లారూఢిం ద్రిజగన్మయుండవగు నీవయ్యై తనూపాధులన్
వేఱై తోఁచు టెఱింగి నిశ్చయమతిన్ విద్వజ్జను లోమహా
చారాధింతురు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. శతపత్రాప్తికి వృద్ధిసంక్షయము లెంచం గల్గునే తత్కళా
తతికిం గాక తదాకృతిన్ బహువిధోత్పత్తిప్రణాశంబు ల
ద్భుతచైతన్యవిశిష్టదేహముల కొందుంగాక జీవాత్మకా
తతమై కల్గునె నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. దివ్యుండై రవి మింటనుండిన ఘృణుల్ దీపించుచందంబునన్
ద్రవ్యప్రాణవినిర్మితాస్థిరశరీరస్థేంద్రియంబుల్ నిజో
క్తవ్యాపార మొనర్చు నీవును దటస్థవ్యక్తినుండం దురం
తవ్యాసంగుని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ముకురోపాధి పరంపరం గ్రమగతిం బొల్పొందు బింబానుబిం
బకదంబంబు బలెన్ భవన్నిరుపమాభాసానుభాసాప్రతి
ప్రకరంబెల్లఁ దనూపరంపరలలో భాసిల్లు నద్వైతసా
ధక దృష్టాంతత నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. ధేనుస్తోమ మనేకవర్ణములఁ బృథ్విన్ వర్తిలుం దత్‌స్తనా
ధీనక్షీరము లేకవర్ణమగురీతిం బెక్కుభిన్నంబు లీ
నానాదేహము లాత్మ యొక్కఁడగుఁ గానం నీవెకా జీవసం
తానంబైతివి నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ఉదకస్థప్రతిబింబసంచలన మయ్యూర్ధ్వప్రచారప్రసి
ద్ధదినాధీశునకుం బలెన్ మహి నవిద్యారూపసంబంధతా
విదితాభాసల నంటుకర్మము మహావిద్యామయున్ నిన్ను నొం
ద దభేదప్రియ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. కలశోపాధిపృథగ్విధంబున నదీగర్భంబునందుం జలం
బులు గానంబడురీతి నీవును జగత్పూర్ణుండవై యుండి లో
కుల దేహస్థితి భేదమైతి వీక నీకుం దేహికిం భేదముల్
దలంపంగల్గునె నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. దేహప్రావరణంబుచేత సదసద్భేదంబుచే జీవసం
దోహంబుల్ నిను వేఱుగాఁ దలఁతు రెందుం భేదవాదప్రియుల్
వ్యాహారార్థము లర్థిభేదములఁ జేయం శక్యమే ముక్తుఁడౌ
సోఽహంబన్నను నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. అమితోచ్ఛ్వాసము చర్మభస్త్రిగతి వేఱైయుండి తత్సూక్ష్మరం
ధ్రమునం జారి మహానిలుం గలియుమర్యాదం శరీరరావృత
భ్రమతం వేఱని తోఁచు జీవుఁడు భవాపాయంబునం యుష్మదై
క్యము నొందుంగద నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. బ్రహ్మైవాహ మటంచుఁ దెల్పు నిగమగ్రంథాంతవాక్యంబులం
బ్రహ్మజ్ఞు ల్మది విశ్వసించి శమమొప్పం దామె నీవంచుఁ జి
ద్బ్రహ్మానందముఁ బొందుచుందురు రభేదత్వప్రసిద్ధంబుగా
బ్రహ్మేంద్రార్చిత నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

దీనత్రాణదశకము

శా. శ్రీగోవింద, సపంజరాండజము శుష్కీభూతమైన ట్లవి
ద్యాగర్వాంధజలగ్రహగ్రహణపాదద్వంద్వుఁడై కుందు త
న్నాగేంద్రుం మృతవైరిఁ జేసి చిరచింతం బాపి రక్షింపవే
రాగగ్రస్తుని నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. సతమస్సత్త్వరజస్సమీకృతకళాసంక్షేపతారావరా
కృతి నాక్రాంతతమఃకనిష్ఠజననీకృత్యావమానంబునం
గతవాంఛామతి మానియైనధ్రువు నాకాశస్థలంబం దనా
రతముం నిల్పవె నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. ప్రసవాంధత్వపుఁదల్లి వాతఁబడి యాపత్తిం బ్రలాపించు దు
ర్వ్యసనవ్యాఘ్రకిశోరముంబలెఁ దమోరాగాంధుఁడౌ తండ్రి తా
మసదుర్బాధలఁ గుందుచున్న సుమతిం బ్రహ్లాదు రక్షింపవే
యసమప్రాభవ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. సమదాజ్ఞానతమోదమందుఁ బడి కష్టప్రాప్తిచే నష్టధీ
తిమిరవ్యాప్తిఁ గృశించునక్కరిణిరీతిన్ శాపసంజాతక
ష్టమునం గుందెడి యాయహల్య చిరదుష్కర్మంబు మాయించి గౌ
తమునిం గూర్పవె నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. క్షణదాంతంబున భాస్కరాభ్యుదయశంకన్ వెల్వెలంబోవు రో
హిణిచేడుంబలె నన్నచే బలయశోహీనాత్ముఁడై కుందుచున్
రణవీథిన్ గృశుఁడైన భానుజుఁగృపన్ రక్షింపవే వాలివా
రణ పంచానన, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. తనగోత్రాంతభయావహంబునకుఁ జింతం గుందుమైనాకుఁ డ
బ్ధిని సేవించినరీతి గోత్రలయభీతిన్ నిన్ను భక్తిన్ భజిం
చిన నిర్దోషవిభీషణుం గరుణచేఁ జేపట్టవే తద్దశా
ననసంహారక! నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. కానం బ్రొద్దు మునుంగ మేఘుఁడు తటిద్గర్జాళి వర్షింప నె
చ్చో నేగం దెరు వేది గానని మనుష్యుంబోలు దారిద్ర్యచిం
తానిర్మగ్నకుచేలుఁ దత్పృథుక లెన్నన్ మెక్కి సౌభాగ్యసం
ధానిం జేయవె నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. భ్రాంతిన్ జాలరు లల్పవారిఁ దనమర్మంబు ల్గనంజొచ్చుచో
నెంతే గంగ గలంగినట్లు సభలో నిచ్చన్ రిపుల్ సేయుమా
నాంతావస్థకుఁ గుందు ద్రౌపదిని నీవాయక్షయాచ్ఛాదనా
క్రాంతం జేయవె నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. తపనగ్రీష్మకరార్చులం బొగులుతప్తభ్రాంతచింతాచకో
రపుఁబక్షింబలెఁ బార్థముక్తశరపర్యంకస్థగంగాసుతుక్
వపురావేదన మాన్చి పూర్వపువసుత్వంబిచ్చి రక్షింపవే
యపరాధిం గృప నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. నిజగర్భస్థరవిద్విషద్గణకృతానేకశ్రమప్రాగ్ద్విగం
బుజనేత్రింబలె వేదనంబడు గతామోదోత్తరం గుక్షిసా
చ్చి జడద్రౌణిశరాగ్ని నార్పి శిశువుక్ జీవింప రక్షింపవే
యజరుద్రార్చిత, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

## అవతారదశకము

శా. శ్రీనారీప్రియ, పాంచభౌతికవపుర్జీవేతరాభాసలక్
నీనారాయణనామరూఢికొఁటకో నీరేజగర్భాగమా
ఖ్యానగ్రాహిని ద్రుంపనో తొలుత మీనాకారతక్ వార్ధి నీ
వానందించుట నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. పూర్వోగ్రాకృతిలేని స్వాన్వయహితాంభోవర్తనంబూననో
గీర్వాణారుల నష్టజీవనులఁగాఁ గేడింపనో కూర్మపుం
బర్వాబ్జాననమేనులెత్తి వనధిక్ భాసిల్లుటల్ భూరియుగాం
తర్వేదిస్థిత, నన్నుఁగైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. తొలిజన్మంబుల లేనిభూస్థలసరిత్కూలప్రచారంబులం
బెలుచం బూననొ భూమిచక్రహరణాపేక్షుం హిరణ్యాక్షు దో
ర్బలవృత్తిక్ వధియింపనో కిటిశరీరం బెత్తి యుద్ధారుణీ
స్థలి వర్తించుట నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. సడియక్ విన్నను దొంటిమైఁ గనని పశ్చాద్గోచరత్వంబు నీ
పుడమిం జెల్పగనో హిరణ్యకశిపుక్ భూతప్రపూర్ణత్వమున్
దడఁగం ద్రోచి వధింపనో క్రొ-నరసింహాకారతక్ ధాత్రి సం
దడి గావించుట నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. మును నీవెత్తినమూర్తిం జొప్పడని సంకీర్ణైకరూపత్వముం
గొననో లేక జితామరావళి బలిం ఘోరాహిలోకంబు డా
య నిఃం ద్రొక్కనో వామనాకృతిని నీవంప్రిత్రయీమాత్ర గో
త్రను యాచించుట నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. గతమూర్తిం బడయంగరాని నిఖిలత్మాదాన శౌండత్వ మ
ప్రతిగాఁ దెల్పనో కార్తవీర్యముఖభూపవ్రాతముం త్క్మాధిప
త్యతమఃపాత మణంపనో పరశురామాఖ్యం నిరాఘాటశూ
రత వర్తించుట నన్నుఁగైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. నీతొల్లింటిభవంబునం గనని నిర్ణేతృస్వకర్మక్రియా
వ్రాతం బందె నటింపనో త్రిభువనావశ్యుం దశాస్యుం మరు
చ్చేతఃప్రీతిగఁ గూల్పనో ధరణిపై శ్రీరామమూర్తిం బహు
ఖ్యాతింజెందుట నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. ప్రాగుత్పత్తి నసంభవంబగు సపర్యం గృష్ణుఁ డొప్పింపనో
యాగోపాలసహాయతం గపటదుష్టారిష్టులం దుచ్ఛ వి
ద్యాగర్విష్ఠుల జంప నేమొ బలరామాఖ్యుండవై పొల్చుటల్
యాగోక్తిప్రియ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. భవదుద్యద్గతమూర్తులం జొరని యప్రత్యక్షతాకార్యముల్
భువిఁ గావింపనొ రాక్షసీవ్రతఫలంబుం దత్పరోన్మత్తదా
నవులం గాల్పనొ బుద్ధరూపమును బౌణత్వంబు సాధించి యి
య్యవనిం బొల్చుట నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. నీపూర్వోద్భవమందు సంధిలనిదానిం జేతనత్వాకృతిం
బ్రాపింపంగఁ దలంచితో స్వకులకర్మభ్రష్టులం దుష్టులం
గోపోద్వృత్తి వధింపనో కలికివై క్షోణిం బ్రవర్తించుటల్
ధాపింభచ్ఛవి నన్నుఁగైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

## నీతిదశకము

శా. శ్రీసంపద్గురుఁ డిచ్చు విద్య బుధగోష్ఠిం గల్గుహృద్వేద్య మం
దేసాధించిన చోద్య మాత్మకులవృత్తిం జేయుసంపాద్య మ
త్యాసన్నాతిథిపాద్య మయ్యతిథితోఁ బ్రాశించునైవేద్య మిం
పై సొంపొందెడు నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. జనకుం డన్నముఁ బెట్టు దాత తనుకృచ్ఛ్రఛేదియేభ్రాత పెం
చినశాతోదరి మాత పుత్త్రసముఁ డర్చిష్కర్మసంధాత జీ
వనముం జేసినవాఁడె నేత పరదైవం బంతరద్యోత మో
యనఘప్రాభవ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. స్వకులాచారత మేలుఁ జెందు బలవచ్చర్చన్ వెతల్ వొందు గ
ర్వికిఁగార్యం బొనగూడ దెందుఁ దనవారిన్ దూఱుటే కందు లో
భికి మూర్ఖుల్ ప్రియమందు రాత్మవిదుఁడే పెంపొందు నిందందు స
ర్వకళామేళన, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. ఇచ్చేవానిదె కీర్తికాంత నిరతాభీష్టార్థిదే వంత సా
మ్మచ్ఛన్ లేనిదెపో కొఱంత ధనికుం డా వానిదే చింత (వే)?
సచ్చేవాని దురాశ వింత యపుడాశల్ వీడు టేకాంత ము
ద్యచ్ఛక్రాయుధ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. కోపంబప్పుడె చేయుఁగీడు పరుషోక్తుల్ గూడ వేనాఁడు సం
తాపించున్ ధృతిలేనివాఁడు తనశాంతంబే సుమీ తోడు ధ
ర్మాపాయంబునఁ జేటుమూడు రసికుం డారాటముల్ వీడు ఘో
రాపత్తారక! నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. తగదన్యప్రమదాభిలాష పరవిత్తస్తేయమే దోష మిం
పగునే ధాత్రి నసత్యభాష కృతకృత్యుం బల్పసంతోష మా
ర్యగుణావృత్తి నణంగు రోష మురియై యంటుం జనద్వేష మో
యగభృద్వందిత, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. చదువుం గేలియొనర్పరాదు సుఖ మాశాపాశికిం లేదు కూ
డదు కాంతాతతితోటి వాదు దురదృష్టం బిష్టమీఁ బోదు భూ
తదయాళుత్వము కీడు లేదు క్షమ చేతశ్శాంతికిం బోదు నీ
రదనీలోపమ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

(?)మ. కృపణుం గొల్చెడివాఁడె కష్టి శరణార్థిం బ్రోచు ధర్మిష్ఠి కా
నిపను ల్గోరమి తుష్టి యేలినవిభుం నిందించుఁ బాపిష్ఠి తు
చ్ఛపుఁజాపల్యము లందె నష్టి వ్యసనేచ్ఛల్ వాయు సద్గోష్ఠి నో
తపనీయాంశుక, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. స్థిరసంపద్విభవుండె భోగి తగ నిక్షేపుండె పోగి య
క్కఱ కప్పిచ్చినవాఁడె త్యాగి యరివర్గప్రాప్తుఁడే రాగి ని
ర్భరుఁ డజ్ఞానవియోగి యాత్మకవిచారస్వాంతుఁడే యోగి యు
గ్రరథాంగాయుధ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

శా. భవ్యశ్రీ నిడు సూనృతోక్తి గతపాపత్వంబె పో యుక్తి ని
త్యవ్యాపారమొసంగు భుక్తి తప మార్యశ్రేణికిం శక్తి క
ర్తవ్యం బేరికి విప్రభక్తి తనయాత్మం గాంచుటే ముక్తి యో
రవ్యబ్జేక్షణ, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. సుగుణాత్ముండయి పైఁడిపాటికులదత్తుండై మనుప్రోక్తినా
దుగురుండై శఠమర్షణాఖ్యమునిగోత్రుండై యజుర్వేదినాఁ
డగు లక్ష్మీపతిసత్కవీంద్రునకుఁ బుత్త్రజ్యేష్ఠుఁడన్ నావశం
బగునట్లెన్నితి నిన్ను వేంకటనృసింహాఖ్యుండ నీవాఁడ భ
ద్రగిరీంద్రస్థిత, నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

మ. స్తుతి, కావ్యోన్నతి, దాససంగతి, మనోదుర్వృత్తి, సంసారప
ద్ధతి, మాయాకృతి, తత్త్వసంతతి, యభేదఖ్యాతి దీనావన
స్థితి, సర్వేశదశావతారనుతి, కించిన్నతి, నా నొప్పు న
ద్భుతరీతిం గృతి రుద్రసంఖ్య దశకంబుల్ సమ్మతిం దానినా
యతకారుణ్యాత నన్నుఁ గైకొను ముపేంద్రా, రామచంద్రా, హరీ!

రామచంద్రశతకము

సంపూర్ణము